



ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

నియమముగా ఉండి మితాహారియై, జితేంద్రియుడై, భక్తితో భాగవత పారాయణ, శ్రవణాదులు చేయాలి. సమాపనముగా వస్త్రాలంకార ద్రవ్యములచే పాఠకుని, పౌరాణికుని పూజించి, రుక్మిణీ కల్యాణము చేయించి, బ్రాహ్మణులకు, అన్నసంతర్పణ చేయాలి. బంగారు సింహాసనమును చేయించి దానిమీద చేతితో వ్రాసిన భాగవత గ్రంథమును ఉంచి పౌరాణికునికి దానం చేయడం వలన మోక్షప్రాప్తి కలుగుతుంది. భాగవత సప్తాహ శ్రవణము భాద్రపద నవమి నుండి పౌర్ణమి వరకు సమాప్తి చేయాలి. శ్రీశుక ముఖతః పరీక్షిత్తు ఇదే సమయములో శ్రవణము చేశాడు.

శ్లో ॥ మనుకర్దమసంవాదపర్యంతం ప్రథమేఽహని ।
భరతాఖ్యానపర్యంతం ద్వితీయేఽహని ।
తృతీయే చ దినే కుర్యాత్ సప్తమస్కంధపూరణమ్ ।
కృష్ణావిర్భావ పర్యంతం చతుర్థే దివసే పఠేత్ ।
రుక్మిణ్యుద్వాహపర్యంతం పంచమేఽహని శస్యతే ।
శ్రీ హంసాఖ్యాన పర్యంతం షష్ఠేఽహని పఠేత్సుధీః ।
సప్తమే తు దినే కుర్యాత్ పూర్తిం భాగవతస్యవై ।
ఏవం నిర్విఘ్నతా సిద్ధిర్విషయస్య న చాన్యథా ॥

మరి కొందరి మతంలో. శ్లో ॥ ఆద్యే హిరణ్యాక్ష వధో ద్వితీయే భరతావధి ।
తృతీయేత్వబ్ధి మథనం చతుర్థే కృష్ణ జన్మ చ ।
పంచమే రుక్మిణ్యుద్వాహః షష్ఠేచోద్ధవ వాచకమ్ ।
సప్తమేఽహ్ని సమాప్తిః స్యాత్ సప్తాహం మునిరబ్రవీత్ ॥

ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య



అని శ్రీమద్భాగవత మాహాత్మ్యం స్కాంద పురాణంలో వైష్ణవ ఖండంలో వివరించబడినది.“ శ్రీమద్భాగవతాఖ్యోయం ప్రత్యక్షః కృష్ణ ఏవహి”. అని పద్మపురాణమున కలదు. శ్రీమద్భాగవతము అక్షరరూప శ్రీకృష్ణ స్వరూపము. పద్మ పురాణములో ఉద్ధవుడు శ్రీకృష్ణ నిర్యాణ సమయమున “స్వామీ ! కలి కాలమున మానవులెలా ఉద్ధరింపబడగలరు. పాపాత్ములు, అల్పాయుష్మంతులు, ఉగ్రరోగబాధితులు బాగుపడే మార్గము చెప్పుము.” అని ప్రార్థించగా తన తేజస్సును శ్రీకృష్ణపరమాత్మ శ్రీమద్భాగవతమున ఉంచెను. ద్వాదశ స్కంధాత్మక శ్రీభాగవతము ద్వాదశాదిత్య సమానము. సూర్యుడు తమస్సును రూపుమాపి వెలుగును ప్రసరింపజేసినట్లు శ్రీమద్భాగవతము అజ్ఞానమనెడి చీకటిని తొలగించి భక్తి, జ్ఞాన, వైరాగ్యములనెడి వెలుతురు కలిగించెడి గొప్ప కల్పతరువు. “కలౌ నష్ట దృశామేష పురాణార్కో ऽ ధునోదితః”. అన్నారు. భక్తి జ్ఞాన వైరాగ్య జనకమగు భాగవతము త్రివిధగతి గల సూర్యునితో సమానమేగాక సూర్యునికన్న మిక్కిలి విశిష్టమైన వ్యతిరేకాలంకారాలలో వివరించబడినది. సూర్యుడు పగలు మాత్రమే ప్రకాశిస్తాడు, కాని శ్రీమద్భాగవతము రాత్రింబవలు కూడా వెలుగుతుంది. సూర్యుడు మనోగుహలోని అంధకారాన్ని తొలగించలేడు, కాని భాగవతము మనోగుహాగతమైన అజ్ఞానమనెడి మాలిన్యాన్ని కూడా తొలగించగలదు. భాగవత పురాణ ప్రవచనము జరిగినచోట సర్వ శ్రేయస్సులు చేకూరుతాయి. భాగవత సప్తాహ శ్రవణము వలన ఈ లోకమున ఆయురారోగ్య ఐశ్వర్యాది సత్ఫలితములే కాక అంత్యమున మోక్షము కూడా లభించును. “నాన్యః పంథా విద్యతేయనాయ” అని శ్రుతి. మోక్షానికి జ్ఞానమే కారణము.

భాగవత సప్తాహము సర్వోత్కృష్టమగు జ్ఞాన యజ్ఞము. ఇది భక్తుల పాలిటి పెన్నిధి.

శ్లో ॥ శ్రీమద్భాగవతం పురాణ తిలకం యద్వైష్ణవానాం ధనమ్ ।
యస్మిన్ పారమహంస్యమేకమమలం జ్ఞానం పరం గీయతే ॥
యత్ర జ్ఞానవిరాగభక్తిసహితం నైష్కర్మ్యమావిష్కృతమ్ ।
తచ్ఛృణ్వన్ ప్రపఠన్ విచారణ పరో భక్త్యా విముచేన్నరః ॥

శ్రీమద్భాగవతము 12 స్కంధములు కలది. 12 అక్షరములు గల వాసుదేవ ద్వాదశాక్షరీ మహామంత్రమునకు సమానమని భావింపబడుచున్నది. శ్రీమద్భాగవతము గహనము. అంత సులభముగా అర్థముగాదు. భాగవతార్థము వ్యాఖ్యాగమ్యము. అనేకమంది పండిత ప్రకాండులు భాగవతానికి వ్యాఖ్యలు రచించారు.

వ్యాఖ్యానాలకు వ్యాఖ్యలు కూడా వెలుబడినవి. అన్నిటికన్నా శ్రీధరీయ వ్యాఖ్యానము ముఖ్యమైనది. శ్రీధరస్వామి రచించిన భావార్థ దీపిక అను అద్వైత సిద్ధాంతపరమైన వ్యాఖ్యానము మిక్కిలి విశిష్టమైనది. శ్రీమద్భాగవతము అద్వైత వేదాంత సిద్ధాంతముతో నిండియున్నదనుటకు సందేహము లేదు. దాన్ని ప్రతిపాదించునది భావార్థదీపిక. యథార్థమైనభావమును ప్రకాశింపజేయునది. శ్రీధరస్వామి గొప్ప నృసింహ భక్త్యుపాసనలు కల మహాపండితుడు. అంతటి ఉపాసకునికి గూడా భాగవత శ్లోకాలకు సరియైన అర్థము కొన్నిచోట్ల గోచరించకపోతే ఆయన ముఖముపై వస్త్రం వేసుకొని నృసింహ ధ్యానం చేస్తూ కూర్చొనేవాడనీ, కొద్ది సేపటికి ముఖవస్త్రం తీసి చూడగా అచట కొన్ని పంక్తులు చక్కని అర్థమును వివరించేవి వ్రాసియుండెడివని చివరన "అయం భావః " అని ఉండిందనీ, ఆ అర్థాలను స్వయంగా నృసింహస్వామి తెల్పినాడని ప్రతీతి. శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని ఇతర వ్యాఖ్యానాలను పరికించి పండితులు ఏది గొప్పదని ఆలోచించి శ్రీధర వ్యాఖ్యలేనిచో, భాగవత నిగూఢార్థము ఎవ్వరికినీ తెలిసేది కాదని నిర్ధారించారు.

అట్టి శ్రీధర వ్యాఖ్య భావార్థదీపికకు వంశీధర వ్యాఖ్యానం కూడా వెలుబడింది. అంతేకాక ఈ వ్యాఖ్యానాలనన్నింటినీ జగన్నాథస్వామి గుడిలో ఉంచితే దేనిని స్వామి పరిగ్రహించునో అది గొప్పదని, తెలుసుకుందామని ఆ విధముగా గుడిలో ఉంచితే శ్రీధర వ్యాఖ్య జగన్నాథస్వామి చేతిలో కనిపించినదని ప్రతీతి.

శ్రీధర వ్యాఖ్యానము ప్రతులలో అనేక పాఠభేదాలు కలవని వాటిని శోధించి సుష్ఠు పాఠములను పండితవర్య నారాయణ శాస్త్రి ప్రభృతులు నిర్ణయించి ముద్రించారు. అందుకే........"వ్యాసో వేత్తి శుకో వేత్తి సంజయో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా న వా శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః". అని ఆభాణకం వెలుబడినది. శ్రీధర వ్యాఖ్య గూడా చాలా జటిలం, వంశీధరవ్యాఖ్యయేకాక శ్రీధరీయానికి చాలా వ్యాఖ్యానాలు వెలుబడినవి. అట్టి శ్రీధరస్వామి భావార్థదీపిక సంస్కృత వ్యాఖ్యానానికి తెలుగు అనువాదం పండితులచే వ్రాయించి ప్రచురించాలని శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠం సంకల్పించినది. శ్రీధరులు కఠిన పదాలకు మాత్రమే అర్థం వివరించారు. అనువాదం అటులనే చేసిన పాఠకులకు అగమ్యగోచరమగును. కావున శ్రీమద్భాగవతమునకు శ్రీధరవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ఈ గ్రంథ ధ్యేయము.

డా ॥ బ్రహ్మశ్రీ శివునూరి విశ్వనాథశర్మ
పీఠకార్యనిర్వాహకులు.

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో ॥ స్వభక్త పాతేన తద్విపక్ష విదారణమ్ ।
నృసింహమద్భుతం వన్దే పరమానంద విగ్రహమ్ ॥ -1

శ్లో ॥ ఊతః పంచదశాధ్యాయైః సప్తమే వర్ణ్యతేఽధునా ।
ఊతిశ్చ వాసనా ప్రోక్తా తత్తత్కర్మానుసారిణీ ॥ -2

శ్లో ॥ అశుభాచ శుభాచేతి ద్విధాసా హేతు భేదతః ।
అశుభా మహతా కోపాచ్ఛుభా మహదనుగ్రహాత్ ॥ -3

శ్లో ॥ హరేర్ద్వార పయోర్యద్య ద్వైకుంఠే వసతోఽపి ।
చతుః సనరుషా విష్ణుద్వేషా ద్యశుభ వాసనా ॥ -4

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

తనభక్తుని యందలి పక్షపాతముచే అతని విపక్షమైన హిరణ్య కశిపుని చీల్చినట్టి పరమానంద స్వరూపుడైన అద్భుతాకారముగల నరసింహునకు నమస్కరించుచున్నాను. (1)

ఇప్పుడు సప్తమ స్కంధమున పదునైదు అధ్యాయములచే ‘ ఊతి ’ వర్ణించబడుచున్నది. ఆయా కర్మలను ననుసరించెడు వాసనయే ఊతియని చెప్పబడుచున్నది. (2)

ఆ ‘ ఊతి ’ కారణభేదముననుసరించి శుభ, అశుభ యని రెండు విధములు. మహానుభావుల కోపమువలన కలుగునట్టిది ‘ అశుభ ’యని, మహానుభావుల అనుగ్రహమువలన కలుగునట్టిది ‘ శుభ ’ యనియు చెప్పబడును. (3)

వైకుంఠమున నివసించువారైనను, శ్రీహరియొక్క ద్వారపాలకులైన జయ విజయులకు బ్రహ్మమానస పుత్రులైన సనకసనందనాది ముని చతుష్టయ క్రోధకారణమున కలిగిన విష్ణుద్వేషాదికము అశుభవాసన యనబడుచున్నది. (4)

శ్లో ॥ యథాచ దైత్య గర్భేపి ప్రహ్లాదస్య సతః స్థిరా ।
నారదానుగ్రహాదాస విష్ణౌ సద్భక్తి వాసనా ॥ - 5

దైత్య గర్భమందున్నప్పటికీ ప్రహ్లాదునకు నారదుని అనుగ్రహము వలన విష్ణుమూర్తి యందు స్థిరమైన సద్భక్తి కలిగినది. అదియే శుభవాసన యనబడుచున్నది. (5)

శ్లో ॥ స్వభక్తంచ సదావిష్ణు ర్ద్విషన్తమపి రక్షతి ।
తృతీయేథ భవేద్వాస్థావకరో దాత్మ సాత్మనః ॥ - 6

తనను ద్వేషించునట్టి వానినైనను తనభక్తుని విష్ణువు ఎల్లప్పుడు రక్షించును. తన ద్వారపాలకులను ( జయ-విజయులను ) మూడవ జన్మమందు మరల ఆత్మ స్వరూపులను గావించెను. (6)

శ్లో ॥ అతో మనీషిణా యత్నః కార్యో మహదనుగ్రహే ।
ఇత్యేతదర్థ మూతీనా మత్ర లక్షణ ముచ్యతే ॥ -7-

కావున బుద్ధిమంతులచే గొప్పవారి అనుగ్రహమునకై యత్నించదగును ఇందులకై ఊతీ లక్షణము చెప్పబడుచున్నది. (7)

శ్లో ॥ తత్రాదౌ దశభిర్దైత్య తత్పుత్ర మతి భేదతః ।
మహత్కోపాను కంపోత్థ వాసనాభేద ఉచ్యతే ॥ - 8

అందు ముందుగ పది అధ్యాయములచే దైత్య - తత్పుత్రుల (హిరణ్యకశిపు-ప్రహ్లాదుల ) మతి భేదముననుసరించి మహాత్ముల క్రోధ, అనుకంపమువలన కలిగెడు వాసనా భేదము చెప్పబడుచున్నది. (8)

శ్లో ॥ సద్వాసనాచ యుజ్యేత కర్మభిః శుద్ధచేతసః ।
పరైస్తు పంచభిస్తస్మా త్క్రియతే ధర్మనిర్ణయః ॥ - 9

శుద్ధచేతస్సుయొక్క కర్మలచే సద్వాసన కలుగుచున్నది. అందువలన ఇతరములైన ఐదు అధ్యాయములచే ధర్మనిర్ణయము గావించబడును. (9)

శ్లో ॥ తత్రతు ప్రథమేధ్యాయే హిరణ్య కశిపోః సుతే ।
విష్ణుభక్తే విరోధస్తు విప్రశాపజ ఈర్యతే ॥ -10

టీ :- యదుక్తం పూర్వస్కంధాంతే. "హతపుత్రాదితిశ్శక్రపార్ష్ణి గ్రాహేణ విష్ణునా, మన్యునా శోకదీప్తేన జ్వలంతీ పర్యచింతయ" ఇతి. తచ్ఛ్రుత్వా విస్మితః పరీక్షిత్ పృచ్ఛతి త్రిభిః – నమ ఇతి.

అందును మొదటి అధ్యాయములో విష్ణుభక్తుడైన పుత్రునియెడ విప్రశాపము వలన హిరణ్యకశిపునకు కలిగిన విరోధము చెప్పబడుచున్నది. (10)

ఆరవ స్కంధాంతమునందు ఇంద్రుని వెనుక సహాయముగా నున్న విష్ణువుచే హత పుత్రయగు దితి శోకముచే దీపింపజేయబడు క్రోధముచే మండుచున్నదై చింతించెను. అని ఏదైతే చెప్పబడినదో దానిని విని ఆశ్చర్యమునందిన పరీక్షిన్మహారాజు మూడు శ్లోకములతో అడుగుచున్నాడు.(1)

**రాజోవాచ :-**

శ్లో ॥ నమః ప్రియః సుహృద్బ్రహ్మన్ భూతానాం భగవాన్స్వయం।
ఇంద్రస్యార్థే కథందైత్యా నవధీ ద్విషమో యథా ॥ 1 ॥

**పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించినాడు :-**

ఓ బ్రహ్మా ! సర్వభూతములయెడ సముడు, ప్రియుడు, మిత్రుడైనట్టి భగవంతుడు పక్షపాతముగల సాధారణజనము వలె ఇంద్రునకై దైత్యులనెట్లు సంహరించెను? (1)

టీ :- న హి సమస్య సుహృదశ్చ వైషమ్యం నామాస్తి న చ ప్రియస్య ప్రీతికర్తృషు వైషమ్యం యుక్తమిత్యర్థః. (1)

టీ :- సమునకు మిత్రునకు వైషమ్యమనునది ఉండదు కదా. ప్రియునకు ప్రీతి గావించువారియెడ తగదని అర్థము. (1)

శ్లో ॥ నహ్యస్యార్థః సురగణైః సాక్షన్నిశ్రేయసాత్మనః ।
నైవా సురేభ్యో విద్వేషో నోద్వేగశ్చా గుణస్యహి ॥ 2 ॥

సాక్షాత్తు పరమానందస్వరూపుడైన ఆ భగవంతునకు సురగణముతో ప్రయోజనముగానీ అసురులయెడ ద్వేషముగానీ ఉండదు. ఏలయన నిర్గుణునకుద్వేషము కలుగదు కదా ! కాన ఓ మహాభాగా ! నారాయణుని

శ్లో ॥ ఇతినః సుమహాభాగ నారాయణ గుణాన్ప్రతి ।
సంశయః సుమహాన్ జాతస్తద్భవాన్ ఛేత్తుమర్హతి ॥3 ॥

టీ :- కించ యస్య యైః ప్రయోజనం సిధ్యతి. స తత్పక్షపాతీ భవతి. యభ్యో బిభేతి తాన్ ద్వేష్టి. ద్వేషేణ హంతి. న తు తదత్రాస్తీత్యాహ - న హీతి. నిశ్రేయసం పరమానంద ఏవాత్మా స్వరూపం యస్య అసురేభ్యోశ్చోద్వేగో భయం నాస్తి. అతో విద్వేషో పి నాస్త్యేవ. తత్ర హేతుః. అగుణస్యేతి. (2)

టీ :- ఇతీతి. శ్రీనారాయణస్య గుణాన్ అనుగ్రహాదీన్ ప్రతి. తం సంశయం. (3)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో ॥ సాధుపృష్టం మహారాజ ! హరేశ్చరిత మద్భుతమ్ ।
యత్ర భాగవత మాహాత్మ్యం భగవద్భక్తి వర్ధనమ్ ॥4॥

గుణముల విషయమై మాకు ఈ విధమైన గొప్ప సంశయము కలిగినది. దీనిని నీవు తొలిగించదగుదువు. (2,3)

టీ:- ఇంతేగాక ఎవరికి ఎవరిచేత ప్రయోజనము సిద్ధించునో వారు వారియెడ పక్షపాతము కలవారగుదురు. ఎవరి వలన భయపడుదురో వారిని ద్వేషముతో హింసింతురు ( చంపుదురు ). కాని అట్టిది ఇచ్చట ( విష్ణువు విషయమున) లేదని చెప్పుచున్నాడు. పరమానందమే స్వరూపముగలవానికి అసురుల నుండియు భయములేదు. కావున విద్వేషము కూడా లేనేలేదు. అందుకు కారణము గుణములకు అధీనుడైన వానికి ప్రీతి ద్వేషములు ఉండునని అర్థము. 2

టీ :- శ్రీనారాయణుని అనుగ్రహ నిగ్రహాది గుణములను గూర్చి. తత్ = ఆ సంశయమును. (3)

**శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

ఓ మహారాజా ! హరి చరిత్రము అద్భుతమైనది. దేనియందైతే శ్రేష్ఠమైన, పుణ్యప్రదమైన, భగవద్భక్తిని పెంపొందించెడు భాగవత మాహాత్మ్యము నారదాది మహర్షులచే గానము చేయబడుచున్నదో అట్టి శ్రీహరి కథను మునియైన కృష్ణద్వైపాయనునకు నమస్కరించి చెప్పెదను. (4,5)

శ్లో ॥ గీయతే పరమం పుణ్య మృషిభిర్నారదాదిభిః ।
నత్వా కృష్ణాయ మునయే కథయిష్యే హరేః కథామ్॥5॥

టీ :- సాధ్వితి. భాగవతస్య ప్రహ్లాదస్య మాహాత్మ్యం. (4)

టీ :- ప్రహ్లాదుని యొక్క మాహాత్మ్యము గానము చేయబడుచున్నది అని భావించవలెను. (4)

టీ :- గీయత ఇతి. కృష్ణాయ వ్యాసాయ. మునయే నత్వా వ్యాసమునిం నమస్కృతేత్యర్థః. అత్రార్షత్వాత్ ద్వితీయార్థేచతుర్థీ(5

టీ :- కృష్ణ ద్వైపాయన వ్యాసమహర్షికి నమస్కరించి అని అర్థము. (5)

శ్లో ॥ నిర్గుణోఽపి హ్యజోఽవ్యక్తో భగవాన్ ప్రకృతేః పరః ।
స్వమాయా గుణ మావిశ్య బాధ్య బాధకతాం గతః ॥ 6

భగవంతుడు ప్రకృతికంటే పరుడైనందున నిర్గుణుడు, జన్మరహితుడు, అవ్యక్తుడు అనగా రాగద్వేషాది నిమిత్త భూతములైన దేహేంద్రియాదులచే వర్జితుడు. అతడు తన సత్వాదికమైన మాయాగుణమును పొంది దేవాసురులయొక్క బాధ్య బాధక భావమును పొందుచున్నాడు. అనగా అచ్చట హేతువగుచున్నాడని భావము. (6)

టీ :- నిర్గుణ ఇతి. యస్మాత్ప్రకృతేః పరః. అతో నిర్గుణః. అత ఏవాజః అత ఏవావ్యక్తః. రాగద్వేషాదినిమిత్తభూత దేహేంద్రియాదిరహితో పి. స్వస్య మాయాగుణం సత్త్వాదికం. ఆవిశ్య అధిష్ఠాయ. బాధ్యాన్ప్రతి బాధకత్వం. యద్వా -

టీ :- ప్రకృతికంటే పరమైనవాడు కనుక నిర్గుణుడు, అందుకే అజుడు, అవ్యక్తుడు అనగా రాగద్వేషాదులకు కారణభూతములైన దేహేంద్రియాదులతో రహితుడు. అయినను అతడు సాత్వికాది గుణములను పొంది బాధ్య బాధక భావము పొందుచున్నాడు. అనగా అచ్చట కారణమగుచున్నాడని భావము.(6)

దేవాసురాదీనాం. యా పరస్పరం బాధ్యబాధకతా. తాం గతః ప్రాప్తః తత్ర హేతుర్జాత ఇత్యర్థః. (6)

శ్లో ॥ సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్నాత్మనో గుణాః ।
నతేషాం యుగపద్రాజన్ హ్రాస ఉల్లాస ఏవవా ॥ 7 ॥

గుణములు స్వీయములుకాగా ప్రాకృతపురుషుని వలె విషముడు అగును కదా! యనిన అట్లు కాదు. రాజా ! సత్వ, రజః, తమోగుణములు ప్రకృతి గుణములే కాని ఆత్మ గుణములు కావు. వానికి ఏకకాలమున క్షీణత్వముగాని, వృద్ధిగానీ కలుగదు.(7)

టీ :- తత్ర గుణానాం స్వీయత్వే సతి ప్రాకృతపురుషవత్. విషయస్స్యాత్. న తు తదస్తీత్యాహ – సత్త్వమితి. నను స్వేచ్ఛయా గుణాధిష్ఠానేనాపి. పక్షపాతే సతి వైషమ్యం స్యాదేవ. న తస్య కాలకృతత్వాదిత్యాహ – న తేషామిత్యాదిసార్ధేన – ఉల్లాసోవృద్ధిః.(7)

టీ :- అప్పుడు గుణములకు స్వీయత్వము కలుగుచుండ ప్రాకృతపురుషునివలె విషముడు ( దుష్టుడు ) అగును. కాని అట్టిది లేదు. అని చెప్పుచున్నాడు. " సత్త్వమ్ " అని. స్వేచ్ఛగా గుణాధిష్టానుడైనను పక్షపాత వైషమ్యము కలుగును కదా యనిన –కలుగదు. అచ్చట కాలకృతత్వము అను తత్ హేతువును చెప్పెను. " నతేషాం " అని సార్ధముగ ( సమూహముగ) వృద్ధి.(7)

శ్లో ॥ జయకాలేతు సత్త్వస్య దేవర్షీన్ రజసోసురాన్ ।
తమసో యక్ష రక్షాంసి తత్కాలాను గుణోఽభజత్॥8 ॥

కాలాను గుణముగ సత్వముయొక్క జయ కాలమునందు భగవంతుడు దేవాదులను ఋషులను పొందును. అనగా వారి వారి దేహములను పొందును. అట్లే రజోగుణము యొక్క జయకాలమున అసురులను, తమోగుణముయొక్క జయకాలమున యక్షరాక్షసులను పొందును . (8)

టీ :- జయేతి. సత్త్వస్య జయకాలే. దేవాదీన్ ఋషీంశ్చ అభజత్. తత్తద్దేహం ప్రవిశ్య వర్ధయతీత్యర్థః. రజసో జయకాలే. ఇత్యన్వయః. తస్య కాలస్యానుగుణస్సన్. (8)

టీ :- సత్త్వగుణము యొక్క జయకాలమున ఋషులనుపొందెను. అనగా ఆయా దేహములను ప్రవేశించి గుణమును వృద్ధిగావించును. రజోగుణము యొక్క జయకాలమున అసురుల దేహమును పొంది, తమోగుణముయొక్క జయకాలమున యక్షరాక్షసుల దేహముల ప్రవేశించి వానిని వృద్ధి పొందించును. ఆయా కాలమునకు అనుగుణుడై వున్నాడు. ( 8 )

శ్లో ॥ జ్యోతిరాది రివాభాతి సంఘూతాన్న వివిచ్యతే ।
విదన్త్యాత్మాన మాత్మస్థం మథిత్వా కవయోఽన్తతః॥9 ॥

ఇంధనాదులయందు తేజస్సువలె, పాత్రములందు జలమువలె, ఘటాదులందు ఆకాశమువలె భగవంతుడు నానారూపుడై ప్రకాశించుచున్నాడు. (సంఘూతముకంటె ) సురాదిదేహమున కంటే భిన్నముగా గోచరించడు. ఆత్మయందుండెడు పరమాత్మను నిప్పులు మథించి అనగా కార్యదర్శన లక్షణమున వివేచించి వివేకులు తెలుసుకొందురు. (9)

టీ :- సమస్యాపి నిమిత్తభేదేన వైషమ్యే దృష్టాంతః. జ్యోతిరితి – జ్యోతిర్యథా కాష్ఠాదిషు, జలం యథా పాత్రేషు, ఆకాశం యథా ఘటాదిషు, తథా నానారూప ఆభాతి. నను తర్హి తానభజదితి కుత శ్లో॥ యదా సిసృక్షుః పుర ఆత్మనః పరో జ్ఞాయతే? తత్రాహ – విదంతీతి. ఆత్మస్థం పరమాత్మనం కవయో నిపుణాః. మథిత్వా కార్యకారణలింగదర్శనేన విచార్య జానంతి. అంతస్స్వభావ కర్మాదివాదనిషేధేన. విదంతీతి పాఠే. లంభత

టీ :- పరమాత్మ సముడైనప్పటికినీ నిమిత్త భేదమున వైషమ్యమునొందుటకు దృష్టాంతము ‘ జ్యోతిరాదిరివ ’ అనగా అగ్నిఎట్లైతే కట్టె మొదలైనవానిని పొంది నానారూపముగ భాసించును. జలము ఎట్లైతే పాత్రాదులందుచేరి, ఆకాశము ఘటాదులందుచేరి నానారూపత్వము పొందినట్లు కనిపించునో అట్లే భగవంతుడు నానారూపుడుగ తోచును. అట్లైన అదేవిధముగ వివేకముతో ఎందులకు తోచడు? అనిన చెప్పబడుచున్నది. సంఘూతము వలన సురాది దేహమున కంటే విడివడడు. భిన్నముగ తోచడు. అయినా వానిని

ఇత్యర్థః. తత్ర లాభో పి జ్ఞానమేవ. అత్రాపి జ్యోతిరాదిరివేతి ద్రష్టవ్యం. యథా సూర్యకాంతాదౌ దాహదర్శనాత్. జ్యోతిర్జ్ఞాయతే. యథా చ. గంధదర్శనాద్వాయురిత్యాది. తదేవం మాయా గుణవశేనైతద్వైషమ్యం. న స్వాభావికమిత్యుక్తమ్. (9)

పొందుచున్నాడని ఎట్లు తెలియవలెననిన ఇట్లు చెప్పుచున్నాడు. 'విందతి' యని. ఆత్మయందుండు పరమాత్మను నిపుణులు కార్యదర్శన హేతువున విచారించి తెలిసికొనుచున్నారు. " అన్తతః " స్వభావ కాలకర్మాది వాద నిషేధముచే "విందతి" యను పాఠమున లాభము కూడా జ్ఞానమే. ఆ విషయమును అగ్ని మొదలైన వాని వలెనే యని చూడదగును. సూర్యకాంతాదులందు ఎటులైతే దాహదర్శనము వలన అగ్నియున్నట్లు తెలియబడుచున్నదో , గంధాఘ్రాణము వలన వాయువు తెలియబడుచున్నదో అట్లే ఆత్మారాముని తెలియుచున్నారు. (9)

శ్లో ॥ యదా సిసృక్షుః పుర ఆత్మనః పరో
రజః సృజత్యేష పృథక్ స్వమాయయా ।
సత్త్వం విచిత్రాసు రిరంసు రీశ్వరః
శయిష్యమాణస్తమ ఈరయత్య సౌ ॥ 10 ॥

ఆత్మగా భావింపబడు శరీరము కంటే భిన్నుడైన ఆ పరమేశ్వరుడు శరీరములను సృష్టిగావింపగోరిన వాడై జీవుని యొక్క భోగమునకై రజోగుణమును ప్రత్యేకముగా సృష్టించుచున్నాడు. తర్వాత విచిత్రములైన ఆ పురములందు (శరీరములందు ) రమించగోరినవాడై తన మాయచే సత్త్వమును సృజించుచున్నాడు. మరియు లయము గావింపగోరి తమోగుణమును వేరుగా వ్యాపింపజేయుచున్నాడు. (10)

టీ :- తర్హి గుణపారతంత్ర్యాదనీశ్వరత్వమాశంక్యాహ – యదేతి. యదా ఆత్మనో జీవస్య. భోగాయ, పురః శరీరాణి. పరః పరమేశ్వరః. సిసృక్షుర్భవతి. తదా సామ్యేన స్థితం రజః. పృథక్

టీ :- అట్లైన ఈ విధముగ మాయాగుణ వశమున ఈ వైషమ్యము స్వాభావికము కాదు అని చెప్పబడినదికదా ! అటులైన గుణపారతంత్ర్యము వలన పరమాత్మకు అనీశ్వరత్వమును శంకించి చెప్పెను. ఎప్పుడైతే జీవుని

సృజతి. విచిత్రాసు తాసు పూర్షు. రిరంసుః క్రీడితుమిచ్ఛుః. సత్త్వం పృథక్ సృజతి – శయిష్యమాణః సంహరిష్యన్. తమః పృథగీరయతి ప్రేరయతి. (10)

శ్లో ॥ కాలం చరంతం సృజతీశ ఆశ్రయం
ప్రధాన పుంభ్యాం నరదేవ సత్యకృత్ ।
యేష రాజన్నపికాల ఈశితా
సత్యం సురానీక మివైదయత్యతః ।
తత్రప్రత్యనీకా నసురాన్సుర ప్రియో
రజస్తమస్కాన్ ప్రమిణో త్యురుశ్రవా ॥ 11 ॥

శ్లో ॥ అత్రైవోదాహృతః పూర్వమితిహాసః సురర్షిణా ।
ప్రీత్యా మహాక్రతౌ రాజన్ పృచ్ఛతేஉజాత శత్రవే॥12॥

టీ :– యదా సిసృక్షురిత్యాదినిర్దేశాత్ ప్రతీతం కాలపారతంత్ర్యం వారయన్ ప్రధానపురుషపారతంత్ర్యమపి వారయతి – కాలమితి.

యొక్క భోగములకై పురములను ( శరీరములను ) పరమేశ్వరుడు సృష్టించగోరునో అప్పుడు సామ్యముగా నుండు రజోగుణమును వేరుగా సృజించును. ఎప్పుడైతే విచిత్రములైన ఆ శరీరములందు క్రీడించగోరువాడో అప్పుడు ప్రత్యేకముగా సత్వమును సృజించును. ఎప్పుడైతే లయము గావించగోరునో అప్పుడు తమోగుణమును వేరుగా ప్రేరేపించును. అనగా అధికము గావించుని అర్థము. ( 10 )

ఓ నరదేవా ! అమోఘకర్తయైన ఈశ్వరుడు నిమిత్త భూతులైన ప్రధాన స్త్రీ పురుషుల సహకారముతో ఆశ్రయభూతమైన వర్తమానమైన ఈ కాలమును సృష్టించెను. అట్లు భగవంతునిచే స్వయముగ సృష్టించబడిన ఈ కాలము సత్త్వగుణమును వృద్ధిగావించుచున్నది. కాన ఈశ్వరుడు కూడా సత్వ ప్రధానమైన దేవగణమునే వృద్ధిగావించుచున్నాడు. ( దేవగణ పక్షమునే చేరుచున్నాడు ). సురులకు ప్రతిపక్షమైన అసురులను సంహరించుచున్నాడు. ఈ సందర్భమును పురస్కరించుకొని పూర్వము మహాయాగమునందు ప్రశ్నించిన అజాతశత్రువగు ధర్మరాజునకు నారదమహర్షిచే ప్రేమతో ఒక ఇతిహాసము చెప్పెను. ( 11, 12 )

టీ :– " యదా సిసృక్షుః " అను మొదలుగాగల శ్లోక నిర్దేశము వలన ప్రతీతమైన కాలపారతంత్ర్యమును వారించుచు ప్రధానపురుష

హేనరదేవ. ప్రధానపుంభ్యాం ప్రకృతిపురుషాభ్యాం నిమిత్త భూతాభ్యాం. సత్యకృత్ అమోఘకర్తా. ఈశ్వరః. తయోః సహకారిత్వేనాశ్రభూతం, చరంతం వర్తమానం, కాలం స్వయమేవ సృజతి. స్వచేష్టారూపత్వాత్ కాలస్య. న తత్పారతంత్ర్య మిత్యర్థః.సవేతి. తథాపి ప్రస్తుతే కిమాయాతం ? తత్రాహ – య ఇతి. య ఏష కాలః ససత్త్వమేధయతి. వర్ధయతి. అతో హేతోః. ఈశితాపి ఈశ్వరో పి సత్త్వప్రధానం సురానీకం దేవసమూహం. ఏధయతి. తత్రప్రత్యనీకాన్ సురప్రతిపక్షాన్. ప్రహిణోతి హినస్తీత్యన్వయః. ఉరుశ్రవః కీర్తిర్యస్య. సః కాలశక్తి క్షుభితగుణగతం వైషమ్యం సన్నిధిమాత్రేణ తదధిష్ఠాతరి స్ఫురతీతి ప్రకరణార్థః.(11)

టీ :–. తఇదానీం తు తయోర్వధః నసుర పక్షపాతేన. కింతు బ్రహ్మశాపేన ఆసురీం యోనిం ప్రాప్తయోరనుగ్రహార్థమేవేతి వక్తుమితిహాసముపక్షిపతి – అత్రేతి. అత్రైవేతి ద్వేషాదిరహితస్యాపి దైత్యవధే నారదేనేతిహాసః ప్రస్తావితః. (12)

పారతంత్ర్యమును కూడా ‘ కాలం’ ఇత్యాది శ్లోకముచే వారించుచున్నాడు. ఓ నరదేవా ! నిమిత్త భూతులైన ప్రధాన స్త్రీ పురుషుల సహకారముతో అమోఘకర్తయగు ఈశుడు ఆశ్రయభూతమైన వర్తమాన కాలమును స్వయముగనే సృజించుచున్నాడు. కాలము ఆ భగవంతుని చేష్టారూపమే కావున భగవంతునకు ఆ కాలపారతంత్ర్యము లేదని అర్థము. ఐనను ప్రస్తుతము ఏమి జరిగిందో చెప్పెను. ఈశునిచే సృష్టించబడిన ఈ కాలము సత్వగుణమును పెంపొందించు చున్నందున ఈశ్వరుడు కూడా సత్వప్రధానమైన దేవసమూహమును వృద్ధిగావించు చున్నట్లుండును. కాన వారికి ప్రతిపక్షమైన అసురులను హింసించుచున్నారని అన్వయము. ‘ ఉరుశ్రవః ’ అనగా ప్రభూతమైన కీర్తిగలవాడని యర్థము. కాలశక్తిచే క్షుభితమైన గుణములందుండెడు వైషమ్యము సన్నిధి మాత్రముచే ఆ గుణములు గల ఈశునియందు స్ఫురించునని ప్రకరణార్థము. ( 11 )

టీ :– ఆ సమయమున అసురసంహారము గావించుట సురపక్షపాతముచే గాదు. బ్రహ్మశాపము ( బ్రహ్మపుత్రులైన సనకాదుల శాపము ) చే అసురజన్మము పొందిన ఆ జయ విజయుల అనుగ్రహము కొఱకే యని చెప్పుటకై ఇతిహాసము పేర్కొనబడుచున్నది. ‘ అత్రైవ ’ ఇత్యాది శ్లోకములలో ఇందు ద్వేషాదులు లేనివాడైనను ఈశుడు దైత్యులను వధించు విషయమున నారదునిచే ఒక ఇతిహాసము ప్రస్తావించబడినది. ( 12 )

శ్లో ॥ దృష్ట్వా మహాద్భుతం రాజా రాజసూయే మహాక్రతౌ ।
వాసుదేవే భగవతి సాయుజ్యం చేది భూభుజః ॥ 13 ॥

శ్లో ॥ తత్రాసీనం సురఋషిం రాజాపాండు సుతక్రతౌ ।
పప్రచ్ఛ విస్మిత మనా మునీనాం శృణ్వతా మిదమ్ ॥14

టీ :- దృష్ట్వేతి. చేదిభూభుజః శిశుపాలస్య. (13,14)

చేది రాజైన శిశుపాలుడు భగవంతుడైన వాసుదేవుని సాయుజ్యమును పొందుట యను మహాద్భుతమును రాజసూయయాగమునందు చూచిన ధర్మరాజు అచ్చట కూర్చునియున్న దేవర్షియైన నారదుని చూచి, మునులందరు వినుచుండగా ఆశ్చర్యముతో ఇట్లు ప్రశ్నించెను. ( 13, 14 )

టీ :- చేది భూభుజః = శిశు పాలుని యొక్క ( 13, 14 ).

**యుధిష్ఠిర ఉవాచ :-**

శ్లో ॥ అహో అత్యద్భుతం హ్యేతద్దుర్లభై కాన్తినామపి ।
వాసుదేవే పరేతత్వే ప్రాప్తి శ్చైద్యస్య విద్విషః ॥ 15 ॥

టీ :- అహో ఇతి. ఏకాంతభక్తానామపి దుర్లభా ప్రాప్తిః. విద్వేషో జాతేత్యేత దద్భుతం హి. (15)

**ధర్మరాజు ఇట్లు అడిగినాడు :-**

శత్రువైన శిశుపాలుడు పరవాసుదేవుని పొందుటయనునది అత్యద్భుతము. ఏకాన్త భక్తులకును దుర్లభమైనది కదా ! ఇది ఆశ్చర్యము.(15

టీ :- నిష్పరిగ్రహులై ముక్తిపొందిన వారికిని దుర్లభమైన భగవత్సాయుజ్యము శత్రువైన శిశుపాలునకు కలిగినది. ఇది మిక్కిలి అద్భుతము కదా ! ( 15 )

శ్లో ॥ ఏతద్వేదితు మిచ్ఛామః సర్వ ఏవ వయం మునే ।
భగవన్నిద్దయా వేనో ద్విజై స్తమసి పాతితః ॥ 16 ॥

ఓ మహర్షీ ! మేము సంపూర్ణముగా ఈ విషయమును తెలిసికొనగోరుచున్నాము. భగవంతుని నిందించుటచే వేనుడు బ్రాహ్మణులచే తమోమయమైన నరకమున ద్రోయబడినాడు. ( 16 )

టీ :- ఏతదితి. తస్య వేనవన్నరకపాత ఏవోచిత ఇత్యాహ – భగవన్నితి. తమసి నరకే. (16)

టీ :- వానికి వేనుని వలె నరకపాతమే యుక్తము అనిన ఇట్లు చెప్పబడు చున్నది. భగవన్నిందియా ఇత్యాదిగా , తమసి = నరకమునందు ( 16 )

శ్లో ॥ దమఘోష సుతః పాప ఆరభ్య కలభాషణాత్ ।
సంప్రత్యమర్షీ గోవిందే దంతవక్త్రశ్చ దుర్మతిః ॥ 17 ॥

శ్లో ॥ శపతో రసకృద్విష్ణుం యద్బ్రహ్మ పరమవ్యయం ।
శ్విత్రో న జాతో జిహ్వాయాం నాన్ధం వివిశతుస్తమః ॥18

శ్లో ॥ కథం తస్మిన్ భగవతి దురవగ్రాహ్య ధామని ।
పశ్యతాం సర్వలోకానాం లయమీయతు రంజసా ॥ 19

పాపాత్ముడగు దమఘోష పుత్రుడైన శిశుపాలుడు, ధూర్తుడైన దంతవక్త్రుడు బాల్యమున ముద్దు ముద్దు మాటలు నేర్చుచున్నది మొదలు నేటివరకును గోవిందునియందు ఓర్పుమాలినతనము కలవారై క్రోధమును, మాత్సర్యమును పొందియున్నారు. అవ్యయుడైన పరబ్రహ్మను మాటి మాటికి నిందించుచున్నారు. వారి నాలుకపై శ్వేతకుష్ఠు కలుగలేదు. వారికి అంధకార బంధురమైన నరకము కలుగలేదు. పైగా పొందుటకు శక్యముగాని పదమైన భగవత్సాయుజ్యపదము లోకములన్నియు చూచుచుండగ లభించినది.(17 – 19 )

టీ :- దమఘోషసుత ఇతి. దమఘోషస్య సుతః శిశుపాలః. కలభాషణాత్ బాల్యే కోమలభాషణమారభ్య. సంప్రతి అధునాపి అమర్షీ. క్రోధీ. మత్సరీ చ. (17)

టీ :- దమఘోషుని పుత్రుడు శిశుపాలుడు బాల్యమున ముద్దుపలుకులాడుట మొదలుకొని నేటికిని సహించనివాడై, కృష్ణుని యందు కోపము కలవాడై లేదా మత్సరముకలవాడై ఉన్నాడు. ( 17 )

టీ :- శపతోరితి. శ్విత్రః శ్వతకుష్ఠం. (18)

టీ :- శ్విత్రః = శ్వేతకుష్ఠము ( బొల్లి ) ( 18 )

టీ :- కథమితి. దురవగ్రాహ్యం దుష్ప్రాపం ధామ స్వరూపో యస్య తస్మిన్. లయం సాయుజ్యం. ఈయతుః జగ్మతుః. అభూతస్యాపి దంతవక్త్రలయస్యాపి తజ్జాతకప్రామాణ్యేన సిద్ధవన్నిర్దేశః. (19)

టీ :- దురవగ్రాహ్యం = పొంద శక్యముగాని, ధామ = స్వరూపముగల ఈశ్వరుని యందు, లయం = సాయుజ్యమును , ఈయతుః = పొందిరి. దంతవక్త్రు నిలయము కాకున్నను తజ్జాతక ప్రామాణ్యముచే సిద్ధించినట్లే నిర్దేశము ( 19 )

శ్లో ॥ ఏతద్భ్రామ్యతి మే బుద్ధిః దీపార్చి రివ వాయునా ।
బ్రహ్మేత దద్భుతతమం భగవాం స్తత్రకారణమ్ ॥20॥

ఇది మిక్కిలి అద్భుతమైనది. ఈ విషయమున నాబుద్ధి వాయువు తాకిడిచే దీపశిఖవలె పరిభ్రమించుచున్నది. సర్వజ్ఞుడవైన నీవు దీని కారణమును తెలుప వలసినది. ( 20 )

టీ :- ఇతీతి. ఏతదద్భుతతమం హి. అతఏవ బుద్ధిర్భ్రామ్యతి. భగవన్ సర్వజ్ఞత్వం బ్రూహి. (20)

టీ :- ఇది మిక్కిలి అద్భుతమైనది. కావుననే నామతి భ్రమించుచున్నది. పూజ్యుడవైన నీవు సర్వమును తెలిసినవాడవు. కాన తెలుపుము . ( 20 )

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో ॥ రాజ్ఞ స్తద్వచ ఆకర్ణ్య నారదో భగవాన్ ఋషిః ।
తుష్ట ప్రాహ తమాభాష్య శృణ్వత్యా స్తత్సదః కథాః ॥21

**శుక యోగీంద్రుడు ఇట్లు చెప్పినాడు :-**

ధర్మరాజు పలికిన ఆ మాటలు విని పూజ్యుడైన నారదమహర్షి తుష్టుడై ధర్మరాజును సంబోధించి సభాసదులందరు వినుచుండగా ఇట్లు చెప్పెను.(21)

టీ :- రాజ్ఞ ఇతి. ఆభాష్య సంబోధ్య, సమ్యక్ సీదంత్యస్యామితి సంసత్ సభా. తస్యాః శృణ్వంత్యాః సత్యాః కథాః ప్రాహేత్య న్వయః. (21)

టీ :- అభాష్య = సంబోధించి, సీదన్తి = కూర్చొనుచున్నారు. సభయందు కూర్చున్నవారు సభాసదులనబడును. అందరు వినుచుండగా సత్యకథలను నారదుడు చెప్పెనని అన్వయము. ( 21 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ నిందనస్తవ సత్కార న్యక్కారార్థం కలేవరమ్ ।
ప్రధాన పరయో రాజన్ ! అవివేకేన కల్పితమ్ ॥ 22 ॥

**నారద మహర్షి ఇట్లు చెప్పెను :-**

రాజా ! నిందాస్తవములు వాచికములైన దోషగుణములు. సత్కార న్యక్కారములు కాయిక మానసిక దోషములు . ఇట్టి నిందాస్తవములు సత్కార, తిరస్కారములు గ్రహించుటకే ప్రధాన పురుషుల అవివేకముచేత కళేబరము కల్పితమైనది. (22)

టీ :- అహెూ ! భగవన్నిందకస్య నరకపాతేన భావ్యమితి వదస్తవ కోఽభిప్రాయః? భగవత్పీడాకరత్వేన వా తదభావేఽపి సురాపానాదివ న్నిషిద్ధ నింద్యాచరణాద్వా తత్ర తావద్దేహాభిమాన కృత నిందాది నిమిత్తత్వాత్పీడాదీనాం భగవతశ్చ తదభావాన్న పీడాశంకాస్తీత్యాహ - నిందనేతి సార్ధై స్త్రిభిః. నిందనం దోష కీర్తనం. న్యక్కారస్తిరస్కారః. నిందాస్తుత్యాది జ్ఞానార్థం ప్రధాన పురుషయోరవివేకేన కలే వరం కల్పితం రచితం. (22)

టీ :- ఆహా ! భగవంతుని నిందించువానికి నరకప్రాప్తియే కాదగినది. అని పలికెదు నీ అభిప్రాయమేమి? భగవంతుని బాధ కలిగించుట ద్వారాగానీ కాకున్న సురాపానము మొదలైన వానివలె నిషిద్ధమైన, నింద్యమైన ఆచరణముల వలన గానీ ( నరకప్రాప్తి కలుగవలెననిన ) పీడ, హింస, మొదలైనవి దేహాభిమానమువలన కలిగెడు నింద మొదలైన నిమిత్తములవలన ఏర్పడుచున్నవి. భగవంతునకు దేహాభిమానము లేనందువలన పీడ, హింస మొదలైనవి ఉండుననెడు శంక లేదు అని మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు. నిందాస్తుత్యాది జ్ఞానము కలుగుటకై ప్రధానపురుషుల వివేక శూన్యమైన కలేవరము (ప్రాణులకు ) కల్పించబడుచున్నది. ( 22 )

శ్లో ॥ హింసా తదభిమానేన దండపారుష్య యోర్యథా ।
వైశమ్యమిహ భూతానాం మమాహమితి పార్థివ ॥23॥

ఆ కళేబరమందలి యభిమానముచే ప్రాణులకు ఇది నాది, నేను అనే వైషమ్యము కలుగుచున్నది. అట్లే తత్కృతమైన దండనము, నిందించుట మొదలుగాగల హింసయు గావింపబడుచున్నది. ( 23 )

టీ :- హింసేతి. తదభిమానేన భూతానాం యథామమాహమితి వైషమ్యం. తత్కృతం హింసాదికం వా భవతి. తథా న యస్యేత్యుత్తరేణాన్వయః. దండస్తాడనం. పౌరుష్యం నిందా. తయోర్హేతుభూతయోః. హింసా పీడా చ భవతి. (23)

టీ :- అట్టి శరీరాభిమానముతో ప్రాణులకు నేను, ఇది నాది అను వైషమ్యము ఏర్పడును. అట్టి వైషమ్యమువలన కలుగు హింస, పీడ మొదలైనవి సిద్ధించును. అట్టి హింసాదులు పరుడైన ఈశ్వరునకు లేవని ముందుశ్లోకముతో అన్వయము. దండనము, నింద వలన ప్రాణికి హింస పీడయు కలుగుచున్నది. ( 23 )

శ్లో ॥ యన్నిబద్ధోఽభిమానోఽయం తద్వధాత్ప్రాణినాం వధః।
తథా న యస్య కైవల్యాదభిమానోఽఖిలాత్మనః ।
పరస్య దమ కర్తుర్హి హింసాకేనాస్య కల్ప్యతే ॥ 24 ॥

శ్లో ॥ తస్మాద్వైరానుబద్ధేన నిర్వైరేణ భయేనవా ।
స్నేహాత్కామేన వా యుంజ్యాత్కథం చిన్నేక్షతే పృథక్ ॥25॥

ఏ శరీర కారణమున ఈ అభిమానము ఏర్పడుచున్నదో అట్టి శరీరవధవలన అభిమానము అంతమగుచున్నది. కాన పరమేశ్వరుని నింద హింస ఎవరిచే చేయబడుచున్నది? ఆత్మచేత కాదుగదా ! అఖిలాత్ముడగు పరమాత్మకు అట్టివానికి కైవల్యమును కల్పించుటకు అభిమానముండదు కదా! ఈశుడు పరునకు హితము గావించుటకొఱకే దండన గావించును అని అర్థము. కావున అట్టి భగవంతునియందు వైరమును కలిగియుండుట ద్వారాగానీ, నిర్వైరముతో భక్తియోగమునగానీ, భయముతో గానీ, స్నేహముతోగానీ, కామముతోగానీ, మనస్సును నిలుపతగును. వారిలో భేదము కాంచబడదు. ( 24, 25 )

టీ :- యదితి. యస్మిన్నిబంధః. అయమభిమానః. తస్య దేహస్య వధాద్వధశ్చ యథా తథా. యస్యాభిమానో నాస్తి అస్య పరమేశ్వరస్య హింసా కేన హేతునా కల్ప్యతే న కేనాపి. అభిమానాభావే హేతుః కైవల్యాత్. అద్వితీయత్వేనాభిమంతవ్యాభావాత్. వైషమ్యాభావే హేతుః. అఖిలాత్మనః సర్వాత్మన ఇతి. తర్హి కిమితి హంతీతి తత్రాహ - పరస్యేతి. దమకర్తుః హితార్థం దండం కుర్వత ఇత్యర్థః. (24)

టీ :- ఏ దేహము వలన ఈ అభిమానము ఏర్పడుచున్నదో అట్టి దేహముయొక్క వినాశము వలన అభిమానము కూడా నశించును. కావున నిరాలంబుడు, నిర్మయుడు నిరహంకారుడైన ఈశునకును అభిమానము లేదు. అందువలన పరమేశ్వరునకు ఏ హేతువుచే హింస కల్పించబడుచున్నది? ఏ కారణముచేతను పరమేశ్వరునకు నింద కల్పించబడదని అర్థము. అభిమానము లేదనుటకు హేతువు కైవల్యమునకన్న అభిన్నుడుగా తలంచదగినవాడైన కారణమున. వైషమ్యము లేకుండుటలో కారణము సర్వాత్మునకు అని. ఈశ్వరుడే సర్వాత్ముడైనందున వైషమ్యమెట్లు సిద్ధించును? అని అర్థము. అట్లైన దైత్యులనెట్లు? ఎందుకు ? సంహరించుచున్నాడనిన ఇట్లు చెప్పబడినది. అణచివేయువాని యొక్క హితము కొఱకే దండించుచున్నాడని అర్థము.(24

టీ :- యస్మాద్భగవతో నిందాకృతం వైషమ్యం నాస్తి. తస్మాద్యేన కేనాప్యుపాయేన ధ్యాయతః. తేనైవ నిందాకృతపాపస్యాపి నాశాత్తత్సాయుజ్యం యుక్తమిత్యాశయేనాహ సప్తభిః - తస్మాదితి. నాస్తివైరం కేనాపి యస్మిన్ తేన భక్తియోగేనేత్యర్థః. యుంజ్యాత్. మన ఇతి శేషః. తస్మాదేతైరుపాయైః పృథక్. నేక్షతే నేక్షేత. (25)

టీ :- ఏ కారణముననైతే భగవంతునకు నిందాదులవలన కలుగు వైషమ్యములేదో అట్టి కారణమున ఏదోవిధమున ధ్యానించువానికి ఆ ధ్యానముచేతనే నిందాదులవలన కలిగెడు పాపము కూడా నశించుటవలన సాయుజ్యప్రాప్తియుక్తమను ఆశయముచే "తస్మాద్వైరా " ఇత్యాది ఏడు శ్లోకములచే చెప్పుచున్నాడు. ఏ కారణము చేత భగవంతుని యందు వైరము లేనట్టి వానిచే భక్తి యోగముచేత యని అర్థము. మనస్సును కూర్చదగినది. ఎందువలన అనగా ఆ ఉపాయములచే భిన్నముగ చూడబడడు ( అనగా తదభేదముగ ఎంచబడునని తాత్పర్యము ) . ( 25 )

శ్లో ॥ యథా వైరానుబంధేన మర్త్య స్త న్మయతా మియాత్ ।
న తథా భక్తి యోగేన ఇతి మే నిశ్చితా మతిః ॥ 26 ॥

భగవంతునియందు వైరభావనతో మానవుడు ఎంత సులభముగ తదైక్యమును పొందునో అంత సులభముగ భక్తి మార్గము భగవత్ప్రాప్తిని పొందజాలడని నా అభిప్రాయము. ( 26 )

టీ :- తేష్వపి వైరానుబంధః శ్రేష్ఠ ఇత్యాహ - యథేతి. న తథా భక్తియోగేనాపీతి. (26)

టీ :- వైరము, భక్తి, భయము, స్నేహము, కామములందును వైరానుబంధమే శ్రేష్ఠమని చెప్పెను. వైరానుబంధముచే పరమేశ్వరప్రాప్తి కలిగినట్లుగా భక్తియోగముతోను కలుగదు.(26)

శ్లో ॥ కీటః పేశ స్కృతా రుద్ధః కుడ్యాయాం తమను స్మరన్ ।
సంరభ భయయోగేన విందతే తత్సరూపతామ్ ॥27॥

భ్రమరముచే మట్టి పొరచే బంధించబడిన కీటకము తానే స్మరించుచు ద్వేషమును భయమును కలిగియున్నదై ఆ భ్రమర సారూప్యమును పొందుచున్నది. ( 27 )

టీ :- అత్ర దృష్టాంతః – కీట ఇతి. కీటః. పేశస్కృతా భ్రమరేణ. సంరంభో ద్వేషః భయం చ. స ఏవ యోగస్తేన. (27)

టీ :- అందుకు దృష్టాంతము కీటకము భ్రమరముచే, సంరంభః = ద్వేషము, భయముకూడా అదియే యోగము. దానిచే ( 27 )

శ్లో ॥ ఏవం కృష్ణే భగవతి మాయా మనుజ ఈశ్వరే ।
వైరేణ పూతపాప్మానః తమాపురనుచింతయా ॥ 28 ॥

ఇట్లే మాయా మానవుడు ఈశ్వరుడైన పూజ్యుడగు శ్రీకృష్ణుని యందు వైరముతో అతనినే సతతము స్మరించుచు విగత పాపుడై ఆ భగవంతుని చేరును. ( 28 )

టీ :- ఏవమితి. వైరేణ. యా అనుచింతా. తయైవ. పూతః పాప్మా యేషాం. తం ప్రాపుః. (28)

టీ :- వైరముతో ఎట్టిచింతనము కలదో దానిచేతనే ( మనుజులు ) పూతమైన పాపము కలవారు అతనిని పొందుదురు. ( 28 )

శ్లో ॥ కామాద్ద్వేషా ద్భయా త్స్నేహా ద్యథా భక్త్యేశ్వరే మనః ।
ఆవేశ్య తదఘం హిత్వా బహవస్తద్గతిం గతాః ॥ 29 ॥

భక్తితో ఈశ్వరుని యందు మనస్సు నిలిపినట్లుగనే కామము వలన, ద్వేషమువలన, భయమువలన, స్నేహమువలన ఈశ్వరుని యందు మనస్సును నిలిపి కామాది నిమిత్తమైన ఆ పాపమును వదిలి అనేకులు ఆ పరమాత్మ సాయుజ్యమును పొందినారు. ( 29 )

టీ :- తదఘం కామాదినిమిత్తం పాపం హిత్వా. (29)

టీ :- కామక్రోధాది హేతువైన పాపమును వదిలి ( 29 )

శ్లో ॥ గోప్యః కామాద్భయా త్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః
సంబంధాద్వృష్ణయో స్నేహాద్యూయం భక్త్యా వయం విభో॥30

కృష్ణుని యందలి కామముతో ( కోరికతో ) గోపికలు, కృష్ణుని వలన భయముతో కంసుడు, ద్వేషము వలన శిశుపాలాది రాజులు, సంబంధము వలన యాదవులు, స్నేహము వలన మీరు ( పాండవులు ) భక్తితో మేము (నారదాదులు) పరమాత్మ సాయుజ్యమును పొందుచున్నాము. ( 30 )

టీ :- తానాహ - గోప్య ఇతి. (30)

టీ :- వానిని ( కామ, భయ, ద్వేష, సంబంధ, స్నేహ, భక్తులను ) గోప్య ఇత్యాది శ్లోకమున చెప్పుచున్నాడు. ( 30 )

శ్లో ॥ కతమోపి న వేనః స్యా త్పంచానాం పురుషం ప్రతి ।
తస్మా త్కేనా ప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్ ॥ 31

ఆ పరమ పురుషుని గూర్చి పైన చెప్పిన ఐదు సంబంధములలో ఏ ఒక్కటియు వేనుడు కలిగిలేడు ( కావున మోక్షమును పొందజాలకుండెను ) .కావున ఏ ఉపాయము చేతనైనను కృష్ణుని యందు మనస్సు నిలుపవలెను.(31

టీ :- తర్హి వేనః కిమితి నరకే పాతితః. తదీయ ప్రధ్యానా భావాత్. పాపమేవ తత్ర ఫలితమిత్యాహ - కతమ ఇతి. పురుషం శ్రీహరిం ప్రతి. పురుషే పురుషస్యకామాసంభవాత్. భయాదిభి శ్చింతయతాం పంచానాం మధ్యేన కతమో పీత్యుక్తం. (31)

టీ :- అట్లైన వేనుడు ఎందుకని నరకమున పడవేయ బడినాడు? తీవ్రమైన ధ్యానము లేనందున పాపమే. దాని ఫలితమే యని ఇట్లు చెప్పెను. పురుషునకు పురుషునియందు కామము అసంభవమైనందున భయము మొదలైన ఐదింటిలో వేనుడు ఏ ఒక్క సంబంధమును కలిగిలేడు. అని చెప్పబడినది. ( 31 )

శ్లో ॥ మాతృష్వ సేయో వశ్చైద్యో దన్త వక్త్రశ్చ పాండవ ।
పార్షద ప్రవరౌ విష్ణో ర్విప్రశాపా త్పదాచ్యుతౌ ॥ 32 ॥

ఓ పాండుపుత్రా ! శిశుపాలుడు, దంతవక్త్రుడును మీకు పినతల్లి కుమారులు. వారు పూర్వము విష్ణుమూర్తియొక్క ముఖ్య ద్వారపాలకులు. సనకసనందనాదుల శాపమున పద భ్రష్టులైరి. అగనా వైకుంఠభ్రష్టులైరి అని అర్థము. ( 32 )

టీ :- తదేవమితిహాస ప్రస్తావకథాముక్త్వా శ్రీకృష్ణేశిశుపాలస్య వైరానుబంధే. కో హేతురిత్యపేక్షాయాం. తమేవేతిహాసం వక్తుమాహ - మాతృష్వసేయ ఇతి. పదాత్ వైకుంఠాత్ చ్యుతౌ. (32)

టీ :- దానినే ఇట్లు ఇతిహాస ప్రస్తావనా వృత్తాంతమును చెప్పి శ్రీకృష్ణునియందు శిశుపాలునకు వైరానుబంధముడుటకు కారణమేమను అపేక్షయందు ఆ ఇతిహాసమునే చెప్పుటకై ఇట్లనెను. ' మాతృష్వసేయ ' ఇత్యాదిగా. పదాత్ = వైకుంఠమునుండి భ్రష్టులైరి.(32).

**యుధిష్ఠిర ఉవాచ :-**

శ్లో ॥ కీదృశః కస్య వా శాపో హరిదాసాభి మర్శనః ।
అశ్రద్ధేయ ఇవాభాతి హరేరేకాంతినాం భవః ॥ 33 ॥

**యుధిష్ఠిరుడు ఇట్లు ప్రశ్నించెను :-**

హరిదాసులైన జయవిజయులకు కల్గిన శాపము ఎవరిది? అది ఎట్టిది? హరికి ఏకాన్తభక్తులైన వారికి కల్గిన శాపము నమ్ముటకు శక్యము కానిది వలెనున్నది. (33).

టీ - కీదృశ ఇతి. హరిదాసౌ అభిమృశతి తథా. అశ్రద్ధేయః అనాదరణీయ ఇవ అసంభవాత్. భవో జన్మ. (33)

టీ :- హరిదాసులైన జయవిజయులను అవమాన పరుచుచున్నదిగాన హరిదాసా భిమర్శనము. ఎవని శాపము ఎట్టిదో? ఆదరింపతగనియట్లు, అసంభవమగుటవలన భవః = జన్మము. '( 33 )

శ్లో ॥ దేహేంద్రియా సుహీనానాం వైకుంఠ పురవాసినామ్ ।
దేహసంబంధ సంబద్ధ మేత దాఖ్యాతు మర్హసి ॥ 34 ॥

శుద్ధ సత్వమయమైన దేహము కలవారు ( దేహేంద్రియ అసువులు లేనివారు) వైకుంఠపురమున నివసించెడు వారైన వీరికి ప్రాకృతదేహ సంబంధముతో కూడిన వారికి కల్గెడు ఈ శాపవృత్తాంతమును గూర్చి నీవు చెప్పుటకు తగియున్నావు. (34 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఏకదా బ్రహ్మణః పుత్రాః విష్ణోర్లోకం యదృచ్ఛయా ।
సనందనాదయో జగ్ముః చరంతో భువనత్రయమ్ ॥ 35 ।

**నారదుడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

ఒకప్పుడు బ్రహ్మ మానసపుత్రులైన సనకసనందనాదులు ముల్లోకముల సంచరించుచు అనుకోకుండా విష్ణులోకమును దర్శించిరి. ( 35 )

టీ :- అసంభవమేవాహ – దేహేతి, జన్మహేతుభూతైః ప్రాకృతైః దేహేంద్రియాసుభిః. హీనానాం శుద్ధసత్త్వమయదేహానామిత్యర్థః. ప్రాకృతదేహసంబంధేనసంబంధం ఏతదాఖ్యానమాఖ్యాతుమర్హసి. (34,35)॥

టీ :- (భవః)అసంభవమేయని చెప్పుచున్నాడు. జన్మము కారణభూతులైన ప్రాకృతజనులచే ( అనుభవింపదగినది శాపము ) దేహము, ఇంద్రియములు, ప్రాణము లేని వారికి అనగా శుద్ధసత్వభూయిష్టమైన దేహము కలవారికని అర్థము. ప్రాకృతదేహ సంబంధముతో కూడియున్నట్టి ఈ ఆఖ్యానమును వినిపింపదగుదువు. ( 34, 35 )

శ్లో ॥ పంచ షడ్వాయ నార్భాభాః పూర్వేషామపి పూర్వజాః ।
దిగ్వాససః శిశూన్మత్వా ద్వాస్థౌతాన్ ప్రత్యషేధతామ్ ॥36

శ్లో ॥ అపశన్ కుపితా ఏవం యువాం వాసం నచార్హథః ।
రజస్తమోభ్యాం రహితే పాదమూలే మధుద్విషః ।
పాపిష్ఠా మాసురీం యోనిం బాలిశౌ యాతమాశ్వతః॥37

ఐదారుసంవత్సరముల ప్రాయముగలవారి వలె నున్న వారును, పూర్వీకులకు గూడా పూర్వీకులును దిగంబరులైన వారిని బాలకులుగా తలిచి ద్వారపాలకులు వారిని అడ్డుకొనిరి. అప్పుడు ఆ సనకసనందులు కోపించినవారై ఇట్లు శపించిరి. రజస్తమోగుణ రహితమైన మధురిపుని పాదమూలమున వైకుంఠమున మీరు నివసించతగదు. ఓ అవివేకులారా ! పాప భూయిష్ఠమైన అసురజన్మమునెత్తండి. కాన శీఘ్రముగా ఇక్కడినుండి వెళ్ళిపొండి. (36,37)

టీ :- పంచేతి. కథంభూతాః. పంచ వా షడ్వా హాయనాని యేషాంతే. అర్భా బాలాః తద్వదాభా యేషాం తే పూర్వేషాం మరీచ్యాదీనామపి దిగ్వాసస దిగంబరాః. అతః. శిశూన్ మత్వా. (36)

టీ :- సనకసనందనాదులు ఎట్టివారనగా ఐదు లేదా ఆరు వర్షముల బాలురవంటివారు. పూర్వీకులైన మరీచి మహర్షి మొదలైన వారికంటెను ముందుపుట్టినవారు, దిగంబరులు, అందువలన శిశువులనుగా తలంచి (36

టీ :- అశపన్నితి. వాసమపి నార్హథః. కుతః. పునస్తత్సేవామితి చకారార్థః. హే బాలిశా అతో హేతోః ఆశు యాతం. (37)

టీ :- నివసించుటకును తగరు. ఇక ఆపరమాత్మ సేవాభాగ్యమెక్కడ? అని చకారమునకు అర్థము. ఓ అవివేకులారా ! అందువలన శీఘ్రముగ వెడలిపొండి. (37)

శ్లో ॥ ఏవం శప్తౌ స్వభవనా త్పతన్తౌ తైః కృపాలుభిః ।
ప్రోక్తౌ పునర్జన్మభిర్వాం త్రిభిర్లోకాయ కల్పతామ్ ॥ 38॥

ఇట్లు శపించబడి తమ నివాసభవనమైన వైకుంఠమునుండి మర్త్యలోకమున వారు పడుచుండగా కృపాళురైన సనకసనందనాదులచే మూడు జన్మల తర్వాత మరల స్వస్థానముపొందెదరని శాపావసానము చెప్పబడినది. (38 )

శ్లో ॥ జజ్ఞాతే తౌ దితేః పుత్రౌ దైత్య దానవ వందితౌ ।
హిరణ్యకశిపుర్జేష్టో హిరణ్యాక్షోఽనుజ సత్తమః ॥39॥

ఆ జయవిజయులు దైత్యదానవులచే నమస్కరించబడిన దితి పుత్రులుగా జన్మించిరి. అందు హిరణ్యకశిపుడు పెద్దవాడు, హిరణ్యాక్షుడు అతని అనుజుడు. (39)

టీ :- ఏవమితి. వాం యువయోః. త్రిభిర్జన్మభిః. లోకాయ స్వస్థానప్రాప్తయే కల్పతాం. తావతా అయం శాపః సమాప్యతామితి పునః ప్రోక్తావిత్యర్థః. (38,39)

టీ :- మీ ఇరువురికి మూడుజన్మలతో స్వస్థాన ప్రాప్తికై తగును గాక. అంతతో ఈ శాపము సమాప్తి యగుగాక. యని మరల చెప్పబడిరని యర్థము. (38,39

శ్లో ॥ హతో హిరణ్యకశిపు ర్హరిణా సింహరూపిణా ।
హిరణ్యాక్షో ధరోద్ధారే బిభ్రతా సౌకరం వపుః ॥ 40 ॥

నరసింహరూపమును దాల్చిన విష్ణువుచే హిరణ్యకశిపుడు హతము గావించబడినాడు. భూమిని ఉద్ధరించు సందర్భమున వరాహ రూపమును దాల్చిన విష్ణుమూర్తిచే హిరణ్యాక్షుడు హతమార్చబడెను. ( 40 )

టీ :- హత ఇతి. ధరోద్ధారే నిమిత్తే. తత్ప్రతిఘాతీ హతః. (40)

శ్లో ॥ హిరణ్య కశిపుః పుత్రం ప్రహ్లాదం కేశవప్రియమ్ ।
జిఘాంసు రకరోన్నానా యాతనా మృత్యు హేతవే ॥41

టీ :-హిరణ్యకశిపోర్వధే కారణంసూచయతి -
హిరణ్యకశిపురితి. (41)

శ్లో ॥ సర్వభూతాత్మ భూతం తం ప్రశాన్తం సమదర్శనమ్ ।
భగవత్తేజసా స్పృష్టం నాశక్నో ద్ధంతుముద్యమైః ॥42 ॥

టీ :- తమితి. సర్వభూతానామాత్మభూతం. కుతః. సమం బ్రహ్మైవ పశ్యతీతి. తథా తం. అతః ప్రశాతం ద్వేషాదిరహితం. అతఏవ భగవత్తేజసాస్పృష్టం. వ్యాప్తం. ఉద్యమైః శస్త్రప్రహారాదిభిః. (42)

టీ :- భూమిని ఉద్ధరించు సందర్భమున అడ్డుపడినవాడై హతుడయ్యెను.(40

హిరణ్యకశిపుడు కేశవప్రియుడైన తన పుత్రుడగు ప్రహ్లాదుని సంహరించ కోరిక కలిగినవాడై అనేకవిధములైన యాతనలకు గుఱి చేసెను. ( 41 )

టీ :- హిరణ్యకశిపుని యొక్క వధయందలి కారణమును సూచించుచున్నాడు. (41)

ఆ హిరణ్యకశిపుడు శస్త్రాస్త్ర ప్రహారాది అనేక ప్రయత్నములచే, సర్వభూతముల ఆత్మ రూపుడుగా జన్మించినవాడును, ద్వేషాదిరహితుడై, ప్రశాంతచిత్తుడైయున్నవాడును, సకల ప్రాణులయందును బ్రహ్మమునే దర్శించువాడునగు భగవత్తేజముచే వ్యాప్తమైనట్టి ప్రహ్లాదుని చంపుటకు అశక్తుడయ్యెను. ( 42 )

టీ :- సర్వ భూతములకు ఆత్మ యైనవాడు. ఎందులకు ప్రాణులన్నింటి యందు సమానముగా బ్రహ్మమునే చూచుచున్నాడని అట్లు చెప్పబడినది. అందువలన ప్రశాంతుడు ( ద్వేషాదిరహితుడు ) కావుననే భగవంతుని తేజముచే వ్యాప్తమైనవాడు. ఉద్యమములచేత, శస్త్రాస్త్ర ప్రహారాదులచే (42)

శ్లో ॥ తతస్తౌ రాక్షసౌ జాతౌ కేశిన్యాం విప్రవస్సుతౌ ।
రావణః కుంభకర్ణశ్చ సర్వలోకోపతాపనౌ ॥ 43 ॥

శ్లో ॥ తత్రాపి రాఘవో భూత్వా న్యహనచ్ఛాప ముక్తయే ।
రామవీర్యం శ్రోష్యసిత్వం మార్కండేయ ముఖాత్ప్రభో॥44

టీ :- తత ఇతి. విశ్రవసః సుతౌ. (43)

టీ :- తత్రేతి. న్యహనత్ నిహతవానిత్యర్థః. తర్హి తదేవ కథనీయమిత్యుత్సుకం ప్రత్యాహ - రామవీర్యమితి. (44)

శ్లో ॥ తావేవ క్షత్రియౌ జాతా మాతృష్వస్రాత్మజౌ తవ ।
అధునా శాపనిర్ముక్తౌ కృష్ణచక్ర హతాంహసౌ ॥ 45 ॥

శ్లో ॥ వైరానుబంధ తీవ్రేణ ధ్యానేనాచ్యుత సాత్మతామ్ ।
నీతౌ పునర్హరేః పార్శ్వం జగ్మతుర్విష్ణు పార్షదౌ ॥ 46

టీ :- తావితి. కృష్ణచక్రేణ హతమంహో యయోస్తౌ. తయోః. పాపమేవ వ్యాహతం. న తు తావిత్యర్థః. (45,46)

అనంతరము వారిరువురు కేశినీ విశ్రవసులకు పుత్రులుగా రావణ కుంభకర్ణులనెడు రాక్షసులై జన్మించి సర్వలోకములకు తాపమును కలిగించిరి. ఆ జన్మములందును విష్ణువు రామావతారమునెత్తి వారి శాపమును తొలిగించుటకై సంహరించెను. మార్కండేయముని ముఖమున నీవు రామ పరాక్రమమును గూర్చి వినగలవు. ( 43, 44 )

టీ :- విశ్రవసుని పుత్రులు ( 43 )

టీ :- చంపినవాడయ్యెనని అర్థము. అట్లైన అదే వృత్తాంతము చెప్పుమని ఉత్సుకతగల వానిని గూర్చి ఇట్లనెను. ( 44 )

ఓ ధర్మరాజా ! మరల వారే నీ పినతల్లి పుత్రులై క్షత్రియులుగా జన్మించిరి. ఇప్పుడు శ్రీకృష్ణుని చక్రముచే నిష్పాపులై బ్రహ్మ శాపమునుండి విముక్తులైరి. తీవ్రమైన వైరానుబంధముచేత, హరిధ్యాసచేత హరిసారూప్యమునొంది విష్ణుమూర్తికి ద్వారపాలకులై మరల విష్ణుమూర్తి చెంత చేర్చబడిరి. (45,46)

టీ :- శ్రీకృష్ణుని చక్రముచే హతముగావించబడిన పాపము గలవారు. వారి పాపమే హతమైనది కానీ వారు కాదని యర్థము. ( 45, 46 )

**యుధిష్ఠర ఉవాచ :-**

శ్లో ॥ విద్వేషోదయితే పుత్రే కథమాసీన్మహాత్మని ।
బ్రూహిమే భగవన్ యేన ప్రహ్లాదస్యాచ్యుతాత్మజా ॥ 47

**ధర్మరాజు ఇట్లు ప్రశ్నించెను :-**

మహాత్ముడైన ప్రియమైన పుత్రునియందు హిరణ్య కశ్యపునకు విద్వేశము ఎట్లు కలిగినది? ఏ కారణముచే ప్రహ్లాదునకు అచ్యుతాత్మత సిద్ధించినది? పూజ్యుడా! ఈ విషయమును నాకు వివరించుము.

టీ :- విద్వేష ఇతి. యేన కారణేన ప్రహ్లాదస్యాచ్యుతాత్మతా అచ్యుతైకచిత్తత్వం. తదపి బ్రూహీతి శేషః. (47)

టీ :- ఏ కారణముచే ప్రహ్లాదునకు అచ్యుతాత్మత కలిగినదో దానిని కూడా చెప్పుమని అధ్యాహారము. ( 47 )

**ఇతి శ్రీమద్భాగవతే, వ్యాస విరచితే, మహాపురాణే, సప్తమస్కంధే, శ్రీహరి కథనం నామ ప్రథమోధ్యాయః**

**ఇయ్యది శ్రీమద్భాగవత మహాపురాణమందలి సప్తమస్కంధమున భావార్థ దీపికా టీకానువాదమున మొదటి అధ్యాయము.**

శ్రీ గణేశాయ నమః
శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ భ్రాతర్యేవం వినిహతే హరాణా క్రోడ మూర్తినా ।
హిరణ్యకశిపూ రాజన్ పర్యతప్యద్రుషా శుచా ॥ 1

**నారదుడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

ఇట్లు దేవ పక్షపాతముచే వరాహరూపుడైన హరిచే తన సోదరుడు (హిరణ్యాక్షుడు ) సంహరించబడగా రాజా ! హిరణ్యకశిపుడు కోపముతో, దుఃఖముతో పరితపించెను. ( 1 )

టీ :- ద్వితీయే విష్ణురోషేణ లోకం విప్లావ్య దానవైః, తద్ధతభ్రాతృ పుత్రాదీనితిహాసైరసాంత్వయత్. భగవద్ద్వేష ఏవ తద్ద్వేషే పి కారణమిత్యాశయేనాహ. - భ్రాతరీత్యాదినా. (1)

టీ :- ద్వితీయాధ్యాయమందు దానవులు విష్ణువందలి కోపముచే లోకమును కొల్లగొట్టుట మొదలైన ఉపద్రవములను గావించి విష్ణువుచే హతుడైన తన సోదరుని పుత్రులు మొదలైన వారిని ఇతిహాసములచే ఓదార్చెను. భగవంతుని యందలి ద్వేషమే ఆ దానవుల ద్వేషమునకు కారణమను ఆశయముచే ' భ్రాతరీత్యాది ' శ్లోకముచే చెప్పుచున్నాడు. ( 1 )

శ్లో ॥ అహచేదం రుషాఘూర్ణ సందష్ట దశన చ్ఛదః ।
కోపోజ్జ్వలాభ్యాం చక్షుర్భ్యాం నిరీక్షన్ ధూమ్ర మంబరమ్2

మరియు కోపముచే అదురుచున్న అధరోష్టమును పంటిచే అదిమిపట్టినవాడై కోపముచే మండుచున్న కన్నులచే ధూమ్ర ( ఎక్కువ నలుపు తక్కువ ఎఱుపు ) వర్ణముగల ఆకాశమును చూచుచున్నవాడై ఇట్లనెను. (2)

టీ :- ఆహేతి. ఏవం దేవపక్షపాతేన కోపేన. ఉత్ అతిశయేన జ్వలద్భ్యాం. కోపాగ్నిధూమేనైవ ధూమ్రం అంబరం. నిరీక్షమాణః. (2)

టీ :- ఇట్లు దేవపక్షపాతముచే, కోపముచే అతిశయముగ మండుచున్న కోపాగ్ని ధూమము చేతనే ధూమ్రవర్ణమైన ఆకాశమును చూచుచున్నవాడై, 2 )

శ్లో ॥ కరాల దంష్ట్రోగ్ర దృష్ట్యా దుష్ప్రేక్ష్య భ్రుకుటీ ముఖః ।
శూలముద్యమ్య సదసి దానవానిద మబ్రవీత్ ॥ 3 ॥

భయంకరమైన దంతములతోడ ఉగ్రమైన దృష్టితో, చూచుటకు శక్యముకాని భృకుటిగల ముఖముగలవాడై శూలమునెత్తి దానవులగూర్చి ఇట్లు చెప్పెను. ( 3 )

శ్లో ॥ భో భో దానవ దైతేయా ద్విమూర్ధ త్ర్యక్ష్య శంబర ।
దశబాహో హయగ్రీవ నముచే పాక ఇల్వల ॥ 4 ॥

శ్లో ॥ విప్రచిత్తే మమవచః పులోమన్ శకునాదయః ।
శ్రుణుతానంతరం సర్వే క్రియతా మాశు మాచిరమ్॥5

ఓరోరి ! దైతేయులైన దానవులారా ! ద్విమూర్ధ ! త్ర్యక్ష ! శంబరా ! దశబాహూ! హయగ్రీవా ! పులోముడా! శకునాదులారా ! నామాటలు వినుడు. అటు తరువాత వెంటనే ఆచరించుడు. జాగుసేయకుడు. ( 4, 5 )

టీ :- కరాలేతి. కరాలదంష్ట్రాభిః. యుక్తయా. ఉగ్రయా దృష్ట్యా. దుష్ప్రేక్ష్యం భ్రుకుటియుక్తం ముఖం యస్య సః. (3,4.5)

టీ :- భయంకరమైన దంతపు కోరలతో యోగము కలిగిన దృష్టిచే, చూడశక్యముగాని భృకుటితో కూడిన ముఖముగలవాడై ( 3, 4, 5 )

శ్లో ॥ సపత్నై ర్ఘాతితః క్షుద్రై ర్భ్రాతామే దయితః సుహృత్ ।
పార్ష్ణి గ్రాహేణ హరిణా సమేనా ప్యుపధావనైః ॥ 6 ॥

సముడైనను దేవతల భజనలచే మనకు పక్కలో బల్లెమైన హరిద్వారా నీచులైన శత్రువులచేత మిత్రుడు, ప్రియమైన వాడగు నా సోదరుడు చంపబడినాడు. తన సహజమైన సమభావమును వీడిన వాడును,

శ్లో ॥ తస్య త్యక్త స్వభావస్య ఘృణేర్మాయా వనౌకసః ।
భజంతం భజమానస్య బాలస్యేవా స్థిరాత్మనః ॥ 7 ॥

శ్లో ॥ మచ్ఛూలభిన్న గ్రీవస్య భూరిణా రుధిరేణవై ।
రుధిర ప్రియం తర్పయిష్యే భ్రాతరం మే గతవ్యథః ॥ 8

శుద్ధతేజోమయుడైనను మాయచే వరాహ రూపమును దాల్చినవాడును, తనను భజించువారిని సేవించువాడును, బాలునివలె చంచలచిత్తముగల వాడునగు ఆ శ్రీహరి కంఠమును నా శూలముచే ఖండించి పుష్కలమైన అతని రక్తముచే రక్తప్రియుడైన నా సోదరునకు తర్పణమొసగి నా మనోవ్యధను తీర్చుకొనెదను. ( ఇచ్చట మరియొక అర్థము. నా శూలమునకచ్చట ప్రవేశము సాధ్యము కానందున అతని అంగరాగమైన కుంకుమతో ఆ నిర్మాల్య కుంకుమ ప్రియుడైన నా సోదరుని తృప్తి కలిగింపజేతును. అని ). ( 6, 7, 8 )

టీ :- సపత్నైరితి. సమేనాప్యపధానైర్భజనైః. నిమిత్తభూతైః పార్ష్ణిగ్రాహేణ సతా. (6)

టీ :- సర్వప్రాణులయెడ సమభావము కలవాడైనను భజనలచే దేవ పక్షపాతమును వహించిన ( 6 )

టీ :- తస్యేతి. ఏవం త్యక్తః స్వభావః సమత్వం యేన తస్యఘృణేః శుద్ధతేజోమయస్యాపి మాయయా వనౌకసః వరాహరూపస్య సతః. అస్థిరాత్మనః అవ్యస్థిత చిత్తస్య. కుతః. యో యో భజతి తం తం భజమానస్య అనుసరతః. (7)

టీ :- ఏవం = ఈ విధముగా వదలబడిన తన సమత్వ భావము కలవాడు. ఘృణేః=శుద్ధ తేజోమయుడైనను మాయచే వరాహ రూపము గలవాడగుచు అనిశ్చిత చిత్తుడైన. ఎందువలన అనగా ఎవరెవరు తనను భజించెదరో, వారినందరిని అనుసరించువాడు. ( 7 )

టీ :- మచ్ఛూలేతి. తస్య రుధిరేణ యావత్తర్పయిష్యామి తావద్యూయం భువం యాతేతి తృతీయేనాన్వయః. (8)

టీ :- విష్ణువుయొక్క రక్తముచే తర్పణమొసగువరకు మీరు భూలోకమునకు వెళ్ళుడు. అని తర్వాతి మూడవ శ్లోకముతో అన్వయము. ( 8 )

శ్లో ॥ తస్మిన్ కూటే హితే నష్టే కృత్తమూలే వనస్పతౌ ।
విటపా ఇవ శుశ్యన్తి విష్ణుప్రాణా దివౌకసః ॥ 9 ॥

ఆ కాపట్య ప్రియుడైన, దేవతలకు హితుడైన హరి నశించిన వాడుకాగా మొదలు నరికిన వృక్షముయొక్క కొమ్మలవలె దేవతలు నశింతురు. దేవతలు విష్ణువే ప్రాణములు గాగలవారు కదా ! ( 9 )

టీ :- నను దేవైస్తద్వధః కారితః. అతస్తే కిం న హన్యంతే? తత్రాహ - తస్మిన్నితి. తస్మిన్ కూటే కపటే అహితే ప్రతిపక్షే కూటమహితం యస్యేతి వా. నష్టే అదృష్టే సతి. దేవాః శుష్యంతి స్వయమేవ నాశం యాస్యంతి. కుతః? విష్ణురేవ ప్రాణో యేషాం తే. (9)

టీ :- దేవతలచే ఆహిరణ్యాక్ష సంహారము గావించబడగ వారేల చంపబడకున్నారు? అనిన చెప్పును. ఆ శ్రీహరి కపటుడు శత్రువు లేదా కూటే + అహితే, కూటే + ఈహిత. అను రెండవ పదవిభాగము ననుసరించి కపట ప్రియుడు. అగుపడని వాడుకాగా దేవతలు స్వయముగనే నశింతురు. ఎట్లనగ వారి ప్రాణములు విష్ణుమూర్తియే. వృక్షము మొదలు నరికివేయబడిన శాఖలు స్వయముగనే ఎండినట్లు. (9)

శ్లో ॥ తావద్యాత భువం యూయం విప్రక్షత్ర సమేధితామ్ ।
సూదయధ్వం తపోయజ్ఞ స్వాధ్యాయ వ్రతదానినః ॥10

నేనా కపటిని అంతమొందించువరకు మీరు విప్రరక్షణలో వృద్ధిపొందుచున్న భూమండలమునకు వెళ్ళండి. తపము, యజ్ఞము, వేదాధ్యయనము, వ్రతములు, దానములు గావించువారినందరినీ సంహరించండి. ( 10 )

టీ :- తావదితి తపోయజ్ఞాదియుక్తాన్ సూదయధ్వం ఘాతయత. (10)

టీ :- తపము, యజ్ఞము మొదలైన క్రియలుగావించువారిని చంపండి. (10)

శ్లో ॥ విష్ణుర్ద్విజ క్రియామూలో యజ్ఞోధర్మ మయః పుమాన్ ।
దేవర్షి పితృ భూతానాం ధర్మస్యచ పరాయణమ్ ॥ 11

శ్లో ॥ యత్ర యత్ర ద్విజాగావో వేదా వర్ణాశ్రమాః క్రియాః ।
తం తం జనపదం యాత సందీపయత వృశ్చత ॥ 12॥

శ్లో ॥ ఇతి తే భర్తృ నిర్దేశ మాదాయ శిరసా ధృతాః ।
తథా ప్రజానాం కదనం విదధుః కదన ప్రియాః ॥13॥

విష్ణువు ద్విజులయొక్క అనుష్ఠాన క్రియలే మూలము గలవాడు. ఎందులకనగా అతడు యజ్ఞము, ధర్మముల రూపములు గలవాడు. దేవతలకు, ఋషులకు, పితరులకు, భూతములకు ఆయన పరమాశ్రయుడు. ధర్మమునకు ఆలవాలము. ( కాన యజ్ఞరూపుడైన విష్ణువునకు మూలమైనందున నన్ననాదరించి వాని నాశ్రయించినందున వారు చంపదగిన వారని భావము) ఎచ్చటెచ్చట ద్విజులు, గోవులు, వేదములు, వర్ణాశ్రమక్రియలు విలసిల్లునో అట్టి దేశమునకు ( జనావాసమునకు ) వెళ్ళండి. కాల్చివేయండి. ఆజీవ్యములైన ( బ్రతుకుదెరువులైన) వృక్షములను ఛేదించండి. ఇలా తమ ప్రభువుయొక్క ఆదేశమును శిరసావహించి, ఆదరించి యుద్ధప్రియులైన ఆ దైత్యులు ప్రజలతో యుద్ధము గావించిరి. ( 11-13 )

టీ :- నను తైః కిమపరాద్ధం? తత్రాహ - విష్ణురితి. ద్విజానాం క్రియా అనుష్ఠానం. మూలం యస్య సః. యతో సౌ యజ్ఞో ధర్మమయశ్చ. పరాయణం పరమాశ్రయః. అతో యజ్ఞరూపస్య విష్ణోర్మూలత్వాత్. మామనాదృత్య. తదాశ్రయణాచ్చ. తే వధ్యా ఇతి భావః. (11)

టీ :- ఏమి? వారిచే ఏ అపరాధము గావించబడినదనిన ‘ విష్ణు ’ ఇత్యాదిగా చెప్పెను. ద్విజులయొక్క అనుష్ఠానాది క్రియలే మూలముగాగలవాడు విష్ణువు. ఎందువలననైతే ఈయన యజ్ఞస్వరూపుడు, ధర్మరూపుడు అగుచున్నాడో దేవ, ఋషి, పితృ, భూతాదులకు పరమాశ్రయుడు. కాన యజ్ఞరూపుడగు విష్ణువునకు మూలమైనందున నన్ను అనాదరించి (లెక్కచేయక) విష్ణువునాశ్రయించినందున వారు చంపదగిన వారని భావము. ( 11 )

టీ :- తస్మాత్పరమం మంత్రం శృణుతేత్యాహ - యత్రేతి. సందీపయత దహత. వృశ్చ్యత ఛేదం కురుత లునీతేత్యర్థః. (12,13)

టీ :- అందువలన ఒక శ్రేష్ఠమైన మంత్రమును వినండి. అని ఇట్లు చెప్పెను. ఎచ్చటెచ్చట ( యత్ర యత్ర ఇత్యాది శ్లోకములచే ) సందీపయత = మండించండి. వారికి ఆధారములైన వృక్షములను నరికివేయండి. (12,13)

శ్లో ॥ పురగ్రామ వ్రజోద్యాన క్షేత్రారామాశ్రమా కరాన్ ।
ఖేట ఖర్వట ఘోషాంశ్చ దదహుః పత్తనానిచ ॥ 14 ॥

పురములను, గ్రామములను, గోవులుగల పల్లెలను, ఉద్యానములను, క్షేత్రములను, ఆలయములను, ఆశ్రమస్థానములను, రైతుల నివాసములను, ఆటవిక గ్రామములను, గొల్లపల్లెలను, రాజధానులను కాల్చివేసిరి. ( 14 )

టీ :- పురేతి. పురం హట్టాదిమత్. గ్రామస్తద్రహితః వ్రజః గవాం వాసః. ఉద్యానం కృత్రిమం వనం. క్షేత్రం వ్రీహ్యాదేః. ఆరామః అకృత్రిమం వనం. ఆశ్రమః ఋషీణాం స్థానం. ఆకరో రత్నాదీనాం. ఖేటః కృషీవలానాం వాసఃజ ఖర్వటః గిరిద్రోణ్యాశ్రయో గ్రామః. ఘోష ఆభీరాణాం వాసః. పట్టణం రాజధానీ. (14)

టీ :- పురము = అంగడివీధి మొదలైనవి కలది. గ్రామము = అంగడివీధి మొదలైన హంగులు లేనిది. వ్రజము = గోవుల నివాస భూమి. ఉద్యానము = కృత్రిమ వనము. క్షేత్రము = ధాన్యాదులు పండించుభూమి. ఆరామము = అకృత్రిమ వనము. ఆశ్రమము=ఋషులు నివసించు స్థానము. ఆకరము = రత్నాదుల స్థలము. ఖేటము=రైతుల ( కృషీవలుర ) నివాస స్థానము. ఖర్వటము = గిరులు, లోయలు మొదలైన చోట గల గ్రామము. ఘోషము = గొల్లపల్లె. పత్తనం = రాజధాని. ( 14)

శ్లో ॥ కేచిత్ఖనిత్రై ర్బిభిదుః సేతు ప్రాకార గోపురాన్ ।
ఆజీవ్యాంశ్చిచ్ఛిదు ర్వృక్షాన్కేచి త్పరశుపాణయః ।
ప్రాదహన్శరణాన్యన్యే ప్రజానాం జ్వలితోల్ముకైః ॥ 15 ॥

ఓ మానవనాథా ! కొందరు గడ్డపారలు తీసుకొని వానిచే సేతువులను, నగరప్రాకారములను, గోపురములను ధ్వంసము గావించిరి. కొందరు పరశువులను (గొడ్డండ్రను ) చేతబూనినవారై ప్రాణాధారములైన వృక్షములను ఛేదించిరి. కొందరు దివిటీలచేత ప్రజల గృహములను తగులబెట్టిరి. (15)

టీ :- కేచిదితి. ఖనిత్రైః ఖననసాధనైః.ఆజీవ్యాన్ ఉపజీవ్యాన్ శరణాని గృహాన్. (15)

టీ :- ఖనిత్రైః = త్రవ్వెడు సాధనములచే ( గడ్డపార, పార మొదలైనవి ), ఆజీవ్యాన్ = జీవనాధారములైన అల్లనేరెడు, మామిడి, వెలగ మొదలైన ఫలవృక్షములను, శరణాని = గృహములను ( ధ్వంసము గావించిరి ). (15)

శ్లో ॥ ఏవం విప్రకృతేలోకే దైత్యేంద్రానుచరై ర్ముహుః ।
దివం దేవాః పరిత్యజ్య భువిచేరు రలక్షితాః ॥ 16 ॥

దైత్యేంద్రుడైన హిరణ్యకశిపుని అనుచరులచే ఇట్లు అనేకమారులు లోకము ధ్వంసము గావించబడగా దేవతలు స్వర్గమువీడి మారు రూపములతో భూమిపై సంచరించసాగిరి. ( 16 )

టీ :- ఏవమితి. విప్రకృతే ఉపద్రుతే. యజ్ఞభాగానామభావాత్. దివం పరిత్యజ్య. (16)

టీ :- విప్రకృతే = విధ్వంసము గావించబడగ. యజ్ఞ భాగములు లేనందున స్వర్గమును వదిలి ఇతరులకు గుర్తింప బడకుండునట్లుగ భూమండలమును చేరి సంచరించు చుండిరి.(16 )

శ్లో ॥ హిరణ్య కశిపుర్భ్రాతుః సంపరేతస్య దుఃఖితః ।
కృత్వా కటోదకాదీని భ్రాతృ పుత్రా నసాన్త్వయత్ ॥17॥

హిరణ్యకశిపుడు సోదరుని మరణమునకు దుఃఖించువాడై ప్రేతకు అర్పించవలసిన ధర్మోదకాదుల నర్పించి సోదరుని పుత్రులనోదార్చెను. (17)

శ్లో ॥ శకునిం శంబరం ధృష్టం భూత సంతాపనం వృకమ్ ।
కాలనాభం మహానాభం హరిశ్మశ్రు మథోత్కచమ్ ॥ 18॥

శకుని, శంబర, ధృష్ట, భూతసంతాపన, వృక, కాలనాభ, మహానాభ, హరిశ్మశ్రు ఉత్కచులను వారిని . ( 18 )

శ్లో ॥ తన్మాతరం రుషాభానుం దితించ జననీం గిరా ।
శ్లక్ష్ణయా దేశకాలజ్ఞ ఇదమాహ జనేశ్వర ॥ 19 ॥

వారి తల్లియైన రుషాభానును తనతల్లియైన దితిని దేశకాలజ్ఞుడైన దానవపతి మృదువైన మాటలచేత ఇట్లు చెప్పెను. ( 19 )

టీ :- తదేవం ప్రజానాం కదనం దానవేషు కురుత్సు. స్వయం స్వర్గస్వారాజ్యాది సాధయితుం తపస్తప్తుకామః ప్రథమం యత్ కృతవాన్ తదాహ – హిరణ్యకశిపురిత్యాదినా. తిలోదకం ప్రేతాయ ప్రదేయం తిలైస్సహితముదకం. కటోదకాదీనితి పాఠాంతరే పి తిలోదకమిత్యేవ జ్ఞేయం. ఆదిశబ్దాత్ప్రేతశ్రాద్ధం చ. (17,18,19)

టీ :- అందువలన ఇట్లు దానవులు ప్రజలయొక్క హింస గావించుచుండగా స్వర్గరాజ్యాది లాభమును సాధించుటకు హిరణ్యకశిపుడు తపస్సు చేయగోరిన వాడై ముందుగా ఏమి చేసెనో " హిరణ్యకశిపుః " ఇత్యాది శ్లోకములతో చెప్పెను. కటోదకం=ప్రేతకు ఒసగవలసిన జలము (ధర్మోదకాదులు) ఆదిశబ్దమువలన ప్రేత (మల) శ్రాద్ధాదులను ఆచరించెను. (17–19)

శ్లో ॥ అంబాంబ మే వధూః పుత్రా వీరం మార్హథ శోచితుమ్।
రిపోరభిముఖే శ్లాఘ్యః శూరాణాం వధ ఈప్సితః ॥20॥

భ్రాతయైన హిరణ్యాక్షుని పుత్రాదులతో హిరణ్యకశిపుడిట్లు చెప్పి ఓదార్చుచున్నాడు. అమ్మా ! అమ్మా ! ఓ వధూ ! ( మరదలా ! ) పుత్రులారా! వీరుని గూర్చి దుఃఖించ తగదు. శత్రువు ఎదుట నిలిచి శూరుల మరణము కోరదగినది. కొనియాడదగినది. ( 20 )

టీ :- అంబేతి. హే వధూరితి భ్రాతుర్భార్యాం సంబోధయతి. (20)

టీ:- హే వధూః! అని సోదరుని భార్యను సంబోధించుచున్నాడు (హిరణ్యకశిపుడు). (20)

శ్లో ॥ భూతానామిహ సంవాసః ప్రపాయామివ సువ్రతే ।
దైవేనైకత్ర నీతానా మున్నీతానాం స్వకర్మభిః ॥ 21 ॥

ఓ పతివ్రతా ! పానశాలలో సహవాసము చేసినట్లు ఈ లోకమున ప్రాణుల (భూతముల ) సహవాసము క్షణికము. తమ తమ కర్మలననుసరించి ఒకచోట కూర్చబడుదురు. మరల కొనిపోబడుదురు. అట్టి వారి వియోగమునకు దుఃఖించ పనిలేదు. ( 21 )

టీ :- భవతు నామ తస్య శ్లాఘ్యో వధః తథాప్యస్మాకం తావత్ బంధుర్గత ఏవేతి చేత్తత్రాహ - భూతానామితి. దైవేన ప్రాచీనకర్మణా. ఏకత్ర నీతానాం సంయోజితానాం. పునశ్చ స్వైస్వైః కర్మభిః.ఉన్నీతానాం వియోజితానాం. (21)

టీ :- ఆ హిరణ్యాక్షుని వధ శ్లాఘ్యమే అగునుగాక. ఐనను మాకైతే కావలసిన బంధువు గతించెను గదా ! అనిన చెప్పెను. ‘ భూతానాం ’ ఇత్యాదిచే. దైవముచే పూర్వకర్మానుసారముగా ఒకచోట యోగము కల్పించబడిన వారికి మరల ఆయా కర్మలచే వియోగము కల్పించబడిన వారికి గల సంయోగము అశాశ్వతమైనది. (21 )

శ్లో ॥ నిత్య ఆత్మావ్యయః శుద్ధః సర్వగః సర్వవిత్పరః ।
ధత్తేఽసావాత్మనో లింగం మాయయా విసృజన్ గుణాన్ ॥22॥

శ్లో ॥ యథాంభసా ప్రచలితా తరవోఽపిచలా ఇవ ।
చక్షుషా భ్రామ్య మాణేన దృష్యతే చలతీ వభూః ॥23 ॥

శ్లో ॥ ఏవం గుణైర్భ్రామ్య మాణే మనస్య వికలః పుమాన్ ।
యాతి తత్సామ్యతాం భద్రే హ్యలింగో లింగవానివ॥24

ఆత్మ నిత్యము. మృత్యువు లేనిది. అపక్షయ శూన్యము. నిర్మలమైనది. సర్వవ్యాపి. సర్వజ్ఞానము కలది. దేహాదులకంటే భిన్నమైనది. అట్టి ఆత్మ మాయచే తన గుణముల నొదిలి ఒక లింగమును ( రూపమును ) ధరించును. ఎట్లైతే నీటిచే కదిలించబడు వృక్షములు నడుచుచున్నట్లు అగుపడునో భ్రమించు నేత్రముచే చూచినచో భూమియు కదులుచున్నట్లుండునో అట్లే గుణములచే భ్రమింపజేయబడిన మనస్సు భ్రమనొంది లింగరహితుడయ్యు లింగము కలవానివలె భావించును. తత్సామ్యమును పొందును. పురుషుడు పరిపూర్ణుడే. అలింగమున లింగభావన యనునది అనగా నిర్మలమైన ఆత్మకు దేహాభిమానము

శ్లో ॥ ఏష ఆత్మ విపర్యాసో హ్యలింగే లింగ భావనా ।
ఏష ప్రియా ప్రియైర్యోగో వియోగః కర్మ సంసృతః ॥ 25

టీ :- ఏవం లోకదృష్ట్యా శోకం నివార్య తత్త్వదృష్ట్యా వారయతి – విత్య ఇతి. నిత్యః మృత్యుశూన్యః. అవ్యయః అపక్షయశూన్యః. శుద్ధః నిర్మలః సర్వగః సర్వగతః సర్వవిత్ సర్వజ్ఞశ్చ. తత్ర హేతుః. పరో దేహాదివ్యతిరిక్తః. అతో మృత ఇతి. కృశ ఇతి. మలిన ఇతి వియుక్త ఇతి. అజ్ఞ ఇతి చ. శోకో న కార్య ఇత్యర్థః. కథం తర్హి తస్య సంసారస్తత్రాహ – ధత్త ఇతి. ఆత్మనో మాయయా స్వావిద్యయా లింగం ధత్తే గుణానుచావచాన్దేహాన్సుఖ దుఃఖాదీన్వా విశేషేణ సృజన్ స్వీకుర్వన్. లింగశరీరోపాధిః సంసార ఇత్యర్థః(22)

టీ :- ఏతత్సదృష్టాంతం ప్రపంచయతి – యథేతి చతుర్భిః. తరవః ప్రతిబింబితాః ఉపాధిధర్మా ఉపహితే భవంతీతి దృష్టాంత ముక్త్వా గ్రాహక ధర్మా గ్రాహ్యే భవంతీతి దృష్టాంతమాహ – చక్షుషేతి. (23)

విపర్యాసము ( అన్యథావము) వలన కలుగును. దానివలన ఇష్టమైన వారితో వియోగము, అప్రియులతో యోగము, కర్మ, నానాగర్భ సంభవములు కలుగును. ( 22 – 25 )

టీ :- ఇట్లు లౌకిక దృష్టిచే శోకమును వారించి తత్త్వ దృష్టిచే నివారించు చున్నాడు. 'నిత్య' ఇత్యాదిగా. ఆత్మ నిత్యము, అనగా మృత్యువు లేనిది, శుద్ధమైనది, నిర్మలమైనది, సర్వగతము, సర్వవ్యాపి, సర్వజ్ఞానియు నగుచున్నది. సర్వగతత్వమునకు హేతువు, దేహాది వ్యతిరిక్తము. అందువలన మృతుడని, కృశుడని, మలినుడని, ఎడబాసెనని, అజ్ఞుడని తలచి దుఃఖించరాదు. అట్లైనచో జీవునకు సంస్కారమెట్లు? అనిన ఇట్లు చెప్పెను. 'ధత్త' ఇత్యాదిగా. తన మాయచే అనగా తన అవిద్యచే ఆకారము దాల్చెను. ఉచ్చావచములైన దేహములను గుణములను, సుఖదుఃఖాదులను, విశేషముగా స్వీకరించును. లింగశరీరోపాధి యైనది సంసారమని భావము. ( 22 )

టీ :- దీనిని దృష్టాంత సహితముగా వివరించు చున్నాడు. ' యదా ' ఇత్యాదిగా నాలుగు శ్లోకములలో . వృక్షములు నీటిలో ప్రతిబింబించినవై ఉపాధి ధర్మములు కూర్చబడుచున్నవని దృష్టాంతమును తెల్పి గ్రాహక ధర్మములు గ్రాహ్యమునందు, శరీరధర్మములు ఆత్మయందు కలుగుచున్నవని దృష్టాంతము చెప్పబడినది. ' చక్షుషా' ఇత్యాదిగా . ( 23 )

టీ :- అవికలః పరిపూర్ణఏవ. తత్సామ్యతాం మనస్సమతా మిత్యర్థః. (24)

టీ :- అవికలుడు అనగా పరిపూర్ణుడైన పరుషుడు వాడే. దానిసామ్యమును మనస్సుతో సమరూపమునని అర్థము. ( 24 )

టీ :- లింగభావనా దేహాభిమానః. ఏష ఆత్మనో విపర్యాసోఽన్యథా భావః తమేవాహ - ప్రియైర్వియోగోఽపి యైర్యోగశ్చ. కర్మ చ సంసృతిశ్చ నానాగర్భేషు ప్రవేశః. (25)

టీ :- లింగభావనా = దేహాభిమానము. ఆ ఆత్మయొక్క విపర్యాసము = అన్యథాభావము. దానినే చెప్పెను. ఇష్టమైన వారితో వియోగము, అప్రియులతో యోగమున్ను. కర్మయు, సంసృతియు అనగా నానా గర్భములందు ప్రవేశించి జన్మించుట. ( 25 )

శ్లో ॥ సంభవశ్చ వినాశశ్చ శోకశ్చ వివిధస్మృతః ।
అవివేకశ్చ చింతాచ వివేకాస్మృతి రేవచ ॥ 26 ॥

పుట్టడము, చావడము, వివిధదుఃఖములు, వివేకాస్మృతి, అవివేకము, చింతయు అనునది కలుగును. ( 26 )

టీ :- సంభవ ఇతి. సంభవః ఉత్పత్తిః. వివేకస్యాస్మృతిః అనుసంధానమితి యావత్. (26)

టీ :- నానా గర్భములందు ప్రవేశానంతరము పుట్టుక. (నాశము మొదలైనవవి) వివేకముయొక్క మరుపు. ( 26 )

శ్లో ॥ అత్రాప్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్ ।
యమస్య ప్రేత బంధూనాం సంవాదం తం నిబోధత॥27

ఈ విషయమునందును యమునకు, ప్రేతబంధువులకు మధ్య కలిగిన సంవాద రూపమైన ఈ ఇతిహాసమును చెప్పెదరు. దానిని చెప్పెదను వినుము. అని హిరణ్యకశిపుడు ఇట్లు చెప్పెను. ( 27 )

టీ :- అత్రాపీతి. అత్రాపి శోకహేతుం వినా వృథైవాయం శోక ఇత్యస్మిన్నర్థే. ప్రేతస్య మృతస్య యే బంధవస్తేషాం చ. (27)

టీ :- ఇందుకుకూడా శోకకారణము లేకుండగ ఈ శోకము వ్యర్థమే. అను అర్థము నందు ప్రేతయొక్క అనగా మృతిచెందిన ఒకానొక బంధువునకు (యమునకు) కలిగిన సంవాదమును వినుడు. (27)

శ్లో ॥ ఉశీనరేశ్వ భూద్రాజా సయజ్ఞ ఇతి విశ్రుతః ।
సపత్నైర్నిహితో యుద్ధే జ్ఞాతయస్తముపాసత ॥ 28 ॥

ఉశీనర దేశములందు సుయజ్ఞుడను ప్రసిద్ధుడైన రాజుండెను. అతడు శత్రువులచే యుద్ధమున హతమార్చబడెను. బంధువులతనిని చేరి చుట్టుమూగి యుండిరి.(28 )

టీ :- ఉశీనరేష్వితి. ఉపాసత తత్సమీపే ఆవృత్య స్థితాః. (28)

టీ :- ఆ ఉశీనరుని సమీపమున చుట్టు చేరియుండిరి. ( 28 )

శ్లో ॥ విశీర్ణరత్న కవచం విభ్రష్టా భరణ స్రజమ్ ।
శర నిర్భిన్న హృదయం శయాన మసృగా విలమ్ ॥29॥

చీలిన రత్నకవచము కలవాడును, విభ్రష్టములైన ఆభరణములు కలవాడును, మాలికటు తెగిపడిన వాడును, బాణములచే ఛేదింపబడిన హృదయము కలవాడును, వ్యాప్తమైన రక్తమున పడియున్నవాడును, ( 29 )

శ్లో ॥ ప్రకీర్ణకేశం ధ్వస్తాక్షం రభసా దష్ట దచ్ఛదమ్ ।
రజఃకుంత ముఖాంభోజం ఛిన్నాయుధ భుజం మృధే॥30॥

చెల్లాచెదురుగా వ్యాప్తమైన కేశములు కలవాడును, చితికిన కన్నులు కలవాడును, వేగమున కొరకబడిన పెదవి కలవాడును, ధూళిచే వ్యాప్తమైన ముఖకమలము కలవాడును, చిన్నములైన ఆయుధములు, భుజములు కలవాడును, యుద్ధమున దైవముచే అట్లు గావించబడిన తమ పతియైన ఉశీనరేంద్రుని చూచి అతని రాణులు దుఃఖించువారై ' నాథా చచ్చితిమి '

శ్లో ॥ ఉశీనరేంద్రం విధినా తథా కృతం
పతిం మహిష్యః ప్రసమీక్ష్య దుఃఖితాః ।
హతాస్మ నాథేతి కరైరురో భృశం
ఘ్నంత్యో మహుస్తత్పద యోరుపాపతన్ ॥ 31 ॥

అనుచు మాటిమాటికి వక్షమును కరముచే మిక్కిలి కొట్టుచున్నవారై అతని పాదముల చెంత పడిపోయిరి. ( 30,31)

శ్లో ॥ రుదన్త ఉచ్చై ర్దయితాంఘ్రి పంకజం ।
సించంత్య అస్రై కుచ కుంకుమారుణైః ।
విస్రస్త కేశాభరణాః శుచం నృణాం
సృజన్త్య ఆక్రందనయా విలేపిరే ॥ 32 ॥

ఉచ్చైః స్వరమున ఏడ్చుచు కుచము లందలి కుంకుమలచే అరుణమైన అశ్రువులచే ప్రియమైన భర్తయొక్క పాదపంకజమును తడుపుచు జారిపోయిన కేశములు ఆభరణములు కలవారై తమ ఆక్రందనచే చూచువారికి దుఃఖమును కలిగించుచు విలపించిరి. ( 32 )

టీ :- విశీర్ణేతి. విశీర్ణం రత్నమయం కవచం యస్య. విభ్రష్టాని ఆభరణాని స్రజశ్చ, యస్య. శరేణ నిర్భిన్నం హృదయం యస్య. అసృజా రక్తేన ఆవిలంలిప్తం. ప్రకీర్ణేతి. ప్రకీర్ణాః కేశాః యస్య. స్తబ్ధే నిమేషశూన్యే ఈక్షణే యస్య రభసా సంరంభేణ దష్టో దచ్ఛదః దంతచ్ఛదః ఓష్ఠో యేన. రజసా కుంఠం ఆవృతం ముఖాంభోజం యస్య. ఛిన్నమాయుధం. భుజశ్చ యస్య. (29,30)

టీ :- చిరిగిన రత్నమయమైన కవచముకలవాడు, భ్రంశములై = తెగి జారిపడిన ఆభరణములు హారములు కలవాడును, బాణముచే చీల్చబడిన వాడును, రక్తముచే లిప్తమైన = వ్యాప్తమైన ( శరీరము కలవాడును ) చెల్లాచెదురైన తలవెండ్రుకలు కలవాడును, ధ్వంసమైన = చితికిపోయిన కన్నులు కలవాడు, వేగముచే సంరంభముచే కొరుక్కొన్న క్రింది పెదవి కలవాడు, ధూళిచే ఆవరించబడిన = కప్పబడిన ముఖముకలవాడు, ఛేదించబడిన = నరికివేయబడిన ఆయుధజాతము, భుజముకలవాడు. ( 29, 30 )

టీ :- ఉశీనరేంద్రమితి. తస్య పాదయోః ఉపసమీపే. ఆసమంతాదపతన్. (31,32)

టీ :- అతని పాదముల చెంత చుట్టూచేరి విలపించుచుండిరి. ( 31, 32 )

శ్లో ॥ అహెూ విధాత్రాఽకరుణేన నః ప్రభో
భవాన్ప్రణీతో దృగగోచరాం దశామ్ ।
ఉశీనరాణా మసి వృత్తిదః పురా
కృతోఽధునాయేన శుచాం వివర్ధనః ॥ 33 ॥

" ఆహా ప్రభో ! దయలేని విధాతచే నీవు మాకన్నులకు అగుపడకుండ గావించబడినావు. గతమున ఉశీనర జనులకు జీవనాధారమును కల్పించితివి. ఇప్పుడు దుఃఖమును పెంపొందించు వాడవైతివి ". ( 33 )

టీ :- విలాపేమేవాహ - ద్వాభ్యాం. అహెూ ఇతి - అకరుణత్వమువాహుః. దృశామగోచరాం దశాం. యేన భవాన్ ప్రణీతో గమితః. తేన విధాత్రా త్వమధునా శుచాం వివర్ధనః. కృతో సీత్యన్వయః. (33)

టీ :- విలాపమునే ఇట్లు చెప్పెను. ఆహాయని రెండు (కరములతో హృదయమును బాదుకొనుచు), ( విధాతయొక్క ) జాలిలేని తనమునే ఇట్లు చెప్పెను. ఏ విధాతచే నీవు దృగ్గోచరముకాని = కన్నులకగుపడని స్థితిని పొందించబడితివో ఆ బ్రహ్మచే నీవిప్పుడు దుఃఖమును పెంపొందించువాడవుగా చేయబడినావు అని అన్వయము.(33)

శ్లో ॥ త్వయా కృతజ్ఞేన వయం మహీపతే
కథం వినాస్యామ సుహృత్తమేన తే ।
తత్రానుయానం తవవీర పాదయోః
శుశ్రూషతీనాం దిశయత్ర యాస్యసి ॥ 34 ॥

" ఓ భూపాలా ! కృతజ్ఞుడవు. మిగుల ఉత్తమ మిత్రుడవైన నీవు లేకుండగ మేమెట్లు బ్రతకగలము? ఓ వీరా ! నీ పాదముల సేవగావించు మమ్ము నీవువెళ్ళు చోటికి నిన్ననుసరించనిమ్ము ". ( 34 )

టీ :- త్వయేతి. త్వయా సుహృత్తమేవ వినా. వయం కథం. స్యామ భవేమ జీవేమేత్యర్థః. అతః. హే వీర. యత్ర త్వం యాస్యసి. తత్ర తే. నఅఉయానమనుగమనం. తవ పాదయోః శుశ్రూషాం కర్వతీనామస్మాకం దిశ దేహి. (34)

టీ :- ఓ భూపాలా ! గొప్పసహృదయుడవైన నీచే వినా = నీవులేకుండా మేమెట్లుందుము. ఎట్లు జీవింతుమని అర్థము. (నీవు లేనిదే జీవించలేము) కావున ఓ వీరా! నీ పాదములకు సేవచేయుచున్న మమ్ము నీవెచ్చటకు వెళ్ళిన అచ్చటకు వెంబడించనిమ్ము. అనగా మేముకూడా చచ్చెదమని భావము.(34)

శ్లో ॥ ఏవం విలపతీనాం వై పరిగృహ్యా మృతం పతిమ్ ।
అనిచ్ఛంతీనాం నిర్హార మర్కోఽస్తం సన్యవర్తత ॥ 35 ॥

శ్లో ॥ తత్రహ ప్రేత బంధూనాం ఆశ్రుత్య పరిదేవితమ్ ।
ఆహతాన్బాలకో భూత్వా యమః స్వయముపాగతః ॥36

మృతుడైన భర్తను పట్టుకొని ఇట్లు విలపించువారై అతని కాంతలు శవదహనమునకు కొనిపోవుటకు ఇష్టపడని వారగుచుండగ సూర్యుడస్తమించ బూనెను. అచ్చట ప్రేతబంధువుల శోకనాదమును వినిన యమధర్మరాజు బాలకుడై స్వయముగా వచ్చినవాడై వారితో నిట్లనెను. ( 35, 36 )

టీ :- ఏవమితి. నిర్హారం దాహార్థం నయనం అస్తం అస్తాచలం ప్రతి. (35)

టీ :- నిర్హారం = దహనమునకై కొనిపోవుటకు ఇచ్ఛగించని (వారగుచుండగ) (సూర్యుడు ) అస్తాచలమును ( చేర వెడలుచుండెను ) . ( 35 )

టీ :- తత్రేతి. పరిదేవనం రోదనం స్వపుర్యామేవ ఆశ్రుత్య శ్రుత్వా తత్ర స్వయమేవోపాగతో యమో బాలకో భూత్వా తానాహ - అహో ఇత్యాదినా. (36)

టీ :- పరిదేవితం = రోదనమును తనపురమందే యున్నవాడై ( యముడు ) విని అచ్చటకు స్వయముగనే చేరవచ్చినవాడై యముడు బాలకుడై వారితో నిట్లు పలికెను. ‘ అహో ’ ఇత్యాదిగా . ( 36 )

**యమ ఉవాచ :-**

శ్లో ॥ అహో అమీషాం వయసాధికానాం
విపశ్యతాం లోక విధిం విమోహః ।
యత్రా గతస్తత్ర గతం మనుష్యం
స్వయం స్వధర్మా అపి శోచన్త్యపార్థమ్ ॥ 37 ॥

**యముడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

ఆహా ! వయస్సుచే పెద్దవారును, లోక మర్యాదనెరిగిన వారును, అగు మీ మోహము ఆశ్చర్యముగా నున్నది. స్వయముగా అట్టి ధర్మమునే పాటించువారైనను (ఒకప్పుడు మీరును మరణించువారే ఐనప్పటికిని) ఎక్కడినుండి వచ్చెనో అచ్చటికే వెళ్ళుచున్న మానవుని గూర్చి వ్యర్థముగా దుఃఖించుచున్నారు. ( 37 )

టీ :- తత్ర స్వయమేవోపాగతో యమస్త్వాహ - అహో ఇతి. వయసా అస్మత్తో ధికానామపి. లోకస్య విధిం జన్మమరణాది ప్రకారం. విపశ్యతామపి. విమోహమేవాహ. యత్ర యస్మాత్ అవ్యక్తావాగతః. తత్రైవ గతస్తమపార్థం శోచంతి. తదుక్తం గీతాసు. శ్లో. "అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత, అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా" ఇతి. కించ స్వయమపి సధర్మాః. తేన సహసమానో మృత్యులక్షణో ధర్మో యేషాం. తథాభూతా అపి అత్రార్షత్వాదనిజభావః. (37)

టీ :- ఆహా ! ఆశ్చర్యము . మాకన్న వయస్సుచే పెద్దవారైనను లోకముయొక్క జనన మరణాది ప్రకారమును విశేషముగ గాంచువారైనను వారి మోహమును గూర్చియే చెప్పుచున్నాడు. ఏ అవ్యక్త దేశమునుండి వచ్చెనో అచ్చటికే వెళ్ళెడి ఆత్మగుఱించి వ్యర్థముగా దుఃఖించుచున్నారు. అదియే శ్రీకృష్ణునిచే గీతలో చెప్పబడినది. ఈ ప్రాణులు అస్పష్టమైన పుట్టుకగలవి. స్పష్టమైన మధ్యము గలవి. అంత్యమును అస్పష్టమైనదే. ఓ భరతకులశ్రేష్ఠా! అర్జునా ! అట్టి శరీరముల గూర్చి వగచుట ఏలా? అనగా ఈ శరీరము ఎచ్చటనుండి పుట్టుచున్నది? ఎవరికిని తెలియదు. తర్వాత అదిచేయు కార్యకలాపములు వృత్తి ప్రవృత్తులు మాత్రము అందరు చూచెదరు. మరల అది ఎచ్చటకు పోవును? ఏమైపోవును? ఎందుకు పోవును? ఎవరును గ్రహించజాలరు. అట్టి ఈ శరీరమునకై పరితాపమేల? పరితపించ పనిలేదని తాత్పర్యము. ఇంతేగాక స్వయముగను మృతునితో సమానమైన జనన మరణాది ధర్మములు కలవారైనను వారికి గూడా. (తెలియనిదే) ( 37 )

శ్లో ॥ అహోవయం ధన్యతమా యదత్ర
త్యక్తాః పితృభ్యాం న విచిన్తయామః ।
అభక్ష్యమాణా అబలా వృకాదిభిః
సరక్షితా రక్షతి యోహి గర్భే ॥ 38 ॥

తల్లి దండ్రులచే వీడబడిన వారమయ్యు మేమిందుకు విచారించుటలేదు. కాన మేము మిక్కిలి ధన్యులము. ఆహా ! బలహీనులమై యుండియు తోడేళ్ళు మొదలైన వానిచే భక్షింపబడకున్నాము. ఎవడు గర్భమందున్నపుడు మనను రక్షించునో వాడే రక్షించుచున్నాడు. ( 38 )

టీ :- అహో ఇతి. అబలాః దుర్బలా అపి. వృకాదిభిర భక్ష్యమాణా వయం. తత్ర హేతుః. యో ంతర్గర్భే రక్షతి, స ఏవ హి విశ్వం రక్షితా రక్షతి. (38)

శ్లో ॥ య ఇచ్ఛ యేశః సృజతీదమవ్యయో
య ఏవ రక్షత్యవలుంపతే చ యః ।
తస్యాబలాః క్రీడన మాహుః శితు
శ్చరాచరం నిగ్రహ సంగ్రహే ప్రభుః ॥ 39 ॥

టీ :- నను తస్య రక్షణే కిం ప్రయోజనం? న కించిదపి కిం తర్హి ? క్రీడైవ కేవలమిత్యాహ - య ఇతి. య ఇదం విశ్వం సృజతి రక్షతి. సంహరతి. చ. భో అబలాః. తస్యేశితుశ్చరాచరంజ క్రీడనసాధన మాహుః - అతః స ఏవ నిగ్రహే సంహారే. సంగ్రహేపాలనే చ. ప్రభుః. (39)

శ్లో ॥ పథిచ్యుతం తిష్ఠతి దిష్ట రక్షితం
గృహేస్థితం తద్విహతం వినశ్యతి ।
జీవత్యనాథోఽపి తదీక్షితో వనే
గృహేపి గుప్తోఽస్యహతో న జీవతి ॥40॥

టీ :- దుర్బలులమై యుండియు వృకాదులచే భక్షింపబడని వారమైన మేము విచారించము. ఎందులకనగా ఎవడైతే గర్భమునందుండగ రక్షించుచున్నాడో వాడే ప్రపంచమునందంతను రక్షించును. ( 38 )

ఎవ్వడైతే అవ్యయుడు ( తరుగుదనము లేనివాడు ) నిగ్రహానుగ్రహ సమర్థుడు, ఈశుడో ( సర్వ సమర్థుడో ) వాడే ఈ విశ్వమును సృష్టించును, రక్షించును, లోపింపజేయును. అట్టి వానికి అబలులైన ప్రాణులు, చరాచరప్రపంచము ఒక ఆట అని చెప్పుదురు. ( 39 )

టీ :- రక్షించుటవలన వానికి ఏమి ప్రయోజనము? ఏమియులేదు, కానీ ఇది అంతయు వాని ఆట మాత్రమే. ఏ ఈశుడైతే ఈ విశ్వమును సృష్టించు చున్నాడో, రక్షించుచున్నాడో, లోపింపజేయుచున్నాడో వానికీ చరాచర ప్రపంచము ఒక ఆట. ఓ అబలలారా! ఆ సమర్థుడైనట్టి ఈశునకు ఈ చరాచర ప్రపంచమంతయు క్రీడాసాధనమని చెప్పుదురు. కావుననే వాడు సంహార కార్యమున, సృష్టికార్యమున, లయకార్యమునకు సమర్థుడు (అధికారి). (39)

త్రోవలో పడిపోయిన సొమ్ము దైవముచే రక్షింపబడినదై వుండును. దైవరక్షణ లేనిది ఇంటియందున్నను నశించిపోవును. వనమందు అనాథయై యుండెడువాడును, అట్టి ఈశునిచే చూడబడువాడు బ్రతుకును. దైవోపహతుడు

టీ :- ప్రభుత్వమేవాన్వయవ్యతిరేకాభ్యాం దర్శయతి - పథితి. దిష్టేన దైవేన ఈశ్వరేణ తద్విహతం తేనేశ్వరేణ విక్షతం అన్యహతః (40)

శ్లో ॥ భూతాని తైస్తై నిజయోని కర్మభిః
భవన్తి కాలే నభవన్తి సర్వశః ।
న తత్ర హాత్మా ప్రకృతావపి స్థిత
స్తస్యాగుణై రన్యతమో నిబధ్యతే ॥ 41 ॥

టీ :- అన్యేన తనోపేక్షితః. తదేవమాత్మనో జన్మమరణాదిక మంగీకృత్యేశ్వరాధీనత్వాన్న శోకః కార్య ఇత్యుక్తం. ఇదానీం తు. దేహానామేవ జన్మాదినత్వాత్మన ఇత్యాహ - త్రిభిః. భూతానీతి. భూతాని దేహాః. నిజయోనిః స్వకారణభూతం లింగశరీరం.

(దైవానుగ్రహము లేనివాడు) ఇంటియందు రక్షింపబడినవాడై యుండికూడా మృతినొందును. ( 40)

టీ :- అతని అధికారమునే అన్వయ వ్యతిరేకములచే తెలియజేయుచున్నాడు. దిష్టేన ఈశ్వరుడైన దైవముచే రక్షింపబడినది. ఆ ఈశుడగు ప్రభువుచే ఉపేక్షింపబడినది అగును. అన్యహతః = అతనిచే ఉపేక్షింపబడినది. ( 40 )

ఇట్లు జనన మరణములు ఈశ్వరాధీనములైనందున మృతుని గుఱించి శోకింపవలసినదిలేదు. ప్రాణులు స్వకారణభూతమైన లింగశరీర నిమిత్తకములైన కర్మలచే పుట్టుచుండును. కాలము తీరగా తప్పక నశించును. దేవాది దేహములైనను కాలము తీరిన నశించవలసినదే. అట్టి దేహమున ఉండెడు ఆత్మ దేహధర్మములైన జన్మాది ప్రకృతి గుణములచే ఒక్కదానిచేత కూడా కూడియుండదు. ( అనగా శరీర ధర్మములు జన్మమృత్యు జరాదులుగానీ క్రోధ ద్వేషాదులుగానీ ఆత్మకు సంబంధించినవి గావని తాత్పర్యము ).(41).

టీ :- అందువలన ఇట్లు ఆత్మయొక్క జన్మ మరణాదికమును అంగీకరించి అంతయు ఈశ్వరాధీనమైనందున శోకించదగదని అర్థము చెప్పబడినది. ఇప్పుడైతే దేహములకే జనన మరణాదులుకాని, ఆత్మకవి లేవని చెప్పుచున్నాడు. ' భూతానాం ' అని మూడు శ్లోకములచే. భూతాని = దేహములు. నిజయోనిః

తన్నిమిత్తైః కర్మభిర్భవంతి నశ్యంతి చ. సర్వశః దేవాదిదేహా అపి. తత్ర హ తత్రదా. ప్రకృతౌ. దేహేస్థితో ప్యాత్మా. తస్యాః గుణైః దేహధర్మైః జన్మాదిభిః. న నిబధ్యతే న యుజ్యతే, యతః. అన్యతమో దేహాదత్యంతవిలక్షణః.(41)

= స్వకారణభూతం లింగశరీరం. తన్నిమిత్తకములైన కర్మలచే పుట్టుచున్నవి, గిట్టుచున్నవియు. సర్వశః = దేవతలు మొదలైన వారి దేహములు గూడా. అప్పుడు ప్రకృతియైన దేహమునందు ఉన్నప్పటికిని ఆత్మ, దానియొక్క గుణములచే, దేహధర్మములైన జన్మాదులచే యోగమును పొందదు. ఎందువల్లననగ ఆ ఆత్మ దేహమునకంటే విలక్షణమైనది.(41)

శ్లో ॥ ఇదం శరీరం పురుషస్య మోహజం
యథాపృథగ్భౌతిక మీయతే గృహమ్ ।
తథౌదకైః పార్థివ తైజసైర్జనః
కాలేన జాతో వికృతో వినశ్యతి ॥ 42 ॥

ఎట్లైతే గోడలతో శోభితమైన గృహము, గృహమునందుండెడు పురుషునకంటె భిన్నమో అట్లే ఈ శరీరము నిత్యమైన ఆత్మకంటే భిన్నమైనది. ఈ శరీరము నాది అనుభావము పురుషుని అజ్ఞానమువలన కలుగునది. ఎటులైతే నీటి పరమాణ్వాదుల వలన పుట్టెడు బుడగలు మొదలైనవి, పృథివీ జన్యములైన ఘటాదులు, తేజోజన్యములైన ( సువర్ణము తేజోమయము ) కటకకుండలాదులు నశించునవో, అట్లే ఆ త్రివిధములైన పృథివీ, జల, తేజ పరమాణువులచే పుట్టిన ఈ శరీరముకూడా పరిణతమై వినాశము చెందును. ( 42 )

టీ :- నన్వహం కృశః స్థూల ఇత్యాదౌ న వైలక్షణ్యం ప్రతీయతే. తత్రాహ - ఇదమితి. ఇదం మోహజం. అవివేకాదాత్మత్వేన జ్ఞాతం. వస్తుతస్తు పృథగేవ యతః ఈయతే దృశ్యతే భౌతికం చ. యథా. గృహమిత్యన్వయః. అత్రైవం ప్రయోగః. ద్రష్టర భౌతికాచ్చ పురుషాత్. శరీరం. భిన్నం. దృశ్యత్వాత్ భౌతికత్వాచ్చ.

టీ :- అట్లైన నేను కృశించినవాడను, స్థూలమైన వాడను. ఇత్యాదులందు అవైలక్షణ్యము గోచరించుటలేదు గదా యనిన అచ్చట ఇట్లు చెప్పెను. 'ఇదం' ఇత్యాదిగా. ఈ శరీరము అజ్ఞానమువలన ఆత్మ రూపమై యొప్పుచున్నది. వాస్తవమైతే భిన్నమే. ఎందువలననైతే అది చూడబడుచున్నదో భౌతికము ఎట్లనగా గృహమువలె అని అన్వయము. ఇచ్చ ప్రయోగమీ విధము. ఆత్మ

యథాత్యంతావివేకినః ఆత్మత్వేనాభిమతమపి గృహం తతః పృథక్. తద్వమితి భౌతికత్వానుమానం వివృణ్వన్. ఆత్మనో జన్మాద్యభావముపసంహరతి యథా చ తైజసైః జాతః కుండలాదిః. వినశ్యతి. తథా తైరేవ త్రివిధైః పరమాణుభిః జాతో జనోదేహ ఏవ వికృతః పరణతస్సన్ వినశ్యతి నత్వాత్మే త్యర్థః. (42)

అభౌతికమైనందున భౌతికమైన శరీరముకంటె భిన్నము దృశ్యము. భౌతికమైనందున అత్యంత వివేకియైన పురుషుని ఆత్మగా అభిమతమైనను గృహం = ఇల్లు , తతః = గృహమందలి పురుషునకంటె, పృథక్ = భిన్నము అగునో అట్లే అని. ఆత్మకు భౌతికత్వానుమానమును వివరించుచు జన్మాది అభావమును చెప్పి ముగించుచున్నాడు. ఎట్లైతే జల పరమాణువులచే కలిగిన బుడగలు, పృథివీ పరమాణువులచే చేయబడిన ఘటము, తేజోరూపములై చేయబడిన కటక కుండలాదులు నశించునో అట్లే అదే త్రివిధ పృథివ్యాపస్తేజో నిర్మితమైన దేహముకూడా పరిణతి చెందినదై నశించునదే. ఆత్మ మాత్రము అనశ్వరమని అర్థము. ( 42 )

శ్లో ॥ యథానలో దారుషు భిన్న ఈయతే
యథాఽనిలో దేహ గతః పృథక్ స్థితః ।
యథానభః సర్వగతం న సంజతే
తథా పుమాన్ సర్వగుణాశ్రయః పరః ॥ 43 ॥

ఎటులైతే అగ్ని కఱ్ఱలయందున్నను భిన్నముగనే చూడబడుచున్నదో, ఎటులైతే వాయువు శరీరమందుండియు తద్భిన్నముగ గోచరించున్నదో, ఎటులైతే సర్వగతమైనను ఆకాశము ఎందును సంగమించదో, అట్లే పురుషుడు కూడా సర్వగుణములకు ఆశ్రయుడు లేదా ఆశ్రితుడైయుండియు తద్భిన్నమే.(43)

టీ :- పృథగవస్థాభావే పి భిన్నత్వే దృష్టాంతద్వయమాహ - యథేతి. యథానలో దారుష్వేవ స్థితో పి దాహకత్వే ప్రకాశత్వేనభిన్న ఏవ ప్రతీయతే. యథా చ దేహగతో ప్యనిలో నాసికాదిషు పృథక్ స్థితఏవ ప్రతీయతే దేహస్థత్వేపి

టీ :- వేరుగా ఉనికి లేకున్నను ఆత్మ శరీరభిన్నమే యనుటకు రెండు దృష్టాంతములను చూపుచున్నాడు. ' యథా ' ఇత్యాదిగా. ఎటులైతే అగ్ని కఱ్ఱలయందున్నను దాహకత్వ రూపమున తద్భిన్నముగనే గోచరించునో, ఎటులైతే దేహమందున్నప్పటికీ వాయువు ముఖనాసికాదులందు భిన్నముగా

ఆత్మనస్తద్ధర్మయోగాభావే దృష్టాంతమాహ – యథా నభో న సజ్జతే క్వాపి సంగం న ప్రాప్నోతి తథా పుమానపి సర్వేషాం గుణానాం దేహేంద్రియాదీనామాశ్రయః. తేష్వాశ్రితోవాపరః పృథగేవేత్యర్థః. (43)

ఉన్నటులే గోచరించునో అట్లే ( అని భావము ) దేహమందున్నను ఆత్మకు శరీరయోగ ధర్మము లేదనుటకు దృష్టాంతమిట్లు చెప్పబడినది. ఎట్లు ఆకాశము ఎచ్చటను దేనియందును లగ్నము కాదో, అట్లే పురుషుడును (ఆత్మయు) సకల దేహేంద్రియాది గుణములకు ఆశ్రయము, (వాని నాశ్రయించి యుండినను ) వానికంటె భిన్నమే అని అర్థము. ( 43 )

శ్లో ॥ సుయజ్ఞో నన్వయం శేతే మూఢాయమను శోచథ ।
యః శ్రోతా యోనువక్తేహ స న దృశ్యేత కర్హిచిత్ ॥ 44॥

ఓ మూఢులారా ! ఎవని గూర్చి దుఃఖించుచున్నారో అట్టి ఈ సుయజ్ఞుడు ఇదిగో పడుకొని యున్నాడు. మీ మాటలు వినగలవాడు. మీకు సమాధానము నీయగలవాడు. ఇక్కడెక్కడను అగుపడుట లేదు. ( 44 )

టీ :– కిం చ సుయజ్ఞ ఇతి. హే మూఢాః. యమనుశోచథ. సో యం యుష్మభర్తా సుయజ్ఞః శేతే. కిమితి శోచథ నన్వేతావంతం కాలమసౌ శృణోతి. అనంతరం ప్రతివక్తి చ. ఇదానీం తస్యాదర్శనాన్మృత ఇతి శోచామ ఇతి చేత్. స తు శోచనీయో న భవతి ప్రాగపి తస్యాదర్శనాదిత్యాహ – యశ్శ్రోతేతి.(44)

టీ :– ఇంతే కాకుండ ఓ మూఢులారా ! ఎవరికై ఏడ్చుచున్నారో అట్టి ఈ మీ భర్త సుయజ్ఞుడు పండుకొని యున్నాడు. ఎందుకు ఏడ్చుచున్నారు? ఇంతకాలము మా మాటలు వినెడివాడు, సమాధానము చెప్పువాడును ఇప్పుడు అట్టివాడు (మాటలాడువాడు, వినువాడును ) అగుపడకున్నందున చచ్చెనని దుఃఖించుచున్నాము, అనినచో అతనిని గూర్చి దుఃఖించదగదు. ఇంతకు పూర్వమును అతడు మీకగుపడలేదు. అని చెప్పుచున్నాడు. " యః శ్రోతే " ఇత్యాదిగా. ( 44 )

శ్లో ॥ నశ్రోతా నాను వక్తాయం ముఖ్యోప్యత్ర మహానసుః ।
యస్త్విహేంద్రియవానాత్మా సచాన్యఃప్రాణదేహయోః॥45

సర్వేంద్రియ చేష్టా కారణమైన ప్రాణము ముఖ్యమే ఐనదైనను అది వినునదిగానీ సమాధానమును చెప్పునదిగానీ కాదు. ఏదైతే అచేతనములైన

శరీరేంద్రియాదులచే ఆయా కార్యములను చేయు ఆత్మ కలదో అది ప్రాణమునకన్నా దేహమునకన్నను భిన్నమైనదే.(45)

టీ :- నను ముఃనాసికాసంచారీ ప్రాణః శ్రోతా వక్తా చ దృష్టఏవ. నాసౌ శ్రోతా వక్తా వా అచేతనత్వాదిత్యాహ - నేతి. మహాన్ సర్వేంద్రియచేష్టా హేతుః. అతఏవ ముఖ్యః. శ్రు. "ప్రాణో వై ముఖ్య" ఇతి శ్రుతేః. కస్తర్హి వక్తా శ్రోతా చ. తత్రాహ. యస్త్విహ దేహేంద్రియైు స్తత్తదర్థద్రష్టా ఆత్మా. స తు ప్రాణదేహాభ్యా మన్యశ్చేతనః. (45)

టీ :- ముఖము నాసికా మొదలైన వానియందు సంచరించెడి ప్రాణము వినెడిది, మాటలాడెడిది దృష్టమేకదా ! యనిన అది మాటలాడునదిగాని వినునదిగానీ కాదు. ఎందుకనగా అది అచేతనము. అని చెప్పెను. ' నశ్రోతా ' ఇత్యాదిగా ' మహాన్ సర్వేంద్రియ చేష్టాహేతుః - అతఏవ ముఖ్యః ' ' ప్రాణోవై ముఖ్యః ' ( ప్రాణమే ముఖ్యమైనదికదా ) అని శ్రుతి వాక్యమువలన, ఐనచో శ్రోత, వక్తయు ఎవరు అనిన అచ్చట ఇట్లు చెప్పబడినది. ఇచ్చట దేహేంద్రియములద్వారా ఎవడైతే ఆయా వస్తువులను కనుగొనునో అతడే ఆత్మ. ఆ ఆత్మ ప్రాణ దేహములకంటే ( అచేతనములకంటే ) భిన్నమైన వాడే సచేతనుడు. (45)

శ్లో ॥ భూతేంద్రియ మనోలింగాన్ దేహానుచ్చా వచాన్విభుః ।
భజ త్యుత్సృజతి హ్యన్య స్తచ్చాపి స్వేన తేజసా ॥ 46 ॥

వివిధములైన ఆ ఆత్మయు తన తేజముచే నీచాతి నీచములైనట్టి భూతేంద్రియ మనోరూపములైన దేహములను పొందును. మరల వదిలివేయును కూడా. ( 46)

టీ :- నను చేతనత్వే అన్యత్వే చ. తస్య. అహం కృశః. స్థూలః. కాలః బధిర ఇత్యాదిదేహధర్మోపలబ్ధిః. కుతస్తత్రాహ - భూతేతి.

టీ :- చేతనత్వమునందు అచేతనత్వమునందును ఆ ఆత్మకు నేను కృశించినవాడను, స్థూలమైనవాడను, గ్రుడ్డివాడను, చెవిటివాడను అను

భూతేంద్రియమనోభిర్లింగ్యంతే లక్ష్యంత ఇతి తథా తాన్ దేహాన్. తేభ్యోన్య ఏవ ఆత్మా భజతి. అహమితి మన్యతే. తర్హి కథం మోక్షస్తత్రాహ – తద్భజనం స్వేన తేజసా వివేరబలేన. ఉత్సృజతి. అపిహీత్యనుభవం ప్రమాణయతి. (46)

మొదలుగాగల దేహధర్మములు పొందుట ఎందువల్లననిన ఇట్లు చెప్పబడినది. భూతేంద్రియ మనస్సులచే గుర్తించబడెడు దేహములను తద్భిన్నమైన వేరొకటి నేను పొందుచున్నాను. అని తలంచుచున్నాడు. అట్లైన మోక్షమెట్లనిన ఇట్లు చెప్పెను. అట్టి భావన తన ప్రతాపముచే వివేకబలము సృష్టించబడినను ' హి ' అను శబ్దముచే లోకానుభవమును ప్రమాణీకరించుచున్నాడు.(46)

శ్లో ॥ యావల్లింగాన్వితో హ్యాత్మా తావత్కర్మ నిబంధనమ్ ।
తతో విపర్యయః క్లేశో మయా యోగోనువర్తతే ॥ 47 ॥

ఆత్మ ఎంతవరకు లింగశరీరముతో కూడియుండునో అంతవరకు తదభిమానము కలదై బంధహేతువగుచున్నది. కావుననే అంతవరకు ఆత్మ దేహధర్మములు కలిగియుండును. అనగా క్లేశము మాయా యోగము ఆత్మానువర్తనములై యుండును. (47 )

టీ – నను వివేకానంతరమప్యాహారాదికర్మసు ప్రవృత్తేర్బంధ స్స్యాదేవేత్యత ఆహ – యావదితి. యావల్లింగ శరీరేణాన్వితః. తదభిమానవానాత్మా భవతి. తావదేవ తస్య తత్కర్మనిబంధనం బంధహేతుర్భవతి తతో విపర్యయః దేహధర్మభాక్త్వం. తతః క్లేశశ్చానువర్తతే. న తు లింగాభిమానే నివృత్తే పి యతో యం మాయాయోగో విపర్యయాదిర్మాయయా యుజ్యత ఇతి తథా న పరమార్థః. (47)

టీ :– వివేకానంతరముకూడా ఆహారాది కర్మలయందు ప్రవృత్తి కలుగుట వలన బంధము కలిగియే యుండుననిన ఇట్లు చెప్పబడినది. ' యావత్ ' ఇత్యాదిగా. ఎంతవరకైతే దేహేంద్రియాది సహితమైన శరీరమున కూడియుండునో అంతవరకు ఆత్మకు కర్మనిబంధనము ( బంధహేతువు ) కలుగును. అందువలననే దేహధర్మములను వహించియుండుట, దానివలన క్లేశమునూ అనువర్తించును. లింగాభిమానము నివృత్తమైన పిదప అవి యుండవు. ఎందుకనగా ఈ విపర్యయాదికము మాయాయోగము వలన కలిగినది. అనగా మాయతో కూడుకున్నది. వాస్తవము కాదని యర్థము. (47)

శ్లో ॥ వితథాభి నివేశోయం యద్గుణేష్వర్థ దృగ్వచః ।
యథా మనోరథః స్వప్నః సర్వమైంద్రియకం మృషా ॥48॥

గుణములందు తత్కార్యములందు పరమార్థదృష్టి పరమార్థమని చెప్పుట ఏది కలదో అది మిథ్యాభూతమైన అభినివేశము. ఎటులైతే మనోరథము, స్వప్నము, అసత్యమో అట్లే ఇంద్రియ సంబంధ అనుభూతి సర్వము అసత్యము. (48)

టీ :- నను సుఖదుఃఖాదీనాం తత్సాధనానాం చ. సత్యత్వ ప్రతీతేః. కుతో మాయామయత్వం? తథా చ బహవో వాదినః సత్యత్వమేవ వదంతి. తత్రాహ – వితథేతి. వితథో మిథ్యాభూతః. అయమభినివేశః. కో సౌ గుణేషు తత్కార్యేషు సుఖాదిషు అర్థః పరమార్థః ఇతి దృక్ వచశ్చేతి యత్ కుత ఇత్యత ఆహ – యథేతి. (48)

టీ :- సుఖదుఃఖములు, తత్సాధనములును సత్యములుగా తోచుచుండ మాయామయత్వమేలయనిన, చాలామంది వాదించువారు సత్యమనియే చెప్పెదరుకూడా. అనిన ఇట్లు చెప్పబడినది. ' వితథేతి వితథ ' ఇత్యాదిగా. వితథ = ఈ అభిమానము వ్యర్థమైనది. అదియేమి? గుణములందు వాని కార్యాదులైన సుఖదుఃఖాదులందు ఇదియే వాస్తవమనెడు దృష్టి, వాక్కుయిననునది. అది ఎందులకనిన ' యథా ' ఇత్యాదిగా చెప్పబడినది. 48

శ్లో ॥ అథ నిత్య మనిత్యం వా నాహో శోచన్తి తద్విధః ।
నాన్యథా శక్యతే కర్తుం స్వభావః శోచతామితి ॥ 49 ॥

నిత్యమైన ఆత్మను గూర్చి , అనిత్యమైన దేహమును గూర్చియు బాగుగా తెలిసినవారు దుఃఖించరు. స్వభావము మార్చుట శక్యము కాదుకదా ! కావున దుఃఖించబడుగాక. ( 49 )

టీ :- ఉపసంహరతి – అథేతి. అథ తస్మాత్. నిత్మమాత్మానం. అనిత్యం దేహం వా. తద్విదః నిత్యమనిత్యం చ జానంతః. నన్వేవముపదేష్టారో పి శోచంతో దృశ్యంతే. తత్రాహ – నాన్యథేతి. జ్ఞానదార్ఢ్యాభావాత్ స్వభావో న నివర్తత ఇత్యర్థః. (49)

టీ :- ఉపసంహరించుచున్నాడు. ' అథ ' అని. అథ = అందువలన. నిత్యమైన ఆత్మను అనిత్యమైన దేహమును గానీ వాని స్వరూపమునెరింగినవారు నిత్యానిత్యములనెరిగియు దుఃఖించరు. ఇట్లుగాక ఇతరులకిట్లు చెప్పువారును దుఃఖించుచు అగుపడుదురు గదా యనిన ఇట్లు చెప్పబడును. ' నాన్యథా '

యని. జ్ఞానము దృఢముగా కలుగని కారణమున స్వభావము మారదని యర్థము. (49)

శ్లో ॥ లుబ్ధకో విపినే కశ్చిత్పక్షిణాం నిర్మితోఽంతకః ।
వితత్యజాలం విదధే తత్ర తత్ర ప్రలోభయన్ ॥ 50 ॥

ఒక అరణ్యమున ఈశ్వరునిచే పక్షులను వేటాడెడి ఒకానొక లుబ్ధకుడు (బోయవాడు) పుట్టించబడెను. వాడు ఎచ్చటెచ్చట పక్షులు సంచరించునో, అచ్చటచ్చట పక్షులను ప్రలోభపరచుచు (నూకలు, గిజలను చల్లి) వల పరచెను. అచ్చట కుళింగము (అడవి పిచ్చుక)ల జంట ఒకటి విహరించుచు అగుపడెను. వానిలో ఆడపిచ్చుక ఆ బోయవానితో ప్రలోభపెట్ట బడినదయ్యెను.(50, 51)

శ్లో ॥ కులింగ మిథునం తత్ర విచరత్సమదృశ్యత ।
తయోః కులింగీ సహసా లుబ్ధకేన ప్రలోభితా ॥ 51 ॥

టీ :- స్వయం సధర్మా అపీతి యదుక్తం తత్రేతిహాససమాహ - లుబ్ధక ఇత్యాదినా. పక్షిణామంతక ఈశ్వరేణ నిర్మితస్సన్ యత్ర యత్ర తత్ర తత్ర తాన్ ప్రలోభయన్, జాలం విస్తార్య విశేషేణ ధృతవాన్. పాఠాంతరే. తేషామామిషాదిభిః ప్రలోభనం కృతవానిత్యర్థః. (50)

టీ :- " స్వయం స్వధర్మా అపి " అని ఏదైతే చెప్పబడినదో ఆ విషయమున ఇతిహాసమును చెప్పెను. ' లుబ్ధక ' ఇత్యాది శ్లోకాదులతో. పక్షులను సంహరించువాడు ( వేటాడువాడు ) ఆ ఈశ్వరునిచే పుట్టించబడిన వాడై ఎచ్చటెచ్చట పక్షులు తిరుగాడునో అచ్చటచ్చట వానిని గింజలుమొదలైన వానిచే ఆశపెట్టుచున్నవాడై వలపన్ని విస్తార్య = విశేషముగ పట్టుకొన్నవాడై యుండెను. పాఠాంతరమున మాంసపుముక్కలు మొదలైన వానిచే వానికి ప్రలోభమును గావించెనని అర్థము. (50)

టీ :- కులింగేతి. కులింగః కందభక్షిపక్షివిశేషః. కులింగయోర్మిథునం. (51)

టీ :- కులింగ = కందములను భక్షించు ఒక పక్షి. కుళింగము (అడవి పిచ్చుక) ల జంట ( 51 )

శ్లో ॥ సాఽసజ్జత శిచస్తన్యాం మహిషీ కాలయంత్రితా ।
కులింగస్తాం తథాపన్నాం నిరీక్ష్య భృషదుఃఖితః ।
స్నేహాదకల్పః కృపణః కృపణాం పర్యదేవయత్ ॥ 52 ॥

ఆ మగపిచ్చుక భార్య కాలము మూడినదై వల త్రాళ్ళలో చిక్కుకొనెను. ఆ విధముగ వల త్రాళ్ళలో చిక్కుకొని ఆపదనొందిన తన భార్యను చూచి మగ అడవి పిచ్చుక మిక్కిలి దుఃఖించెను. ఆ పక్షియందలి స్నేహముచే ఏమియు చేయజాలని ఆ దీనుడు దైన్యావస్థలోనున్న ఆడపిచ్చుకను గూర్చి శోకించెను. ( 52 )

టీ :- నేతి. సిచస్తంత్యాం జాలస్య సూత్రే. అసజ్జత బంధం ప్రాప. ఆపన్నాం ఆపదం ప్రాప్తాం. (52)

టీ :- వలయొక్క త్రాళ్లయందు బంధనమును పొందెను. అట్టి ఆపదనొందిన ఆడపిచ్చుకను చూచి మగపిచ్చుక దానిని విడిపించ శక్తి లేనిదై చెట్టుకొమ్మపై కూచుని విలపించసాగెను. ( 52 )

శ్లో ॥ అహో అకరుణోదేవః స్త్రియాకరుణయావిభుః ।
కృపణం మాను శోచన్త్యా దీనయా కింకరిష్యతి ॥ 53 ॥

శ్లో ॥ కామం నయతు మాందేవః కిమర్థేనాత్మనో హి మే ।
దీనేన జీవతా దుఃఖమనేన విదురాయుషా ॥ 54 ॥

ఆహా ! దేవుడు దయలేనివాడుకదా ! సర్వసమర్థుడైన దైవము దీనుడనైన నన్నుగూర్చి దుఃఖించెడు కరుణాపూర్ణురాలగు దీనురాలైన స్త్రీతో ఏమి చేయగలడు? దేవుడు నన్నుగూడా కొనిపోవుగాక. దీనుడనై బ్రతుకుచు దుఃఖముతో కూడిన భార్యలేని జీవితముతో, అర్థశరీరముతో నాకేమి పని?. (53,54 )

టీ :- అకరుణయా సర్వతోఽనుకంపయా స్త్రియా కిం కరిష్యతి. (53)

టీ :- ఆ కరుణయా = అన్ని విధముల దయతలచగలిగిన స్త్రీతో ఏమి చేయగలడు? (53)

టీ :- ఆత్మనో దేహస్యార్ధేన. అనేన విధురాయుషా భార్యాశూన్య జీవితేన దుఃఖం యథా భవత్యేవం జీవతా కిం మే ప్రయోజనమ్. అతో మామపి కామం నయత్విత్యన్వయః.(54)

టీ :- ( తన అర్ధదేహమైన భార్యగతించ మిగిలిన ) అర్ధదేహముతో ఈ భార్యాశూన్యమైన, దుఃఖమయమైన జీవితముతో నాకేమి ప్రయోజనము? కాన నన్ను కూడా ( దైవము ) కొనిపోవును గాక. అని అన్వయము. ( 54 )

శ్లో ॥ కథం త్వజాత పక్షాంస్తా న్మాతృహీనాన్ బిభర్మ్యహమ్ ।
మన్దభాగ్యాః ప్రతీక్షంతే నీడేమే మాతరం ప్రజాః ॥ 55 ॥

రెక్కలు పుట్టనట్టి తల్లిలేని ఆ పిల్లలను నేనెట్లు పోషింతును? గూటిలోనున్న నా పిల్లలు నష్టజాతకులు తల్లిని గూర్చి ఎదురు చూచుచుందురు. అని ఇట్లు ప్రియా వియోగముచే బాధపడుచు కన్నీరు నిండిన కంఠముకలవాడై విలపించుచున్న మగపిచ్చుకను అదే వ్యాధుడు కాలప్రేరితుడై బాణముచే వేధించగా అదియును మరణించెను. ( 55, 56 )

శ్లో ॥ ఏవం కులింగం విలపంతమారా త్ప్రియా వియోగాతుర మశ్రుకంఠమ్ । స ఏవతం శాకునికః శరేణ వివ్యాథ కాల ప్రహితో విలీనః ॥56॥

టీ :- న జాతాః పక్షా యేషాం తాన్. కథం బిభర్మిపోషయామి? మందేతి. మే ప్రజా మాతరం ప్రతీక్షంతే.(55)

టీ :- పక్షములు ( రెక్కలు ) పుట్టని బాలకులను ఎట్లు పోషించుకొందును. దురదృష్టవంతులైన మా పిల్లలు తల్లికై ఎదురుచూచుచుందురు. (55 )

టీ :- ఏవమితి. శాకునికః పక్షిహంతా. విలీపస్సన్. (56)

టీ :- శాకునికః = పక్షిహంతకుడు, విలీనుడై ( 56 )

శ్లో ॥ ఏవంయూాయ మపశ్యంత్య ఆత్మాపాయ మబుద్ధయః ।
నైనం ప్రాప్స్యథ శోచన్త్యః పతిం వర్షశతైరపి ॥ 57 ॥

ఇట్లే బుద్ధిలేనివారై మీరును ఆత్మాపాయమును (మీ మృత్యువును) గాంచుట లేదు. వందల సంవత్సరములు దుఃఖించినను ఈ మీ పతిని పొందలేరు. (57)

టీ :- ఏవమితి. ఆత్మాపాయం స్వమృత్యుం. (57)

టీ :- ఆత్మాపాయం = తనమృత్యువును ( 57 )

**హిరణ్యకశిపురువాచ :-**

శ్లో ॥ బాల ఏవం ప్రవదతి సర్వేవిస్మిత చేతసః ।
జ్ఞాతయో మేనిరే సర్వమనిత్య మయథోత్థితమ్ ॥ 58 ॥

**హిరణ్యకశిపుడిట్లు చెప్పెను :-**

అని బాలుని రూపమున నున్న యముడు చెప్పగ అందరు ఆశ్చర్యచిత్తులైరి. సర్వము అనిత్యము, అయథార్థజ్ఞానము వలన కలిగినదని బంధువులు తలంచిరి. (58)

టీ- బాల ఇతి. అయథోత్తితం మధ్యేవావిర్భూతం. (58)

టీ :- అయథోత్థితమ్ = అసత్యముగా ఏర్పడిన ( 58 )

శ్లో ॥ యమ ఏతదుపాఖ్యాయ తత్రైవాంతర దీయత ।
జ్ఞాతయోఽపి సుయజ్ఞస్య చక్రుర్యత్సాంపరాయికమ్ ॥ 59॥

శ్లో ॥ తతః శోచత మా యూయం పరంచాత్మా నమేవచ ।
క ఆత్మా కః పరోవాత్ర స్వీయః పారక్యఏవవా ।
స్వపరాభినివేశేన వినాఽజ్ఞానేన దేహినామ్ ॥ 60 ॥

యముడు ఈ ఉపాఖ్యానమును చెప్పినవాడై అచ్చటనే అంతర్ధానము నొందెను. ఆ సుయజ్ఞుని బంధువులు కూడా అతని పారలౌకిక క్రియలను గావించిరి. అని చెప్పుచు హిరణ్యకశిపుడు ఇంకను ఇట్లు చెప్పెను. కావునమీరు పరమైన ఆత్మను గూర్చి దుఃఖించకండి. ఇచ్చట ఎవడు ఆత్మ, ఎవడు పరుడు, తనవాడెవరు? పరవాడెవరు? స్వ పర బుద్ధిగల పాణుల అజ్ఞానమును వీడిరి. ( 59, 60 )

టీ :- యమ ఇతి. సాంపరాయికం పరలోకకృత్యం. (59)

టీ :- సాంపరాయికమ్ = పరలోకకృత్యము ( పుణ్యలోకములు కలుగుటకై చేయబడెడు శ్రాద్ధాది కృత్యములని యర్థము ). ( 59 )

టీ :- అత ఇతి. అశోచతేతి పాఠే. అడాగమ ఆర్షః స్వః పర ఇత్యభినివేశ ఏవ జ్ఞానం తేన వినా. (60)

టీ :- ' అశోచిత ' అనుపాఠమున అడాగమము ఋషి సమ్మతము. తన - పర అను బుద్ధియే అజ్ఞానము. అట్టి అజ్ఞానముచే రహితమైన ( 60 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఇతి దైత్యపతేర్వాక్యం దితిరాకర్ణ్య సస్నుషా ।
పుత్రశోకం క్షణాత్యక్త్వా తత్త్వే చిత్తమధారయత్ ॥ 61 ॥

అని ధర్మరాజుతో నారదుడు ఇట్లు చెప్పెను. ఈ విధమైన దైత్యపతియైన హిరణ్యకశిపు వచనములను వినిన దితి పుత్రశోకమును వీడెను. మరియు కోడలు హిరణ్యాక్షుని భార్యయు పతివియోగదుఃఖమును వీడెను. తత్త్వవిచారమును పొందెను.(61)

టీ :- ఇతీతి. సస్నుషా స్నుషాసహితా. (61)

టీ :- సస్నుషా = కోడలితో కూడిన ( 61 )

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే**
**దితి శోకాపనయనం నామ ద్వితీయోధ్యాయః ॥**

**ఇది శ్రీమద్భాగవతమునందలి సప్తమస్కంధములోని**
**దితిశోకాపనయనం అను ద్వితీయాధ్యాయము శ్రీధరీయ టీకానువాదము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ హిరణ్యకశిపూ రాజన్నజేయ మజరాజరమ్ ।
ఆత్మాన మప్రతి ద్వంద్వమేకరాజం వ్యధిత్సత ॥ 1 ॥

టీ :- తృతీయే తస్య తపసా తప్తం వీక్ష్య జగద్విధిః. ఆగత్య విస్మితస్తేన సంస్తుతస్సవరానదాత్. తదేవం సాధూనాం కదనే దానవానాదిశ్య బంధూనాం శోకం చ తత్త్వనిరూపణేనాపనీయ యత్కృతవాన్ తదాహ - హిరణ్యకశిపురిత్యాదినా. అప్రతిద్వంద్వం ప్రతిపక్షహీనం. ఏకరాజం ఏకమేవ రాజానం. వ్యధిత్సత కర్తుమైచ్ఛత్. (1)

శ్లో ॥ సతేపే మందర ద్రోణ్యాం తపః పరమ దారుణమ్ ।
ఊర్ధ్వ బాహుర్నభో దృష్టిః పాదాంగుష్ఠాశ్రితావనిః ॥ 2 ॥

శ్లో ॥ జటాదీధితి భీరేజే సంవర్తార్క ఇవాంశుభిః ।
తస్మింస్తపస్తప్యమానేదేవాః స్థానాని భేజిరే ॥ 3 ॥

పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారదుడు ఇట్లు చెప్పెను :-**

హిరణ్య కశిపుడు తనను జరామరణశూన్యునిగ, అజేయునిగ, సాటిలేనివానిగా, ఏకచ్ఛత్రాధిపతిగా కావించుకొనగోరెను. ( 1 )

టీ :- (మూడవ అధ్యాయమున) ఆ హిరణ్యకశిపుని తపస్సుచే తపించుచున్న జగత్తును చూచిన బ్రహ్మ అచ్చటకు వచ్చి ఆశ్చర్యము నొందును. మరియు అతనిచే స్తుతించబడిన వాడై వరములనిచ్చెను. అట్లు సజ్జనులయొక్క వినాశముగావింప దైత్యులనాదేశించి, తత్వబోధచే బంధువుల దుఃఖమును బాపి అతడేమి చేసెనో దానిని ‘ హిరణ్యకశిపు ’ ఇత్యాదిగా చెప్పెను. అప్రతిద్వంద్వం = ప్రతిపక్షము లేనివానినిగా, ఏకరాజం = అతడొక్కడూ రాజగునట్లు, వ్యధిత్సిత = చేసికొనగోరెను.(1)

అందుకతడు మందర పర్వతపుద్రోణి ( పల్లపు భూభాగము ) యందు మిక్కిలి కఠినమైన తపస్సుగావించెను. ఎట్లనగ ఊర్ధ్వబాహువులు గలవాడై ఆకాశముపై దృష్టి నిలిపి పాదముయొక్క బొటనవ్రేలితో భూమిపై నిలిచి జటాకాంతులచే కిరణములతో గూడిన ప్రళయకాల భాస్కరునివలె ప్రకాశించెను. అతడు తపస్సు చేయుచుండ భూమియందు అజ్ఞాతముగ సంచరించుదేవతలు వారివారి స్థానములను చేరుకొనిరి.(2,3)

టీ :- స ఇతి. ఊర్ధ్వౌ బాహూ యస్య, నభసి దృష్టిర్యస్య పాదాంగుష్ఠేనాశ్రితా అవనిర్యేన. (2)

టీ :- పైకి చాచబడిన బాహువులు కలవాడై, ఆకాశమున చూడ్కులు నిలిపిన వాడై, కాలిబొటన వ్రేలిచే భూమిపై నిలబడిన వాడునై (2 )

టీ :- జటేతి. జటానాం దీధితిభిః అంశుభిః ప్రలయ కర్తా అర్క ఇవ రేజే. పూర్వం యే అలక్షితాస్సంతః. భువి చేరుః. తే దేవాః తదా పునస్స్వానిస్థానాని భేజిరే. (3)

టీ :- జటేతి - జడలయొక్క దీధితులచే = కాంతులచే , అంశుభిః = కిరణములచే, ప్రళయముగావించు సూర్యునివలె ప్రకాశించెను. పూర్వము ఎవరైతే అజ్ఞాతముగ నున్నవారై భూమిపై సంచరించిరో ఆ దేవతలు మరల తమ స్థానములను పొందిరి.(3)

శ్లో ॥ తస్యమూర్ధ్నః సముద్భూతః సధూఽమోగ్నిస్తపోమయః ।
తిర్యగూర్ధ్వ మధోలోకా నతపద్విశ్వగీరితః ॥ 4 ॥

అతని శిరమునుండి పుట్టిన తపోమయమైనట్టి ధూమముతో గూడిన అగ్ని అడ్డముగ, పైన, అధోభాగములందంతట వ్యాపించెను. ( 4 )

టీ :- తస్యేతి. విష్వగీరితః ప్రసృతః. (4)

టీ :- విశ్వగీరితః = అంతట వ్యాపించినదై ( 4 )

శ్లో ॥ చక్షుభుర్నద్యుదన్వంతః సద్వీపాద్రిశ్చ చాలభూః ।
నిపేతుః సగ్రహాస్తా రాజజ్వలుశ్చ దిశోదశ ॥ 5 ॥

నదులు, సముద్రములు, ద్వీపములతో, పర్వతములతో గూడిన భూమియు క్షోభించినవి ( చలించినవి ). గ్రహములతో కూడిన నక్షత్రములు పడిపోయినవి (రాలినవి). దశదిక్కులును జ్వలించెను. ( 5 )

శ్లో ॥ తేన తప్తా దివం త్యక్త్వా బ్రహ్మలోకం యయుఃసురాః ।
ధాత్రే విజ్ఞాపయామాసు ర్దేవదేవ జగత్పతే ॥ 6 ॥

ఆ హిరణ్యకశిపుని తపోగ్నిచే తపింప చేయబడిన సురులు స్వర్గమును వీడి బ్రహ్మలోకమునకు వెడలిరి. మరియు బ్రహ్మతో ఇట్లు మొరపెట్టుకొనిరి.

శ్లో ॥ దైత్యేంద్ర తపసా తప్తా దివస్థాతుం నశక్నుమః ।
తస్యచోపశమం భూమన్ విధేహి యది మన్యసే ।
లోకాన యావన్నక్ష్యంతి బలిహారా స్తవాభి భూః ॥ 7 ॥

ఓ దేవదేవా! లోకపాలకా ! దైత్యేంద్రుడగు హిరణ్యకశిపుని తపస్సుచే తపింపజేయబడువారమై స్వర్గమున నిలువజాలకున్నాము. నీవు భావ్యమని తలచితివేని ఓ బ్రహ్మదేవా ! ఆ తాపము నుపశమింపజేయుము. నిన్ను పూజించెడు లోకములు నశించకుండునంతలో రక్షించుము. ( 6, 7 )

టీ :- చక్షుభురితి. ద్వీపైరద్రిభిశ్చ సహితా. భూశ్చలితా. (5)

టీ :- ద్వీపములతో, పర్వతములతోడను సహితమైన భూమి చలించెను.(5)
(దీనిచే వాని తపో తీవ్రత నిరూపించబడినది ).

టీ :- లోకా ఇతి. తవ బలిహరాః కరప్రదాః. పూజాకారిణ ఇతి వా. అభితో భవతీత్యభిభూః తస్యామంత్రణం. హే అభిభో సర్వాధిపతే. పాఠాంతరే భో ఇతి సంబోధనం. అభితో యావన్న నంక్ష్యంతీతి. సంబంధః.(6,7)

టీ :- నీ యొక్క బలిమరాః = అప్పనము నిచ్చువారు ( యాగభాగము నొసగువారు) లేదా పూజచేయువారు అని. అభిభూః = సర్వత్రవ్యాపించి ఉండువాడు. హే అభిభూః= ఓ సర్వాధిపతీ !. పాఠాంతరమున ' అభిభో ' అని ' భో ' అనునది సంబోధనము. సర్వత్ర ఎంతలో నశించకుందురో అని సంబంధము. ( 6, 7 )

శ్లో ॥ తస్యాయం కిల సంకల్పశ్చరతో దుశ్చరం తపః ।
శ్రూయతాం కిం నవిదితస్తవాథాపి నివేదితః ॥ 8 ॥

దుష్కరమైన తపస్సుగావించుచున్న వాని సంకల్పమిదియట. నీకు తెలియనిదేమి? ఐనను తెలిపెదము విందువుగాక. ( 8 )

టీ :- బ్రహ్మణస్తస్మిన్ ద్వేషముత్పాదయింతుం కల్పమాహుః చతుర్భిః.

టీ :- బ్రహ్మకు వానియందు ద్వేషమును కలిగింపజేయుటకై వాని సంకల్పమును చెప్పిరి. ' తస్య ' ఇత్యాది నాలుగు శ్లోకములలో. వాని

తస్యేతి. అథాప్యస్మాభిర్నివేదితం త్వయా శ్రూయతాం. (8)

సంకల్పము నీకు తెలియదా ఏమి? తప్పక తెలిసియే యుండును. ఐనను మేము తెలిపెడిది వినెదవు గాక !. (8)

శ్లో ॥ సృష్ట్వాచరాచరమిదం తపోయోగ సమాధినా ।
అధ్యాస్తే సర్వ ధిష్ణ్యేభ్యః పరమేష్ఠీ నిజాసనమ్ ॥ 9 ॥

శ్లో ॥ తదహం వర్ధమానేన తపోయోగ సమాధినా ।
కాలాత్మనోశ్చ నిత్యత్వా త్సాధయిష్యే తథాత్మనః ॥ 10 ॥

బ్రహ్మ తపోయోగనిష్ఠచే ఈ చరాచర ప్రపంచమును సృష్టించినవాడై సర్వశక్తి సంపన్నులకంటెను శ్రేష్ఠమైన తన ఆసనమును ( సత్యలోకమును ) అధిష్ఠించుచున్నాడు. అట్లే నేనును వృద్ధిపొందెడు తపోయోగముచే దానిని సాధింతును. ఆయువు అల్పమైనప్పటికినీ, దేహము మాటి మాటికి అంతమొందినప్పటికినీ, కాలము, ఆత్మ నిత్యమైనందున అనేకజన్మలతో తపస్సు గావించి ఆ పరమేష్ఠి పదమును పొందెదను.(9,10)

టీ :- తపోయోగయోః. సమాధినా నిష్ఠయా. సర్వధిష్ణ్యేభ్యః శ్రేష్ఠం నిజాసనం సత్యలోకం. యథా అధ్యాస్తే అధితిష్ఠతి. (9)

టీ :- తపోయోగముల సమాధిచే అనగా నిష్ఠచే శ్రేష్ఠమైన అన్నింటికంటెను శ్రేష్ఠమైన తన ఆసనమును అనగా సత్యలోకమును ఎట్లైతే అధిష్ఠించునో అట్లే దానిని నేను సాధించుకొందును. ( 9 )

టీ :- తత్తథైవాత్మనః సాధయిష్యామి, నను బ్రహ్మణా అతి దీర్ఘాయుషా తపస్తప్త్వా తత్సాధితం అన్యః కుతస్తత్సాధయేత్. తత్రాహ -కాలాత్మనోరితి. యద్యప్యాయుషోకల్పత్వేన దేహో వారం వారం మ్రియేత. తథాపి కాలస్యాత్మనశ్చ నిత్యత్వాత్ బహుభిర్జన్మభిస్తపస్తప్త్వా తత్సాధయిష్యామ్యేవేతి. (10)

టీ :- బ్రహ్మ అతి దీర్ఘమైన ఆయువుచే తపస్సు గావించి దానిని సాధించెను. వేఱొకడు దానునెట్లు సాధించుననిన ' కాలాత్మనోః ' ఇత్యాదిగా చెప్పెను. ఆయువు అల్పమైనందున దేహము మాటిమాటికి అంతమైనను కాలము, ఆత్మయు నిత్యములైనందున అనేక జన్మలందును తపస్సుచేసి ఆ పదమును తప్పక సాధించెదను. (10 )

శ్లో ॥ అన్యథేదం విధాస్యేహమయథాపూర్వ మోజసా ।
కిమన్యైః కాలనిర్ధూతైః కల్పాంతే వైష్ణవాదిభిః ॥11 ॥

శ్లో ॥ ఇతి శుశ్రుమ నిర్బంధం తపః పరమ మాస్థితః ।
విధత్స్వానంతరం యుక్తం స్వయం త్రిభువనేశ్వర ॥12॥

టీ :- వర్ధమానేనేతి యదుక్తం తస్య ఫలమాహ - అన్యథేతి. ఇదం సురాసురాది. అయథాపూర్వం పణ్యపాపాదివ్యత్యయేన ఇదం జగద్విధాస్యామి. వైష్ణవాదిభిః ధ్రువాదిపదైః. కిం ప్రయోజనం? అతస్తదేవ సాధయిష్యామి. (11,12)

శ్లో ॥ తవాసనం ద్విజగవాం పారమేష్ఠ్యం జగత్పతే ।
భవాయ శ్రేయసే భూత్యై క్షేమాయ విజయాయచ ॥ 13

తేజస్సుచే ఈ జగత్తును సురాసుర వ్యత్యయముగ పుణ్యపాపాది వ్యతిరిక్తముగ నిర్మింతును. కల్పాంతమున కాలక్రమమున , ఊడిపోయెడు విష్ణుసంబంధములైన 'ధృవపదము' మొదలైన పదములతో నేమి ప్రయోజనము? కావున దానినే సాధింతునని నిర్బంధముగ ఉత్కృష్టమైన తపము చేయబూనినట్లు వినుచున్నాము. ఓ త్రిభువనప్రభూ! ఏమిచేయతగునో బాగుగా విచారించి తదనంతరము యుక్తమని తోచినట్లు చేయుము.(11,12)

టీ :- ' వర్ధమానేన ' అని ఏదైతే చెప్పబడినదో దాని అభిప్రాయమిట్లు చెప్పబడినది. 'అన్యథా ' ఇత్యాదిగా. అన్యథా = సురులు, అసురులు అనుదానికి భిన్నముగా, అయథా పూర్వమ్ = పూర్వమున్నదానికి వ్యతిరేకముగా పుణ్యపాపాదులకు వ్యతిరిక్తముగ ఈ ప్రపంచమును నిర్మింతును. ఇతరములైన, విష్ణుసంబంధములైన ' ధృవపదము ' మొదలైన వానితో ఏమిప్రయోజనము? కాన ఆ పారమేష్ఠ్య పదమునే సాధింతును. (11,12)

పరమేష్ఠికి సంబంధించిన ఈ నీ ఆసనము ( పదము ) ద్విజులకు, గోవులకును సుఖముకొఱకు, ఐశ్వర్యము కొఱకు, క్షేమము కొఱకు, విజయముకొఱకు, భవము కొఱకునై యున్నది. ( 13 )

టీ :- ఇతీతి. ఇతి త్వత్పదాపహరణే తస్యనిర్బంధం శుశ్రుమ. అత ఏవాసౌ తపః పరమాస్థితః. యదత్ర యుక్తం. తత్ అనంతరమేవ విధత్స్వ. (13)

టీ :- అని నీపదమును ( పదవిని ) అపహరించుటకై వాని పట్టుదలను గూర్చి వినుచున్నాము. కనుకనే వాడు గొప్పనైన తపస్సును బూనియున్నాడు. ఇట్టి యెడ ఏది చేయతగునో ఆలోచించి అనంతరము చేయుము. ( 13 )

శ్లో ॥ ఇతి విజ్ఞాపితో దేవై భగవానాత్మ భూర్నృప ।
పరీతో భృగు దక్షాద్యై ర్యయౌ దైత్యేశ్వరాశ్రమమ్ ॥14॥

ఓ రాజా ! పూజ్యుడైన ఆత్మభవుడు దేవతలచే ఇట్లు విన్నవించబడిన వాడై భృగు దక్షాదులతో కూడినవాడై దైత్యుడైన హిరణ్యకశిపుని ఆశ్రమమున కేగెను. (14 )

టీ :- అన్యథా తవ స్థానభ్రంశే సతి సాధూనామనిష్టం స్యాదితి శోచంత ఆహుః. - తవేతి. తవ పారమేష్ఠ్యమిదమాసనం ద్విజానాం గవాం చ భవాయ ఉద్భవాయ. శ్రేయసే సుఖాయ. భూత్యై ఐశ్వర్యాయ. క్షేమాయ లబ్ధపాలనాయ. విజయాయ ఉత్కర్షాయ. (14,)

టీ :- లేదేని నీకు స్థానభ్రంశము కలిగెనేని సాధువుల కనిష్టము కల్గునని దుఃఖించుచున్నాము. అని ఇట్లు చెప్పిరి. పరమేష్ఠికి సంబంధించిన ఈ నీ ఆసనము, ద్విజులు, గోవులయొక్క ఉద్భవము కొఱకు తగియున్నది. మరియు వానియొక్క సుఖము కొఱకు, ఐశ్వర్యము కొఱకు, క్షేమము కొఱకు, విజయము కొఱకునై యున్నది.(14).

శ్లో ॥ న దదర్శ ప్రతిచ్ఛన్నం వల్మీక తృణకీచకైః ।
పిపీలికాభిరాచీర్ణ వేదస్త్వఙ్ మాంసశోణితమ్ ॥ 15 ॥

శ్లో ॥ తపన్తం తపసాలోకా న్యథాభ్రాపి హితం రవిమ్ ।
విలక్ష్య విస్మితః ప్రాహ ప్రహసన్ హంసవాహనః ॥16॥

అచ్చట పుట్టి పెరిగి, గడ్డి వెదురు మొలిచి వ్యాప్తమై యుండుటచే వానిచే కప్పబడియున్న హిరణ్యకశిపుని దర్శించలేకపోయెను. అనంతరం చీమలు మొదలైన వానిచే లోపింపజేయబడిన క్రొవ్వు, చర్మము, మాంసము, రక్తము కలిగినట్టి, తపస్సుచే లోకములను తపింపజేయునట్టి, మేఘములచే కప్పబడిన సూర్యునివలె నున్నట్టి అతనిని గుర్తించి బ్రహ్మ ఆశ్చర్యపడినవాడై నవ్వుచున్నవాడై ఇట్లనెను. (15, 16)

టీ :- నేతి. వల్మీకాదిభిః ప్రతిచ్ఛన్నం. ప్రథమం న దదర్శ. పశ్చాత్కథంచిద్విలక్ష్య తం ప్రాహేతి ద్వయోరన్వయః. ఆచీర్ణం సమంతాద్భక్షితం. మేదశ్చ త్వక్చ మాంసం చ శోణితం చ యస్య. అభ్రైః రాపిహితం ఛన్నం రవిమివ విలక్ష్య. విస్మితః ప్రాహ. (15,16)

టీ :- పుట్టలు మొదలైన వానిచే కప్పివేయబడియున్న ఆ దైత్యేంద్రుని హంసవాహనుడు మొదట కనుగొనకుండెను. తదుపరి ఎట్లో గుర్తించి అతనితో పలికెనని రెండు శ్లోకములకు అన్వయము. చీమలు మొదలైన వానిచే పూర్తిగా భక్షించబడిన క్రొవ్వు చర్మము, మాంసము, రక్తమును కలవాడునైన మేఘములచే కప్పివేయబడిన సూర్యునివలెనున్న వానిని గుర్తించి హంసవాహనుడైన బ్రహ్మ ఆశ్చర్యపడుచు పలికెను. ( 15, 16 )

**బ్రహ్మోవాచ :-**

శ్లో ॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రంతే తపః సిద్ధోఽసి కాశ్యప ।
వరదోఽహమనుప్రాప్తో వ్రియతా మీప్సితో వరః ॥ 17 ॥

**బ్రహ్మ ఇట్లు పలికెను :-**

ఓ కశ్యప పుత్రా ! లెమ్ము లెమ్ము . నీకు శుభమగుగాక. తపస్సిద్ధిని పొందితివి. వరమొసగెడు నేను వచ్చితిని. ఇష్టమైన వరమును కోరుకొనుము. (17)

శ్లో ॥ అద్రాక్ష మహమేతత్తే హృత్సారం మహదద్భుతమ్ ।
దంశ భక్షిత దేహస్య ప్రాణాహ్యస్థిషు శేరతే ॥ 18 ॥

అద్భుతమైన ఈ నీ హృదయసారమును చూచితిని. క్రిమి కీటకములచే భక్షింపబడిన దేహముగల నీ ప్రాణములు ఎముకలందు నిలిచియున్నవి. 18

శ్లో ॥ నైతత్పూర్వర్షయ శ్చక్రుర్న కరిష్యన్తి చాపరే ।
నిరంబుర్ధారయే త్ప్రాణాన్ కోవైదివ్య సమాః శతమ్ ॥19

ఇంతటి కఠినమైన తపస్సును పూర్వమందలి మహర్షులు చేయలేదు. వేరెవరును చేయలేరు. ఎవడు వంద దివ్యవత్సరములు నీరు కూడా త్రాగనివాడై ప్రాణములను నిలుపుకొనగలడు. ( 19 )

టీ :- హృత్సారం ధైర్యం దంశైర్మక్షికావిశేషైర్భక్షితో దేహో యస్య. నైతదితి. నిరంబుః నిషిద్ధమంబు యేన సః. త్యక్తోదక ఇత్యర్థః. నిరంబ్వితి పాఠే క్రియావిశేషణం. (17,18,19)

టీ :- హృత్సారం = ధైర్యమ్, దంశైః = ఈగలు మొదలైన వానిచే భక్షించబడిన దేహముగలవాడు. నిరమ్బుః = నిషేధించబడిన నీరు గలవాడు. నీరు త్రాగుటను కూడా మానివేసిన వాడని అర్థము. ( 17, 18, 19 ).

శ్లో ॥ వ్యవసాయేన తేఽనేన దుష్కరేణ మనస్వినామ్ ।
తపోనిష్ఠేన భవతా జితోఽహం దితినందన ! ॥ 20 ॥

పండితులచే దుష్కరమైన నీ ఈ ఉద్యమముచే నేను జయించబడితిని. విశేషముగ నీ తపోనిష్ఠచే నేను విజితుడనైతిని. ( 20 )

టీ :- తే త్వయా అనేన వ్యవసాయేనైవ దృఢసంకల్ప రూపోద్యమేనైవ తావజ్జితో హం. తపోనిష్ఠేన భవతా తు. సుతరాం జితః. (20)

టీ :- నీ యొక్క ఉద్యమము చేతనే నేను జయించబడినాను. తపోనిష్ఠుడవైన నీచే మిగుల జయించబడితిని. ( 20 )

శ్లో ॥ తతస్త ఆశిషః సర్వా దదామ్యసుర పుంగవ ।
మర్త్యస్యతే అమర్త్యస్య దర్శనం నాఫలం మమ ॥ 21 ॥

ఓ అసురశ్రేష్ఠా ! అందువలన నీకు సకలమైన ఆశీస్సులనిచ్చుచున్నాను. మర్త్యుడ ( భూలోకవాసుడ ) వైన నీకు సత్యలోక ( అమర్త్య ) వాసుడవైన నా దర్శనము వ్యర్థము గాదు. ( 21 )

టీ :- తత ఇతి. అమర్త్యస్య మమ దర్శనం. అఫలం న భవతి. (21)

టీ :- మర్త్యుడవైన నీకు అమర్త్యుడనైన ( సత్యలోకవాసుడనైన ) నాయొక్క దర్శనము అఫలం = నిష్ఫలము గాదు. ( 21 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఇత్యుక్త్వాది భవోదేవో భక్షితాంగం పిపీలికైః ।
కమండలు జలేనౌక్ష ద్దివ్యేనామోఘ రాధసా ॥ 22 ॥

టీ :- ఇతీతి. ఆదౌ భవతీత్యాదిభవః అమోఘరాధసా అమోఘ ప్రభావేన. ఔక్షత్ ప్రోక్షితవాన్. (22)

శ్లో ॥ సతత్కీచక వల్మీకాత్సహ ఓజో బలాన్వితః ।
సర్వావయవ సంపన్నో వజ్రసంవహనో యువా ।
ఉత్థిత స్తప్తహేహాభో విభావసురివైధసః ॥ 23 ॥

శ్లో ॥ సనిరీక్ష్యాంబరే దేవం హంవాహ మవస్థితమ్ ।
ననామ శిరసా భూమౌ తద్దర్శన మహోత్సవః ॥ 24 ॥

టీ :- వజ్రవత్సంహననం అంగదార్ఢ్యం యస్య. తప్తస్య హేమ్నః ఇవాభా దేహకాంతిర్యస్య. (23)

**నారదుడు ఇట్లు చెప్పెను :-**

ఈ ప్రకారముగ ఆదిభవుడైన బ్రహ్మ హిరణ్యకశిపునితో పలికి దివ్యమైన, అమోఘమైన ప్రభావముగల కమండలు జలముచే, పిపీలికాదులచే ( చీమలు మొదలైన కీటకములచే ) భక్షించబడిన శరీరమును ప్రోక్షించెను. ( 22 )

టీ :- మొదట పుట్టినవాడు కావున ఆదిభవుడు = బ్రహ్మ. ఔక్షత్ = ప్రోక్షించెను. (చల్లెను).(22)

ఆ దైత్యపతి దానితో వెదురుతో నిండిన పుట్టనుండి కాంతియుక్తమైన, బలముతో గూడిన ( మనస్సు, ఇంద్రియములు, శక్తి మొదలైన వానితో సహా ) సర్వావయవ సంపన్నమైన, వజ్రమువలె కఠినమైన శరీరముగల యువకుడై లేచెను. మరియు అతడు తపింపజేయబడిన బంగారమువంటి కాంతి గలవాడై కట్టెనుండి పుట్టిన అగ్నివలెనున్నవాడై అంబరముననున్న హంసవాహనుడైన బ్రహ్మదేవుని చూచి అతని దర్శనముచే గొప్ప పండుగను పొందినవాడై భూమిపై శిరమువంచి నమస్కరించెను.(23, 24)

టీ :- వజ్రమువలె, సంహననమ్ = అంగదారుఢ్యము కలవాడు. కాచబడిన బంగారువంటి ఆభా = దేహకాంతి గలవాడు. ( 23 )

టీ :- తస్య దర్శనమేవ మహోనుత్సవో యస్య, (24)

టీ :- ఆ బ్రహ్మ దర్శనముచే మహోత్సవము గలవాడు. ( 24 )

శ్లో ॥ ఉత్థాయ ప్రాంజలిః ప్రహ్వ ఈక్షమాణో దృశావిభుమ్ ।
హర్షాశ్రు పులకోద్భేదో గిరా గద్గదయాగృణాత్ ॥ 25 ॥

లేచి చేతులు జోడించి నమ్రుడై కన్నులచే విభుని చూచువాడై ఆనంద బాష్పములు జాలువార, శరీరము పులకలెత్తగ, గద్గదమైన వాక్కుచే భగవంతుని స్తుతించెను. ( 25)

టీ :- హర్షేతి. హర్షేణాశ్రూణి పులకోద్భేదశ్చ యస్య. (25)

టీ :- ఆనందముచే అశ్రువులను పులకములను పొందినవాడు. ( 25 )

**హిరణ్యకశిపురువాచ :-**

**హిరణ్యకశిపుడిట్లు పలికెను :-**

శ్లో ॥ కల్పాంతే కాల సృష్టేన యోన్ధేన తమసావృతమ్ ।
అభివ్యనక్ జగదిదం స్వయంజ్యోతిః స్వరోచిషా ॥26॥

కల్పాంతమునందు కాలముచే సృష్టించబడిన ( ప్రకృతి గుణరూపమున) గాఢమైన తమస్సుచే ఆవరించబడిన ఈ జగత్తును నీ ప్రకాశముచే స్వయముగా ప్రకాశించునట్లు అభివ్యక్తము చేయుచున్నావు ( ప్రకటించుచున్నావు ).(26)

శ్లో ॥ ఆత్మనా త్రివృతా చేదం సృజత్యవతి లుంపతి ।
రజః సత్త్వ తమోధామ్నే పరాయ మహతే నమః ॥ 27 ॥

మరియు త్రిగుణాత్మక స్వరూపముతో దీనిని సృష్టించుచున్నావు. పాలించుచున్నావు. లోపింపజేయుచున్నావు. రజః సత్త్వ తమో గుణముల కాశ్రయమైన పరాత్మా ! మహానుభావా! నీకు నమస్కారము. ( 27 )

టీ :- అంధేన నిబిడేన. తత్ర హేతుః. కాలసృష్టేన ప్రకృతిగుణ రూపేణ. ధ్వాంతేన తమసా ఆవృతమిదం జగత్. యః అభివ్యనత్. అభివ్యక్తమకరోత్. (26)

టీ :- ఆత్మనేతి. యశ్చ త్రిగుణేనాత్మనా. ఇదం సృజతి. అవతి. లుంపతి చ. తస్మైరజస్సత్త్వతమసాం ధామ్నే ఆశ్రయాయ. మహతే పరాయ పరమేశ్వరాయ. నమ ఇతి ద్వయోరన్వయః. (27)

టీ :- అన్ధేన = నిబిడమైన ( గాఢమైన ) ( కల్పాంతమున ఈ జగము గాఢమైన తమస్సుచే ఆవరించబడుటకు ) తత్రహేతుః = కారణము. ప్రకృతి గుణ రూపమైన కాలముచే సృష్టించబడిన తమస్సుచేత అంతేకాని అజ్ఞానాంధకారముచే గాదు. వ్యాప్తమైన ( ఆవృతమైన ) ఈ ప్రపంచమును ఎవడు అగుపడునట్లు చేయుచున్నాడో, ఎవడైతే త్రిగుణ ( రజః సత్త్వ, ,తమస్సులు ) రూపమైన స్వరూపముతో ఈ జగమును సృజించి, పాలించి, ఉపసంహరించునో, అట్టి త్రిగుణములకు ఆశ్రయుడైన మహత్తు అగు పరమేశ్వరునకు నమస్కారము. అని రెండు శ్లోకముల అన్వయము. ( 26,27)

శ్లో ॥ నమ ఆద్యాయ బీజాయ జ్ఞాన విజ్ఞాన మూర్తయే ।
పాణేంద్రియ మనోబుద్ధి వికారై ర్వ్యక్తి మీయుషే ॥ 28 ॥

ఆద్యుడవు, కారణభూతుడవు, జ్ఞాన విజ్ఞానమూర్తివియునగు నీకు నమస్కారము. ప్రాణేంద్రియ మనోబుద్ధులనెడు వికార రూపములచే ప్రకటమయ్యెడు దేవా ! నీకు నమస్కారము. ( 28 )

టీ :- అత్ర చ స్వప్రకాశకత్వం. జగత్ప్రకాశకత్వం. తత్కారణత్వం. తత్సృష్ట్యాది కర్తృత్వం. మహత్త్వం పరమేశ్వరత్వం చేతి. షడ్విధత్వముక్తం. తదేవ ప్రపంచయన్నమస్కరోతి - చతుర్భిః. నమ ఇతి. బీజాయ కారణాయ తత్ర హేతుః. ఆద్యాయ. జ్ఞానం జ్ఞప్తిః. విజ్ఞానం విషయాకారం జ్ఞానం. ముర్తిర్యస్య తస్మై. అనేన స్వప్రకాశకత్వం జగత్ప్రకాశకత్వం చ దర్శితం. బీజాయేతి

టీ :- ఇచ్చటను స్వప్రకాశకత్వము, జగత్ప్రకాశకత్వము, జగత్కారణత్వము, జగత్ సృష్ట్యాది కర్త ృత్వము, మహత్వము, పరమేశ్వర తత్వము అని చెప్పబడినది. దానినే వివరించి ప్రకటించుచు నమస్కరించుచున్నాడు. ' నమ ' ఇత్యాదిగా నాలుగు శ్లోకములలో బీజాయ = కారణుడైన, అందుకు హేతువు - ఆద్యుడైనవాడు. జ్ఞానం = జ్ఞప్తి, విజ్ఞానం= విషయరూపమైన జ్ఞానమును రూపమైనవాడు, అట్టివానికై నమస్కారము. దీనిచే బ్రహ్మకు

నిమిత్తత్వముక్తం. ఉపాదానత్వమాహ – ప్రాణాదయో యే వికారాస్తైః రూపైర్వ్యక్తిః శౌర్యాకారం. ఈయుషే ప్రాప్తవతే. (28)

స్వప్రకాశకత్వము, జగత్ప్రకాశకత్వమును ప్రదర్శించబడినది. ' బీజాయ ' అనుటచే బ్రహ్మకు జగన్నిమిత్త కారణత్వము చెప్పబడినది. ఉపాదానత్వము ఇట్లు చెప్పబడినది. ప్రాణాది వికార రూపములచే కార్యాకారము పొందినవాడు. అట్టి వానికై నమస్కారము. ( 28 )

శ్లో ॥ త్వమీశిషే జగతస్తస్థుషశ్చ
ప్రాణేన ముఖ్యేన పతిః ప్రజానామ్ ।
చిత్తస్య చిత్తేర్మన ఇంద్రియాణామ్
పతిర్మహాన్భూత గుణాశయేశః ॥ 29 ॥

ఈ స్థావర జంగమాత్మక ప్రపంచముయొక్క నియంతవై వున్నావు. సూత్రాత్మ కారణరూపమైన ముఖ్యమగు ప్రాణమగుటచే ప్రజలకు పతివగుచున్నావు. చిత్తమునకు, తత్పరిణామ రూపమైన చైతన్యమునకు, మనస్సునకు, ఇంద్రియములకును పతివి, కాన నీవే గొప్పవాడవు. మహాభూతములైన పృథివీ జల తేజో వాయు ఆకాశములకు , వాని గుణములైన శబ్దాదులకు, వాని వాసనలకు ఈశుడవు. ( 29 )

టీ :– ఏవమాత్మనా త్రివృతా చేత్యనేనోక్తం కారణత్వం ద్వేధా దర్శితం. మహత్త్వమీశ్వరత్వం చాహ – త్వమితి. త్వమేవ జగతో జంగమస్య. తస్థుషః స్థావరస్య చ. ఈశిషే నియంతా భవసి. కేన. ముఖ్యేన ప్రాణేన సూత్రాత్మరూపేణ. అతస్త్వం ప్రజానాం పతిః. తాసాం. చిత్తస్య చిత్తేశ్చ. తత్పరిణామ భూతాయాశ్చేతనాయాః. మనసశ్చ. తన్నియమ్యానామింద్రియాణాం చ. పతిః. అతస్త్వమేవ మహాన్. భూతానామాకాశాదీనాం. తద్గుణానాం

టీ :– ఇట్లు ' ఆత్మ నాత్రివృతా ' ఇత్యాదిగా చెప్పబడిన కారణత్వము రెండు విధములుగ ప్రదర్శించబడినది. మహత్వమును, ఈశ్వరత్వమును ఇట్లు చెప్పుచున్నాడు. ' త్వం ' అను శ్లోకమున నీవే స్థావర జంగమాత్మకమైన జమునకు నియన్తవై యున్నావు. దేనిచేత అనగా సూత్రాత్మ రూపమైన ముఖ్యమగు ప్రాణము ద్వారా అని యర్థము. కావున నీవు ప్రజాపతివి. మరియు వారి చిత్తమునకు, తత్పరిణామరూపమైన చైతన్యమునకు, మనస్సునకు, మనోనియమ్యములైన ఇంద్రియములకును ప్రభువువై

శబ్దాదివిషయాణాం. ఆశయానాం తద్వాసనానాం. ఈశశ్చ. ఏతేనైవ స్రష్టృత్వం దర్శితం. (29)

యున్నావు. కాన నీవే గొప్పవాడవు. ఆకాశాది భూతములకు, తద్గుణమైన శబ్దాది విషయములకు, వానికి సంబంధించిన వాసనలకును నీవే ఈశుడవు. దీనిచేతనే సృష్టికర్తృత్వము ప్రదర్శితత్వము. ( 29)

శ్లో ॥ త్వతప్త తంతూన్వితనోషి తన్వా
త్వయ్యాచాతుర్హోత్రక విద్యయాచ ।
త్వమేక ఆత్మాత్మవతా మనాది
రనంతపారః కవిరంతరాత్మా ॥ 30 ॥

నీవు అగ్నిష్టోమాది యాగములను విస్తరించుచున్నావు. ఎట్లనగా నీ శరీరముచే (వేద త్రయ రూపముచే ) చాతుర్హోత్రక విద్యచేతను విస్తరించుచున్నావు. ప్రాణుల అంతర్యామివైన ఆత్మవు నీవే. ఆదిలేని వాడవు, అంతము లేని వాడవు, పారము (దేశము) లేనివాడవు. కవివి అనగా సర్వజ్ఞుడవు అని అర్థము. నీవు ఒక్కడవే ( అఖండుడవు ) అంతరాత్మవై యున్నావు. ( 30 )

టీ :- ఇదానీం యజ్ఞప్రవర్తకత్వేనాంతర్యామిత్వేన చ జగత్పాలకత్వమాహ - త్వమితి. త్వమేవ సప్తతంతూన్ అగ్నిష్టోమః. అత్యగ్నిష్టోమః ఉక్థ్యః. షోడశీ. వాజపేయః. అప్తోర్యామః. అతిరాత్రః ఏతే సప్తతంతవః. విస్తారయసి. కథం. త్రయ్యాతన్వా వేదత్రయరూపేణ. కథంభూతయా. చత్వారో హోతారో యత్ర తచ్చతుర్హోతృకం కర్మ. తద్విషయయా విద్యయా ఆత్మవతాం ప్రాణినామాత్మ భూత స్త్వమేవాంతరాత్మా చ అంతర్యామీ. కుతః? యతః కవిః సర్వజ్ఞః. తత్కుతః? ఏకః అఖండః తత్ర హేతుః.

టీ :- ఇప్పుడు యజ్ఞ ప్రవర్తకుడుగ, అంతర్యామిగా జగత్పాలకత్వమును చెప్పెను. నీవే అగ్నిష్టోమ, అత్యగ్నిష్టోమ, ఉక్థ్య, షోడషీ, వాజపేయ, ఆర్యమ, అతిరాత్రయజ్ఞం విస్తరింప జేయుచున్నావు. ఎట్లనిన వేదత్రయ రూపమైన శరీరముచే. ఆ శరీరము ఎట్టిదనిన హోతా, ఉద్గాతా, అధ్వర్యువు, బ్రహ్మలు గల కర్మ ( చాతుర్హోత్రకం ) సంబంధమైన విద్యచే ప్రాణులయొక్క ఆత్మ రూపుడవైన నీవే అంతరాత్మవు. ఎందువల్లననగా, ఎందువల్ల నైతే నీవు కవిః = సర్వజ్ఞుడవు అగుచున్నావో. అదియెట్లు అనిన ఏకః = అఖండుడవు, అందుకు హేతువు అనాదిరనంత పారుడవు. కాలమానము ననుసరించి

అనాదిః అనంతపారశ్చేతి. నాస్త్యంతః కాలతః. పారం చ దేశతః యస్య సః. (30)

అంతములేని వాడవు. దైవికముగా పారుడవు. ఏ ఒక దేశమునకు సంబంధించినవాడవు కావు. ( 30)

శ్లో ॥ త్వమేవకాలో నిమిషో జనానా
మాయుర్లవాద్యావ యవైః క్షణోసి ।
కూటస్థ ఆత్మా పనరమేష్ఠ్యజో మహాన్
స్త్వం జీవలోకస్యచ జీవఆత్మా ॥ 31 ॥

నీవే కాలస్వరూపుడవు, అనిమిషుడనీవే, ప్రాణుల ఆయువునీవే, లవము మొదలైన కాలావయవములచే వారి ఆయువును తరిగించుచున్నావు. కూటస్థుడవైన ఆత్మవు నీవే. పరమేశ్వరుడవు, జన్మశూన్యుడవు, మహత్వ రూపుడవు. ప్రాణికోటికి జీవము (జీవనహేతువు ), ఆత్మయు ( జ్ఞానము ), నీవే. ( 31 )

టీ :- కాలరూపేణ సంహర్తృత్వమాహ - త్వమితి. లవాద్యై రవయవైః క్షిణోషి క్షపయసి. తదేవం సృష్ట్యాది కర్తృత్వేపి నిర్వికారత్వమేవాహ - కూటస్థ ఇతి. తత్ర హేతవః -మ ఆత్మా జ్ఞానరూపః. పరమేష్ఠీ పరమేశ్వరః. అజః. జన్మశూన్యః. మహాన్ అపరిచ్ఛిన్నః. కించ జీవలోక ఏవ కర్మవశాజ్జన్మాదిభిర్విక్రియతే. త్వం తు తస్య జీవః. జీవనస్య హేతుః. యతస్తస్యాత్మా నియంతా. (31)

టీ :- కాలరూపుడిగా సంహర్తృత్వ మును ఇట్లు చెప్పెను. ‘ త్వమేవ ’ ఇత్యాదిగా. లవము మొదలైన కాలావయవములచే ఆర్చుచున్నావు. అందువలన ఇట్లు సృష్ట్యాది కర్తృత్వమున్నను నిర్వికారత్వమే యని చెప్పెను. ‘ కూటస్థ ’ ఇత్యాదిగా. అచల కారణములు ఆత్మా = జ్ఞానరూపుడు. పరమేష్ఠీ = పరమేశ్వరుడు. అజః = జన్మ శూన్యుడు. మహాన్= అపరిచ్ఛిన్నుడు (ఇంతయని చెప్పుటకు వీలుకానివాడు ). ఇంకను జీవలోకమే కర్మవశమున జన్మాదులచే వికారము గావించబడుచున్నది (పరివర్తన గావించబడుచున్నది). నీవైతే ఆ జీవలోకమునకు జీవుడవు = జీవనహేతువు. ఎందుకనగా దానిని ఆత్మవు = నియంతవు. ( 31 )

శ్లో ॥ త్వత్తః పరం నా పరమప్యనే జదే
జచ్చ కించి ద్వ్యతిరిక్త మస్తి ।
విద్యా కలాస్తే తనవశ్చ సర్వా
హిరణ్య గర్భోసి బృహత్రిపృష్టః ॥ 32 ॥

నీకంటే భిన్నమైన కారణము గానీ కార్యముగానీ లేదు. నీకంటే వేరైన స్థావరముగానీ జంగమము గానీ, దానికి భిన్నమైనదిగానీ లేదు. వేదోప వేదాత్మకమైన విద్య, తదంగములు, అన్నియు నీ శరీరములే. హిరణ్యరూపమైన బ్రహ్మాండము గర్భమందుగలవాడవు. త్రిగుణాత్మక ప్రధాన పురుషునకు పృష్టరూపుడవు. ( 32 )

టీ :- తత్కుతస్తత్రాహ - త్వత్త ఇతి. త్వత్తో వ్యతిరిక్తం యది కించిద్భవేత్. తర్హి తస్మాత్తవ జన్మాదివికారో నియమత్వాదికం వా భవేత్. త్వత్తః పరం కారణం. అపరం కార్యం. తత్ర చ ఏజత్ జంగమం. అనేజత్ స్థావరం. వ్యతిరిక్తం నాస్తి. బోధకం శాస్త్రం వ్యతిరిక్తమస్తీతి చేత్. న. యతః. విద్యాః వేదోపవేదాది విద్యాస్థానాని. కలాశ్చ తదంగాని. తవైవ తనవః న త్వద్వ్యతిరిక్తా. తత్కుతః? యతః. త్వం బృహత్. బ్రహ్మైవాసి. తదపి కుతః? తత్రాహ - హిరణ్యరూప బ్రహ్మాండం గర్భే యస్య సః. త్రిపృష్టః త్రిగుణాత్మకస్య ప్రధానస్య పృష్ఠే పరతః స్థితః. శ్రు. “ అక్షరాత్ప రతః పర ” ఇత్యాది శ్రుతేః. (32)

టీ :- అది ఎందులకనిన ఇట్లు చెప్పెను. ‘ త్వత్త ’ ఇత్యాదిగ. నీకంటే భిన్నమైనది ఏదేనియు కొంచెము ఉండెనేని, దానివలన నీకు జన్మాది పరిణామము లేదా నియమ్యత్వాదికము ఉండవలసినది. అది లేదని చెప్పుచున్నాడు. పరంతారణము, అపరం = కార్యము. అచ్చటను స్థావరజంగమమునకన్న వ్యతిరిక్తము లేదు. ఓయీ నన్ను గూర్చి తెలిపెడు శాస్త్రము నాకన్న భిన్నమైనది వున్నది కదా ! యనిన అదియు లేదు. ఎందువల్లననగా వేదములు, ఉపవేదములు మొదలుగాగల విద్యాస్థానములు, తదంగములైన కళలు నీ శరీరములే . నీ వ్యతిరిక్తములు గావు. అది యెందులకనిన నీవు బృహత్తరమైన బ్రహ్మవేకదా ! అదియును ఎందులకనిన నీవు హిరణ్యరూపమైన బ్రహ్మాండము గర్భమున గలవాడవు. “ అక్షరాత్పరతః పరః ” అను శ్రుతివాక్యము ననుసరించి నీవు త్రిపృష్ఠుడవు. త్రిగుణాత్మకుడైన ప్రధానునకు పృష్ఠమున నున్నవాడవు.(32)

శ్లో ॥ వ్యక్తం విభో స్థూలమిదం శరీరం
యేనేంద్రియ ప్రాణమనో గుణాం స్త్వమ్ ।
భుంక్షే స్థితో ధామని వపారమేష్ఠ్య
ఆవ్యక్త ఆత్మా పురుషః పురాదనః ॥ 33 ॥

ఓ ప్రభూ ! ఏ శరీరముచే నీవు ఇంద్రియ ప్రాణ మనస్సుల యొక్క గుణములను అనుభవించుచున్నావో మరియు పరమైశ్వర్య స్వరూపమునందే ఉన్నవాడవై అనుభవించుచున్నావో అట్టి ఈ నీ స్థూలమైన శరీరము వ్యక్తమైనది. నిజమైనది. నీవు అవ్యక్తమైన ఆత్మ రూపుడవు. పురాణ పురుషుడవు. నిరుపాధి బ్రహ్మావు. ( 33 )

టీ :- నను బ్రహ్మాండశరీరస్య జీవస్య మమ కుతో బ్రహ్మత్వ బ్రహ్మాండగర్భత్వాది తత్రాహ - వ్యక్తమితి. వ్యక్తం కార్యమిదం తవ శరీరం వ్యక్తం సత్యమితి వా. యేన శరీరేణ. త్వమింద్రియ ప్రాణమనసాం గుణాన్ విషయాన్ భుంక్షే. కింతు పారమేష్ఠ్యే పరమైశ్వర్యే. ధామని స్వరూపే. స్థిత ఏవ భుంక్షే. న తు స్వరూప తిరోధానేన. అతస్త్వమవ్యక్తః. ఆత్మా నిరూపాధి బ్రహ్మైవ పురాణః పురుషశ్చేత్యర్థః. (33)

టీ :- బ్రహ్మాండమే శరీరముగాగల జీవుడనైన నాకు బ్రహ్మత్వమెక్కడిది. బ్రహ్మాండ గర్భత్వాదికమును ఎక్కడిది? అనిన దానికి ఇట్లు చెప్పెను. వ్యక్త = కార్యరూపమైన ఈ నీ యొక్క శరీరము, వ్యక్తం = సత్యమైనదనియు కూడా, ఏ శరీరముచే నీవు ఇంద్రియ ప్రాణ మనస్సులయొక్క గుణములను = విషయములననుభవించుచున్నావు. మావంటి వారి వలె స్వరూప తిరోధానము చేతకాదు. పారమైశ్వర్య స్వరూపము నందే యున్నవాడవై అనుభవించుచున్నావు. కాన నీవు అవ్యక్తమైన ఆత్మ రూపుడవు. ఉపాధి శూన్యమైన బ్రహ్మావు. ప్రాచీనమైన పురుషుడవు అని అర్థము. ( 33 )

శ్లో ॥ అనన్తా వ్యక్త రూపేణ యేనేద మఖిలం తతమ్ ।
చిద చిచ్ఛక్తి యుక్తాయ తస్మై భగవతే నమః ॥ 34 ॥

ఓ అనంతా ! ఏ నీచేత అవ్యక్తమైన (మనస్సునకు, వాక్కులకు అందని) రూపముచే ఈ విశ్వము వ్యాప్తమై ఉన్నదో, అట్టి చిద చిచ్ఛక్తితో కూడుకొన్న (అచిన్త్యమైన ఐశ్వర్య సంపన్నుడవైన ) పూజ్యుడవైన ఓ భగవన్! నీకు నమస్కారము. (34 )

శ్లో ॥ యదిదాస్య స్యభిమతా న్వరాన్మే వరదోత్తమ ।
భూతేభ్య స్త్వద్విసృష్టేభ్యో మృత్యుర్మా భూన్మమప్రభో ॥35॥

ఓ వరదోత్తమా ! ( వరములనిచ్చెడు మహాదేవా ) నాకు అభిమతములైన వరములను ఇచ్చునట్లైన ఓ ప్రభూ ! నాకు నీవు సృష్టించిన ప్రాణులనుండి మృత్యువు కలుగకుండుగాక. ( 35 )

టీ :- నను బ్రహ్మత్వం పురాణపురుషత్వం కథమేకస్య? తత్రాహ - అనంతేతి. హే అనంత యేన త్వయా. అవ్యక్తరూపేణ మనోవచనాగోచరేణ రూపేణ ఇదం వ్యక్తం. విశ్వం తతం వ్యాప్తం. తస్మై తుభ్యం భగవతే. అచింత్యైశ్వర్యాయ నమః. భగవత్త్వే హేతుః. చిచ్ఛక్తిః విద్యా. అచిచ్ఛక్తిః మాయా, తాభ్యాం యుక్తాయేతి. (34,35)

టీ :- బ్రహ్మత్వము, పురాణపురుషత్వమును ఒక్కనికే ఎట్లు అనిన అందుకు ఇట్లు చెప్పెను. ‘ అనన్త ’ ఇత్యాదిగా. ఓ అనంతా ! ఏ నీ చేతనైతే అవ్యక్తమైన = మనస్సునకును, వాక్కునకును అందనట్టి రూపముచే ఈ ప్రపంచము వ్యాపించబడి యున్నదో అట్టి భగవంతుడవైన ( అచిన్త్యైశ్వర్య సంపన్నుడవైన) నీకు నమస్కారము. భగవత్వమునకు హేతువు చిదచిచ్ఛక్తి యుక్తునకై అనునది. చిచ్ఛక్తిః = విద్యా, అచిచ్ఛక్తిః = మాయా, వానిచే కూడినవానికై అని. (34,35)

శ్లో ॥ నాన్తర్బహిర్దివానక్త మన్యస్మా దపి చాయుధైః ।
న భూమౌ నాంబరే మృత్యు ర్నరై ర్నమృగైరపి ॥ 36 ॥

ఇంటిలోనగాని, బయటగాని, పగలుగానీ, రాత్రిగానీ, నీచే సృష్టించబడని ప్రాణులనుండియు, ఆయుధములచేతను, మృత్యువు కలుగకుండుగాక. భూమియందును, ఆకాశమునందును మృత్యువు కలుగరాదు. మృగముల చేతగానీ, నరులచేతగానీ మరణము కలుగరాదు.(36

టీ :- నేతి. అన్యస్మాత్ త్వత్స ృష్టవ్యతిరిక్తాదపి ఆయుధైః మాభూదితి పూర్వేణాన్వయః. (36)

టీ :- అన్యస్మాత్ = నీచే సృష్టించబడిన వాని కంటే భిన్నమైన వాని నుండియు, ఆయుధములచే మృత్యువు కలుగకుండుగాక. ( 36 )

శ్లో ॥ వ్యసుభిర్వాఽసుమద్భిర్వా సురాసుర మహోరగైః ।
అప్రతి ద్వంద్వతాం యుద్ధే ఏకపత్యంచ దేహినామ్ ॥37

శ్లో ॥ సర్వేషాం లోకపాలానాం మహిమానం యథాత్మనః ।
తపోయోగ ప్రభావానాం యన్నరిష్యతి కర్హిచిత్ ॥ 38 ॥

టీ :- వ్యసుభిః అప్రాణైః అసుమద్భిః సప్రాణైః. యథా ఆత్మనస్తవాస్తి. తథా అప్రతిద్వంద్వతాదికం దేహీతి శేషః. (37)

టీ :- సర్వేషామితి. తపసా యోగేన చ ప్రభావో యేషాం తేషాం. అణిమాద్యైశ్వర్యం నరిష్యతి ననశ్యతి తచ్చ త్వం దేహీత్యర్థః. (38)

**ఇతి శ్రీమద్భాగవతే మహా పురాణే సప్తమస్కంధే హిరణ్య కశిపోర్వరయాచనం నామ తృతీయోఽధ్యాయః ॥**

ప్రాణములు లేనివానిచేత గానీ, ప్రాణములుగల వానిచేతగానీ, సురులచేతగానీ, అసురులచేతగానీ, మహాసర్పములచేతగానీ నాకు మరణము కలుగరాదు. మరియు నాకు యుద్ధమున అప్రతి ద్వంద్వత్వమును (నన్ను అద్వితీయునిగా) సకల ప్రాణులయొక్క ఏకాధిపత్యమునొసంగుము. నీవలె సకల లోకపాలురయొక్క మహిమను నాకొసగుము. తపస్సుచే యోగము చేతను కలిగిన ప్రభావము (అణిమాద్యైశ్వర్యము) ఏ విధముగను నశించకుండునట్లు వరమునిమ్ము. ( 37, 38 )

టీ :- వ్యసుభిః = ప్రాణ శూన్యమైన వానిచే, అసుమద్భిః = ప్రాణములు కలవానిచే (మృత్యువు కలుగకుండుగాక ) నీకు ఏవిధమైన మహిమకలదో అట్లే ఎదురులేమి తనము మొదలైన వరము నిమ్ము అని శేషము. ( 37 )

టీ :- తపస్సు చేతను, యోగము చేతను కలుగు ప్రభావములుగల ' అణిమా' (అణిమా, లఘిమా. మహిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వం అనునవి అష్టసిద్ధులు) మొదలైన ఐశ్వర్యము నశించకుండునట్లు వరమునిమ్ము అని అర్థము. ( 38 )

**ఇది శ్రీమద్భాగవత పురాణము నందలి సప్తమ స్కంధము నందు హిరణ్యకశిపుని యొక్క వరయాచనమను మూడవ అధ్యాయము.**








శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఏవం వృతః శత ధృతిః హిరణ్యకశిపోరథ ।
ప్రాదాత్త త్తపసాప్రీతో వరాంస్తస్య సుదుర్లభాన్ ॥ 1 ॥

టీ :- చతుర్థే తు వరాన్ లబ్ధ్వా విజత్యాఖిలలోకపాలాన్, విష్ణుద్వేషేణ తాన్ సర్వాన్ దైత్యేంద్రస్సమపీడయత్. ఏవమితి. శతధృతిః. బ్రహ్మా. (1)

**బ్రహ్మోవాచ :-**

శ్లో ॥ తాతేమే దుర్లభాః పుంసాం యాన్ వృణీషే వరాన్మమ ।
తథాపి వితరామ్యంగ వరాన్యదపి దుర్లభాన్ ॥ 2 ॥

టీ :- తాతేతి. మమ దత్తః. యత్ యద్యపి. ఇమే దుర్లభాః. (2)

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారదుడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

బ్రహ్మ హిరణ్య కశిపునివలన ఇట్లు కోరబడిన వాడై ఆతని తపస్సుకు మెచ్చి మిక్కిలి దుర్లభములైన ఆ వరములనాతనికొసంగెను. హిరణ్యకశిపుడు వాటివలన విష్ణువు యందలి ద్వేషముచే వారిని పీడించసాగెనని అంతరార్థము.(1)

టీ :- నాల్గవ అధ్యాయమున దైత్యేంద్రుడైన హిరణ్యకశిపుడు వరములను పొంది సకలలోకపతులను జయించి విష్ణువుయందలి ద్వేషముచే వారిని పీడించెను. శతధృతిః = బ్రహ్మదేవుడు. (1)

**బ్రహ్మ ఇట్లు పలికెను :-**

ఇచ్చట బ్రహ్మ వచనములు ఓ నాయనా ! నన్ను ఏ వరములైతే కోరితివో అవి పురుషులకు దుర్లభములైనవి. అంగా ! దుర్లభములైనను ఆ వరముల నిచ్చుచున్నాను.(2)

టీ :- మమ = నావలన. యదపి = ఈ వరములు పొందశక్యము గానివే యైనను.(2)



శ్లో ॥ తతో జగామ భగవానమోఘానుగ్రహో విభుః ।
పూజితోసుర వర్యేణ స్తూయమానః ప్రజేశ్వరైః ॥ 3 ॥

అని పలికినవాడై ఆ సురోత్తమునిచే పూజింపబడినవాడై, మరీచ్యాది ప్రజాపతులచే స్తుతించబడినవాడై, అమోఘానుగ్రహము గలవాడును, సర్వసమర్థుడగు భగవానుడు వెడలిపోయెను. ( 3 )

టీ :- తత ఇతి. అమోఘః అనుగ్రహో యస్య. ప్రజేశ్వరైర్మరీచ్యాదిభిః (3)

టీ :- వ్యర్థముకాని అనుగ్రహము కలవాడు (బ్రహ్మ) ప్రజేశ్వరైః = మరీచి మొదలైన ప్రజాపతులచే (3)

శ్లో ॥ ఏవం లబ్ధవరో దైత్యో బిభ్రద్ధేమ మయం వపుః ।
భగవత్యకరోద్ద్వేషం భ్రాతుర్వధ మనుస్మరన్ ॥ 4 ॥

శ్లో ॥ సవిజిత్య దిశః సర్వా లోకాంశ్చత్రీన్మహాసురః ।
దేవాసుర మనుష్యేంద్రాం గంధర్వ గరుడోరగాన్ ॥ 5 ॥

శ్లో ॥ సిద్ధచారణ విద్యాధ్రాన్ ఋషీన్ పితృపతీన్మనూన్ ।
యక్ష రక్షః పిశాచేశాన్ ప్రేతభూత పతీనథ ॥ 6 ॥

ఇట్లు వరములను పొందిన దైత్యుడు బంగారపు శరీరమును దాల్చినవాడై, సోదరుని వధను స్మరించుచు, భగవంతుడగు హరియందు ద్వేషమును బూనెను. తర్వాత ఆ హిరణ్యకశిపుడు సకలదిక్కులను, ముల్లోకములను జయించెను. అనంతరము దేవాసుర మనుష్యేంద్రులను, గంధర్వ గరుడోరగులను, సిద్ధ చారణ విద్యాధరులను, ఋషులను పితృ పతులను, మనువులను, యక్ష, రాక్షస, పిశాచాధిపతులను, ప్రేత, భూతపతులను జయించెను. (4.5.6)

టీ :- యదర్థం తపస్తప్తం తదాహ – ఏవమిత్యాదినా. (4,5,6)

టీ :- దైత్యేంద్రుడు ఎందుకొఱకై తపస్సు చేసెనో " ఏవం " ఇత్యాది శ్లోకములతో చెప్పెను. ( 4, 5, 6 )

శ్లో ॥ సర్వ సత్వ పతీన్ జిత్వా వశమానీయ విశ్వజిత్ ।
జహార లోకపాలానాం స్థానాని సహ తేజసా ॥ 7 ॥

విశ్వవిజేతయైన ఆ హిరణ్యకశిపుడు సకలప్రాణుల అధిపతులను జయించి తన అధీనమునకు తెచ్చుకొన్నవాడై లోకపాలుర తేజస్సుతో వారి స్థానములను హరించెను. ( 7 )

టీ :- సర్వేతి. సర్వేషాం సత్వానాం ప్రాణిజాతానాం యే యే పతయస్తాన్. (7)

టీ :- సర్వేషాం సత్త్వానాం = సకల ప్రాణి జాతుల యొక్క ఏ ఏ అధిపతులుండిరో వారందరిని. ( జయించెను ) (7)

శ్లో ॥ దేవోద్యాన శ్రియాజుష్ట మధ్యాస్తేస్మ త్రివిష్టపమ్ ।
మహేంద్ర భవనం సాక్షాన్నిర్మితం విశ్వకర్మణా ।
త్రైలోక్య లక్ష్మ్యాయయ తనుమధ్యవాసాఖిలర్ధిమత్ ॥ 8 ॥

దేవోద్యానమైన నందనవన శోభతో నలరారెడు స్వర్గమునధిష్ఠించెను. సకల సమృద్ధులతో కూడినట్టి సాక్షాత్తుగా విశ్వకర్మచే నిర్మించబడినట్టి, త్రైలోక్య లక్ష్మికి ఆలయమైనట్టి మహేంద్రుని భవనమునే ఆక్రమించుకొనెను. ( 8 )

టీ :- దేవేతి. త్రివిష్టపం స్వర్గం అధ్యాస్తేస్మ అధిష్ఠతవాన్. తత్ర మహేంద్రభవనమధ్యువాస అధివసతి స్మ. (8)

టీ :- త్రివిష్టపం = స్వర్గమును, అధ్యాస్తేస్మ = అధిష్ఠించినవాడై యుండెను. ఆ స్వర్గమందును మహేంద్రుని భవనమును. అధ్యువాస = ఆక్రమించి నివసించెను(8)

శ్లో ॥ యత్ర విద్రుమ సోపానా మహామారకతా భువః ।
యత్రస్ఫాటిక కుడ్యాని వైడూర్యస్తంభ పంక్తయః ॥ 9 ॥

మహేంద్రభవనము సకల సమృద్ధిమంత మెట్లనగా అచ్చటి సోపాన పంక్తులు పగడములచే నిర్మించబడినవి. భూములు మహా మరకత మణులచే పరువబడినవి. గోడలు స్ఫటికమణులతో నిర్మించబడినవి. స్తంభ పంక్తులు వైఢూర్యమణులచే నిర్మించబడినవి. ( 9 )

టీ :- అఖిలసమృద్ధియుక్తత్వమేవాహ - యత్రేత్యాదిత్రిభిః - యత్రేతి. (9)

టీ :- అఖిలసమృద్ధియుక్తత్వమును ఇట్లు చెప్పెను. - "యత్ర" ఇత్యాది మూడు శ్లోకములతో. (9)

శ్లో ॥ యత్ర చిత్రవితానాని పత్మరాగాసనానిచ ।
పయః ఫేన నిభాః శయ్యా ముక్తాదామ పరిచ్ఛదాః ॥ 10

అచ్చట చిత్రమైన చాందినీలు ( వితానములు ) పద్మరాగమణులతో కూడిన ఆసనములు, పాలనురుగువంటి తెల్లనైన శయ్యలు, ముత్యాల హారాలు వ్రేలాడెడి ప్రచ్ఛద పటము (పరదా) లతో శోభిల్లు చుండెను. ( 10 )

టీ :- ముక్తాదామాని పరిచ్ఛదాః పరికరా యాసాం. (10)

టీ :- ముత్యాలహారములు. పరిచ్ఛదాః = చుట్టూ వ్రేలాడునట్టివి. (10)

శ్లో ॥ కూజద్భిర్నూపురైర్దేవ్యః శబ్ద యంత్య ఇతస్తతః ।
రత్న స్థలీషు పశ్యన్తి సుదతీః సుందరం ముఖమ్ ॥ 11

సవ్వడి చేయు నూపురములతో దేవకాంతలు శబ్దము గావించువారలై ఇచటచ్చట తిరుగాడుచు తమ అందమైన మోములను రత్నములు పొదిగిన స్థలములలో చూచుకొనుచున్నారు. ( 11 )

టీ :-కూజద్భిరితి. సుదతీః సుదత్యః. (11)

టీ :- సుదతీః = స్త్రీలు. ( దేవకాంతలు ) (11)

శ్లో ॥ తస్మిన్మహేంద్ర భవనే మహాబలో
మహామని నిర్జిత లోక ఏకరాట్ ।
రేమేభి వంద్యాఙ్ఘ్రి యుగః సురాదిభిః
ప్రతాపితై రూర్జిత చండశాసనః ॥ 12 ॥

మహాబలుడైన ఆ హిరణ్యకశిపుడు లోకములను జయించి ఏకచ్ఛత్రాధిపత్యమును వహించి మిగుల పీడించబడిన సురులచే, గంధర్వాదులచే నమస్కరించబడిన పాదయుగళము కలవాడై, మిక్కిలి చండశాసనుడై ఆ మహేంద్రభవనమున క్రీడించుచుండెను. ( 12 )

టీ :- తస్మిన్నితి. ఊర్జితమధికం చండం తీవ్రం శాసనం యస్య. (12)

టీ :- ఊర్జితం = అధికమైన, చణ్డం = తీవ్రమైన. శాసనముకలవాడు. (12)

శ్లో ॥ తమంగమత్తం మధునోరుగంధినా
వివృత్త తామ్రాక్ష మశేష ధిష్ణ్యపాః ।
ఉపాసతో పాయన పాణిభిర్వినా
త్రిభిస్తపోయోగ బలౌజసాం పదమ్ ॥ 13 ॥

ఓ రాజా ! బ్రహ్మ విష్ణు రుద్రులు వినా అశేష లోకపాలురు ఉగ్రమైన గంధముగల మధువుచే మత్తెక్కినవాడును, అందువలన విఘూర్ణితములైన ఎఱ్ఱని నేత్రములు గలవాడును, తపోయోగ బలముచే ప్రతాపము గలవాడు నగు వానిని కానుకలచేత వచ్చినవారై సేవించుచుండిరి. ( 13 )

టీ :- తమితి. అంగ హే రాజన్. ఉరుగంధినా ఉగ్రగంధినా. మధునా సురయా. మత్తం అతఏవ వివృతే విఘూర్ణితే తామ్రే అక్షిణీ యస్య తం. అశేషధిష్ణ్యపాః సర్వే లోకపాలాః. ఉపాయన యుక్తైః పాణిభిరూపాసత. త్రిభిర్బ్రవిష్ణురుద్రైః వినా. పదం ఆశ్రయభూతం. (13)

టీ :- అఙ్గ = ఓ రాజా ! ఉరుగంధినా = ఉగ్రమైన గంధముగల, మధునా = సురచే మధించినట్టి వాడును, కావుననే విఘూర్ణితములైన ఎఱ్ఱని కన్నులుగల వాడును అగు వానిని. అశేషధిష్ణ్యపాః = సకలలోకపాలురు కానుకలతో గూడిన కరములుకలవారై సేవించిరి. త్రిభిః = బ్రహ్మ విష్ణు రుద్రులు వినా. పదం = ఆశ్రయభూతుడగు ( ఆ హిరణ్యకశిపుని ) (13)

శ్లో ॥ గంధర్వ సిద్ధా ఋషయోస్తువన్ముహుః ।
విద్యా ధరోప్సరసశ్చ పాండవ ॥ 14 ॥

ప్రతాపముచే మహేంద్రాసనమధిరోహించి యున్న అతనిని విశ్వావసు, తుంబురుడు, నావంటి ( నారదుడు ) వారు గంధర్వులు, సిద్ధులు గానము చేసిరి. ఓ పాండవా ! ఋషులు, విద్యాధరులు, అప్సరసలును మాటిమాటికి స్తుతించిరి. (14)

శ్లో ॥ స ఏవ వర్ణాశ్రమభిః క్రతుభిః భూరిదక్షిణైః ।
ఇజ్యమానో హవిర్భాగా నగ్రహీత్స్వేన తేజసా ॥ 15 ॥

వర్ణాశ్రమ ధర్మములను పాటించువారు భూరి దక్షిణలతో యాగములు చేయుచుండగా స్వీయతేజముచే అతడే హవిర్భాగములను గ్రహించెను. (15)

శ్లో ॥ అకృష్ట పచ్యా తస్యాసీ త్సప్తద్వీపవతీ మహీ ।
తథా కామదుఘా ద్యౌస్తు నానాశ్చర్య పదంనభః ॥ 16 ॥

సప్త ద్వీపములతో గూడినభూమి అతనికి దున్నకయే పండుచుండెను. స్వర్గము కోరిన కోరికలనెల్ల ఇచ్చుచుండెను. ఆకాశము నానా ఆశ్చర్యములకు పదమై యుండెను. ( 16 )

టీ :- ఉపాసనాప్రకారమాహ - జగురితి. (14,15,16)

టీ :- ఉపాసన ప్రకారమును " జగుః " ఇత్యాది శ్లోకములచే చెప్పబడెను. (14,15,16)

శ్లో ॥ రత్నాకరాశ్చ రత్నౌఘాం స్తత్పత్న్యశ్చోహురూర్మిభిః ।
క్షారసీధుఘృతక్షాద్ర దధి క్షీరామృతోదకాః ॥ 17 ॥

శ్లో ॥ శైలాద్రోణీ భిరాక్రీడం సర్వర్తుషు గుణాంద్రుమాః ।
దధార లోకపాలానాం ఏక ఏవ పృథగ్గుణాన్ ॥ 18 ॥

శ్లో ॥ స ఇత్థం నిర్జిత కకు బేకరాడ్విషయాన్ ప్రియాన్ ।
యథోపజోషం భుంజానో నాతృప్య దజితేంద్రియః ॥ 19

సముద్రములు రత్నరాసులనిచ్చుచుండెను. సముద్రుని భార్యలు నదులు తమతరంగములచే వానిని వహించి వచ్చుచుండెను. ఆ సముద్రములేవియనిన ఉప్పు, మద్యము, నేయి, తేనె, పెఱుగు, పాలు, అమృతము, నీరు గల్గిన సముద్రములు. కొండ పల్లములతో గూడిన శైలములు క్రీడాస్థానములయ్యెను. వృక్షములు సకలతరువులందును పుష్ప ఫలముల నిచ్చుచుండెను. ఇట్లు ఆ హిరణ్యకశిపుడొక్కడే సమస్తలోకపాలకుల గుణములను (వర్షణ, దహన, శోషణాదులను) కల్గియుండెను. ఇట్లు దిక్కులన్నియు జయించి ఏకచ్ఛత్రాధిపతియై తనకు ప్రియమైన వాని నన్నింటిని యథాప్రీతి అనుభవించుచు అజితేంద్రియుడై తృప్తినందకుండెను. ( 17-19)

టీ :- రత్నేతి. తత్పత్న్యో నద్యః ఊహుః. వహంతి స్మ. రత్నాకరానేవాహ - క్షారేతి. (17)

టీ :- ఆ సముద్రముల భార్యలు అనగా నదులు ( సముద్రములొసగెడు రత్నములను తమ తరంగములచే వహించి వచ్చుచుండెను.) ఊహుః = వహించుచుండెను. రత్నాకరములేవనిన ఇట్లు చెప్పెను. - ' క్షార ' ఇత్యాది శ్లోకమున. (17)

టీ :- శైల ఇతి. ఆక్రీడం క్రీడాస్థానం. గుణాన్ పుష్పఫలాదీన్. స చ లోకపాలానాం. పృథగ్విధాన్ గుణాన్ వర్షదహన శోషణాదీనేక ఏవ దధార. (18)

టీ :- ( శైలములు ) ఆక్రీడం = క్రీడాస్థానమయ్యెను. వృక్షములు సర్వ ఋతువుల యందును, గుణాన్ = పుష్పఫలాది గుణములను కలిగియుండెను. ఆ హిరణ్యకశిపుడును లోకపాలురకు ఒక్కొక్కరికిగల భిన్నభిన్నమైన వర్షించుట, దహించుట, శోషించివేయుట (ఎండింపజేయుట) మొదలగు గుణము లన్నింటిని ఒక్కడే కలిగి యుండెను. (18)

టీ :- స ఇతి. నిర్జితాః కకుభో యేన. యథోపజోషం యథా ప్రీతి. (19)

టీ :- నిర్జింపబడిన దిక్కులుగలవాడై. యథోపజోషం = ప్రీతి కలుగునట్లుగ. (19)

శ్లో ॥ ఏవమైశ్వర్యమత్తస్య తృప్తస్యోచ్ఛాస్త్ర వర్తినః ।
కాలో మహాన్వ్యతీయాయ బ్రహ్మశాప ముపేయుషః ॥20॥

ఇట్లు శాస్త్రవిరుద్ధముగ ప్రవర్తించువాడై ఐశ్వర్యముచే మదించినట్టి, బ్రహ్మ శాపమును పొందబోయెడు ఆ హిరణ్యకశిపునకు చాలాకాలము అనగా డెబ్బది యొక్క యుగములకు కొంచెమధికముగా గడిచెను. ( 20 )

శ్లో ॥ తస్యోగ్రదండ సంధిగ్నాః సర్వేలోకాః సపాలకాః ।
అన్యత్రాలబ్ధ శరణాః శరణం యయురచ్యుతమ్ ॥ 21 ॥

ఆ హిరణ్యకశిపుని ఉగ్రమైన పాలనమునకు భయపడి పాలకులతోగూడా లోకములన్నియు వేరెవ్వరివలన రక్షణ లేనివై అచ్యుతుని శరణుపొందెను. ( 21 )

శ్లో ॥ తస్మై నమోఽస్తు కాష్ఠాయై యత్రాత్మా హరిరీశ్వరః ।
యద్గత్వా న నివర్తంతే శాన్తాః సన్యాసినోఽమలాః ॥ 22॥

శ్లో ॥ ఇతితే సంయతాత్మానః సమాహిత ధియోఽమలాః ।
ఉపతస్థుః హృషీకేశం వినిద్రా వాయుభోజనాః ॥ 23 ॥

శ్లో ॥ తేషామావిర భూద్వాణీ అరూపా మేఘనిః స్వనా ।
సంనాదయన్తీ కకుభః సాధూనామభయంకరీ ॥ 24 ॥

ఎచ్చటనైతే పరమాత్మయగు ఈశ్వరుడైన హరియున్నాడో అట్టి దిక్కునకు నమస్కారము. శాంతులైన సన్యాసులు నిష్పాపులు. ఏ దిక్కునకు చేరిన తిరిగి పునర్జన్మను పొందిరో ఆ దిక్కునకు నమస్కారము. అని ప్రార్థించుచు ఆ జనులు ఆత్మ నిగ్రహము గలవారై, సమాహిత చిత్తులై, నిష్కల్మషులై నిద్రాహారములు మాని కేవలము వాయుభక్షకులై హృషీకేశుని కొలిచిరి. అప్పుడు మేఘధ్వనివంటి రూపరహితమైన వాణి యొకటి దిక్కులను పిక్కటిల్ల జేయుచు సాధువులకు అభయమునొసగుచు వారికి వినిపించెను. ( 22-24)

టీ :- మహాన్ కాలః ఏక సప్తతి యుగాని కించిదధికాని. (20,21,22,23)

టీ :- తేషామితి. అరూపా వక్తృరహితా. (24)

టీ :- హిరణ్యకశిపుడ ఇట్టి దుష్టపాలనను డెబ్బదియొక్క యుగములకు పైగా కొనసాగించెనని చెప్పబడినది. (20,21,22,23)

టీ :- తనను ఆశ్రయించిన లోకములను గూర్చి శ్రీహరి అదృశ్యరూపముననే వారిని అభయము నొసగుచు ఇట్లు పలికెనని అర్థము. అరూపా = రూపము లేకుండగనే. వక్తృరహితా = వక్త లేకుండగనే. (24)

శ్లో ॥ మాభైష్ట విబుధ శ్రేష్ఠాః సర్వేషాం భద్రమస్తువః ।
మద్దర్శనం హి భూతానాం సర్వశ్రేయోప పత్తయే ॥ 25॥

ఓ విబుధ శ్రేష్ఠులారా ! భయపడకండి. మీకందరకు క్షేమము కలుగుగాక. ప్రాణలకు నా దర్శనము సకల శ్రేయస్సుల నొసగునుకదా!(25)

శ్లో ॥ జ్ఞాతమేతస్య దౌరాత్మ్యం దౌతేయా పసదస్యచ ।
తస్య శాంతిం కరిష్యామి కాలాంతావత్ ప్రతీక్షత ॥ 26 ॥

శ్లో ॥ యదా దేవేషు వేదేషు గోషు విప్రేషు సాధుషు ।
ధర్మే మయిచ విద్వేషః స వా ఆశువినశ్యతి ॥ 27 ॥

వీని దుర్మార్గము తెలిసినది. వీడు నీచదైత్యుడు. వీని దురాగతములను శాంతింపజేతును. కొంతకాలము ప్రతీక్షించండి. ఎప్పుడైతే దేవతలయందు, వేదములందు, గోవులయందు, విప్రులయందు, సాధువులందు, ధర్మములందు, నాయందును విద్వేషము కలుగునో అట్టివాడు శీఘ్రముగా నశించును. (26 -27 )

టీ :- మేతి. మమ దర్శనం శ్రవణం. సర్వేషాం శ్రేయసాం. ఉపపత్తయే భవతి. (25,26,27)

టీ :- నా దర్శనము ( అనగా ఇచట అరూపవాణి వినిపించుటయే దర్శన శబ్దమునకు వాక్య శ్రవణమని భావించుట యుక్తము ) శ్రవణము సకల శ్రేయస్సులను పొందుటకు కారణమగుచున్నది. అనగా నా వాక్య శ్రవణమే వలన మీకందరకును శ్రేయస్సులన్ని కలుగునని భావము. (25. 26. 27)

శ్లో ॥ నిర్వైరాయ ప్రశాంతాయ స్వసుతాయ మహాత్మనే ।
ప్రహ్లాదాయ యదా ద్రుహ్యేద్ధనిష్యేపి వరోర్జితమ్ ॥ 28 ॥

ఎవరియందును వైరము లేనివాడును, ప్రశాంతచిత్తుడును, మహాత్ముడును, వాని కుమారుడునగు ప్రహ్లాదునకు ఎప్పుడైతే వాడు ద్రోహము చేయునో అప్పుడు బ్రహ్మ వరముచే గొప్పబలము గలవాడైనను వానిని సంహరింతును. ( 28 )

టీ :- నను దేవాదివిద్వేషే ప్యస్య వినాశో నాస్తి. బ్రహ్మవరేణోరి తత్వా త్త్రాహ - నిర్వైరాయేతి. సర్వమహం సహే. న మద్భక్తద్రోహమితి భావః. (28)

టీ :- వీనికి దేవాదులందు విద్వేషమున్నను నాశములేదు. బ్రహ్మ వరముచే బలవంతుడగుట వలన వాని వినాశమెట్లో చెపుచున్నాడు - 'నిర్వైరాయ' ఇత్యాదిగా. నేనన్నినంటిని సహింతునుగాని నా భక్తులకు గావించు ద్రోహమును సహించను. అని భావము. (28)

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఇత్యుక్తా లోక గురుణా తం ప్రనమ్య దివౌకసః ।
వ్యవర్తంత గతోద్వేగా మేనిరేచాసురం హతమ్ ॥ 29 ॥

**నారదుడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

ధర్మరాజునకు హిరణ్యకశిపుని తెల్పుతూ- లోకగురువైన హరిచే ఇట్లు చెప్పబడినవారై దేవతలు ఉద్వేగము తీరినవారై అతనికి నమస్కరించి వెనుదిరిగిరి. ఆ అసురుని సంహరించబడిన వానిగనే తలచిరి. ( 29 )

టీ :- ఇతీతి. ఆసురం చ హతం మేనిరే. తదానీం తద్ద్వేషస్య ప్రవృత్తత్వాదితి భావః. (29)

టీ :- ( పరమాత్మ మాటలు విన దేవతలు ) అసురుని హతుడైనట్లుగనే తలచిరి. ఆ సమయమున అతని ద్వేషము ప్రవృత్తమైనందున యని భావము. (29)

శ్లో ॥ తస్యదైత్య సతేః పుత్రాశ్చత్వారః పరమాద్భుతాః ।
ప్రహ్లాదోఽభూన్మహాన్తేషాం గుణైర్మహదుపాసకః ॥ 30 ॥

శ్లో ॥ బ్రహ్మణ్యః శీలసంపన్నః సత్యసంధో జితేంద్రియః ।
ఆత్మవత్సర్వభూతానాం ఏకః ప్రియ సుహృత్తమః ॥ 31 ।

దైత్యపతియైన ఆ హిరణ్యకశిపునకు మిక్కిలి అద్భుతమైన నల్గురు పుత్రులుండిరి. వారిలో మహద్రూపమైన పరమాత్మను ఉపాసించెడు ప్రహ్లాదుడు గుణములచే గొప్పవాడుగా నుండెను. అతడు వైదికాచారపరుడు, శీల సంపన్నుడు, సత్యసంధుడు, ఇంద్రియములను జయించినవాడు, సమస్త ప్రాణులను తనవలె భావించువాడు, ప్రియమైనవాడు, మంచిమిత్రుడు. (30,31)

టీ :- తమేవ ద్వేషం వక్తుం ఆదౌ సుతస్య మహత్త్వం వక్తుమాహ – తస్యేతి. గుణైః మహానభూత్. గుణానేవాహ – మహదుపాసక ఇత్యాదినా. (30)

టీ :- ఆ ద్వేషమును గూర్చి చెప్పుటకుముందు అతని సుతుని మహత్త్వమును "తస్య" ఇత్యాది శ్లోకములలో నిట్లు చెప్పెను. (ఆ ప్రహ్లాదుడు) గుణములచే గొప్పవాడైయుండెను. ఆ గుణములను "మహదుపాసక" ఇత్యాదిగా చెప్పెను. (30)

టీ :- బ్రహ్మణ్య ఇతి. సత్యా సంధా ప్రతిజ్ఞా యస్య. ఏవఏవ ప్రియశ్చ సుహృత్తమశ్చ. (31)

టీ :- సత్యమైన సంధా = ప్రతిజ్ఞకలవాడు. అతనొక్కడే ప్రియమైనవాడు, మంచి మిత్రుడును. (31)

శ్లో ॥ దానవత్సన్నతార్యాంఘ్రిః పితృవద్దీనవత్సలః ।
భ్రాతృవత్సదృశే స్నిగ్ధో గురుశ్వీశ్వర భావనః
విద్యార్థ రూప జన్మాఢ్యో మానస్తంభ వివర్జితః ॥ 32 ॥

పూజ్యులకు దాసునివలె మెలగుచు పాదములకు నమస్కరించువాడు, దీనులయెడ తండ్రివలె ప్రేమగలవాడు, గురువులందు ఈశ్వరభావన కలవాడు, చతుర్దశ విద్యలు, ధనము, రూపము గలిగిన జన్మముచే ప్రశస్తమైనవాడు, అహంకారము గర్వము లేనివాడు. ( 32 )

టీ :- దాసవదితి. సమ్యక్ నతాః ఆర్యాణామంఘ్రయో యేన. ఈశ్వర ఇతి భావనా యస్య. (32)

టీ :- పూజ్యుల పాదములకు దాసునివలె బాగుగా నమస్కరించువాడు. గురువులయందు ఈశ్వరుడను భావముగలవాడు. (32)

శ్లో ॥ నోద్విగ్నచిత్తో వ్యసనేషు నిస్పృహః
శ్రుతేషు దృష్టేషు గుణేష్వ వస్తుదృక్ ।
దాన్తేంద్రియ ప్రాణ శరీర ధీః సదా
ప్రాశాంత కామో రహితా సురోఽసురః ॥ 33 ॥

వ్యసనములు ( దుఃఖములు, బాధలు ) కలుగక చలించని చిత్తము గలవాడు, వినవచ్చెడు, కనవచ్చెడు విషయములందు స్పృహలేనివాడు (ఆసక్తి లేనివాడు) ఎందులకనగా ఐహికాముష్మిక విషయములందు అవస్తుదృష్టి కలవాడు, ఇంద్రియ, ప్రాణ, శరీర బుద్ధులను అణచగలవాడు, ఎల్లప్పుడును

ప్రశాంతమును కోరువాడు అసురజన్మ కలవాడైకూడా ఆసురములైన మత్సరాది గుణములు లేనివాడు. ( 33)

టీ :- నేతి. వ్యసనేషు నోద్విగ్న చిత్తః. గుణేషు విషయేషు నిస్పృహః యతః. తేషు అవస్తుదృక్. దాంతా ఇంద్రియాదయో యస్య. రహిత ఆసురో భావో మత్సరాదిర్యస్య సః. అసురోపి సన్ ప్రశాన్తకామః. (33)

టీ :- వ్యసనములు (దుఃఖములు) ప్రాప్తించిన కలతచెందని చిత్తముగలవాడు, విషయములు అగుపడినను, వినపడినను వానియందు స్పృహ (కాంక్ష) లేనివాడు. ఎందువలననగా వానియందు అతడు అవస్తుదృష్టి గలవాడు. ఇంద్రియములను నిగ్రహించు శక్తిగలవాడు, మత్సరాది ఆసుర భావములేనివాడు. అసురుడైయుండియు కోరికలు ఉపశమించినవాడు. (ఇట్టి మహత్త్వ లక్షణములు గలవాడు ప్రహ్లాదుడు) (33)

శ్లో ॥ యస్మిన్ మహద్గుణా రాజన్ గృహ్యన్తే కవిభిర్ముహుః ।
నతే ధునాపి ధీయన్తే యథా భగవతీశ్వరే ॥ 34 ॥

ఓ రాజా ! ఏ ప్రహ్లాదుని యందుండెడు మహాత్ములయొక్క గుణములు కలవో అవి కవులచే అనేకత్ర మాటిమాటికి వర్ణించబడుచున్నవి. భగవంతుడైన ఈశ్వరుని యందలి గుణములవలె ఆ ప్రహ్లాదుని గుణములు నేటికిని మఱుగున పడుటలేదు. (34)

టీ :- యస్మిన్నితి. అధునాపి తే గుణాః. న పిధీయంతే. తిరోహితా న భవంతి. (34)

టీ :- ఆ ప్రహ్లాదుని గుణములు నేటికిని నాపిధీయంతే = మరుగుపడటము లేదు. దేశమున వ్యాపించుచునే యున్నవి. (34)

శ్లో ॥ యం సాధు గాథా సదసి రిపవోపి సురానృప ! ।
ప్రతిమానం ప్రకుర్వన్తి కిముతాన్యే భవాదృశాః ॥ 35 ॥

ఓ రాజా ! శత్రువులైన సురులు గూడా సాధుకథా ప్రసంగముగల సభలో ఏ ప్రహ్లాదుని దృష్టాంతముగ గ్రహింతురో, ఇక ఇతరులైన నీవంటివారు ఏమని చెప్పవలెను?.(35)

టీ :- యమితి. సాధుగాథా సదసి సాధుకథా ప్రసంగవత్యాం సభాయాం. ప్రతిమానం దృష్టాంతం.రిపవోపి సురాః కుర్వన్తి, కిం వక్తవ్యం భవాదృశా విష్ణుభక్తా. (35)

టీ :- సాధుగాథాసదసి = సజ్జన కథా ప్రసంగముగల సభలందు. ఏ ప్రహ్లాదుని ప్రతిమానం = దృష్టాంతముగా గైకొనుచున్నారు, రిపవో పి = శత్రువులైనను దేవతలు (దృష్టాంతముగా) చేయుచున్నారు. కాగా నీవంటి విష్ణుభక్తులు అతని దృష్టాంతముగా చెప్పువిషయమున ఏమని చెప్పవలెను? అది సాధారణమే కదా ! (35)

శ్లో ॥ గుణైరల మసంఖ్యేయై మాహాత్మ్యం తస్యసూచ్యతే ।
వాసుదేవే భగవతి యస్యనైసర్గికీ రతిః ॥ 36 ॥

అట్టి ప్రహ్లాదుని అసంఖ్యాకములైన గుణములచే అతని గొప్పతనమధికముగ సూచించబడుచున్నది. అతనికి పూజ్యుడైన వాసుదేవుని యందు నైసర్గికమైన రతి (ప్రేమ) యున్నది. ( 36 )

టీ :- గుణైరితి. సూచ్యతే మయా కేవలం ద్యోత్యతే. సుష్ఠు కథ్యత ఇతి వా. (36)

టీ :- సూచ్యతు = నాచే కేవలము వ్యక్తపరచబడుచున్నది. లేదా బాగుగా చెప్పబడుచున్నది. (36)

శ్లో ॥ న్యస్త క్రీడా నకోబాలః జడవత్తన్మనస్తయా ।
కృష్ణ గృహ గృహీతాత్మా న వేద జగదీదృశమ్ ॥ 37 ॥

బాలుడై యుండియు క్రీడా సాధనములను వదిలి ఆ భగవంతునియందే మనసుగల కారణమున జడునివలె నుండెను. కృష్ణ గ్రహముచే గ్రహించబడిన

శ్లో ॥ ఆసీనః పర్యటన్నశ్నన్ శయానః ప్రపిబన్ బ్రువన్ ।
నాను సంధత్త ఏతాని గోవింద పరి రంభితః ॥ 38 ॥

శ్లో ॥ క్వచిద్రుదతి వైకుంఠ చింతా శబలలోచనః ।
క్వచిద్ధపతి తచ్చిన్తాహ్లాద ఉద్గాయగి క్వచిత్ ॥ 39 ॥

శ్లో ॥ నదతి క్వచిదుత్కంఠో విలజ్జో నృత్యతి క్వచిత్ ।
క్వచిత్తద్భావనాయుక్త స్తన్మయోను చకారహ ॥ 40 ॥

శ్లో ॥ క్వచిదుత్పులకస్తూష్ణీ మాస్తే సంస్పర్శ నిర్వృతః ।
అస్పంద ప్రణయానంద సలిలామీలితే క్షణః ॥ 41 ॥

టీ :- నైసర్గికరతేః లింగాన్యాహ - షడ్భిః. న్యస్తేతి. తన్మస్తయా తదేకచిత్తత్వేన. (37)

టీ :- ఆసీన ఇతి. ఏతాని ఆసనాదీని. గోవిందేన సరిరంభితః ఆత్మనా ఏకీకృతః. (38)

టీ :- రుదతి రోదతి రౌతి. వైకుంఠస్య చింతయా శబలా వ్యామిశ్రా క్షుభితా చేతనా యస్య. తస్య చింతయా హ్లాదో యస్య. (39)

మనస్సుకలవాడై ఇట్టి జగమును ఎరుంగడు. అతడు గోవిందునితో ఏకీకృత మనస్కుడై కూర్చున్నను తిరుగుచున్నవాడై, పడుకొన్నవాడై, పానముచేయువాడై, మాటలాడువాడై యుండియుగూడా వానితో అనుసంధానము నొందడు. శ్రీహరి చింతచే చంచల లోచనములు గలవాడై ఒకప్పుడు రోదించును. అతని చింతన వలన కలిగిన ఆనందము కలవాడై ఒకప్పుడు నవ్వును. ఒకప్పుడు గొంతెత్తి పాడును. ఒకప్పుడు అరచును. ఒకప్పుడు ఉద్గతమైన విరహము కలవాడై సిగ్గువీడి నృత్యము చేయును. ఒకప్పుడు ఆగ్రహ భావనతో కూడినవాడై తన్మయుడై అతనిని అనుకరించును. ఒకప్పుడతని సంస్పర్శను భావించుకొని ఆనందించువాడై పులకాంకితుడై మౌనముగా నుండును. నిశ్చలమైన ప్రణయముచే ఒక్కొక్కప్పుడు ఆనంద బాష్పములతో కన్నులు మూసుకొని యుండును. ( 37-41 )

టీ :- నైసర్గిక రతికి చిహ్నములను చెప్పుచున్నాడు. “న్యస్త క్రీడనక” మొదలుగాగల ఆరు శ్లోకములతో. తన్మనస్తయా = తదేక చిత్తత్వముగా.(37)

టీ :- ఈ ఆసనాదులు గోవిందునితో పరిరంభితః = తనకు ఏకముగా గావించబడినది. (38)

టీ :- రుదతి = రోదతి = రౌతి = ఏడ్చుచున్నాడు. వైకుంఠవాసియైన విష్ణువుయొక్క చింతనచే శబలాః = వ్యామిశ్రమైన. క్షుభితమైన

చేతనముగలవాడు. అతని చింతచే ఆహ్లాదముగలవాడు. (39)

టీ :- క్వచిదితి. ఉత్కంఠః ముక్తకంఠస్సన్. అనుచకార తచ్చేష్టాదికం స్వయం కృతవాన్. (40)

టీ :- క్వచిదుత్కణ్ఠ = ఒకానొకప్పుడు ముక్తకంఠముగలవాడై, అనుచకార = ఆ విష్ణుచేష్టలను స్వయముగా ఆచరించుచుండెను (40)

టీ :- క్వచిదితి. సంస్పర్శస్తద్భావాపత్తిః తేన నిర్వృతః. అస్పందః స్థిరో యః ప్రణయః. తేన యః. ఆనందః. తేన యత్సలిలం. తేన యుక్తే ఆమీలితే ఈషన్నిమీలితే ఈక్షణే యస్య. (41)

టీ :- సంస్పర్శః = అతని భావమును పొందుట. దానిచేత తృప్తిని పొందును. అస్పందః = స్థిరమైన ప్రణయముచే ఆనందమునొంది, ఆ ఆనందబాష్పములచే కూడుకొనిన నేత్రములను కొంచెము మూసియుంచిన వాడయ్యెను. (41)

శ్లో ॥ స ఉత్తమ శ్లోక పదారవిందయో
ర్నిషేవయాఽకించన సంగ లబ్ధయా ।
తన్వన్పరాం నిర్వృతిమాత్మనో ముహుః
దుస్సంగ దీనాన్య మనః శమం వ్యధాత్ ॥ 42 ॥

మహాత్ముల సంగమువలన పొందబడిన పుణ్యచరిత్రుల పదారవిందముల సేవచే ఆ ప్రహ్లాదుడు తాను స్వయముగా పరమానందమును, సంతృప్తిని పొందుచు దుస్సంగముచే దీనులైన ఇతరుల మనస్సులకును శాంతమును కలుగజేయుచుండెను.(42)

టీ :- స ఇతి. ఆత్మనః పరాం నిర్వృతిం తన్వన్. దుస్సంగేన దీనస్యాన్యస్యాపి మనః. శమం శాంతం వ్యధాత్. (42)

టీ :- తనకు మిక్కిలి ఊరటను (సుఖమును) కలిగింపచేసికొనుచు దుష్టసహవాసముచే దీనుడైన ఇతరునకు మనః శాంతిని కలిగింపచేసెను.(42)

శ్లో ॥ తస్మిన్మహాభాగవతే మహాభాగే మహాత్మని ।
హిరణ్యకశిపూ రాజన్ అకరోదఘమాత్మజే ॥ 43 ॥

ఓ రాజా ! అట్టి మహాత్ముడు, మహాభాగవతుడు, మహానుభావుడైన ఆత్మజునియందు హిరణ్యకశిపుడు ద్రోహమును గావించెను. ( 43 )

టీ :- తస్మిన్నితి. అఘం ద్రోహమకరోత్. (43)

టీ :- హిరణ్యకశిపుడు తన పుత్రునకు అఘం = ద్రోహము చేసెను. (43)

**యుధిష్ఠర ఉవాచ :-**

శ్లో ॥ దేవర్శ ఏతదిచ్ఛామో వేదితుం తవ సువ్రత ।
యదాత్మజాయ శుద్ధాయ సితాదాత్సాధ వేహ్యఘమ్ ॥44॥

**యుధిష్ఠిరుడు ఇట్లు ప్రశ్నించెను :-**

ఓ సువ్రతా ! దేవర్షీ ! శుద్ధచరితుడు, సజ్జనుడైనట్టి పుత్రునకు ఏదైతే ద్రోహము గావించెనో అట్టి దీనిని నీనుండి తెలిసిగొనగోరుచున్నాము. (44)

టీ :- ప్రథమాధ్యాయాంతే పృష్టమేవార్థమతి విస్మయేన పునః పృచ్ఛతి – దేవర్ష ఇతి. తవ త్వత్త. తవ వాక్యమితి వా. సాధవే అఘదాత్. సాధోర్ద్రోహం కృతవానితి యత్. ఏతద్వేదితుం జ్ఞాతు మిచ్ఛామః (44)

టీ :- మొదటి అధ్యాయపు చివర ప్రశ్నించిన విషయమునే ధర్మజుడు మిక్కిలి విస్మయముచే మరల అడుగుయున్నాడు. "దేవర్ష" ఇత్యాది శ్లోకములతో. తవ = నీ వలన లేదా నీ వాక్యమును సాధవే ఘమదాత్ = సాధువునకు (సజ్జనునకు) ద్రోహము గావించెను అని. అను ఏ విషయముగలదో దానిని ఎరుంగ కోరుచున్నాము. (44)

శ్లో ॥ పుత్రాన్విప్రతికూలాన్ స్వాన్ పితరః పుత్రవత్సలాః ।
ఉపాలభంతే శిక్షార్థం నైవాఘమపరో యథా ॥ 45 ॥

శ్లో ॥ కిముతాను వశాన్సాదూంస్తాదృశాన్ గురుదేవతాన్ ।
ఏతత్కౌతూహల బ్రహ్మన్నస్మాకం విధమ ప్రభో ! ।
పితుః పుత్రాయ యద్వేషో మారణాయ ప్రయోజితః ॥46॥

పుత్రవత్సలురైన తండ్రులు తమకు వ్యతిరేకులైన పుత్రులను మందలింతురు (నిందింతురు). వారిని మంచిదారిన పెట్టుటకు కోపగింతురు కానీ శత్రువులవలె వారికి ద్రోహములు తలపెట్టరుకదా ! ఒక అనుకూలురు, సాధువులు, తండ్రియే దైవముగా భావించువారైన ప్రహ్లాదుని వంటి వారిని గూర్చి ఏమని చెప్పవలెను. ఓ బ్రహ్మ ! ఇది వినుటకు మాకు కుతూహలముగా నున్నది. తండ్రికి పుత్రునిపైగల ద్వేషము సంహారమునకు కారణమైనదను విషయము ఏదికలదో అది మేము తెలిసికొనగోరుచున్నాము. ( 45, 46 )

టీ :- పుత్రానితి. ఉపాలభంతే ఆక్షిపంతి. అఘం తు నైవ కుర్వంతి. అపరే శత్రవ ఇవ. (45)

టీ :- ఉపాలభన్తే = ఆక్షేపింతురు, నిందింతురు. ద్రోహమును మాత్రము చేయనేచేయరు. అపరః = శత్రువువలె. (45)

టీ :- కిముతేతి. అనువశాన్ అనుకూలాన్ సాధూన్ అరాగ రోషాన్. గురుః పితైవ దేవతా యేషాం తానుద్దిశ్యాఘం న కుర్వంతీతి కిము వక్తవ్యమిత్యర్థః. పుత్రముద్దిశ్య పితుర్ద్వేషః పిత్రా కృతో ద్వేషః పుత్రస్య మరణార్థం ప్రయోజితః ప్రవర్తిత ఇతి యత్. ఏతత్ కౌతూహలం విధమ అపాకురు. యత్ యస్మాత్ పుత్రాయ యో ద్వేషః. సః పితృమరణార్థం ప్రయోజితః. అతఏవ ఏతత్కౌతూహలం విధమేత్యర్థః. (46)

టీ :- అనువశాన్ = అనుకూలముగానున్నట్టి. సాధూన్ = రాగ రోషములు లేనట్టి. గురుః = తండ్రియే దైవముగా తలచువారినుద్దేశించి ద్రోహము చేయరని ఏమి చెప్పవలెనని అర్థము. పుత్రాయ = పుత్రుని ఉద్దేశించి తండ్రి యొక్క ద్వేషము అనగా తండ్రిచే గావించబడిన ద్వేషము పుత్రుని మరణమును గూర్చి. ప్రాయోజితః = ప్రవర్తింపబడినది. అనునదేదో అది కౌతూహలమును కూర్చుచున్నది. దానిని విధమ = తొలగించుము - లేదా ఏ కారణము వలననైతే పుత్రుని విషయమున కలిగిన ఏ ద్వేషము కలదో అది తండ్రి మరణమునకై ప్రవర్తింపబడినది. కాన ఈ కౌతూహలమును తొలగించుము అని అర్థము. (46)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే చతురోఽధ్యాయః ॥**

**ఇది శ్రీమద్భాగవతమను మహాపురాణమందలి సప్తమస్కంధములోని ప్రహ్లాదచరిత్రమున నాల్గవ అధ్యాయము.**





శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ పౌరోహిత్యాయ భగవాన్ వృతః కావ్యః కిలాసురైః ।
శండామర్కౌ సుతౌ తస్య దైత్య రాజ గృహాంతికే ॥ 1 ॥

టీ :- పంచమే గురుతో ధీతం త్యక్త్వా విష్ణుస్తుతౌ రతం, ఘాతయన్ విషసర్పాద్యైస్సుతం దైత్యో న చాశకత్. భగవద్భక్తిరేవ విద్వేషకారణమితి వక్తుమాహ - పౌరోహిత్యాయేతి. కావ్యః శుక్రః. అతస్తస్య సుతౌ. తత్ర న్యవసతామితి. శేషః. (1)

శ్లో ॥ తారాజ్ఞా ప్రాపితం బాలం ప్రహ్లాదం నయకోవిదం ।
పాఠయామాసతుః పాఠ్యా నవ్యాంశ్చాసుర బాలకాన్ ॥2॥

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారదుడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

అసురులచే పూజ్యుడైన శుక్రాచార్యులు పౌరోహిత్యమునకై ఎన్నుకొనబడెను. అందువలన అతని కుమారులు చండామర్కులనువారు దైత్యరాజగు హిరణ్యకశిపుని ఇంటి సమీపమున నివసించుచుండిరి. (1)

టీ :- ఐదవ అధ్యాయమున 'గురువునుండి చదివిన విషయమును వదిలిపెట్టి విష్ణుస్తుతియందాసక్తుడైన కుమారుని (ప్రహ్లాదుని) గజ, సర్పాదులచే హింసించుచు దైత్యుడు ( హిరణ్యకశిపుడు ) వానిని సంహరించజాలకుండెను. (1)

భగవద్భక్తియే పుత్రుని యందలి విద్వేమునకు కారణమని చెప్పుటకు 'పౌరోహిత్యే' ఇత్యాది శ్లోకములను చెప్పెను. కావ్యః = శుక్రుడు. అట్లు అసురులచే శుక్రాచార్యులు అసురుల పౌరోహిత్యమునకు ఎన్నుకొనబడుటచే అతని సుతులు చండామర్కులు దైత్యరాజుయొక్క గృహసమీపమున నివసించుచుండిరి. అని శేషము. 'నివసించుచుండిరి' అని మూలమున చెప్పబడనందున ఊహించదగుని యర్థము. రాజుచే చేర్చబడిన బాలుడగు ప్రహ్లాదునకు మరియు ఇతర అసుర బాలకులకు ఆ చండామర్కులు నయకోవిదులగునట్లు పాఠ్యాంశములను బోధించుచుండిరి. ( 2 )







టీ :- తావితి. పాఠ్యాన్ దండనీత్యాదీన్ సురబాలకానితి వాన్వయః. (2)

టీ :- పాఠ్యాన్ = దండనీత్యాదులను, లేదా పాఠ్యులైన ( బోధించదగిన అసురబాలకులనని అన్వయించదగును ) ( 2 )

శ్లో ॥ యత్తత్ర గురుణా ప్రోక్తం శుశ్రువేనుపపాఠచ ।
న సాధు మనసా మేనే స్వపరా సద్గ్రహాశ్రయమ్ ॥ 3 ॥

శ్లో ॥ ఏకదా సురరాట్పుత్ర మంకమారోప్య పాండవ ! ।
పప్రచ్ఛ కథ్యతాం వత్స ! మన్యతే సాధు యద్భవాన్ ॥4॥

ప్రహ్లాదుడు అచ్చట గురువుచే చెప్పబడు విషయమును వినుచు దానిని అచ్చటనే అప్పగించుచుండెను. కాని వారు చెప్పెడు పాఠమును స్వః పర అను ద్వైత శాస్త్రమును మంచిది కాదని తలచెను. ఎందువలన ననగా అది మిథ్యాభినివేశాశ్రయమైనది. ఓ పాండుపుత్రా ! ఆ అసురరాజు ఒకరోజున తన ఒడిలోనికి తీసుకొని “ నాయనా ! నీవు దేనిని మంచిదని తలంచుచున్నావో చెప్పుము ” అని ప్రశ్నించెను. ( 3, 4 )

టీ :- యదితి. అనుశ్రవణానంతరం. తథైవ. పపాఠ చ. కింతు తత్సాధు. న మేనే. తత్ర హేతుః. స్వః పర ఇత్యసద్గ్రహః మిథ్యాభినవేశ ఏవాశ్రయో యస్య తత్. (3,4)

టీ :- ప్రహ్లాదుడు పాఠములను గురువులనుండి వినినంతనే అట్లే అప్పగించుచుండును. కాని ఆ పాఠమలను మంచివని తలంచకుండెను. అందుకు కారణమేమన తన పర అను, మిథ్యాభినివేశః = అసద్గ్రహః అసత్య జ్ఞానమునకు ఆశ్రయమ్మైనది ఆ గురూపదేశము. ద్వైత బోధకమ్మైన ఆ శాస్త్రము మిథ్యాభినివేశమని తలచి దానిని మంచిది గాదని ప్రహ్లాదుడు తలంచెనని భావము. (3,4).



**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ తత్సాధు మన్యేసురవర్య దేహినామ్
సదా సముద్విగ్నధియా మసద్గ్రహాత్ ।
హిత్వాత్మ పాతం గృమమంధ కూపం
వనంగతో యద్ధరి మాశ్రయేత ॥ 5 ॥

**ప్రహ్లాదుడు ఇట్లు చెప్పెను :-**

ఓ అసురశ్రేష్ఠా ! ఉద్విగ్నమైన , చంచలమైన లేదా భయముగల, చిత్తముగల ప్రాణులకు నేను నాదియను సదా అసత్యమైన అభినివేశము కలిగించు ఆ గురువుల బోధకంటే తన అధఃపతనమునకు కారణమైన చీకటి కూపమువలెనుండు గృహమును వీడి వనమును ( ఏకాన్త ప్రదేశమును ) చేరుకొని హరిని ఆశ్రయించవలెననునది ఏది కలదో దానిని నేను మంచిదని భావించుచున్నాను.(5)

టీ :- తదితి. హే అసురవర్య. అసద్గ్రహాత్ అహం మమేతి మిథ్యాభినివేశనాద్ధేతోః - సమ్యగుద్విగ్నాధీర్యేషాం - వనం గతస్సన్ హరిమాశ్రయేతేతి యత్ తదేవాహం. సాధు మన్యే. కథంభూతం గృహం హిత్వా. ఆత్మనః పాతం అధః పాతనిమిత్తం. కుతః. అంధకూపవన్మోహావహం. (5)

టీ :- ఓ అసుర శ్రేష్ఠా ! అసద్గ్రహాత్ = నేను, నాది యను అసత్యపు అభినివేశము (కల్గించు కారణమున ) వలన, ఉద్విగ్నాః = విషణ్ణమైన బుద్ధిగలిగినట్టి ( మానవులకు) వనమునకు లేదా ఏకాన్త ప్రదేశమునకు వెళ్ళి హరిని ఆశ్రయించుట అనునదేది కలదో అదియే మంచిదని నేను తలచుచున్నాను. గృహమెట్టి దనగా తనయొక్క అధఃపాత నిమిత్తము ఎందులకన చీకటి కూపము (నుయ్యి ) వలె మహావహము అజ్ఞానహేతువు.(5)

**నారదువాచ :-**

శ్లో ॥ శ్రుత్వా పుత్ర గిరో దైత్యః పరపక్ష సమాహితాః ।
జహాస బుద్ధిర్బాలానాం భిద్యతే పర బుద్ధిభిః ॥ 6 ॥

**నారదుడు ఇట్లు చెప్పెను :-**

దైత్యుడగు హిరణ్యకశిపుడు శత్రువైన విష్ణుమూర్తి యొక్క పక్షమున పరినిష్ఠితములైన పుత్రుని వాక్కులను విని పరబుద్ధులచే బాలుర బుద్ధి మార్చబడుచున్నదని తలచి నవ్వుకొనెను. ( 6 )

టీ :- శ్రుత్వేతి. పరపక్షే విష్ణౌ. సమాహితాః. పరినిష్ఠితాః హాసమేవాహ - బుద్ధిరితి. (6)

టీ :- శత్రుపక్షదమైన విష్ణువునందు స్థిరభక్తి గలవై యున్నవి. హాసమందలి కారణము- ' బుద్ధి ' ఇత్యాదిగా చెప్పబడినది. ( 6 )

శ్లో ॥ సమ్యగ్విధార్యతాం బాలో గురుగేహే ద్విజాతిభిః ।
విష్ణు పక్షైః ప్రతి చ్ఛిన్నై నభిద్యేతాస్య ధీర్యథా ॥ 7 ॥

మరియు గురువులతో ఇట్లు చెప్పెను. బాలుడు గురుగ్రహమున ద్విజాతులచే రక్షించబడుగాక. విష్ణు పక్షీయులు మీ ఇంటనుండుటకు ఆవకాశములేదు. ఐనను మారు వేషములలో నుండవచ్చును. అట్టి విష్ణుపక్షీయులే బాలుని బుద్ధిమార్చ కుందునట్లు జాగరూకులై ఉండండి.(7)

టీ :- సమ్యగితి. విష్ణుపక్షైర్భాగవతైర్హేతుభూతైః. నను. తద్గృహే కుతస్తేషాం ప్రవేశః సత్యం. తథాపి ప్రతిచ్ఛన్నైః వేషాంతరేణా చ్ఛన్నైః. (7)

టీ :- దీనికి కారణభూతులైన విష్ణుభక్తులైన భాగవతులచే ఓయీ మీ గృహమున వారికి ప్రవేశమెక్కడిది? నిజమే. ఐనను ప్రతిచ్ఛన్నైః = వేషాన్తరములచే దాగియున్నట్టి వారిచే (7)

శ్లో ॥ గృహమానీత మాహూయ ప్రహ్లాదం దైత్య యాజకాః ।
ప్రశస్య లక్ష్ణయా వాచా సమ పృచ్ఛంత సానుభిః ॥ 8॥

దైత్యపతి మాటలాలకించి ఆ దైత్యపురోహితులు బాలుని గృహమునకు తీసుకొని వచ్చి మృదువాక్కులచే కొనియాడి బుజ్జగింపుగా ఇట్లు ప్రశ్నించిరి.(8)

టీ :- గృహమితి. దైత్యః గృహమానీతం. (8)

టీ :- దైత్యులచే గృహమునకు తేబడిన ( 8 )

శ్లో ॥ వత్స ప్రహ్లాద భద్రంతే సత్యం కథయ మా మృషా ।
బాలానతి కుతస్తుభ్య మేష బుద్ధి విపర్యయః ॥ 9 ॥

నాయనా ప్రహ్లాదా ! నీకు భయము లేదు. శుభమగుగాక. సత్యము చెప్పుము. అసత్యము వలదు. బాలుర కతీతమైన ఈ బుద్ధి విపర్యయము

శ్లో ॥ బుద్ధి భేదః పరకృత ఉతాహోతే స్వతో భవత్ ।
భణ్యతాం శ్రోతు కామానాం గురూణాం కులనందన॥10॥

నీకెక్కడిది? ఈ బుద్ధియొక్క భేదము ( మార్పు ) ఇతరులచే గావించబడినదా? లేక నీకు స్వతఃసిద్ధమా? ఓ కులనందనా! వినగోరెడు నీ గురువులకు చెప్పుము. ( 9, 10 )

టీ :- వత్సేతి. బాలాన్ సర్వాన్. అతి అతిక్రమ్య. తుభ్యం తవ. (9,10)

టీ :- బాలుర నందరను మించి తుభ్యం = నీకు ఇంతటి బుద్ధి వికాసము ఎక్కడిది? ఎందువలన నీకిది ఇష్టమగుచున్నది? ( 9,10 )

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ స్వః పరశ్చేత్య సద్గ్రాహః పుంసాం యన్మాయ మాకృతః ।
విమోహిత ధియాం దృష్టస్తస్మై బగవతే నమః ॥ 11 ॥

**ప్రహ్లాదుడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

తన పర యను మిథ్యాభినివేశము ( అసత్యపు అహంకారబుద్ధి ) పురుషులకు ఎవని మాయచే కలిగింపజేయబడుచున్నదో అట్టి వాని మాయచే విమోహితులైన మీకే దృష్టము.నాకు కాదు. అట్టి అచింత్య మాయేశ్వరుడగు భగవంతునకు నమస్కారము.(11)

టీ :- అహో మాయామోహితా భవంతో మామాక్షిపంతీత్యాశయేన తావదాహ - పరఇతి. పరః స్వీయశ్చేతి మిథ్యాభినివేశః. యదీయమాయయైవ కృతః. న తు వాస్తవః. అతఏవ. తయా విమోహితబుద్ధీనాం భవతామేవ దృష్టః. న తు మమ. తస్మై అచింత్యమాయేశ్వరాయ నమః. (11)

టీ :- ఆహా ! మాయా మోహితులైన మీరు నన్నాక్షేపించుచున్నారు. అను ఆశయముచే ఇట్లనెను. తన పర యను మిథ్యార్థ జ్ఞానము ఎవని మాయచేత కల్పించబడినదో, వాస్తవమైనదికాదో, కావుననే అతని మాయచే మోహింపజేయబడిన బుద్ధిగలమీకే తెలుసు. నాకు తెలియదు. అట్టి ఊహించ శక్యముగాని మాయకు ఈశ్వరుడైన అతనికి నమస్కారము. ( 11 )

శ్లో ॥ సయదానువ్రతః పుంసాం పశుబుద్ధి ర్విభిద్యతే ।
అన్య ఏష తథాన్యోహమితి భేదగతాసతీ ॥ 12 ॥

ఆ భగవంతుడు పురుషులకు ఎప్పుడు అనుకూలుడగునో అప్పుడు ఇతడు వేరు, నేను వేరు అను భేదమును కలిగిన పశుతుల్యుని బుద్ధి మిథ్యా సంసార విషయమై భేదించి అభిన్నాత్మ నిష్ఠమగుచున్నది. ( 12 )

టీ :- అహెూ కిమేతత్ప్రలపసి. తవ బుద్ధిభేదో యతో జాతస్తత్కథయే త్యాక్షిప్తస్సన్. తత్ప్రసాదాదేవేత్యుత్తరమాహ – త్రిభిః. స ఇతి. స భగవాన్. యదా అనువ్రతః అనుకూలో భవతి తదా. పశూనామివ బుద్ధిర్భేదగతా సతీ. మిథ్యావిషయా విభిద్యతే. అభిన్నాత్మనిష్ఠా భవతి.(12)

టీ :- ఆహా ఇదేమి వదరుచున్నావు. నీ బుద్ధి భేదము ఎవర వలన లేదా ఎందువలన కలిగినదో చెప్పుము. అని ఆక్షేపింపబడినవాడై అతని అనుగ్రహము వలననే యని 'సః' అని మొదలుగాగల మూడు శ్లోకములతో చెప్పెను. ఆ భగవంతుడెప్పుడైతే అనువ్రతః= అనుకూలుడగునో అప్పుడు పశూనాం = అవివేకులబుద్ధివలె ద్వైతభావము కలది, మిథ్యాసంసారవిషయము గలది భేదింపబడి అభిన్నమైన ఆత్మనిష్ఠము కాగలదు. (12)

శ్లో ॥ స ఏష ఆత్మ స్వపరేత్య బుద్ధిభి
దురత్యయానుక్రమణో నిరూప్యతే ।
ముహ్యంతి యద్వర్త్మని వేదవాదినో
బ్రహ్మాదయోహ్యేష భినత్తి మే మతిమ్ ॥ 13 ॥

దుర్ఘటమైన అనుక్రమణముగల ఆ ఈ పరమాత్మయే అవివేకులచే తమ పర యని నిరూపించబడుచున్నాడు. (ఇట్టి ద్వైత భావన ఆ పరమాత్మా మాయాఫలమే. ఆ మాయ సకల జనులకు అతిక్రమించ సాధ్యము కానిది అని భావము.) అది యుక్తమే. ఎవని మార్గమును ఎరుంగ కోరు విషయమై వేదవేత్తలైన బ్రహ్మాదులు కూడా మోహము నొందుచున్నారో అట్టివాడే నా బుద్ధిని భేదింపజేయుచున్నాడు. ( మార్చుచున్నాడు ) (13)

టీ :- భేదస్యాసత్త్వం దర్శయన్నాహ - స ఇతి. స ఏష పరమాత్మైవ. స్వః పర ఇతి చ. అవివేకిభిర్నిరూప్యతే. యుక్తం చైతత్. యతః. యస్య వర్త్మని. జిజ్ఞాసాయాం బ్రహ్మాదయో పి ముహ్యంతి. తత్ర హేతుః. దురత్యయం దుర్ఘటమనుక్రమణం అనుచరితమనువర్ణనం. వా యస్య సః. (13)

టీ :- భేదము లేకుండుటను చూపుచు ఇట్లనెను. అట్టి ఈ పరమాత్మయే తాను అని పరుడని అవివేకులచే గాంచబడుచున్నాడు. అది యుక్తమే. ఎందు వలననగా ఎవనియొక్క జిజ్ఞాస యందైతే బ్రహ్మాదులు గూడా మోహము నొందుచున్నారో అందుకు కారణము దురత్యయం = దుర్ఘటమైన అనుక్రమణము , అనుచరితము లేదా అనువర్ణనముగల వాడతడు. ( 13 )

శ్లో ॥ యథా భ్రామ్యత్యయో బ్రహ్మన్ స్వయమాకర్ష సన్నిధౌ ।
తథామే భిద్యతే చేతః చక్రపాణే ర్యదృచ్ఛయా ॥ 14 ॥

ఓ బ్రహ్మ ! ఎట్లైతే లోహము అయస్కాంతము యెక్క సమీపమందు స్వయముగనే భ్రమించునో అట్లే నా చిత్తము చక్రపాణి సన్నిధిలో స్వయముగనే భ్రమించుచున్నది.దీనికి ఎవరి బోధనము కారణము కాదని భావము. (14)

టీ :- నను నిర్వికారస్య కథం మతిభేదకత్వం? తత్రాహ- యథేతి. అయో యథా లోహః ఆకర్షస్యాయస్కాంతస్య సమీపే. స్వయమేవ భ్రమతి. చేతశ్చక్రపాణేః సన్నిధౌ. సన్నిధిరేవ కుతో జాతస్తత్రాహ - యదృచ్ఛయేతి. కస్య తపోదానాదేః ఫలమేతదితి న జ్ఞాయత ఇత్యర్థః. (14)

టీ :- ఐన నిర్వికారునకు మతి భేదకత్వమెట్లు కలుగును. అనిన ఇట్లు చెప్పెను. 'యథా' ఇత్యాదిగా. ఎట్లు = అయః = లోహము, ఆకర్షణస్య = అయస్కాంతముయొక్క సమీపమునందు, స్వయముగనే భ్రమించునో అట్లే నాచిత్తము చక్రపాణి సన్నిధిలో భ్రమించుచున్నది. నీకాతని సన్నిధి ఎట్లు అనిన ఇట్లు చెప్పెను. " యదృచ్ఛయా " ఇత్యాదిగ. ఎవరి తపోదానాదుల ఫలమో యిది నేనెరుంగనని భావము. ( 14 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఏతావ ద్బ్రాహ్మణాప్రోక్త్వా విరరామ మహామతిః ।
తం నిర్భర్త్స్యాథ కుపితః స దీనో రాజసేవకః ॥ 15 ॥

**నారదుడు ఇట్లు చెప్పెను :-**

మహామతియైన ప్రహ్లాదుడు ఇంతవరకు బ్రాహ్మణునకు చెప్పి విరమించెను. అనంతరము దీనుడైన ఆ రాజసేవకుడు కుపితుడై ప్రహ్లాదుని బెదిరించి భయపెట్టి ఇట్లనెను. వీడు మనకపకీర్తి తెచ్చువాడు. అరే బెత్తము

శ్లో ॥ ఆనీయతా మరేవేత్రం అస్మాకమయశస్కరః ।
కులాంగారస్య దుర్బుద్ధే శ్చతుర్థోఽస్యోదితో దమః ॥16॥

శ్లో ॥ దైతేయ చందనవనే జాతోఽయం కంటక ద్రుమః ।
యన్మూలోన్మూల పరశోర్విష్ణో ర్నాలాయితోఽర్భకః ॥17॥

టీ :- ఏతావదితి. రాజసేవక ఉవాచేతి శేషః. (15)

టీ :- ఆనీయతామితి. వేత్రం కలా. ఉపాయానాం మధ్యే చతుర్థః. దమో దండః. అస్య దుర్బుద్ధేః. ఉదితః ఉక్తశ్శాస్త్రేషు. దుర్బుద్ధిత్వే హేతుః కులస్యాంగారవన్నాశహేతోః. (16)

టీ :- తత్కుతః? తత్రాహ - దైతేయేతి. దైతేయా ఏవ చందనద్రుమాః. తేషాం వనే. అయం కంటకద్రుమతుల్యో జాతః. తదేవాహ - యస్య దైత్యవనస్య. మూలోన్మూలనే. పరశు

కట్టె తెండు. కులమునకు నిప్పువంటి ఈ దుర్బుద్ధికి నాల్గవ ఉపాయమైన దమము (దండము) ప్రయోగింపతగునని శాస్త్రములందు చెప్పబడినది. దైతేయులనెడు చందనవృక్షముల వనమున వీడు ముండ్ల చెట్టుగా పుట్టెను. దైతేయ చందనముయొక్క మూలమును నాశనము చేయుకార్యమున పరుశువు (గొడ్డలి) ఐన విష్ణువునకు ఈ అర్భకుడు నాలముగా (గొడ్డలి కామగా) ఐనాడు. (గొడ్డలిచే ఛేదించుటకు దానికి బబ్బూలము మొదలైన వృక్షముల కట్టెచే నిర్మితమైన దండము ఒకటి సహకారిగా నియోగించబడును. అది లేనిదే గొడ్డలిచే ఛేదించుటకు సాధ్యముగాదు.) ( 15, 16, 17 )

టీ :- రాజసేవకుడు ఉవాచ = పలికెను, అనుపదము అధ్యాహారము. (15)

టీ :- అరే వేత్రం = కలా కొరడా తీసుకుని రాబడును గాక. సామ దాన భేద దండోపాయములలో నాల్గవదైన దమః = దండము ఈ దుర్బుద్ధికి తగునని శాస్త్రములందు చెప్పబడినది. దుర్బుద్ధియనుటకు హేతువు కులాంగారస్య = కులమునకు అగ్నివలె నాశకారణుడు. ( 16 )

టీ :- అది ఎట్లనిన ఇట్లు చెప్పెను. దైతేయులే చందన వృక్షములు వాని వనమందు ఇతడు ముండ్లచెట్టు వంటివాడు పుట్టెను. అదియే చెప్పెను. ఏ దైతేయ చందనవనమునకు మూలవినాశన కార్యమున పరుశు ( గొడ్డలి )

స్థానీయస్య విష్ణోరయమర్భక ఏవ. నాలాయితః నాలమివాచరితః. యథా. పరశోః భేదకత్వే బర్బురాదద్రుమనిర్మితో దండః సహకారీ. తేన వినా ఛేదపాసంభవాత్. తథాయం విష్ణోర్దైత్యమూలభేదే హేతుర్జాత ఇత్యర్థః. (17)

స్థానీయుడైన విష్ణువునకీ అర్భకుడు నాలాయితః = నాలమువలె ( గొడ్డలి కామవలె ) ఐనాడు. ఎట్లనగా గొడ్డలికి ఛేదించు కార్యమునందు బబ్బూలాది ద్రుమనిర్మితమైన దండము ( గొడ్డలి కామ ) సహకారియగును. అట్టి దండము లేకుండగ ఛేదించుట అసంభవమగుట వలన. అట్లే ఈ ప్రహ్లాద బాలుడు విష్ణువునకు దైత్యులను సమూలముగా మట్టుపెట్టుటయందు కారణమగు చున్నాడని యర్థము. (17)

శ్లో ॥ ఇతితం వివిధోపాయై ర్భీషయంస్తర్జనాదిభిః ।
ప్రహ్లాదం గ్రాహయామాస త్రివర్గస్యోపసాధనమ్ ॥ 18॥

శ్లో ॥ తత ఏవం గురుః జ్ఞాత్వా జ్ఞాత జ్ఞేయ చతుష్టయమ్ ।
దైత్యేంద్రం దర్శయామాస మాతృమృష్ట మలంకృతమ్ ॥19

అని ఆ బాలుని వివిధోపాయములచే బెదిరించుట మొదలైన వానిచే భయపెట్టుచు ఆ ప్రహ్లాదునకు ధర్మార్థకామ త్రివర్గ ప్రతిపాదకమైన శాస్త్రమును బోధించి గ్రహింప జేసెను. అటు తర్వాత గురువు ప్రహ్లాదుని ఎరుంగదగిన సామ దాన భేద దండోపాయములను అభ్యసించిన వానిగా తెలుసుకొని తల్లిచే తలంటి స్నానము చేయబడి అలంకరింపబడిన ఆ బాలుని దైత్యేంద్రునకు చూపెట్టెను. ( 18, 19)

టీ :- ఇతీతి. ఇతి. తం ప్రహ్లాదం భీషయన్. ధర్మార్థకామవర్గస్య ప్రతిపాదకం శాస్త్రమధ్యాపయామాస. (18)

టీ :- ఇట్లు ఆ ప్రహ్లాదుని భయపెట్టుచు ధర్మార్థ కామ వర్గముయొక్క ప్రతిపాదనమైన శాస్త్రమును అతనికి బోధించెను. ( 18 )

శ్లో ॥ పాదయోః పతితం బాలం ప్రతినంద్యాశిషాసురః ।
పరిష్వజ్య చిరం దోర్భ్యాం పరమాప నిర్వృతిమ్ ॥20॥

అసురుడైన హిరణ్యకశిపుడు తన పాదములపై బడిన బాలుడగు ప్రహ్లాదుని ఆశీస్సుచే అభినందించి బాహువులచే చాలాకాలము కౌగిలించుకొని గొప్ప సుఖమును పొందెను. ( 20 )

శ్లో ॥ ఆరోప్యాంక మవఘ్రాయ మూర్ధన్యశ్రు కలామ్బుభిః ।
ఆసించన్వికసద్వక్త్ర మిదమాహ యుధిష్ఠిర ॥ 21 ॥

ఒడిని చేర్చుకొని, శిరము నాఘ్రాణించి ఆనందాశ్రుబిందువులచే శిరమును తడుపుచు ఓ యుధిష్ఠిరా! వికసించిన ముఖముగల పుత్రుని ఇట్లనెను. ( 21 )

**హిరణ్యకశిపు రువాచ :-**

శ్లో ॥ ప్రహ్లాదానూచ్యతాం తాత స్వధీతం కించిదుత్తమమ్ ।
కాలేనైతావతాయుష్మ న్యదశిక్షద్గురోరభవాన్ ॥ 22 ॥

**హిరణ్య కశిపుడు ఇట్లు పలికెను :-**

నాయనా ప్రహ్లాదా ! నీవు బాగుగా అభ్యసించినది, ఉత్తమమైన దేదేని కొంచెము చెప్పబడుగాక. ఓ ఆయుష్మంతుడా! ఇంతకాలము నీవు గురువులవల్ల ఏమి నేర్చుకొంటివో చెప్పుము అని ప్రశ్నించెను. ( 22 )

టీ :- తత ఇతి. జ్ఞాతం జ్ఞేయముపాయచతుష్టయం. యేన తం జ్ఞాత్వా దైత్యేంద్రం ప్రతి. మాత్రా మృష్టం ఉద్వర్త్య స్నాపితం. (19,20,21.22)

టీ :- ఎరుంగదగిన సామ దాన భేద దండములను ఉపాయ చతుష్టయమును నేర్చిన ఆ బాలుని తల్లిచే తలంటి స్నానము చేయించి భూషణ తిలకాదులచే అలంకరింపజేసి ( తండ్రిని దర్శింపజేసిరి ). ( 19, 20, 21, 22 )

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్ ॥23॥

శ్లో ॥ ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవ లక్షణా ।
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేధీత ముత్తమమ్ ॥ 24 ॥

**ప్రహ్లాదుడిట్లు చెప్పెను :-**

విష్ణువు యొక్క గుణములను, వీరగాథలను వినుట, చరితమును, నామములను కీర్తించుట, అతనినే అనుక్షణము స్మరించుట, విష్ణువుయొక్క పరిచర్య గావించుట, పూజించుట, దాస్యము అనగా కర్మార్పణము చేయుట, నమస్కరించుట అతని యందలి విశ్వాసాదులతో సఖ్యతను కలిగి యుండుట, స్వశరీర సమర్పణము (అనగా విక్రయించబడిన గోవులు, అశ్వములు మొదలైన వానియొక్క పాలన పోషణాది విచారమును వదిలి పెట్టినట్లే స్వశరీరార్పణము గావించి దాని భరణ పోషణాది విచారమును వీడవలెనని అర్థము ) అను

నవ లక్షణాత్మకమైన భక్తి పురుషునిచే (మానవునిచే) విష్ణువుయందర్పితమైనచో భగవంతుని యందలి తత్వము కలిగించబడుచున్నది. తెలియజేయ బడుచున్నది. అదియే ఉత్తమమైన అధీతం=చదువబడుట యని నేను తలంచుచున్నాను. అనగా భగవత్తత్వమును తెలియజేయునదియే విద్య. దానిని అభ్యసించుటయే సద్విద్యాభ్యాసము. అదియే అధ్యయనమని భావము.(23,24

శ్లో ॥ నిశమ్యైతత్సుత వచో హిరణ్యకశిపుస్తదా ।
గురుపుత్ర ముదాచేదం రుషా ప్రస్ఫురితాధరః ॥ 25 ॥

పుత్రుని ఈ మాటలు విని హిరణ్యకశిపుడు అప్పుడు కోపముతో అధరము అదురుచుండగా గురు పుత్రుని గూర్చి ఇట్లనెను. ( 25 )

శ్లో ॥ బ్రహ్మ బంధో కిమేతత్తే విపక్షం శ్రయతా సతా ।
అసారం గ్రాహితో బాలో మామనా దృత్య దుర్మతే ॥26॥

ఓ నీచ బ్రాహ్మణా ! ఈ నీ పనియేమి? శత్రుపక్షమును ఆశ్రయించిన దుష్టుడవైన నీచే ఓ దుర్మతీ ! నన్ను నామాటలను ఆదరించక లెక్కచేయక బాలుడు వ్యర్థపు చదువు నేర్పబడినాడు. ( 26 )

టీ :- శ్రవణమితి. పాదసేవనం పరిచర్యా అర్చనం పూజా. దాస్యం కర్మార్పణం. సఖ్యం తద్విశ్వాసాది. ఆత్మనివేదనం దేహసమర్పణం. యథా విక్రీతస్య గవాశ్వాదేః భరణపాలనాదిచితా న క్రియతే, తథా దేహం తస్మై సమర్ప్య తచ్చింతావర్జనమిత్యర్థః. (23)

టీ :- పాదసేవనం = పరిచర్య విష్ణుమూర్తికి గావించబడు అన్నివిధముల సేవ పాదసేవనము క్రిందజేరును. అర్చనం = పూజా, ఆరాధన దాస్యం = కర్మార్పణము, సఖ్యం = భగవంతుని యందలి విశ్వాసము మొదలైనవి కలిగి మెలగుట. ఆత్మనివేదనమ్=స్వీయ శరీరమును అర్పించుట, ఎట్లైతే విక్రయించబడిన గోవులు, అశ్వములు మొదలగువాని యొక్క భరణము, పాలనము ఇత్యాది విచారము గావించబడదో అట్లే దేహమును ఆ భగవంతునకు సమర్పించి దేహచింతను వీడియుండుట అని అర్థము. ( శ్రీ

టీ :- ఇతీతి. ఇతి పూర్వోక్తప్రకారేణ నవలక్షణాని యస్యాస్సా అద్ధా. యేనాధీతేన చేద్భగవతి విష్ణౌ భక్తిః క్రియేత. సా చ అర్పితైవ సతీ యది క్రియతే. న తు కృతా సతీ పశ్చాదర్ప్యేత. తదుత్తమమధీతం మన్యే, న త్వస్మద్గురోరధీతం శిక్షితం వా. తథావిధం కించిదస్తీతి భావః. (24,25)

టీ :- న విద్యతే సారం యత్ర తదసారం. న విద్యత్యే సారం యస్మాదితి వాస్తవోర్థః. (26)

ఆదిశంకరులు చెప్పినట్లు ' రత్నైః కల్పితమానసం, హిమజలైః స్నానంచ దివ్యాంబరం। నానారత్న విభూషితం మృగమదామోదాంకితం చందనం। జాతీ చంపక బిల్వ పత్రరచితం పుష్పంచ ధూపం తథా। దీపం ...............' ఇత్యాదులను భక్తితో సమర్పించి ఆరాధించుట అర్చనము. ' సాష్టాంగం ప్రణతిః ' యని, ' ప్రాతర్నమామి గిరిశం గిరిజార్ధదేహం । సర్గస్థితి ప్రళయ కారణమాది దేవం । విశ్వేశ్వరం విశ్వ మనోభిరామం । సంసార రోగహర మౌషధ మద్వితీయమ్ । అని పల్కిన శ్రీ ఆదిశంకర భగవత్పాదులు మనసాకృత నమస్కారాదులు వందనమను భక్తి లక్షణము. దాస్యం = కర్మార్పణము. ఇందుకు గూడా ' కరచరణ కృతం వా కర్మవాక్కాయజం వా। శ్రవణ నయనజం వా మానసం వాపరాధం। విహిత మవిహితం వా సర్వమేతత్ క్షమస్వ।" యనుచు " పూజాతే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః । సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాణిరో । యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్। " యని కర్మార్పణ పూర్వకముగా క్షమార్పణకై ప్రార్థించుట, దాస్యము అను భక్తి లక్షణము. సఖ్యము అనగా భగవంతునిపై విశ్వాసముంచి అతనినే సఖునిగా మాతా పితరులుగా, బంధువుగా " త్వమేవ మాతాచ పితా త్వమేవ । త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ। త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ । త్వమేవ సర్వం మమ దేవ దేవ ॥ " అని భగవంతునిపై విశ్వాసముంచుట సఖ్యము అగును. ఆత్మార్పణము అనగా శరీరాదులను భగవంతునకర్పణచేసి తత్పాలన పోషణములను అతనిచే వదిలివేయుట ముముక్షుస్థితి అని అర్థము. ) (23, 24, 25, 22, 26)

శ్లో ॥ సన్తి హ్యసాధవో లోకే దుర్మైత్రా శ్ఛద్మ వేషిణః ।
తేషాముదేత్యఘం కాలే రోగః పాతకి నామివ ॥ 27 ॥

**గురుపుత్ర ఉవాచ :-**

శ్లో ॥ నమత్ప్రణీతం న పర ప్రణీతం
సుతో వదత్యేష మహేంద్ర శత్రో ।
నైసర్గికీయం మతిరస్య రాజ
న్నియచ్ఛ మన్యు క కదాస్మమానః ॥ 28 ॥

**నారద ఉవాచ :-**

శ్లో ॥ గురుణైవం ప్రతిప్రోక్తో భూయ ఆహా సురస్సుతమ్ ।
న చేద్గురు ముఖీయం తే కుతో భద్రాసతీమతిః ॥ 29 ॥

టీ :- మిత్రత్వేన వర్తమానస్యాపి తవ విరోధాచరణం న సంభావితమిత్యాహ – సంతీతి. దుష్టం మైత్రం మిత్రత్వం యేషాం తే. రోగ ఇవేతి. శ్లో. " బ్రహ్మహా క్షయరోగీ స్యాత్సురాపీ శ్యావదంతకః, స్వర్ణాపహారీ కునఖీ దుశ్చర్మా గురుతల్పగః." ఇత్యాదిస్మృత్యుక్తః పాతకినాం రోగోయథోదేతి. తథా తేషామఘం విద్వేషాదికముదేతీత్యర్థః. (27)

దుష్టమైన మైత్రి నెఱుపుచు కపటముతో మిత్రుని వేషము దాల్చెడు దుర్జనులు ఉందురు కదా ! పాతకులకు క్షయరోగాదులు కల్గినట్లు వీరికిని కాలమాపన్నము కాగా కీడు హాని కలుగును. అని పలికిన హిరణ్యకశిపుని క్రోధభాషణమును వినిన గురుపుత్రులు అసుర పతితో ఇట్లనిరి. " ఓయీ ! దేవేంద్ర విరోధీ ! ఈ నీ పుత్రుడు చెప్పు విషయము నాచేగానీ ఇతరులచే గానీ బోధించబడినది కాదు. రాజా ! ఇది ఈతని స్వాభావికమైన బుద్ధియే. దీనాత్ములమైన మాపై కుత్సితమైన ఈ దోషమును ఆరోపింపకండి. బ్రాహ్మణులను నీవు కోపించ తగదు. " అని గురువుచే ఇట్లు బదులీయబడిన వాడై ఆ అసురపతి మరల పుత్రునితో ఇట్లనెను. అనుచు ధర్మజునకు నారదుడిట్లు వివరించుచుండెను. " నీకీ బుద్ధి గురుముఖమున సంక్రమించినది. కాకున్నచో ఓ అమంగళా ! దుష్టమైన ఈ బుద్ధి నీకెట్లు కలిగినది? అని హిరణ్యకశిపుడు ప్రశ్నించెను. (27-29)

టీ :- మిత్రుడుగా ప్రవర్తించు వాడవైనను నీయొక్క విరోధాచరణము ఊహించబడలేదు. అని ఇట్లు చెప్పెను. ' సన్తిహి ' ఇత్యాదిగా. దుష్టమైన మైత్రం=మిత్రత్వము, కలవారు దుర్మైత్రులు ( కపట మిత్రులుగా వేషములు దాల్చి, దుర్మార్గులు హాని చేయుదురని భావము ) ' రోగః ' అని. " బ్రహ్మ హత్య గావించిన వాడు క్షయరోగియగును. సురాపానము చేసినవాడు కపిలవర్ణములుగల దంతములు కలవాడగును. స్వర్ణమును దొంగిలించినవాడు వికారమైన దంతములు కలవాడగును. గురు భార్యతో కూడినవాడు

టీ :- నేతి. మత్ప్రణీతం మయాపాదితం. నో స్మభ్యం. కత్ కుత్సితం దోషం మాస్మ అదాః. అడాగమ ఆర్షః. మయి దోషారోపం మాకృథాఇత్యర్థః. ఇంద్రశత్రో ఇత్యనేన. న హి బ్రాహ్మణేషు తవ కోప ఉచిత ఇతి భావః. (28)

టీ :- గురుణేతి. గురుముఖీ గురువాక్యజనితా. హే అభద్ర. (29)

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ మతిర్న కృష్ణే పరతః స్వతోవా
మిథోభి పద్యేత గృహవ్రతానామ్ ।
అదాంత గోభిర్విశతా తమిస్రం
పునః పునశ్చర్విత చర్వణానామ్ ॥ 30 ॥

చర్మరోగమును కలవాడగును. ఇత్యాది స్మృతి వాక్యములలో చెప్పబడిన పాతకులకు నరక భోగాంతర కాలమున ఆయా రోగములు కలిగినట్లుగా అట్టి దుర్మార్గులకు సుజనులుగా మెలుగుచున్న వారైనప్పటికిని అఘం = విద్వేషాదికము కలుగునని భావము. ( 27 )

టీ :- మత్ ప్రణీతం = మయా పాఠితమ్ నాచే చదివింపజేయబడినది. బోధింపబడినది. నః = మా యొక్క కత్ = కుత్సితమైన, దోషమును ఆరోపించవద్దు. ఇచ్చట అడాగమము ఆర్షము. నాయందు దోషారోపణ గావించవద్దని అర్థము. ఇంద్ర శత్రో అనునది బ్రాహ్మణులమైన మాయందు నీ యొక్క కోపము తగదని చెప్పుట. ( 28)

టీ :- గురుముఖీ = గురుబోధవలన కలిగిన బుద్ధి. ఓ అమంగళా ! అనగా ఇకనీకంతా అశుభమే యని సూచించు సంబోధన. ( 29 )

**ప్రహ్లాదుడిట్లు పలికెను :-**

నాకీ బుద్ధి యెట్లు కలిగినదను ప్రశ్న అట్లుండనిమ్ము. నీ వంటి విషయాసక్తులైన వారికి మాత్రము ఇందు ( ఈ జ్ఞానమును పొందుటయందు) అధికారము లేదను భావముతో ప్రహ్లాదుడు ఇంద్రియ నిగ్రహము లేనట్టి చర్విత చర్వణములైన సంసారబంధము నందున్నట్టి నీవంటి గృహవ్రతులకు స్వతః గానీ గురువు వలన గానీ , అన్యోన్య సంబంధము వలన గానీ

టీ :- ఆస్తామియం వార్తా భవాదృశానాం విషయాసక్తానా మత్రానధికారాదిత్యాశయేనాహ – మతిరితి. పరతః గురోః. స్వతో వా. మిథో వా అన్యోన్యతః. నాభిపద్యేత న సంపద్యేత. కేషాం. గృహ ఏవ వ్రతం సంకల్పః ఇతికృత్యచింతా యేషాం. అతఏవ. అదాంతైరనుపరతైః. గోభిరింద్రియైర్హేతుభూతైః. తమిస్రం సంసారం. విశతాం తత్ర చర్వితస్యైవ చరణం యేషాం. (30)

కృష్ణుని యందు మనస్సు లగ్నము గాదు. (30)

టీ :- ఈ విషయమట్లుండనిమ్ము. నీవంటి విషయాసక్తులకు ఇందు అధికారము లేనందువలన అను ఆశయముతో ఇట్లు పలికెను. ' మతిః ' అని. పరతః = గురువువలన, స్వతః = స్వయముగనైనను మిథః = అన్యోన్య సహవాసము వలనను, నాభిపద్యేత=కలుగ కుండును గాక, ఎవరికి అనగా, గృహవ్రతానాం = గృహమే, వ్రతం = సంకల్పమను కృత్య చింత గలవారికి, కావుననే , అదాన్తైః = అణిచివేయబడని, గోభిః = హేతుభూతములైన ఇంద్రియములు గలవారిచే, తమిస్రం = సంసారమును పొందువారికి, ఆ సంసారమున అనుభవించినదే నిత్యము అనుభవించు వారికి, (30 )

శ్లో ॥ నతేవిదుః స్వార్థ గతిం హి విష్ణుం
దురాశయాయే బహిరర్థ మానినః ।
అంధాయధాంధై దుపనీయమానా
వాగీశతంత్యా మురుదామ్ని బద్ధాః ॥ 31 ॥

విషయవాసితాంతః కరణులగు అట్టివారు స్వార్థగతులైన ( తమయందే పురుషార్థము గల ) వారికి పొందదగిన విష్ణువును ఎరుంగరు. అంధుల కొనిపోబడుచున్న అంధులు (గోతిలో పడుదురు.) లక్ష్యమును ( గమ్యమును) చేరరు. అట్లే బహిర్విషయములందాసక్తులైన వారినే గురువులని భావించువారు బ్రహ్మయొక్క వేద లక్షణమైన దీర్ఘ రజ్జువు ( త్రాడు) నందలి సూత్రములచే ( కామ్య కర్మలచే ) బద్ధులగుదురు.(31)

టీ :- నను శ్రీకృష్ణస్య పరమానందరూపత్వాత్తే పి తన్నష్ఠా ఏవ కిం న స్యుః? తదజ్ఞానాదిత్యాహ – నేతి. యే దురాశయాః

టీ :- శ్రీకృష్ణుడు పరమానంద స్వరూపుడు గదా ! వారును, తన్నిష్ఠాః = ఆ శ్రీకృష్ణుని యందే ఉండువారు కారా ఏమి? అనిన అతనినెరుంగనందున

విషయవాసి తాంతఃకరణాః తే హి విష్ణుం న విదుః తత్ర హేతుః. స్వస్తిన్నేవార్థః. పురుషార్థో యేషాం తేషాం. గతిం గమ్యం. నను తే పి గురూపదేశాద్విష్ణుం జ్ఞాస్యంతి తత్రాహ – బహిర్విషయేష్వర్థో యేషాం తే బహిరర్థాః తానేవ గురుత్వేన మంతుం శీలం యేషాం తే అతః అంధైరుపనీయమానా అంధా పంథానం న విదుః. కింతు గర్తే పతంతి. తథా తే పి ఈశస్య తంత్ర్యాం దీర్ఘ రజ్జ్వాం వేదలక్షణాయాం. ఉరూణి దామాని బ్రాహ్మణాదినామాని యస్యాం తస్యాం. కామ్యైః కర్మభిః బద్ధా ఏవం భవంతీత్యర్థః. తదుక్తం. శ్లో. విషయావిష్టచిత్తానాం విష్ణ్వావేశస్సుదూరతః, వారుణీదిగ్గతం వస్తు వ్రజన్నైంద్రీం కిమాప్నుయాత్. (31)

అని ఇట్లు పలికెను. 'న' ఇతి = ' న' ఇత్యాదిగా, యేదురాశయాః = విషయములచే వ్యాప్తమైన ఇంద్రియములు గలవారు విష్ణువును ఎరుంగరు కదా ! అందుకు హేతువు తమయందే , అర్థః=పురుషార్థముగల వారికి, గతిః = చేరతగినవాడు, కాగా వారుకూడా గురూపదేశము వలన విష్ణువునెరుంగుదురు కదా ! యనిన ఇట్లు చెప్పెను. బాహిర విషయములందు ప్రయోజనము గలవారినే వారు గురువులుగ స్వీకరించు స్వభావము గలవారు. అందువలన అంధులచే కొనిపోబడు అంధులు ఎట్లైతే మార్గము నెరుగరో, పైగా గోతిలో పడెదరో అట్లే వారు ఈశ్వరుని యొక్క , తన్త్యాం = పొదవైన త్రాడుయందలి వేద లక్షణమైన దానియందలి, ఉరూణి దామాని = బ్రాహ్మణాది నామములుగల పురులందు కామ్య కర్మలచే బద్ధులే అగుదురు. అని భావము. అదియే ఇట్లు చెప్పబడినది. 'విషయా సక్త చిత్తానాం విష్ణ్వావేశః సుదూరతః వారుణీ దిగ్గతం వస్తు వ్రజన్నైంద్రీం కిమాప్నుయాత్' అనగా విషయములందాసక్తమైన చిత్తము గలవారికి విష్ణువునందు లగ్నమగుట చాలా దూరము ( కష్టము ). (31)

శ్లో ॥ నైషాం మతిస్తావ దురుక్రమాంఘ్రిం
స్పృశత్యనర్థాపగమో యదర్థః ।
మహీయసాం పాదరజోభిషేకం
నిష్కించనానాం న వృణీత యావత్ ॥ 32 ॥

నిరస్తవిషయాభిమానులగు గొప్ప మహాత్ములయొక్క పాదధూళిచే అభిషేకము వరించబడు వరకు ( అసంభావనాదులచే పీడించబడు చుందురు) వారి బుద్ధి అనర్థాపగమమునకు హేతువైన భగవంతుని పాదములను సోకదు. ( 32 )

టీ :- నను చ. శ్రు. “ ఏకో దేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మే ” త్యాది. శ్రుతి ప్రతిపాదితం విష్ణుం కథం న విదుః? కుతో వా తేషాం తమః ప్రవేశస్తత్రాహ – నైషామితి. నిష్కించనానాం నిరస్తవిషయాభిమానానాం. పాదరజసా అభిషేకం యావన్నవృణీత. తావత్. శ్రుతివాక్యతో జాతాపి ఏషాం మతిరుక్రమస్యాంఘ్రిం న స్పృశతి న ప్రాప్నోతి. అసంభావనాదిభి ర్విహన్యత ఇత్యర్థః. అనర్థస్య సంసారస్యాపగమో యదర్థః యస్యా ఉరుక్రమాంఘ్రిస్పర్శిన్యా మతేరర్థః ప్రయోజనం. మహదనుగ్రహా భావాన్న తత్త్వనిశ్చయేనాపి మోక్షస్తేషామిత్యర్థః. (32)

టీ :- పశ్చిమ దిక్కున ఉన్న వస్తువును గూర్చి పయనించువాడు తూర్పు దిక్కును చేరగలడా అని భావము. మరియు భగవంతుడు ఒక్కడే సర్వభూతములందు గూఢముగా నుండువాడు. సర్వప్రపంచమున వ్యాపించువాడు, సకల ప్రాణులకు అంతరాత్మ యైనవాడు, అని శ్రుతి ప్రతిపాదితుడైన విష్ణువును ఎట్లు ఎరుంగరు? వారికెందులకు సంసార ప్రవేశము? అనిన ఇట్లు చెప్పెను. ‘ నైషాం ’ ఇత్యాదిగా. నిష్కించనానాం = నిరస్తమైన విషయాభిమానముగల మిగుల గొప్పనైన వారి యొక్క పాదధూళిచే అభిషేకము కలుగనంతవరకు వారికి శ్రుతి వాక్యము వలన బుద్ధి కలిగినను ఆ బుద్ధి నారాయణుని పాదములను స్పృశించదు. అనగా పొందదని అర్థము. అసంభావనాదులచేత నష్టమగునని అర్థము. అనర్థస్య = సంసారము యొక్క తొలిగిపోవుట అనునది ఆ భగవంతుని యొక్క అంగ స్పర్శను పొందిన మతి చేతనే సాధ్యమగును. అట్టి మతికి మాత్రమే సంసారాపగమము ప్రయోజనము. మహదనుగ్రహము లేనందున తత్త్వ నిశ్చయము కలుగదు. మోక్షము గూడా వారికి కలుగదని అర్థము. ( 32 )

శ్లో ॥ ఇత్యుక్త్వో పరతం పుత్రం హిరణ్యకశిపూరుషా ।
అంధీ కృతాత్మా స్వోత్సంగాన్నిరస్యత మహీతలే ॥ 33 ॥

అని పలికి విరమించిన పుత్రుని హిరణ్యకశిపుడు కోపముతో అంధీకృతమైన ఆత్మ కలవాడై తన ఒడినుండి భూమిపై బడద్రోసెను. (33)

టీ :- ఇతీతి. నిరస్యత నిరస్యాత్ చిక్షేపేత్యర్థః. నిరస్యేతి ల్యబంతపాఠే తూత్తరేణాన్వయః. (33)

టీ :- నిరస్యత = పడద్రోసెను. ( 33 )

శ్లో ॥ ఆహా మర్ష రుషా విష్టః కశాయీభూత లోచనః ।
వధ్యతా మాశ్వయం వధ్యో నిః సారయత నైరృతాః ॥34॥

కశాయ వర్ణ నేత్రములు గలవాడై, అసహనముతో కూడిన క్రోధముచే వ్యాప్తమైన వాడగుచు ఆ హిరణ్యకశిపుడు ఓ రాక్షసులారా ! వీనినిచ్చటినుండి తొలగించుడు. ఈ వధ్యుని శీఘ్రముగా వధించుడు. ( 34 )

టీ :- ఆహేతి. అమర్షః అసహనం. తేన సహితయా రుషా. ఆవిష్టో వ్యాప్తః. కషాయీభూతే ఆతామ్రే లోచనే యస్య. హు నిరృతాః రాక్షసాః. (34)

టీ :- అమర్షః = అసహనముతో కూడిన కోపముతో, ఆవిష్టః = వ్యాప్తమైన, కశాయీభూతే = ఆ తామ్రములైన లోచనములుగల, హే నైరృతాః = ఓ రాక్షసులారా!(34)

శ్లో ॥ అయం మే భ్రాతృహా సోయం హిత్వాస్వాన్ సుహృదోధమః
పితృవ్య హంతుర్యః పాదౌ విష్ణోర్దాసవ దర్చతి ॥ 35 ॥

వీడు నా భ్రాతృ హంతకుడు ( సోదరుని చంపినవాడు ). ఏల యనగా అధముడై తన మిత్రులను వీడి దాసునివలె తన పిన తండ్రిని చంపిన విష్ణువు యొక్క పాదములను అర్చించుచున్నాడు. ( 35 )

టీ :- వధ్యతే హేతుః. - అయమితి. యతో యం మే భ్రాతృహా. కుతః. యో విష్ణోః పాదౌ దాసవదర్చతి. తత్పక్షపాతీత్యర్థః. అతః ఏవాయమిత్యన్వయః. (35)

టీ :- వధ్యత్వమునందు హేతువు, ఎందువల్లనైతే వీడు నపా సోదరుని సంహరించినవాడు. ఎట్లనగా ఏవడైతే విష్ణువుయొక్క పాదములను దాసునివలె అర్చించుచున్నాడో త్పక్షపాతియని అర్థము. ( ఆ విష్ణువుయందు పక్షపాతము కలవాడని భావము ) అందువలన ఆ విష్ణువే వీడు ( ప్రహ్లాదుడు) అని అన్వయము. ( 35 )

శ్లో ॥ విష్ణోర్వా సాధ్వసౌ కిన్ను కరిష్యత్య సమంజసః ।
సౌహృదం దుస్త్యజం పిత్రో రహాద్యః పంచహాయనః ॥36॥

అవిశ్వసనీయుడైన ఈ ధూర్తుడు విష్ణువునకు ఏమి ప్రయోజనము గూర్చును. ఐదు సంత్సరముల ఏ బాలుడైతే త్యజించరాని తలి దండ్రుల స్నేహమును వదిలి పెట్టెనో ( అట్టి వీడు విష్ణువునకు ఏమి ఉపకరించును)36)

టీ :- అహెూ విష్ణురప్యవిశ్వసనీయం కిమితి స్వీకతవానిత్యాహ - విష్ణోర్వేతి. అజహాత్. జహౌ. (36)

శ్లో ॥ పరోప్య పత్యం హితకృద్యథౌషధం
స్వదేహజోప్యా మయవత్సుతో హితః ।
ఛింద్యాత్తదంగం యదుతాత్మనోహితం ।
శేషం సుఖం జీవతి యద్వి వర్జనాత్ ॥ 37 ॥

టీ :- నను తవాయమపత్యం కథం వధ్యస్త్రాహ - పరఇతి. పరో ప్యాషధమివ హితకృచ్చేత్. తర్హ్యపత్యమేవ జ్ఞేయం. సుతః స్వదేహజోపి అహితశ్చేత్. ఆమయ ఇవ త్యాజ్యః. ఆస్తాం మమతాస్పదస్య కథం వధస్త్రాహ - స్వయం మమతాస్పదం అంగమపి కరచరణాది. తదప్యాత్మనః. అహితం చేత్. ఛింద్యాదేవేత్యర్థః. (37)

శ్లో ॥ సర్వైరుపాయై ర్హన్తవ్యః సంభోజ శయనాసనైః ।
సహృల్లింగధరః శత్రుః మునేర్దుష్టమినేంద్రియమ్ ॥ 38॥

టీ :- ఆహా ! ఆ విష్ణువుగూడా అవిశ్వసనీయుడైన వీనిని ఎందులకు స్వీకరించుచున్నాడో యని ఇట్లు చెప్పెను. ' విష్ణోర్వా ' యని, అహాత్ = వదిలివేసెను.(36)

పరసంతానమైనను హితకారియైనచో ఔషధమువలె గ్రహించదగిన వాడే. స్వాత్మజుడైనను రోగమువలె అహితకారి యైనచో అట్టి సుతుడు వదిలివేయ తగినవాడే అగును. అంత యెందులకు తనకు హానిచేకూర్చు స్వీయమైన అంగమును కూడా వదిలివేసిన మిగిలిన అంగము సుఖముగ నందునట్లైన దానిని ఖండించి వేయవలసినదే యగును కదా ! . ( 37 )

టీ :- ఓయీ ! నీ అసత్యమైన వీడు ఎట్లు చంపదగిన వాడనిన ఇట్లు చెప్పెను. పరుల సంతానమైనను ఔషధమువలె హితకారియైనచో తన అసత్యముగనే ఎరుంగదగును. స్వాత్మజుడైన సుతుడైనను అహితుడైనచో రోగమువలె భావించదగును. మమతకు ఆస్పదమైన సుతుని విషయమట్లుండనిమ్ము. కరచరణాది తన అంగమే ఐనను తనకు చేటు కలిగించునదైనచో ఛేదింపదగినదే యని యర్థము. ( 37 )

కావున వీడు భోజనము విషము కలిపిగానీ, శయనాసనములందు దుష్టపన్నాగము చేతగానీ సకల ఉపాయములు గావించియైనను సంహరింపదగినవాడు. మునికి ఎట్లైతే దుష్టమైన ఇంద్రియము శత్రువగునో

అట్లే మిత్రుని రూపమును పొందిన శత్రువు గూడా ఉపేక్షింపదగినవాడు గాదు. ( 38 )

టీ :- సర్వైరితి. అతః సర్వైరుపాయైర్హంతవ్యః. సంభోజో. భోజనం భోజనాదిషు విషాదిప్రయోగైరిత్యర్థః. యథా దుష్టమింద్రియం. మునేః శత్రుః. (38)

టీ :- కాన సర్వోపాయములు గావించియైనను వీడు సంహరింపదగును. సంభోజో=భోజనము, భోజనాదులయందు విషప్రయోగాదులచే యని యర్థము. ఎట్లైతే దుష్టమైన ( తన యధీనములోలేని ) ఇంద్రియము మునికి శత్రువో ( 38 )

శ్లో ॥ నైరృతాస్తే సమాదిష్టా భర్త్రావై శూలపాణయః ।
తిగ్మ దంష్ట్ర కరాలాస్యా స్తామ్ర శ్మశ్రు శిరోరుహాః ॥ 39

అని శూలపాణులైనవారును, తీక్ష్ణమైన దంతములు కలవారును, భయంకరమైన ముఖము కలవారును, ఎఱ్ఱని మీసములు, ఎఱ్ఱని తలవెండ్రుకలు కలవారును ఐన ఆ రాక్షసులు ప్రభువైన హిరణ్యకశిపునిచే ఆదేశించబడినారు.(39)

శ్లో ॥ నదన్తో భైరవాన్నాదాం శ్చింది భిన్ధీతి వాదినః ।
ఆసీనం చాహనన్ శూలైః ప్రహ్లాదం సర్వమర్మసు ॥ 40॥

వారు భారులకు వెరపు పుట్టించునట్టి ధ్వనులు గావించువారై ఛేదించుడు, భేదించుడు అని సలుకుచు కూర్చుని యున్న ప్రహ్లాదుని సర్వ మర్మ స్థానములందు శూలములచే హింసించిరి. ( 40 )

టీ :- నైరృతా ఇతి. తిగ్మాః తీక్ష్ణాః దంష్ట్రాః యేషాం కరాలాన్యాస్యాని యేషాం తేచ తే చ. తామ్రాణి శ్మశ్రూణి శిరోరుహాశ్చ యేషాం. (39, 40)

టీ :- తిగ్మాః = తీక్ష్ణమైన దంష్ట్రలు గలవారు, కరాలాన్యాస్యాని = భయంకరములైన ముఖములు గలవారును, తామ్రవర్ణము గల మీసములు, తలవెండ్రుకలు గలవారును(39,40)

శ్లో ॥ పరే బ్రహ్మణ్య నిర్దేశ్యే భగవత్యఖిలాత్మని ।
యుశీఏక్తాత్మన్య ఫలా ఆసన్న పుణ్యస్యేవ సత్క్రియాః ॥41॥

పాపాత్ముని యొక్క సత్క్రియలవలె అనిర్దేశ్యుడగు పరబ్రహ్మయైన భగవంతుడైనట్టి అఖిలాత్ముని యందు మనస్సు నిల్పినట్టి ప్రహ్లాదునియందు వారు గావించిన హింసా కృత్యములన్నియు నిష్ఫలములయ్యెను. ( 41 )

శ్లో ॥ ప్రయాసే పహతే తస్మిన్దైత్యేంద్రః పరిశంకతః ।
చకార తద్వధోపాయాన్నిర్బంధేన యుధిష్ఠిర ॥ 42 ॥

అతని యందు ఆ క్రూర రాక్షసులచే గావించబడిన ప్రయాస అంతయు వ్యర్థముగాక దైత్యేంద్రుడు మిగుల శంకించినవాడై నిర్బంధముగా ఆ బాలుని వధించు ఉపాయమును గావించెనని నారదుడు యుధిష్ఠిరునితో చెప్పెను.(42)

టీ :- పర ఇతి. పరే ఈశ్వరే యుక్తః సమాహితః. ఆత్మా మనో యస్య తస్మిన్. తేషాం ప్రహారా నిష్ఫలా జాతాః. తత్ర హేతవః. బ్రహ్మణి నిర్వికారే. అనిర్దేశ్యే అవిషయే. భగవతి నిరతిశయైశ్వర్యే అఖిలాత్మని శాస్త్రవాదినామపి నియంతరి. ఏవంభూతే పరే. అపుణ్యస్య నిర్దైవస్య సత్క్రియా మహోద్యమా ఇవ. (41, 42)

టీ :- పరే = ఈశ్వరునియందు, యుక్తః = సమాహితమైన, ఆత్మా = మనస్సుగల ఆ ప్రహ్లాదునియందు ఆ రాక్షసులయొక్క ప్రహారములు ( దెబ్బలు ) నిష్ఫలములు ఆసన్=అయ్యెను. అందుకు కారణములు బ్రహ్మణి = నిర్వికారుడైన, అనిర్దేశ్యే = అవిషయుడైనట్టి , భగవతి = నిరతిశయైశ్వర్య సంపన్నుడైనట్టి అఖిలాత్మునియందు శస్త్రాదులను సహితము నియంత్రించు ఈశ్వరునియందు, అపుణ్యస్య = నిర్దైవుడైన (దైవభక్తిలేనట్టి ) వానియొక్క , సత్క్రియాః = మహోద్యమములవలె. ( 41, 42 )

శ్లో ॥ దిగ్గజై ర్దంద శూకైశ్చ అభిచారావ పాతనైః ।
మాయాభిః సన్నిరోధైశ్చ గనదానైర భోజనైః ॥ 43 ॥

దిగ్గజములచే ( త్రొక్కించి ), సర్పములచే ( కరిపించి ), హింసయే ఫలముగా గలిగిన అథర్వణవేద విహితమైన హోమాది కర్మలచే, గిరిశృంగములనుండి క్రింద పడద్రోయుటచే శంబర నిర్మితములైన మాయా క్రియలచే, సర్పాదులు నివసించు భూసొరంగములందు త్రోయుటచే , అందు

శ్లో ॥ హిమ వాయ్వగ్ని సలిలైః పర్వతాక్రమణైరపి ।
న శశాక యదా హంతుమపాప మసురః సుతమ్
చిందాం దీర్ఘత మాం ప్రాప్త స్తత్కర్తుం నాభ్యపద్యత ॥44॥

నిరోధించుటచే, విషప్రయోగములచేత, భోజనము పెట్టకుండ నిరాహారముగ నుంచబడుటచే, హిమ, వాయు, అగ్ని, జలములందు పడవేయుటచే, పర్వతముల నాతనిపై పడవేయుటచేతను ప్రహ్లాదుని సంహరించుటకు ప్రయత్నించియు తంద్రియైన హిరణ్యకశిపుడు వానిని సంహరింపజాల కుండెను. అందువలన దీర్ఘతమమైన విచారమును పొందెను. కాని అతని సంహారమునకు తగిన ఉపాయమును పొందకుండెను. (43,44)

టీ :- దిగ్గజైరితి. అభిచారాః కృత్యాదయః. అవపాతనాని గిరిశృంగాదధఃపాతనాని. తైః అవగాదిషు సన్నిరోధైశ్చ. (43)

టీ :- దండశూకైః = సర్పములచేత, అభిచార కృత్యాదులచే, అవపతనాని = పర్వత శిఖరములనుండి క్రింద పడద్రోయుటముచే, మాయాభిః = శంబర నిర్మితములైన మాయా ప్రవృత్తులచే, సర్పాది భూయిష్టములైన సొరంగము లందు బంధించుట చేతను. ( 43 )

టీ :- హిమేతి. పర్వతాక్రమణైః పర్వతానాం తదుపరిక్షేపైః. బహువచనైరభిచారాద్యావృత్తిం దర్శయతి. తద్ధననం. కర్తుం నాభ్యపద్యత ప్రాప నాశక్నోదిత్యర్థః. (44)

టీ :- పర్వతాక్రమణైః = పర్వతములను అతనిపై పడవేయుటము ద్వారా, బహువచనములచే అభిచారాది దుష్కృత్యములను మరల మరల గావించుటను తెలుపుచున్నాడు. అతని సంహారము గావించుటకు అశక్తుడయ్యెను. చాలకుండెనని అర్థము. ( 44 )

శ్లో ॥ ఏషమే బహ్వ సాధూక్తో వధోపాయాశ్చ నిర్మితాః ।
తై సై ర్ద్రోమై రసద్ధర్మై ర్ముక్తస్యే నైవ తేజసా ॥ 45 ॥

వీడు నాచే మిక్కిలి పరుషముగా మందలించ బడినాడు. (నిందించబడినాడు). వీని సంహారమునకు అనేక ఉపాయములు గూడ గావించబడినవి. వీనికి అవకాశము గావించు అభిచార క్రియాది ద్రోహముల

చేతను వధించ యత్నించబడినాడు. కాని అన్నిటినుండి తన తేజము చేతనే బయటపడినాడు. ( 45 )

టీ :- చింతామేవాహ - త్రిభిః. ఏష ఇతి. మేమయా అసాధు పరుషం యతా భవతి తథోక్తః. అసద్ధర్మైరపకారైరభిచారైర్వా. (45)

టీ :- చింతను ఇట్లు చెప్పెను. ' ఏషః ' ఇత్యాది మూడు శ్లోకములచే. మే = నాచేత, అసాధు = పరుషముగా, అసద్ధర్మైః = అపచారములచే లేదా అభిచార క్రియలచే (45)

శ్లో ॥ వర్తమానోవిదూరే వై బాలోప్యజడ ధీరయమ్ ।
న విస్మరతి మేనార్యం శునః శేప ఇవ ప్రభుః ॥ 46 ॥

నా సమీపమునందే ఉన్నవాడై కూడా, బాలుడై కూడా నిర్భయచిత్తుడై కుక్క తోక వలె ఎన్ని చెప్పినా తన మార్గమును వీడనివాడై అన్యాయముగా నాయొక్క శత్రుత్వమును విస్మరించకున్నాడు. ( ఇచ్చట " శునః శేప ఇవ " అను వాక్యమునకు మరొక విధముగా, అజీగర్తుని మధ్యమ పుత్రుడు శునః శేపుడనువాడు తల్లి దండ్రులచే హరిశ్చంద్రునకు విక్రయించబడినవాడై ఎట్లైతే వారి అపకారమును విస్మరించనివాడై అతని శత్రువైన విశ్వామిత్రుని ఆశ్రయించి గోత్రాంతరమును పొందెనో అట్లే ఈ ప్రహ్లాదుడును " అని మరియొక అర్థము గ్రహించనగును ). ( 46 )

టీ :- వర్తమాన ఇతి. అవిదూరే వర్తమానో పి బాలో ప్యయం అజడధీః. నిర్భయచిత్తః. మే అకార్యం అన్యాయం. శత్రుత్వం వా న విస్మరతి. అజగర్తస్య మధ్యమపుత్రశ్శునశ్శేఫో నామ.

టీ :- అవిదూరే = సమీపమందుఉన్నప్పటికినీ, బాలుడైనను వాడు, అజడధీః = నిర్భయ చిత్తుడై, నాయొక్క , అనార్యం = అన్యాయమైన శత్రుత్వమును విస్మరించుటలేదు. అజీగర్తుని మధ్యమపుత్రుడు, శునఃశేపుడనువాడు తల్లి

పితృభ్యాం హరిశ్చంద్రాయ విక్రీతస్సన్. యథా తయోరపకార మవిస్మరంస్తద్విపక్షం విశ్వామిత్రమాశ్రిత్య. గోత్రాంతర మాపన్నస్తద్వత్. యద్వా. స్వభావాపరిత్యాగే దృష్టాంతః. శు నశ్శేఫః, పుచ్ఛమివేతి. (46)

దండ్రులచే హరిశ్చంద్రునకు విక్రయియించబడినవాడై ఎట్లైతే వారి అపకారమును మరవక వారి విపక్షమైన విశ్వామిత్రుని ఆశ్రయించి గోత్రాంతరమును పొందెనో అట్లు. లేదా స్వభావము వీడకుండుటయందు దృష్టాంతము కుక్కయొక్క శేపః = తోకవలె అని (46 )

శ్లో ॥ అప్రమేయాను బానోయ మకుతశ్చిద్భయోమరః ।
నూనమేత ద్విరోధేన మృత్యుర్మే భవితా న వా ॥ 47 ॥

సాటిలేని అను భావము గలవాడు, దేనికిని భయము లేనివాడు, అమరుడు (మరణము లేనివాడు) వీడు. వీనితో విరోధము ద్వారా నాకే మృత్యువు కలుగునేమో? వీనికి మృత్యువు కలుగదేమో?. ( 47 )

టీ :- అప్రమేయ ఇతి. అప్రమేయః అపరిమేయో నుభావో యస్య. న కుతశ్చిద్భయం యస్య. న వా భవితా. అన్యథా మృత్యుర్నైవ భవిష్యతీత్యర్థః. (47)

టీ :- అప్రమేయః = అనంతమైన అనుభావము కలవాడు, దేనివలన భయము లేని వాడు, అమరః = మృత్యు శూన్యుడు, మరణించదేమొ. లేదా మృత్యువు అసలు కలుగదేమో అని అర్థము. ( 47 )

శ్లో ॥ ఇతితం చింతయా కిచిన్ మ్లాన శ్రియమధో ముఖమ్ ।
శండామర్కా వౌశనసౌ వివిక్త ఇతి హోచతుః ॥ 48 ॥

అను విచారముచే కొంచెము మ్లానమైన (వాడిన ) కాంతి గల్గిన, అథో ముఖుడై వున్న ఆ హిరణ్యకశిపుని ఏకాంతమున దర్శించినట్టి శు క్రాచార్యుని పుత్రులైన శండామార్కులు అతనితో ఇట్లనిరి. ( 48 )

టీ :- ఇతీతి. ఔశనసౌ ఉశనసః పుత్రౌ - నీతిజ్ఞౌ వివిక్తే ఏకాంతే. (48)

టీ :- ఔషనసౌ = ఉషసుని పుత్రులు నీతిజ్ఞులు వివిక్తే = ఏకాంతమునందు (48 )

శ్లో ॥ జితం త్వయైకేన జగత్త్రయం భ్రువో
ర్విజృంభణత్రస్త సమస్త ధిష్ణ్యపమ్ ।
న తస్య చింత్యం తవనాథ చక్ష్మహే
న వై శిశూనాం గుణ దోషయోః పదమ్ ॥ 49 ॥

నీ ఒక్కడి చేతనే కనుబొమ్మల విజృంభణ మాత్రముననే భయపెట్టబడిన దిక్పాలకులుగల జగత్త్రయము జయించబడినది. అట్టి నీకు విచారించదగినది అగుపడుటలేదు. శిశువులయొక్క నడవడి గుణదోషములకు విషయముగాదు.(49 )

టీ :- జితమితి. భ్రువోర్విజృంభణేనైవ త్రస్తాః ధిష్ణ్యపా యస్మిన్ తస్య చింత్యం. చ చక్ష్మ హే న పశ్యామః. పదమాలంబనం నైవాస్తి. యద్వా. శిశూనాం వృత్తం గుణదోషయోః పదం విషయో న భవతీత్యర్థః. 49)

టీ :- కను బొమలయొక్క విజృంభణము చేతనే భయపెట్టబడిన సమస్త దిష్ణ్యపాః=లోకపాలురుగల ( జగత్త్రయము ) అట్టి నీకు చింతించదగిన విషయమును కానకున్నాము. న చక్ష్మహే = చూడకున్నాము. పదం = ఆలంబనము ( ఆధారము) లేనే లేదు. లేదా శిశువుల నడవడి గుణదోషములకు పదం = విషయము కాదని అర్థము.(49)

శ్లో ॥ ఇమంతు పాశై ర్వరుణస్య బధ్వా
నిదేహి భీతో న పలాయతే యదా ।
బుద్ధిశ్చ పుంసో వయసార్య సేవయా
యావద్గురు ర్భార్గవ ఆగమిష్యతి ॥ 50 ॥

భయపడి పలాయనము చిత్తగించకుండునట్లు ( తప్పించుకొని పారిపోకుండునట్లు ) వరుణ పాశములచే బంధించి శుక్రాచార్యులు వచ్చు వరకు వుంచుము. వయస్సుతోగానీ, ఆర్యుల సేవచేతగానీ పురుషుల బుద్ధి చక్కబడును.(50)

టీ :- తథాపి. బంధనమస్యోచితమిత్యామతుః - ఇమం త్వితి. యావద్గురురాగమిష్యతి. తావద్బుద్ధ్వా నిధేహి. తతః కిమిత ఊచతుః. బుద్ధిశ్చ సమీనా వయసా భవతీతి. (50)

టీ :- ఐనను ఇతనికి బంధనము తగునని చెప్పిరి. ‘ ఇమంతు ’ అని. ఇంతవరకు గరుః = భార్గవుడు ( శుక్రాచార్యుడు ) రాగలడో అంతవరకు బంధించియుంచుము. ఐన నేమి యననిట్లు చెప్పిరి.ఎందువల్లనైతే పురుషుని బుద్ధి వయస్సుచేత అట్లే పూజ్యుల సేవచేతను బాగుపడునో అందువలన(50)

శ్లో ॥ తథేతి గురు పుత్రోక్తమను జ్ఞాయేద మబ్రవీత్ ।
ధర్మాహ్యస్యోప దేష్టవ్యా రాజ్ఞాం మే గృహమేధినామ్ ॥51॥

అని చెప్పిన హిరణ్యకశిపుడు అట్లేనని చెప్పి గురుపుత్రుల మాటలను అంగీకరించి వారితో ఇట్లనెను. గృహస్థాశ్రమమందున్న రాజులయొక్క ధర్మములను ఇతనికి ఉపదేశిం తగును. ( 51 )

టీ :- తథేతి. అనుజ్ఞాయ తథేత్యంగీకృత్య. (51)

టీ :- అనుజ్ఞాయ = అట్లే అని సమ్మతించి ( 51 )

శ్లో ॥ ధర్మ మర్థంచ కామంచ నితరాం చాను పూర్వశః ।
ప్రహ్లాదాయో చతూరాజన్ ప్రశ్రితా వనతాయచ ॥ 52 ॥

అని ఓ ధర్మారాజా ! దైత్యేంద్రుని ఆజ్ఞ మేరకు ఆ గురు పుత్రులు వినయ విధేయతలతో నమ్రుడైన ప్రహ్లాదునకు క్రమమముగ ధర్మమును, అర్థమును, కామమును బాగుగా బోధించిరి. ( 52 )

టీ :- ధర్మమితి. తతశ్చతౌ ప్రహ్లాదాయ ధర్మాదికమూచతుః. ప్రశ్రితశ్చా సావవనతశ్చ తస్మై. (52)

టీ :- అటు తర్వాత ఆ చండామర్కులు ప్రహ్లాదునకు ధర్మము మొదలైన విషయములను చెప్పిరి. వినయము కలిగి నమ్రుడైనట్టి ( బాలునకు ) (52)

శ్లో ॥ యథా త్రివర్గం గురుభిః ఆత్మనే ఉపశిక్షితమ్ ।
న సాధు మేనే తచ్ఛిక్షాం ద్వంద్వారామోప వర్ణితామ్॥53॥

ఎప్పుడైతే గురువులచే తనకు త్రివర్గము ( ధర్మార్థకామ త్రయము ) నేర్పబడినచో అట్టి రాగద్వేషాదులచే విషయములందు ఆసక్తి గలిగి ఆనందమునొందు గురువులచే ఉపదేశించబడిన బోధను ఆ ప్రహ్లాదుడు మంచిదని తలంచకుండెను. ( 53 )

శ్లో ॥ యదాచార్యః పరావృత్తో గృమమేధీయ కర్మసు ।
వయస్యైః బాలకైః తత్రసోపహూతః కృతక్షణైః ॥ 54 ॥

ఎప్పుడైతే గురువుగారు గృహమేధీయ ( గృహస్థు యొక్క ) కర్మలందు ఆసక్తుడై అచ్చటనుండి వేరొకచోటికి వెళ్ళెనో అప్పుడు సమయము లభించిన మిత్రులగు బాలురచే ఆ ప్రహ్లాదుడు క్రీడకై పిలువబడెను. ( 54 )

టీ :- యథేతి. యతావత్ త్రివర్గమనుశిక్షితమపి సాధు న మేనే. తాం శిక్షాం చ. కుతః. ద్వంద్వైరాగద్వేషాదిభిర్విషయేష్వారమణం యేషాం. తైరుపవర్ణితాం. యదేతి. పరావత్తః అన్యత్ర గతః. ఉపహూతః అత్ర. సూ. "సోచి లోపే చేత్పాదపూరణమి" తి సూత్రేణ. సంధిః పారపూరణార్థం. క్రీడార్థం కృతక్షణైః కృతోత్సవైర్ల బ్ధావసరైరితి వా. (53,54)

శ్లో ॥ అథ తాన్ శ్లక్ష్ణయా వాచా ప్రత్యాహూయ మహాబుధః ।
ఉవాచ విద్వాం స్తన్నిష్ఠాం కృపయా ప్రహసన్నివ ॥ 55॥

టీ :- అథేతి. తేషాం నిష్ఠాం జన్మమరణాదిలక్షణాం. విద్వాన్. (55)

శ్లో ॥ తేతు తద్గౌరవాత్సర్వే త్యక్త క్రీడా పరిచ్ఛదాః ।
బాలా న దూషిత ధియో ద్వంద్వారామే రితే హితైః ॥56॥

టీ :- యథా = ఉన్నదున్నట్లుగా ధర్మార్థకామ త్రివర్గము బోధించబడినను దానిని ఆ బోధనకు అతడు మంచిదని తలంచకుండెను. ఎందువలన అనగా? ద్వంద్వైః = రాగ ద్వేషాదులచే, విషయములందు క్రీడించెడు, ఆనందించెడు గురువులచే అది వుపదేశించబడినది. ( 53 )

టీ :- పరావృత్తః = వేరొకచోటికి వెళ్ళెనో ( అప్పుడు ) ఆ ప్రహ్లాదుడు మిత్రులైన ఇతర బాలురచే పిలువబడెను. సోపహూతః అనుచోట సః ఉపహూతః అని పదవిభాగము. పాదపూరణ కొరకు సంధి గావించబడినది. 'సోచ్ లోపే చేత్ పాదపూరణమ్' అను పాణినీయ సూత్రమిచ్చుట గ్రహించనగును. ఆటకై కృతక్షణైః = ఉత్సామమునొందిన లేదా అవకాశమును పొందిన వారునగు ( 54 )

అప్పుడు మహా పండితుడైన అతడు మృదువైన వాక్కుచే తిరిగి తానే పిలిచినవాడై కృపతో నవ్వుచున్నట్లుగనున్నవాడై వారియందుండు జరామరణాది లక్షణమైన అంశమును చెప్పెను. ( 55 )

టీ :- తన్నిష్ఠాం = తేషాం నిష్ఠాం = జన్మ మరణాది లక్షణమైనది అంశమును, విద్వాన్=ఎరింగినవాడు, ( 55 )

మలినముగాని బుద్ధిగల ఆ బాలురు అందరు ఆ ప్రహ్లాదునియందలి గౌరవము వలన క్రీడా సాధనములను వదిలివేసినవారై ఆ ప్రహ్లాదునియందే

శ్లో ॥ పర్యుపాసత రాజేంద్ర ! తన్యస్త హృదయేక్షణాః ।
తానాహ కరుణా మైత్రో మహాభాగవతోఽసురః ॥ 57 ॥

అర్చించబడిన హృదయము, చూపులుగలవారగుచు అని చుట్టుచేరి కొలువసాగిరి. మహాభాగవతుడైన అసురుడగు ఆ ప్రహ్లాదుడు కరుణామైత్రి గలవాడై వారితో ఇట్లు చెప్పెను. ( 56, 57)

టీ :- త ఇతి. ద్వంద్వారామాణామీరితైరీహితైశ్చ. నదూషితా ధీర్యేషాం. యతో బాలాః. (56)

టీ :- రాగద్వేషాదులచే విషయములందాసక్తులైన గురువులయొక్క మాటల చేత, యత్నముల చేతను మాలిన్యము గాని బుద్ధిగల, ఎందువలన అనగా బాలురు. (56)

టీ :- పర్యుపాసతేతి. తస్మిన్నేవ న్యస్తం హృదయమీక్షణం చ యైః.(57)

టీ :- అతనియందే ( ప్రహ్లాదునియందే ) నిల్పబడిన హృదయము చూపులును గలవారై.(57)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమ స్కంధే**
**పంచమోఽధ్యాయః**

**ఇది శ్రీమద్భాగవతమనబడు మహాపురాణమందలి సప్తమస్కంధమందలి శ్రీధరీయ భావార్థ దీపికయను టీకానువాదమున పంచమాధ్యాయము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ కౌమార ఆచరేత్ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహ ।
దుర్లభం మానుషం జన్మ తదప్య ధ్రువ మర్థదమ్ ॥1॥

టీ :- షష్ఠే గురౌ గృహవ్యగ్రే ప్రహ్లాదో దైత్యబాలకాన్, అనుకంప్య పరం తత్త్వం నారదోక్తముపాదిశత్. (1)

టీ :- కౌమార ఇత్యాదినా - ఇహైవ మానుషజన్మని ధర్మానాచరేత్. యతో ర్థదమేతత్. తత్ర చ కౌమార ఏవ. యతస్తదప్యధ్రువమ్. న చైవం భూతం జన్మాంతరం. యతో దుర్లభమ్. తత్ర ధర్మానేనాచరన్న సుఖార్థే ప్రయాసాన్. తత్ర భాగవతానేవ న కామ్యాన్. (1)

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**ప్రహ్లాదుడు ఇట్లు చెప్పెను :-**

మానవ జన్మము దుర్లభమైనది, అది అర్థ ప్రదము. అదియును ఎంతవరకుండునో నిశ్చయము లేదు. ఇలాంటి మానవ జన్మము మరియొకటి లభించునో లేదో? కావున ఈ మానవ జన్మమున కౌమారావస్థయందే భగవత్సంబంధములైన ధర్మములాచరించవలెను. సుఖము కొఱకై ప్రయాసపడరాదు. (1)

టీ :- ఆరవ అధ్యాయమున గురువుగారు గృహకర్మలయందు నిమగ్నమైయుండ ప్రహ్లాదుడు దైత్య బాలకులను దయతలచి నారదుడు చెప్పిన పరతత్త్వమును ఉపదేశించెను. (1)

టీ :- 'కౌమార' ఇత్యాది శ్లోకములలో ఈ మానవ జన్మమునందే ధర్మములనాచరించ వలెను. ఎందువలననగా ఇది అర్థమను పురుషార్థము యొసంగునట్టిది. అందునను కౌమారావస్థయందే . ఇదియును ఎంతకాలముండునో నిశ్చయము లేదు. ఇటువంటి మరోజన్మము అభించదు. ఈ మానవ జన్మము దుర్లభమైనది. అట్టి జన్మము నందు ధర్మములనే ఆచరించు వాడు కావలెను. సుఖము కొఱకై ప్రయాసలు పడవద్దు. అందునను భాగవత ధర్మములనే

ఆచరించవలెను. కామ్య కర్మములను ( ధర్మములను ) ఆచరించవలదు. (1)

శ్లో ॥ యథాహి పురుషస్యేహ విష్ణోః పాదోపసర్పణమ్ ।
యదేష సర్వభూతానాం ప్రియ ఆత్మేశ్వరః సుహృత్ ॥2॥

విష్ణువు సర్వ ప్రాణులకును ప్రియమైనవాడు, ఆత్మేశ్వరుడు, మిత్రుడు కావున ఈ జన్మమున పురుషుడు విష్ణువు యొక్క పాదముల చెంతకు చేరుటయే ఉత్తమము. యోగ్యము. (2)

టీ :- నిరర్థక క్రియాకలాపైః ఆయుర్వ్యయమజానతామ్, ప్రహ్లాద స్సదయం ప్రాహ ధర్మం భాగవతం కృతీ. (2)

టీ :- వ్యర్థమైన కార్యకలాపములచే తమ ఆయువు వ్యర్థమగుచుండుటను ఎరుగనట్టి దైత్య బాలకులకు కృతకృత్యుడైన ప్రహ్లాదుడు దయతో భాగవత ధర్మమును చెప్పెను. (2)

టీ :- ఇహ భగవతానేవ ధర్మానాచరేదిత్యేతదుపపాదయతి - యథా హీతి చతుర్భిః. ఇహ పురుషస్య విష్ణోః పాదోపసర్పణమేవ యథానురూపం యోగ్య మిత్యర్థః. యద్యస్మాదేష ప్రియ ఇత్యాదినా. (2)

టీ :- ఇచ్చట భాగవత ధర్మములనే ఆచరిచవలెనను విషయమును పేర్కొనుచున్నాడు. ' యథాహి ' అను నాలుగు శ్లోకములతో. ఈ జన్మమునందు పురుషునకు విష్ణువుయొక్క పాదముల పొందుటయే తమకు తగినట్లుగా యోగ్యమని అర్థము. ఎందువలననైతే ఆ విష్ణువు ప్రియమైనవాడో ఇత్యాదిగా. (2)

శ్లో ॥ సుఖ మైంద్రియకం దైత్యా దేహయోగేన దేహినామ్ ।
సర్వత్ర లభ్యతే దైవాద్యథా దుఃఖ మయత్నతః ॥ 3 ॥

ఓ దైత్యులారా ! ప్రాణులకు దేహయోగముచేత, పూర్వజన్మ కర్మ వశమున దుఃఖమువలెనే ఏ ప్రయత్నమును లేకయే అన్ని జన్మములయందు ఇంద్రియ సుఖము కూడా లభించును. (3)

టీ :- నను భోగోద్యమః కథం త్యాజ్య ఇతి చేత్తత్రాహ - సుఖమితి. సర్వత్ర పశ్వాదావపి. దైవాత్పూర్వాదృష్టాదేవ. (3)

టీ :- మఱి ఈ భోగోద్యమము ఎట్లెట్లు వదల తగును? అనిన ఇట్లు చెప్పెను. 'సుఖం' ఇత్యాదిగా. పశువులు మొదలైన అన్ని జన్మములందును, దైవాత్ = పూర్వ జన్మకృత అదృష్ట కర్మచేతనే సుఖము పొందబడుచున్నది. (3)

శ్లో ॥ తత్ప్రయాసో న కర్తవ్యో యత ఆయుర్వ్యయః పరమ్ ।
న తథా విందతే క్షేమం ముకుంద చరణాంబుజమ్ ॥4॥

కాన సుఖమునకై ప్రయాసపడరాదు. దానివలన కేవలము ఆయువు వ్యయమగునే కానీ ఫలితముండదు. ముకుందుని చరణ కమలములను పొందిన లభించు క్షేమము సుఖానుభవమున కలుగదు. (4)

టీ :- అతస్తదర్థం ప్రయాసో న కర్తవ్యః. యతః ప్రయాసాత్పరం కేవలమానుషో వ్యయ ఏవ. యత స్తథా తేన ప్రకారేణ క్షేమం న ప్రాప్నోతి. (4)

టీ :- కావున దానికై ప్రయాస పడరాదు. ఎందులకనిన ప్రయాస వలన కేవలము ఆయుష్షుయొక్క వ్యయమే అగును. ఎట్లైతే విష్ణువు యొక్క పాదప్రాప్తి వలన కలిగెడు క్షేమము లౌకిక సుఖప్రాప్తిచే కలుగదు. (4)

శ్లో ॥ తతో యతేత కుశలః క్షేమాయ భయమాశ్రితః ।
శరీరం పౌరుషం యావన్నవిపద్యేత పుష్కలమ్ ॥ 5 ॥

అందువలన ఈ సంసారమున జన్మించిన పురుషుడు ఎంతవరకైతే ఈ పురుష రూపమైన శరీరము కలిగియుండునో,ఈ శరీరము విపత్తును పొందకుండునో, అంతలోపు నేర్పరియై క్షేమమునకై యత్నించవలసినది.(5)

టీ :- భయమాశ్రితః సంసారం ప్రాప్తం. పురుషరూపం శరీరం యావత్పుష్కల మస్తి న విపద్యేత అక్షమం న భవేన్ననశ్యేదితివా తావచ్ఛీఘ్రం క్షేమాయ యతేత. (5)

టీ :- భయమాశ్రితః = సంసారమును పొందినవాడై, పురుష రూపమైన శరీరము ఎంతవరకైతే జరావ్యాధి పీడితము కాకుండా యుండునో, విపత్తును పొందదో, కార్యాచరణమునకై అశక్తము కాదో, లేదా నశించదో అంతలో శీఘ్రముగా క్షేమముగా యత్నించవలెను. (5)

శ్లో ॥ పుంసో వర్షశతం హ్యాయుస్తదర్ధం చా జితాత్మనః ।
నిష్ఫలం యదసౌ రాత్ర్యాం శేతేన్ధం ప్రాపితస్తమః ॥6॥

పురుషునకు వందసంవత్సరముల ఆయువు. అందు సగము యాభది సంవత్సరముల రాత్రి, దానిలో అజితాత్ముడై , అజ్ఞానము గలవాడై పురుషుడు దానిని వ్యర్థము చేయుచున్నాడు. నిద్రించుచున్నాడు. (6)

టీ :- ఆయుర్వ్యయక్రమమాహ - పుంస ఇతి త్రిభిః. యద్యస్మాత్ శేతే. (6)

టీ :- ఆయుర్వ్యయక్రమమును చెప్పుచున్నాడు. ' పుంస ' ఇత్యాది మూడింటిచే. ఎందువలన అనగా నిద్రించుచున్నాడు. (6)

శ్లో ॥ ముగ్ధస్య బాల్యే కౌమారే క్రీడతో యాతి వింశతిః ।
జరయాగ్రస్త దేహస్య యాత్య కల్పస్య వింశతిః ॥ 7 ॥

మూఢుడైన మానవునకు బాల్య కౌమారములలో క్రీడించుచుండ ఇరువది సంవత్సరముల ఆయువు గడిచిపోవుచున్నది. ముసలి తనముచే శరీరము గ్రస్తమై ఏమియును చేయ శక్తుడుగాని స్థితిలో ఇరువది వత్సరముల కాలము గడుచును.(7)

టీ :- వింశతిర్వర్షాణ్యాయుర్యాతి. (7)

టీ :- ఇరువది వత్సరముల ఆయువు గడుచుచున్నది. ( 7 )

శ్లో ॥ దురా పూరేణ కామేన మోహేనచ బలీయసా ।
శేషం గృహేషు సక్తస్య ప్రమత్తస్యాప యాతి హి ॥ 8 ॥

దుఃఖముచే సంపూర్ణముగా వ్యాప్తమైన కామముచే, బలీయమైన మోహముచే తను గృహములందు ఆసక్తుడై మత్తుడైన పురుషునకు శేష జీవితము గడిచిపోవును.(8)

టీ :- దురాపూరేణ దుఃఖైః సమన్తాదాపూర్వమాణేన. (8)

టీ :- దురాపూరేణ = దుఃఖములచే చుట్టూరా బాగా నింపబడిన. (8)

శ్లో ॥ కో గృహేషు పుమాన్సక్త మాత్మాన మజితేంద్రియః
స్నేహ పాశైః దృఢైర్బద్ధ ముత్సహేత విమోచితుమ్ ॥ 9॥

గృహములందు సక్తుడై, ఇంద్రియములను నిగ్రహింపజాలనివాడై, దృఢములైన స్నేహ పాశములచే బద్ధుడైన ఏ పురుషుడు వాని నుండి బయట పడుటకు వుత్సహించును? (9)

టీ :- నను యౌవనే గృహాసక్తోపి పశ్చాద్విరక్తస్సన్ క్షేమం యాస్యతీత్యాశంక్య తదసంభవం దర్శయన్ కౌమార ఏవాచరేదిత్యేతదుపాదయతి. - కోగృహేష్వితి సప్తభిః. (9)

టీ :- యౌవనమున గృహాసక్తుడైనను తర్వాత విరక్తుడై క్షేమమును పొందును కదా! యని శంకించి అది యసంభవమని చూపుచూ కౌమారావస్థయందే ధర్మాచరణ గావించవలెనని ప్రతిపాదించుచున్నాడు. "కోగృహేషు" ఇత్యాదిగా సప్తశ్లోకములతో.(9)

శ్లో ॥ కో న్వర్థ తృష్ణాం విసృజే త్ప్రాణేభ్యోఽపి య ఈప్సితః ।
యం క్రీణాత్యసుభిః ప్రేష్ఠైస్తస్కరః సేవకో వణిక్ ॥ 10 ॥

తస్కరుడు, సేవకుడు, నావికుడును ( ప్రాణములను అర్పించుటకు సిద్ధమై ధనార్జనకు సిద్ధపడుచుండ ) తనకు మిక్కిలి ప్రియములైన ప్రాణముల నర్పించియు ఏ ధనమును ఆర్జించుచున్నారో అట్టి అర్థతృష్ణను ఎవడు వదులుకొనగలడు. (10)

టీ :- యమర్థమసుభిః క్రీణాతి ప్రాణహానిమంగీకృత్యాపి సాదయతి తస్కరాదిః తస్మిన్నర్థే తృష్ణాం కోనువిసృజేత్. (10)

టీ :- యమర్థమసుభిః క్రీణాతి = ఏ ధనమునైతే ప్రాణహానిని అంగీకరించియు సంపాదించగోరుచున్నాడో, దొంగ, సేవకుడు, నావికుడు ఇత్యాదులు తమ ప్రాణములను ఫణముగ పెట్టి ధనసంపాదనకు ఉద్యమించుచున్నారు. అట్టి అర్థమునందు ఎవడు ఆశను వీడును ? ( ఎవడును వీడజాలడు ). ( 10 )

శ్లో ॥ కథం ప్రియాయా అనుకంపితాయాః
సంగం రహస్యం రుచిరాంశ్చ మంత్రాన్ ।
సుహృతుసచ స్నేమసితః శిశూనాం
కలాక్షరాణా మనురక్త చిత్తః ॥ 11 ॥

తన దయకు పాత్రురాలైన తన ప్రియురాలియొక్క రహస్య సంగమమును, అందమైన ముచ్చటలను, మిత్రుల సహవాసమును, శిశువులయొక్క ముద్దు పలుకులను, వారి నడకలను, ఏల మరువగలడు? (11)

టీ :- కథమితి. ప్రియాయాః సంగాదికం స్మరన్. కథం త్యజేతేతి తృతీయేనాన్వయః. మంత్రాన్ హితశిక్షాలాపాన్. సుహృత్సు చ సంగం. తేషాం స్నేహేన సితో బద్ధః. కలాని మధురాణి అక్షరాణి యేషాం తేషాం చ. సంగం తేష్వనురక్తం చిత్తం యస్య. (11)

టీ :- ఇంతేగాక ఎట్లు ఇత్యాది. ప్రియురాలి సంగాదికమును స్మరించుచు ఎట్లు సంసారమును త్యజించును. అని మూడవ శ్లోకముతో అన్వయము. మంత్రాన్=హిత శిక్షా భాషణములను , మిత్రులయందలి స్నేహమును, వారియొక్క స్నేహముచే సితః=బద్ధుడై, కలాని = మధురమైన అక్షరములు గలవారి (పిల్లల) సంగమును, వారియందు అనురక్తమైన చిత్తము కలవాడై.(11)

శ్లో ॥ పుత్రాన్ స్మరంస్తా దుహితౄః హృదయ్యా
భ్రాతౄన్ స్వసౄర్వా పితరౌచ దీనౌ ।
గృహాన్మనోజ్ఞోరుపరిచ్ఛదాంశ్చ
వృత్తీశ్చ కుల్యాః పశుభృత్య వర్గాన్ ॥ 12 ॥

పుత్రులను స్మరించుచు, పుత్రికలను, హృదయంగములైన సోదరులను, తోబుట్టువులైన స్త్రీలను, దీనులైన తల్లిదండ్రులను, మనోజ్ఞములైన అలంకారములుగల గృహములను, తన వృత్తులను, కులపరంపరాగతములైన పశుభృత్య వర్గమును ఎలా వీడగలడు? ( 12 )

టీ :- తాః శ్వశురుగృహే స్థితాః. హృదయ్యా హృదయంగమాః. మనోజ్ఞాః. ఉరవః పరిచ్ఛదా యేషు తాన్. వృత్తీర్జీవికాః. కుల్యాః కులపరంపరాగతాః. (12)

టీ :- తాః = శ్వశుర గృహమందుండెడు, హృదయ్యాః = హృదయంగములైన, మనోజ్ఞములైన, ఉరవః = అలంకారములుగల వస్తుజాలములను, వృత్తీః = జీవికలను (వృత్తులను ) కుల్యాః = కులపరంపరగా వచ్చిన. ( 12 )

శ్లో ॥ త్యజేత కేశస్కృదివేహమానః
కర్మాణి లోభాద వితృప్త కామః ।
ఔపస్థ్య జైహ్వ్యం బహుమన్య మానః
కథం విరజ్యేత దురన్తమోహః ॥ 13 ॥

ఎట్లైతే పట్టు పురుగు తన గూడును నిర్మించుకొనుచు బయటకు వెడలు ద్వారమును గూడా మిగులకుండ అల్లుకొనునో అట్లే కర్మలను చేయగోరువాడై లోభము వలన ఏ కోరికలు తీరనివాడై ఔపస్థములైన (శిశ్న సంబంధములైన) జిహ్వ సంబంధములైన కోరికలనే గొప్పవని తలంచుచు అంతము లేని మోహము గలవాడై వాని యెడల యెట్లు వైరాగ్యమును బొందును? ( 13 )

టీ :- కోశస్కృత్ కోశకారీ కీటః. యథా గృహం కర్వన్నాత్మనో నిర్గమాయ ద్వారమపి నివశేషయతి. తథా కర్మాణీహమానః. నన్వవితృప్తకామో పి దోషదర్శనేన విరక్తస్సన్ త్యజేత్తత్రాహ –ఔపస్థ్యం శైశ్నం చ. జైహ్వ్యం చ యత్ సుఖం తదేవాధికం మన్యమానః. అతో దురంతో మోహో యస్య సః. కథం విరజ్యేత విరక్తస్స్యాత్. (13)

టీ :- కోశస్కృత్ = పట్టు పురుగు, అది ఎట్లైతే తనకు హితకరమైన గృహమును చేసుకొనుచున్నదై అందుండి వెడలుటకు ద్వారమును కూడా మిగుల్చుకొనదో అట్లే కర్మలను చేయగోరువాడై, తృప్తి బొందనివాడయ్యు దోష దర్శనముచే విరక్తుడై వదులను గదా ! యనిన ఇట్లు చెప్పెను. ఔపస్థ్యం = శిశ్నసంబంధమైన, జిహ్వాసంబంధమైనట్టియు సుఖమునే గొప్పగా తలచువాడై, అందువలన దురంతమైన మోహముగలవాడై, అతడెట్లు విరజ్యేత = విరక్తుడగును. (13)

శ్లో ॥ కుటుంబపోషాయ వియన్నిజాయుః
న బుధ్యంతేర్థం విహతం ప్రమత్తః ।
సర్వత్ర తాపత్రయ దుఃఖితాత్మ
నిర్విద్యతే న స్వకుటుంబ రామః ॥ 14 ॥

కుటుంబ పోషణమునకై క్షీణించెడు తన ఆయువును, నశింపజేయబడు పురుషార్థమును, ఎరుంగడు. ప్రమత్తుడై అన్నింట అధ్యాత్మికత, ఆదిభౌతికత, ఆధి దైవికములనే తాపత్రయముచే దుఃఖితుడగుచు కూడా తనకుటుంబము నందే సంతోషించువానియందు నిర్వేదమునందదు. అనగా అవి దుఃఖములని తలంచడని యర్థము. ( 14 )

టీ :– దురంతమోహత్వం దర్శయన్నాహ – కుటుంబేతి. కుటుంబపోషణాయ యత్ క్షీయమానం నిజమాయుః పురుషార్థం చ విహతం న బుధ్యతే. అతఏవ తాపత్రయేణ దుఃఖచిత్తో పి న నిర్విద్యతే దుఃఖబుద్ధిం న కరోతి. యతః స్వకుటుంబే రామో రతిర్యస్య. (14)

శ్లో ॥ విత్తేషు నిత్యాభి వినిష్టచేతా
విద్వాంశ్చ దోషం పరవిత్త హర్తుః ।
ప్రేత్యేహ చాథాప్యజితేంద్రియ స్త
దశాన్తకామో హరతే కుటుంబీ ॥ 15 ॥

టీ :– ప్రత్యుత చౌర్యం కరోతీత్యాహ – విత్తేష్వితి. నిత్యమభి నివిష్టం చేతో యస్య సః. పరవిత్తహర్తుః ప్రేత్య నరకలక్షణం. ఇహ చ దండాదిరూపం దోషం యద్యపి విద్వాన్. అథాప్యశాంత కామః అశాంతాభిలాషః. తత్ పరవిత్తం హరత్యేవ. (15)

టీ :– దురంత మోహమును చూపుచు ఇట్లనియెను. కుటుంబ పోషణమునకై పాటుపడుచు, వియత్ = క్షీణించెడు తన ఆయువును, పురుషార్థమున్నూ నశించుదానిని ఎరుగడు. కావుననే తాపత్రయముచే దుఃఖించు చిత్తము కలవాడై నిర్వేదము నొందదు. అనగా దానియందు దుఃఖమును, బుద్ధిని పొందదు. ఎందుకన అతడు తన కుటుంబమునందే ప్రీతికలవాడు. ( 14 )

ధనములందు నిత్యము అభినివేశ చిత్తుడై పర విత్తము హరించువానికి పరలోకమున ఇహలోకమునను గావించబడు దండనము నెరింగినవాడయ్యు అజితేంద్రియుడై కుటుంబీకుడు కలిగిన దానితో కోరిక తీరక పరవిత్తమును హరించును. ( 15 )

టీ :– అదియునుగాక దొంగతనమును గూడా చేయునని ఇట్లు చెప్పెను. 'విత్తేషు' ఇత్యాది శ్లోకమున. నిత్యము ( ధనమునందు ) లగ్నమైన చిత్తము కలవాడై పరవిత్తము హరించు వానికి ప్రేత్య = నరకమున, నరకలక్షము, ఈ లోకమునందును దండాదిరూపమైన దోషమును విద్వాన్ = తెలుసుకొన్నవాడయ్యు, శమించని అభిలాష గలవాడై ఆ పర విత్తమును హరించుచునే యున్నాడు. ( 15 )

శ్లో ॥ విద్వాన పీత్థం దనుజాః కుటుంబం
పుష్ణం స్వలోకాయ న కల్పతేవై ।
యః స్వీయ పారక్య విభిన్నభావః
తమః ప్రపద్యేత యథా విమూఢః ॥ 16 ॥

ఓ దనుజులారా ! విద్వాంసుడైనను ఇట్లు తన కుటుంబమును పోషించుకొనువాడై ఆత్మ పరామర్శగావించుకొన సమర్థుడుగాడు. అతడు విద్వాంసుడైనను మూఢునివలె స్వీయము, పరకీయము అను విభిన్నభావము గలవాడై తమోభినివేశమునే పొందుచున్నాడు. ( 16 )

టీ :- తదేవం కో గృహేషు పుమానిత్యాదిసప్తభిశ్లోకైరుపపాదితం గృహాదిషు ప్రసక్తస్య వైరాత్యాదసంభవముపసంహరతి - విద్వానపీతి. స్వలోకాయ ఆత్మపరామర్శాయ న కల్పతే. కింతు విమూఢో యథా తథా విద్వానపి తమః అభినివేశమేవ ప్రపద్యతే. తత్ర హేతుః - ఇ ఇతి. స్వీయమిదం పారక్యమిదమితి భిన్నోభావో భావనా యస్య సః. (16)

టీ :- అందువలన ఏ పురుషుడు గృహములందు ఇత్యాదిగా ( కో గృహేషు పుమాన్) సప్తశ్లోకములచే ప్రతిపాదించెను. గృహాదులందు ప్రసక్తు డైన వానికి వైరాగ్యాదుల అసంభవమును ముగించుచున్నాడు. ' విద్వాన్ ' ఇత్యాదిగా. స్వలోకాయ = ఆత్మ పరామర్శ గావించుకొన అసమర్థుడగును. ఇంతేగాక విమూఢునివలె విద్వాంసుడుగూడా తమోగుణమునందే అభినివిష్టుడగును. అందుకు కారణము 'య' ఇత్యాదిగా. ఇది తనది. ఇది పరునిది అను విభిన్నమను భావః = భావన కలవాడై యుండును. ( 16 )

శ్లో ॥ యతో న కశ్చిత్క్వచ కుత్ర చిద్వా
దీనః స్వమాత్మాన మలం సమర్థః ।
విమోచితుం కామ దృశాం విహార
క్రీడా మృగో యన్నిగడో విసర్గః ॥ 17 ॥

ఎందువలననైతే ఎవ్వడు ఎక్కడ గూడా ఎప్పుడైనను గృహలంపటుడైన మూఢుడు స్వకీయమైన ఆత్మను ముక్తిపొందించుకొన సమర్థుడు కాడో, అప్పుడు అందువలన కామ దృష్టి గలవారి విహారమందలి క్రీడా సాధనమైన మృగమగుచున్నాడు. ' విహారం' అను పాఠాంతరమున విహార సాధనమైన తనను అని అర్థము చెప్పుకొనదగును. ఎందులకనగా పుత్ర పౌత్రాదిరూపమైన సంకెలలు కలవాడగుచున్నాడు. ( 17 )

టీ :- తస్మాత్ కౌమార ఏవ భాగవతాన్ ధర్మాన్ ఆచరేదితి సహేతుక ముపసంహరతి - యత ఇతి. యతః కశ్చిదపి స్వమాత్మానం మోచితుం న సమర్థః తతః నారాయణముపేత. శరణం యాతేత్యుత్తరేణాన్వయః. అసామర్థ్యే హేతుః అలం దీనో లంపటః అతః కామో దృశి యాసాం తాసాం విహారే క్రీడాయాం నిమిత్తే క్రీడామృగః. విహారమితి పృథక్ పాఠే. తాసాంవిహారసాధన మాత్మానం. యతస్తాసాం క్రీడామృగః స ఇత్యన్వయః కించ యత్ యాసు నిగలః శృంఖలాతుల్యో విసర్గః పుత్రాదిరూపో భవతి. (17)

టీ :- అందువలన కామావస్థయందే భాగవత ధర్మములను ఆచరించవలెనని సహేతుకముగా నిరూపించుచు ముగించుచున్నాడు. ' యతః ' ఇత్యాది శ్లోకముల ద్వారా ఎందువలననైతే ఎవడుగూడా తన ఆత్మను విడిపించుకొన ( మోక్షమునొందింప) సమర్థుడుకాడో అందువలన నారాయణుని శరణము, ఉపేత = పొందుడు అని ఉత్తరార్థముతో అన్వయము. అసామర్థ్యమునకు హేతువు. అలందీనో = లంపటుడు ( సంసారమున తగుల్కొన్నాడు ) అందువలన కామదృష్టిగల వారికి విహారే =క్రీడయందు క్రీడామృగః = ఆటమృగముగా వాడు అని అన్వయము. ఇంతేకాక ఒకవేళ వీరియందు సంకెలలతో సదృషమైన విసర్గః = పుత్రపౌత్రాది రూపమై అగుచున్నాడు.(17)

శ్లో ॥ తతో విదూరాత్పరి హృత్య దైత్యా
దైత్యేషు సంగం విషయాత్మకేషు ।
ఉపేత నారాయణమాది దేవం
సముక్త సంగై రిషతోపసర్గః ॥ 18 ॥

కావున ఓ దైత్యులారా!విషయాత్ములైన దైత్యులయందలి సహవాసమును పరిహరించి ఆదిదేవుడైన నారాయణుని పొంది ముక్తి నొందుడు. ఆయనే ముక్తసంగులైన మునులకు ఇష్టమైన అపవర్గము (మోక్షము). (18)

టీ :- తత ఇతి. విదూరాత్ దూరతః సంగం పరిహృత్య. యద్వా. అవిదూరాచ్ఛీఘ్రం నారాయణముపేతేత్యన్వయః. యస్మాత్. స ఏవ అపవర్గః ఇసితో ఇష్టః. (18)

టీ :- విదూరాత్ = దూరముగ సహవాసమును వదిలి లేదా అవిదూరాత్ = దగ్గరగా శీఘ్రముగా నారాయణుని పొంది అని అన్వయము. అందువలన అతడే ( నారాయణుడే ) అపవర్గముగా ఇష్టమైనవాడు.(18)

శ్లో ॥ నహ్యచ్యుతం ప్రీణయతో బహ్వాయాసోసురాత్మజాః ।
ఆత్మత్వా త్సర్వభూతానాం సిద్ధత్వా దిహ సర్వతః ॥ 19॥

ఓ అసుర పుత్రులారా! అచ్యుతుని సంతోషపరచువారికి బహు ఆయాసములేదు. ఆయన సర్వప్రాణులకు ఆత్మ స్వరూపుడైనందున, ఇహ లోకమున సిద్ధస్వరూపుడైనందున ఆయాసము అధికముగా పొందనవసరము లేదు. ( 19 )

టీ :- నను బాలానామస్మాకం తద్భజనమశక్యమితి చేత్తత్రాహ - నహీతి. బహ్వాయాసః అతి ప్రయాసః. (19)

టీ :- బాలురమైన మాకు అతని భజనము అశక్యము కదా ! యనిన ఇట్లు చెప్పెను. ' నహీ ' ఇత్యాదిగ. బహ్వాయాసః = అతిప్రయాసము. ( 19 )

శ్లో ॥ పరావరేషు భూతేషు బ్రహ్మాంత స్థావరాదిషు ।
భౌతికేషు వికారేషు భూతేష్వథ మహత్సుచ ॥ 20 ॥

బ్రహ్మాంతములైన స్థావరాది జీవులయందును, పరావరములైన, భౌతికములైన ( జీవములేని ) ఘటాదులయందును, మహత్తులైన ఆకాశాది భూతములయందును ( ఆత్మయగు ఈశ్వరుడుండును ). ( 20 )

టీ :- ఆత్మత్వాత్సర్వత్ర సిద్ధత్వాదితి చ హేత్వయముపపాదయతి - చతుర్భిః, పరావరేష్వితి. బ్రహ్మా అంతో యేషాం స్థావరాదిర్యేషాం తేషు దేవేషు అజీవేషు భౌతికేషు అజీవేషు ఘటాదిషు మహత్సు చ భూతేష్వాకాశాదిషు. (20)

టీ :- అతడు ఆత్మ స్వరూపుడైనందున, అంతట సిద్ధమైయున్నవాడై యున్నందున అను కారణ ద్వయమును ప్రతిపాదించుచున్నాడు. 'పరావరేష 'ఇత్యాదిగ నాలుగు శ్లోకములతో. బ్రహ్మయే అంతముగా గల స్థావరములు అదిగాగల, భూతేషు=జీవము లేనట్టి ఘటాదులందు. మహత్తులైన ఆకాశాది భూతములందు. ( 20 )

శ్లో ॥ గుణేషు గుణసామ్యేచ గుణవ్యతికరే తథా ।
ఏక ఏవ పరో హ్యాత్మా భగవానీశ్వరోऽవ్యయః ॥ 21 ॥

గుణములందు , గుణసామ్యముగల ప్రధానరూపమునందును, మహత్తత్వాదులయందును, బ్రహ్మ స్వరూపుడు, అవ్యయుడు, ఈశ్వరుడు, ఆత్మయునైన భగవంతుడొకడే యుండును. ( 21 )

టీ :- గుణేష్వితి. గుణసామ్యే ప్రధానే గుణవ్యతికరే. మహత్త్వాదౌ చ. పరః బ్రహ్మస్వరూపః. (21)

టీ :- గుణసామ్యే = ప్రధానమైన రూపమునందు, గుణవ్యతికరే = మహత్త్వాదులందు పరః = బ్రహ్మరూపుడైన. ( 21 )

శ్లో ॥ ప్రత్యగాత్మ స్వరూపేణ దృశ్య రూపేణచ స్వయమ్ ।
వ్యాప్య వ్యాపక నిర్దేశ్యో హ్యనిర్దిశ్యోకవికల్పితః ॥ 22 ॥

శ్లో ॥ కేవలానుభవానంద స్వరూపః పరమేశ్వరః ।
మాయయాంతర్హితైశ్వర్య ఈయతే గుణ సర్గయా ॥ 23॥

ప్రత్యగాత్మ స్వరూపముతో ( ద్రష్టయు, భోక్తయు తానై ) దృశ్యరూపముగను స్వయముగ ఆ భగవంతుడే ఉన్నవాడై, వ్యాప్య - వ్యాపకములుగ ( ఉదా ॥ ధూమాగ్నులు) నిర్దేశించబడువాడైన, వికల్పములు లేనివాడైన, కేవలానుభవ ఆనంద స్వరూపుడు పరమేశ్వరుడు ఒక్కడే మాయచే అంతర్హితమైన ఐశ్వర్యము గలవాడై గుణాత్మకమైన సృష్టిరూపమున దర్శించబడుచున్నాడు. ( 22, 23 )

టీ :- కథం తర్హి ద్రష్టృదృశ్య భోగ్యాదిభేదః. మాయయేత్యాహ - ప్రత్యగాత్మేతి. ప్రత్యగాత్మా ద్రష్టా భోక్తా తత్స్వరూపేణ వ్యాపకతయా నిర్దేశ్యః. దృశ్యం భోగ్యం దేహాది. తద్రూపేణ వ్యాప్యకతయా చ నిర్దేశ్యః మాయయా ఈయత ఇత్యుత్తరేణాన్వయః. వస్తుతస్తు స్వయం అవికల్పితో నిర్దేశ్యో పి సన్. యద్వా. అనిర్దేశ్యోపి ఏవం నిర్దేశ్యస్సన్ వికల్పిత ఈయతే ఇత్యన్వయః. (22)

టీ :- అట్లైన ద్రష్ట- దృశ్యము, భోక్త, భోగ్యము మొదలుగాగల భేదమెట్లు? అనిన 'మాయయా ' అని చెప్పెను. ప్రత్యగాత్మా = ద్రష్టా, భోక్తా అను ఆ స్వరూపముచే వ్యాపక రూపమున నిర్దేశించదగినవాడు. దృశ్యము, భోగ్యము, దేహాదికము అను ఆ రూపముచే వ్యాప్యకత్వ రూపమున నిర్దేశించదగినవాడు మాయచే ఆయా రూపమున గోచరించుచున్నాడు. అని ఉత్తర శ్లోకముతో అన్వయము. వాస్తవముగనైతే స్వయముగ, అవికల్పితః = అనిర్దేశ్యుడైనను ఇట్లు నిర్దేశ్యుడగుచు వికల్పించబడినవాడై గోచరించుచున్నాడు. అని అన్వయము. ( 22 )

టీ :- కేవలేతి. యతః కేవలానుభవాత్మక ఆనందఏవ స్వరూపం యస్య. నను స ఏవ చేత్ సర్వత్ర తర్హి సర్వత్ర సర్వజ్ఞ సర్వజ్ఞత్వాద్యు పలభ్యేత? తత్రాహ - గుణాత్మకః సర్గో యస్యాస్సా గుణసర్గా తయా మాయయా అంతర్హితమైశ్వర్యం యేన సః.(23)

టీ :- ఎందువల్లనైతే కేవలమైన అనుభవాత్మక ఆనంద స్వరూపుడు, మరి అతడే సర్వత్ర ఉన్నట్లైన సర్వత్ర సర్వజ్ఞత్వాదికము పొందదగియుండుగాక అనిన ఇట్లు చెప్పెను. గుణాత్మకమైన సృష్టిచే మాయచే అంతర్హితమైన ఐశ్వర్యముగలవాడై (23 )

శ్లో ॥ తస్మా త్సర్వేషు భూతేషు దయా కురుత సౌహృదమ్ ।
ఆసురం భావ మున్ముచ్య యయాతుష్య త్యధోక్షజః ॥24॥

కాన సకలప్రాణుల యెడ సహృదయము గలవాడై దయను చూపవలసినది. ఆ సురభావమును వీడి కృపాంతరంగుడు కాదగును. దానిచే అధోక్షజుడు సంతోషపడును. ( 24 )

టీ :- తస్మాదితి. యస్మాదేవం తస్మాత్సర్వేషు యథోచితం దయాం సౌహృదం చ కురుత యయా దయయా. ఉన్ముచ్య సంత్యజ్య. (24)

టీ :- ఎందువలననైతే సర్వత్ర అంతర్యామియై ఈశ్వరుడున్నాడో అందువలన సర్వభూతములయందు యథోచితముగా దయను, సహృదయతను కలిగియుండవలెను. యయా = ఏ దయచే. ఉన్ముచ్య = వదిలి. ( 24 )

శ్లో ॥ తుష్టేచ తత్ర కిమలభ్య మనంత ఆద్యే
కింతైర్గుణ వ్యతికరాదిమయే స్వసిద్ధాః ।
ధర్మాదయః కిమగుణేన చ కాంక్షితేన
సారంజుషాం చరణయోరుపగాయతాం నః ॥25॥

అనంతుడు, ఆద్యుడునగు ఆ ఆత్మరూపుడైన జనార్దనుడు సంతోషించిన ఇక పొందరానిదేది కలదు? ఆ మహత్త్వాదులవలన ఇందు ప్రయోజనమేమి? అవి స్వయముగనే సిద్ధించినవగును. ధర్మాదులును భగవత్ప్రసాదమువలన స్వయం సిద్ధములే యగును. నిర్గుణమగు మోక్షమును కాంక్షించుట ఎందులకు? అతని చెంతజేరి గానము చేయు మనకు అది కోరకయే సిద్ధించును. లేదా అతని పాదసేవామృతము గ్రోలు మనకు మోక్షము అవసరము లేదు. ( 25 )

టీ :- తతః కిమిత్యత ఆహ - తుష్ట ఇతి. తత్ర తస్మిన్ కిమలభ్యం. తథాపి గుణపరిణామాదేవ స్వసిద్ధా అయత్నతః సిద్ధాయే ధర్మాదయః తైః కిం అగుణేన చ మోక్షేణకాంక్షితేనకిం? తముపగాయతాం నో స్మాకమనాకాంక్షితస్యాపి సిద్ధేః యద్వా. మాభూన్మోక్షః. తస్య చరణయోః సారంజుషాం సుధాం సేవమానానాం తేనాపి కిమిత్యర్థః. (25)

టీ :- ఐతేనేమి యనిన ఇట్లనెను. అచ్చట ఇట్లు భగవంతుడు తుష్టి పొందినవాడుకాగా పొందరానిదేమికలదు? ఐనను గుణపరిణామమైన దైవము వలననే స్వసిద్ధాః = అయత్నముగనే ఏ ధర్మాదులైతే సిద్ధించునో వానిచే నేమి ప్రయోజనము? గుణవిహీనమైన మోక్షమును కోరుటచేతను ఏమి ప్రయోజనము? ఆ ఈశ్వరుని మోక్షమునకన్న మిన్నయైన వానిని, కీర్తించెడు మనకు కోరకున్నను ఆ మోక్షము సిద్ధించునదే కదా ! లేదా మోక్షము కలుగవద్దు గాక. ఆ భగవంతుని చరణముల సారమైన అమృతమునాస్వాదించువారికి ఆ మోక్షముతో ఏమిపని? అని అర్థము. ( 25 )

శ్లో ॥ ధర్మార్థ కామ ఇతి యోభిహిత స్త్రివర్గ
ఈక్షత్రయీ నయదమౌ వివిధా చ వార్తా ।
మన్యేతదేత దఖిలం నిగమస్య సత్యమ్
స్వాత్మార్పణం స్వ సుహృదః పరమస్యపూతః॥26॥

అటులైన పురుషార్థములు గానట్టి ధర్మాదులెందుకనిన ఆచార్యులచే, వేదోక్తములైనందున ధర్మార్థకామమోక్షములను పురుషార్థములగూర్చి సత్యమే నుడువ బడినదని ఇట్లు చెప్పెను. ధర్మము, అర్థము, కామము అను త్రివర్గమునకై ' ఈక్షా ' (ఆత్మ విద్యా ) మొదలైనవి తెల్పినవి. ఈక్షా = ఆత్మవిద్య, త్రయీ = కర్మవిద్య నయదమములు ( తర్కము, దండనీతి ) విధమైన వృత్తులు ఇవన్నియు వైదికార్థజాతము సత్యమే. ఇవియన్నియు స్వాన్తర్యామియైన పరమ పురుషునకు స్వాత్మార్పణము గావించు సాధనములగుచున్నవి. అట్లైన సర్వమును సత్యమనియే తలంతును. ( 26)

టీ :- ననుచ ధర్మాదురపుషార్థత్వే కిమిత్యాచార్యాభ్యాం వేదోక్తత్వేన సత్య ఏవాభిహితః? తత్రాహ – ధర్మేతి. ధర్మోర్థః కామశ్చేతి యస్త్రివర్గః తదర్థం. యే ఈక్షాద్యా అభిహితాః. ఈక్షా ఆత్మవిద్యా. త్రయీ కర్మవిద్యా. నయదమౌ నీతిః దండశ్చ వివిధా చ వార్తా జీవికా. తదేతత్సర్వం నిగమస్యార్థజాతం. స్వసుహృదః స్వాంతర్యామిణః. పరమస్య పుంసః స్వాత్మార్పణం స్వాత్మార్పణ సాధనం చేత్. తర్హి సత్యం మన్యే సత్యపరత్వాత్. అన్యథా తదసత్యమేవ. యద్వా. తదేతదఖిలం నిగమస్య త్రైగుణ్యవిషయస్య ప్రతిపాద్యం మన్యే సత్యం పునర్నిస్త్రైగుణ్య లక్షణం పరమస్య పుంసః స్వాత్మార్పణమేవేత్యర్థః. తదుక్తం భగవతా. శ్లో. "త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున" ఇతి. (26)

టీ :- కాగా ధర్మాదులకు ఆ పురుషార్థత్వము కలిగిన ఆచార్యులచే వేద ప్రామాణ్యమును చెప్పుటచే నేమి ఫలమనిన వారిచే సత్యమే చెప్పబడినదని చెప్పుచున్నాడు. ధర్మము, అర్థము, కామము అను త్రివర్గము, వాని యర్థమును ఏ ఈక్షాదులు చెప్పినవో, ఈక్షా = ఆత్మవిద్యా, త్రయీ = కర్మవిద్యా, నయదమౌ = తర్కము దండనీతియు, వివిధమైన వార్తా = జీవిక / వృత్తులను. అట్టిదంతయు వేదార్థజాతము, స్వ సుహృదః = తన అంతర్యామియైన పరమపురుషునకు స్వాత్మార్పణ సాధనమైనచో అట్టియెడ సర్వమును సత్యమనియే తలంతును. సత్యపరమైనందున. లేని యెడల అది అసత్యమేయగును. లేదా అట్టి ఈ అఖిలమును త్రైగుణ్య విషయమున వేదముయొక్క ప్రతి పాద్యాంశముగనే తలంతును. కాని నిస్త్రైగుణ్య లక్షణము కాక పరమపురుషునకు స్వాత్మార్పణమే సత్యమని అర్థము. ఆ విషయము భగవంతునిచే గీతయందు ఇట్లు చెప్పబడినది. ఓ అర్జునా ! వేదములు త్రైగుణ్య విషయములు, నీవు త్రైగుణ్య రహితుడవు అగుము. అని ( 26)

శ్లో ॥ జ్ఞానం తదేత దమలం దురవాపమాహ
నారాయణో నరసఖః కిలనారదాయ ।
ఏకాంతినాం భగవత స్తదకించనానాం
పాదారవింద రజసాప్లుత దేహినాం స్యాత్ ॥ 27॥

నరసఖుడైన నారాయణుడు పొందుటకు శక్యముగాని నిర్మలమైన అట్టి ఈ జ్ఞానమును నారదునకు చెప్పెనట. ఏ విధమైన జ్ఞానములేని భగవత్ పాదారవింద పరాగముచే స్నాతులైన భగవంతుని ఏకాంత భక్తులకు అట్టి జ్ఞానము కలుగును. (27)

టీ :- తేషాం విశ్వాసార్థం గరుసంప్రదాయమేవాహ - జ్ఞానమితి. యత్ర నారదః శ్రోతా. తత్ర కుతో మాదృశానామధికార ఇతి మాశంకీరిత్యాహ - భగవతః ఏకాంతభక్తానాం యత్పాదరజః తేన ఆప్లుతానాం స్నాతానాం దేహినాం సర్వేషామపి తత్ జ్ఞానం స్యాత్. న తూత్తమానామేవేతి నియమః. (27)

టీ :- ఆ దైత్య బాలకులకు విశ్వాసము కొఱకై గురు సంప్రదాయమును చెప్పెను. 'జ్ఞానం ' ఇత్యాది శ్లోకముల ద్వారా. ఏ విషయములందు నారదుడు శ్రోతగానుండెనో అందు మాలాటి వారికి అధికారమెక్కడ? అని శంకించకండి. అని ఇట్లు చెప్పెను. భగవంతుని ఏకాంతభక్తులకు ఏ భగవానుని పాదరజముచే ఆప్లుతానాం = స్నానము గావించిన వారికి అందరికిని ఆ జ్ఞానము కలుగును. ఉత్తములకే యను నియమములేదు. ( 27 )

శ్లో ॥ శ్రుతమేతన్మయా పూర్వం జ్ఞానం విజ్ఞాన సంయుతమ్ ।
ధర్మం భాగవతం శుద్ధం నారదాద్దేవ దర్శనాత్ ॥ 28 ॥

విజ్ఞానయుక్తమైన జ్ఞానము, శుద్ధమైన ఈ భాగవత ధర్మము దేవదర్శనము గావించిన నారదునినుండి పూర్వము నాచే వినబడినది.(28)

టీ :- శ్రుతమితి. అతఏవ మయాపి నారదాచ్ఛ్రుతం విజ్ఞాన సంయుతం అనుభవపర్యంతం ధర్మం చ శ్రుతం. (28)

టీ :- కనుకనే నేనును పూర్వము నారదుని వలన వింటిని. విజ్ఞాన సహితం=అనుభవ పర్యంతమైన జ్ఞానమును ధర్మమును కూడా వింటిని.(28)

**దైత్య పుత్రా ఊచుః :-**

శ్లో ॥ ప్రహ్లాదత్వం వయంచాపి నతేऽన్యం విద్మహే గురుమ్ ।
ఏతాభ్యం గురు పుత్రాభ్యాం బాలానామపి హీశ్వరౌ ॥29॥

అని ప్రహ్లాదుడు చెప్పిన దైత్య పుత్రులాతనిని ఇట్లు ప్రశ్నించిరి. ఓ ప్రహ్లాదా ! నీవు గాని మేము గాని ఈ గురు పుత్రులైన చండామర్కులకంటే వేరొక గురువును ఎరుంగము. బాల్యము నుండియు మనకు వీరే గురువులు. కాన నీవు వేరొకచోటికి వెడలినేర్చుకొనుటయు సంభవింపదు. ( 29 )

టీ :- తత్రాతివిస్మితాః పృచ్ఛంతి దైత్యపుత్రాః ప్రహ్లాదేతి. ఏతాభ్యామృతే న్యం గురుం న విద్మః ఏతదాగమనాత్పూర్వమేవాహం నారదపార్శ్వం గత ఇతి చేత్ ! తత్రాహుః - బాలానామపి అతిశిశూనామప్యస్మాక మేతావిశ్వరౌ నియన్తారౌ అతస్తవాన్యత్ర గమనం న సంభవతి. (29)

టీ :- అక్కడ మిక్కిలి విస్మయమును పొందినవారై అడుగుచున్నారు. ' ప్రహ్లాద ' ఇత్యాదిగా. ఓ ప్రహ్లాదా ! నీవు, మేమును ఈ వీరి కంటే వేరే గురువును ఎరుగము. వీరిద్దరు రాకపూర్వమే నేను నారదుని చెంతకు వెడలితినన్న అంత ఇట్లనిరి. ' బాలస్య ' ఇత్యాదిగా. బాలానామపి = మిక్కిలి శిశువులుగానున్నప్పటినుండియు మనకు వేరే ఈశ్వరులు. నియంతలు అనగా గురువులు అని అర్థము. కాన నీకు వేరేచోటికి వెడలుట అసంభవము.(29)

శ్లో ॥ బాలస్యాంతః పురస్థస్య మహత్సంగో దురన్వయః ।
ఛింది నః సంశయం సౌమ్య స్యాచ్చే ద్విశ్రంభ కారణమ్॥30॥

అంతఃపురమున నుండు బాలుడవైన నీకు మహాత్ములతో కలయిక కుదరదు. కాన ఓసౌమ్యా ! మేము నమ్మదగిన కారణమేదేని యున్నచో దానిని తెల్పి మా సంశయమును ఛేదించుము. ( 30 )

టీ :- స ఏవాత్రాగత ఇత్యపి న సంభవతీత్యాహుః - బాలస్యేతి. దురన్వయః దుర్ఘటః. విస్రంభకారణం విశ్వాసహేతుః. (30)

టీ :- సః = ఆ నారదుడే ఇచ్చటకు వచ్చెననుటయు పొసగదు. అని ఇట్లు చెప్పెను. ' బాలస్య ' ఇత్యాదిగా. దురన్వయో దుర్ఘటః = ఘటించునది గాదు. విశ్రంభకారణమ్=విశ్వాస హేతువు. ( 30 )

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదానుచరితే షష్ఠోఽధ్యాయః ॥**

**ఇది శ్రీమద్భాగవతమందు సప్తమస్కంధములోని భావార్థదీపికా టీకానువాదమున ఆరవ అధ్యాయము.**

**ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి సప్తమ స్కంధములోని ప్రహ్లాదానుచరితమందు ఆరవ అధ్యాయము.**






శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఏవం దైత్య సుతైః మహాభాగవతోఽసురః ।
ఉవాచ స్వయ మానాంస్తాన్ స్మరన్మదనుభాషితమ్ ॥1॥

టీ :- సప్తమే మాతృగర్భస్థే స్వస్మిన్నారదభాషితమ్, ప్రహ్లాదో వర్ణయామాస శిష్యప్రత్యయ సిద్ధయే. (1)

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ పితరి ప్రస్థితేఽస్మాకం తపసే మందరాచలమ్ ।
యుద్ధోద్యమం పరం చక్రు ర్విబుధా దానవాన్ ప్రతి ॥2॥

టీ :- అత్రాని నారదాదేతన్మయా గర్భ ఇతీరితుం, తత్ప్రస్తావ కథా మాహ పద్యైష్షోడశభిస్సుధీః. పితరీతి. అస్మాకం పితరి హిరణ్యకశిపౌ. (2)

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారదుడు చెప్పుచున్నాడు :-**

ఇట్లు దైత్య సుతులచే ప్రశ్నించబడిన అసురుడగు మహాభాగవతుడు ప్రహ్లాదుడు నేను చెప్పినదానిని స్మరించుచు చిరునగవుతోనున్న ఆ దైత్య బాలకులను గూర్చి ఇట్లనెను. అనుచు నారదుడు చెప్పుచుండెను. ( 1 )

టీ :- సప్తమాధ్యాయమున తాను తల్లి గర్భమందుండగ వినిన నారదభాషితమును శిష్యులకు విశ్వాసము కల్గుటకై వర్ణించి చెప్పెను. (1)

**ప్రహ్లాదుడు ఇట్లనెను :-**

మా తండ్రి తపస్సు చేయుటకై మందరాచలమునకు ప్రయాణము కాగా దేవతలు దానవులను గూర్చి మిక్కిలి యుద్ధోద్యమును గావించిరి.(2)

టీ :- నేను మాతృగర్భవాసమున నున్నవాడనై నారదుని వలన దీనిని వింటిని. అని చెప్పుటకు ముందు తత్ప్రస్తావన కథను పదునారు పద్యములతో ఆ పండితుడు ప్రహ్లాదుడు చెప్పదొడంగెను. ( 2 )




శ్లో ॥ పిపీలికై రహిరివ దిష్ట్యా లోకోపతాపనః ।
పాపేన పాపో2భక్షీతి వాదినో వాసవాదయః ॥ 3 ॥

మహా సర్పము చలి చీమల చేతచిక్కి చచ్చినట్లు లోకకంటకుడు, పాపాత్ముడునైన దైత్యపతి తన పాపము చేతనే భక్షించబడెననుచు ఇంద్రాది సురులు యుద్ధమునకై ఉద్యమించిరి. ( 3 )

శ్లో ॥ తేషామతి బలోద్యోగం నిశమ్యాసుర యూధపాః ।
వధ్యమానాః సురైర్భీతా దుద్రువుః సర్వతోదిషమ్ ॥ 4 ॥

సురులయొక్క అతి బలోద్యోగమును గూర్చి వినిన అసుర యూధ పతులు వారిచే హింసించబడుచు భీతులై అన్ని దిక్కులకు పారిపోయిరి.(4)

శ్లో ॥ కలత్ర పుత్ర మిత్రాప్తా న్గృహాన్పశు పరిచ్ఛదాన్ ।
నావేక్ష మాణా స్త్వరితాః సర్వే ప్రాణ పరీప్సవః ॥ 5 ॥

ఎట్లనగా భార్యా పుత్రులను, మిత్రులను, ఆప్తులను, గృహములను, పశువులను, పరిజనమును పట్టించుకొనని వారై అందరును ప్రాణములను దక్కించుకొనగోరువారై పరుగెత్తిరి. ( 5 )

టీ :- పిపీలికైరితి. స్వకృతేనైవ పాపేన పాపో సౌ అభక్షి భక్షిత ఇత హర్షేణ వదంతో యుద్ధోద్యమం చక్రుః. (3,4,5)

టీ :- పాపాత్ముడు తన పాపముచేతనే అభక్షి = భక్షించబడెను. అని ఆనందముతో పలుకుచున్నవారై యుద్ధప్రయత్నములను గావించిరి. ( 3,4,5)

శ్లో ॥ వ్యలుమ్పన్ రాజశిబిర మమరా జయ కాంక్షిణః ।
ఇంద్రస్తు రాజమహిషీం మాతరం మమచాగ్రహీత్ ॥ 6॥

జయమును గోరు అమరులు రాజుయొక్క ఆవాసమును కొల్లగొట్టిరి. ఇంద్రుడు రాజమహిషియైన మా తల్లిని పట్టుకొనెను. ( 6 )

శ్లో ॥ నీయమానాం భయోద్విగ్నాం రుదతీం కురరీమివ ।
యదృచ్ఛయా గతస్తత్ర దేవర్షి ర్దదృశే పథి ॥ 7 ॥

ఇంద్రునిచే కొనిపోబడుచు లకుముకి పిట్టవలె భయభ్రాంతయై ఏడ్చుచున్నదానిని భాగ్యవశమున అచ్చటికి వచ్చిన నారదుడు మార్గమున (ఆమెను) చూసెను. మరియు దేవేంద్రునితో ఇట్లనెను. ఓ సురపతీ ! దోషము చేయని ఈమెను కొనిపోతగదు. మహానుభావా ! పతివ్రత, పరస్త్రీయైన ఈమెను

శ్లో ॥ ప్రాహమైనాం సురపతే ! నేతుమర్హస్య నాగసమ్ ।
ముంచ ముంచ మహాభాగ ! సతీం పర పరిగ్రహమ్॥ 8॥

**ఇంద్ర ఉవాచ :-**

శ్లో ॥ ఆస్తేకస్యా జఠరే వీర్య మవిషహ్యాం సురద్విషః ।
ఆస్యతాం యావత్ప్రసవం మోక్ష్యేకర్థ పదవీం గతః ॥ 9॥

టీ :- వ్యలుంపన్నితి. రాజ్ఞః శిబిరం ఆవాసం వ్యలుంపన్ సర్వస్వాపహారేణ నాశితవంతః. (6,7)

టీ :- ప్రాహేతి. అనాగసీం నిరపరాధామేనాం నేతుం నార్హసీతి ప్రాహ . (8)

టీ :- ఆస్త ఇతి. అవిషహ్యాం దుస్సహం అతః అనయా ప్రసవ పర్యంతమత్రాస్యతాం. తతశ్చార్థస్య పదవీం మార్గం గతః ప్రాప్తస్సన్ జాతం పుత్రం హత్వా మోక్ష్యే మోక్షా య్యమీత్యర్థః. (9)

**నారద ఉవాచ :-**

శ్లో ॥ అయం నిష్కిల్బిషః సాక్షన్మహా భాగవతో మహాన్ ।
త్వయా న ప్రాప్స్యతే సంస్థా మనన్తాను చరోబలీ ॥ 10॥

వదులుము. వదులుము. అనగా అతనితో బదులు పలుకుచు ఇంద్రుడు 'ఈమె గర్భమున అసురపతియైన హిరణ్యకశిపునియొక్క సహింపరాని వీర్యముకలదు. ప్రసవమగువరకు ఈమె ఇచ్చట నుండుగాక. అనంతరము పుట్టిన శిశువును చంపి ఈమెను వదిలిపుత్తును.' అని చెప్పెను. (7-9)

టీ :- రాజుయొక్క శిబిరం = నివాసమును, వ్యలుంపన్ = సర్వస్వాపహారముచే కొల్లగొట్టిరి. నాశనము చేసిరి. ( 6, 7 )

టీ :- అనాగసీం = నిరపరాధురాలైన ఈమెను నీవు కొనిపో తగవు అని ( నారదుడు ఇంద్రునితో ) చెప్పెను. ( 8 )

టీ :- అవిషహ్యాం = దుస్సహమైన/ సహింపరాని . కాన ఈమె ప్రసవమగు వరకు ఇచ్చట ఉండుగాక. అనంతరము ప్రయోజనముయొక్క , పదవీం = మార్గమును, గతః = పొందినవాడనై, పుట్టిన పుత్రుని సంహరించి ఈమెను వదలగలనని అర్థము.(9)

**నారదుడు ఇట్లు చెప్పెను :-**

ఈమె యొక్క గర్భమందు కలవాడు, పాపములు లేనివాడు, తన గుణములచేతనే గొప్పవాడు, భాగవతోత్తముడు, అనంతుని అనుచరుడు, ధీబలశాలి, ఇతడు నీచే మృత్యువును పొందదు. అని చెప్పబడిన ఇంద్రుడు

శ్లో ॥ ఇత్యుక్తస్తాం విహాయేంద్రో దేవర్షేర్మానయన్ వచః ।
అనంత ప్రియ భక్త్యైనాం పరిక్రమ్య దివం యయౌ ॥11॥

దేవర్షియైన నారదుని మాటలను గౌరవించువాడై ఆమెను వదిలి అనంతుని యందలి ప్రియమైన భక్తితో, అనంతుడికి ప్రియమైన ప్రహ్లాదుని యందలి భక్తితో ఆమెకు ప్రదక్షిణము చేసి దివమునకు వెడలెను. ( 10, 11 )

టీ :- సో యమితి. సాక్షాత్స్వగుణైరేవ మహాన్. న తు పిత్రాది సంబంధాత్ త్వయా హేతుభూతేన సంస్థాం మృత్యుం న యాస్యతి. తత్ర హేతవో నిష్కిల్బిష ఇత్యాదయః. (10)

టీ :- సాక్షాత్ = తన గుణములచేతనే గొప్పవాడు, పిత్రాది సంబంధము వలన గాదు, త్వయా = హేతు భూతుడవైన నీచే, సంస్థాం = మృత్యువును పొందదు. అందుకు కారణము నిష్కిల్బిషుడు మొదలైనవి. ( 10 )

టీ :- ఇతీతి. అనంతస్య ప్రియో యో హం స వా ప్రియో యస్య తస్య మమ భక్త్యా ఏనాం ప్రదక్షిణీకృత్య. (11)

టీ :- అనంతునకు ప్రియమైన నేను లేదా అనంతునకు సః = అతడు ప్రియమైనట్టివాడు, నాయొక్క భక్తిచే ( నా యందలి భక్తిచే ఆమెకు ప్రదక్షిణము చేసి వెడలెను ). ( 11 )

శ్లో ॥ తతో నో మాతర మృషిః సమానీయ నిజాశ్రమమ్ ।
ఆశ్వాస్యేహోష్యతాం వత్సే యావత్తే భర్తురాగమః ॥ 12॥

అటు పిమ్మట మా తల్లిని తన ఆశ్రమమునకు కొని తెచ్చి ఓదార్చి, ఓ బిడ్డా! నీ భర్త తిరిగివచ్చువరకు ఇచ్చట నివసింతువు గాక. యని చెప్పెను. (12)

టీ :- తత ఇతి. ఇహోష్యతామిత్యాహేతి శేషః. (12)

టీ :- చెప్పుదువుగాక అని పల్కెనని శేషము. ( 12 )

శ్లో ॥ తథే త్యవాత్సీద్దేవర్షే రన్తి సాప్యకుతోభయా ।
యావద్దైత్య పతిర్ఘోరా త్తపసో న న్యవర్తత ॥ 13 ॥

ఆ మా తల్లియు అట్లేనని చెప్పినదై ఆ దేవర్షి సమీపమున నిర్భయచిత్తురాలై ఘోరమైన తపస్సు పూర్తిచేసుకొని దైత్యపతి తిరిగివచ్చు వరకు అచ్చట నివసించెను.(13)

శ్లో ॥ ఋషిం పర్య చరత్తత్ర భక్త్యా పరమయా సతీ ।
అంతర్వత్నీ స్వగర్భస్య క్షేమాయేచ్ఛా ప్రసూతయే ॥ 14॥

గర్భవతియైన ఆమె తన గర్భముయొక్క క్షేమము కొఱకు తన ఇచ్ఛాను సారముగా భర్తయొక్క ఆగమనానంతరము ప్రసవించుటకును సతియై పరమ భక్తితో అచ్చట ఆ దేవర్షిని సేవించుచుండెను. ( 14 )

టీ :- తథేతి. అంతి సమీపే. (13)
టీ :- ఋషిమితి. అంతర్వత్నీ గర్భిణీ. ఇచ్ఛయా భర్తురాగమనాంతరం. ప్రసూతయే ఏవమపి స్వగర్భస్య క్షేమాయ. (14)

టీ :- అంతర్వత్నీ = గర్భిణి, ఇచ్ఛయా = భర్తయొక్క ఆగమనానంతరము ప్రసవించుటకై, ఇట్లు గూడా తన గర్భముయొక్క క్షేమము కొఱకు. (13,14)

శ్లో ॥ ఋషిః కారుణిక స్తస్యాః ప్రాదాదుభయ మీశ్వరః ।
ధర్మస్య తత్త్వం జ్ఞానంచ మామప్యుద్దిశ్య నిర్మలమ్ ॥ 15॥

దయాత్ముడైన, సర్వశక్తి సమన్వితుడైన ఆ మహర్షి నన్ను కూడా ఉద్దేశించి మా తల్లికి ధర్మతత్త్వమును, నిర్మలమైన జ్ఞానమును, ఉభయమును ఉపదేశించెను.(15)

శ్లో ॥ తత్తు కాలస్య దీర్ఘత్వా స్త్రీత్వాన్మాతు స్తిరోదధే ।
ఋషిణాను గృహీతం మాం నాధునాప్య జహాత్స్మృతిః॥16॥

అది బోధించి దీర్ఘకాలమైనందున, స్త్రీయైనందున మాతల్లికి ఆ జ్ఞానము, ధర్మమును విస్మృతములైనవి. ఋషిచే అనుగ్రహించబడిన నన్ను వాని స్మరణము నేటికిని వీడలేదు. ( 16 )





టీ :- ఋషిరితి. తస్యాః శోకశాంత్యై ధర్మస్య తత్త్వం భక్తిలక్షణం జ్ఞానం ఆత్మానాత్మవివేకః తదుభయం ప్రాదాత్. ఈశ్వరః సమర్థః. (15,16)

టీ :- ఆమెయొక్క శోకము శమించుటకై ధర్మము యొక్క తత్త్వమును, భక్తి లక్షణమును, జ్ఞానం = ఆత్మానాత్మ వివేకమును ఆ రెంటిని ఒసంగెను (బోధించెను ). ఈశ్వరః = సమర్థుడు. ( 15, 16 )

శ్లో ॥ భవతామపి భూయాన్మే యది శ్రద్ధధతే వచః ।
వైశారదీ ధీః శ్రద్ధాతః స్త్రీ బాలానాం చ మే యథా ॥17॥

నా మాటలను మీరు విశ్వసించినట్లైన మీకును (జ్ఞానము, ధర్మముయొక్క తత్త్వము) కలుగును. నాకు వలెనే స్త్రీ, బాలురకు శ్రద్ధవలన (విశ్వాసమువలన) నైపుణ్యమైన బుద్ధి కలుగును. ( 17 )

టీ :- భవతామితి. భూయాత్ భవేత్. వైశారదీ స్వార్థే తద్ధితః. దేహాద్యహంకారభేదనిపుణేత్యర్థః. (17)

టీ :- భూయాత్ = అగునుగాక. వైశారదీ = నిపుణమైన, స్వార్థే - తద్ధిత ప్రత్యయము. దేహాది అహంకార ఛేదనమున నైపుణ్యముగల యని యర్థము. (17 )

శ్లో ॥ జన్మాద్యాః షడిమే భావా దృష్టా దేహస్య నాత్మనః ।
ఫలానామివ వృక్షస్య కాలేనేశ్వర మూర్తినా ॥ 18 ॥

ఈశ్వరస్వరూపమైన కాలముచే వృక్షములకు వలె జన్మాది షడ్భావములు (పుట్టుట, ఉండుట, పెరుగుట, పరిణతి చెందుట, క్షీణించుట, నశించుట) దేహమునకు అగుపడుచున్నవి. ఆత్మకు గాదు. ( 18 )

టీ :- కాసా వైశారదీ ధీరిత్యపేక్షాయాం నారదోక్తమేవ దేహాత్మ ప్రకారమాహ - దశభిః. జన్మాద్యా ఇతి. జన్మాద్యాః. అస్తి జాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే వినశ్యతి. ఇత్యేవంభూతాః.

టీ :- ఈ నైపుణ్యముగల బుద్ధి ఏది? అనిన నారదునిచే చెప్పబడిన దేహాత్మ వివేక ప్రకారమునే చెప్పెను. - “జన్మ” ఇత్యాది పదిశ్లోకములచే. జన్మాదులు - పుట్టుట, ఉండుట, పెరుగుట, పరిపక్వమగుట, కృశించుట, నశించుట








షడ్భావవికారాః వృక్షే సత్యేవ యథా ఫలానాం దృశ్యంతే తద్వదాత్మని న యౌవనాద్యవస్థాః తే దేహస్య దృష్టా ఇత్యర్థః. ఈశ్వరీ వికారసమర్థా మూర్తిర్యస్య తేన. (18)

అనెడు ఆరు అవస్థలు (దశలు) వృక్షమున ఫలములకును ఉన్నవి. అట్లే ఆత్మయందున్న శరీరమునకు కూడా ఈ షడ్వికారములు అగుపడుచున్నవి. ఈశ్వరీ = వికారసమర్థమైన మూర్తి కల్గిన కాలముచే. (18)

శ్లో ॥ ఆత్మా నిత్యోఽవ్యయః శుద్ధఏకః క్షేత్రజ్ఞ ఆశ్రయః ।
అవిక్రియః స్వదృగ్ఘేతు ర్వ్యాపకో సంత్యనావృతః ॥ 19 ॥

శ్లో ॥ ఏతైర్ద్వాదశభిర్విద్వా నాత్మనో లక్షణైః పరైః ।
అహం మమేత్య సద్భావం దేహాదౌమోహజం త్యజేత్।20॥

(ఈ ఆరు వికారములు ఫలమునకు వృక్షమునందున్నప్పుడే దేహమునకు అగుపడుచున్నవి ). ఆత్మ నిత్యమైనది, అవ్యయము, శుద్ధము, ఏకత్వవిశిష్టము, క్షేత్రజ్ఞము, ఆశ్రయము, మార్పులేనిది, స్వయముగ దర్శించునది, హేతువు, వ్యాపకము, అసంగి, అనావృతము, శ్రేష్ఠములైన ఈ పన్నెండు (ద్వాదశ) ఆత్మలక్షణములచే విద్వాంసుడు దేహాదులందు మోహమువలన కలిగిన నేను నాదియను అసత్యభావము వదులును గాక. (19, 20)

టీ :- తదేవం దేహధర్మైః తద్వైలక్షణ్యేన ఆత్మనో దేహాద్భేదో దర్శితః. ఇదానీం ఆత్మధర్మైరేవ భేదం స్ఫుటయన్ తదహంకారాదికం త్యాజయతి – ఆత్మేతి. ఆత్మా నిత్యః. శ్రు."అవినాశీ వా అరే యమాత్మే" తి. అవ్యయః అపక్షయశూన్యః. శ్రు. "ఋచో అక్షరే పరమే వ్యోమన్ని"తి. శుద్ధః నిరవద్యః. శ్రు."నిరవద్యం నిరంజనమి" తి. ఏవః శ్రు. "ఏకమేవాద్వితీయమి" తి. క్షేత్రజ్ఞః. శ్రు. "విజ్ఞాతారమరే కేన విజానీయాది" తి. అశ్రయః. శ్రు. "యస్మిన్ ద్యౌః పృథివీ" త్యాది. అవిక్రియః. శ్రు. "నిష్కలం

టీ :- ఇట్లీ ప్రకారముగ దేహధర్మములు చెప్పుటద్వారా దానికంటే విలక్షణముగా నుండుటచే ఆత్మకు దేహమునకన్న భేదము ప్రదర్శించబడినది. ఇప్పుడు ఆత్మ ధర్మముల ద్వారానే భేదమును స్పష్టపరచుచు ఆ అహంకారాదికమును త్యజింపజేయుచున్నాడు. ' ఆత్మా ' ఇత్యాదిగా. ఆత్మ నిత్యమైనది. ఇందుకు ' అవినాశీ వారేయమాత్మా ' అను శ్రుతివాక్యము ప్రమాణము. అవ్యయమైనది అనగా అపక్షయ శూన్యమైనది. ఇందుకు ' ఋచో అక్షరే పరమే వ్యోమన్ ' అను శ్రుతి ప్రమాణము. శుద్ధమైనది అనుటకు ' నిరవద్యం నిరంజనమ్ ' అను శ్రుతి ప్రమాణము. ఆత్మ ఒక్కటే. ఇందుకు ' ఏకమేవా

నిష్క్రియం శాంత" మితి. స్వదృక్. శ్రు. "ఆత్మజ్యోతి" రితి. హేతుః. శ్రు. "స ఇమాన్ లోకానసృజతే" తి. వ్యాపకః. శ్రు. "సత్యజ్ఞానమనంతమి" తి. అసంగీ. శ్రు. "అసంగో హ్యయం పురుష" ఇతి. అనావృతః. శ్రు. " పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యత" ఇతి. (19)

ద్వితీయమ్ ' అను శ్రుతి ప్రమాణము. క్షత్రజ్ఞుడు ఆత్మా ఇందుకు " విజ్ఞాతార మరేకేన విజానీయాత్ " ఇత్యాది శ్రుతి. "ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే । ఏతద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" ఇత్యాది భగవద్వాక్యములును ప్రమాణము. ఆశ్రయుడు ఇందుకు "యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షమ్" ఇత్యాది శ్రుతి ప్రమాణము. అవిక్రియుడు, వికారశూన్యుడు. ఇందుకు 'నిష్కలం నిష్క్రియం శాంతం' అను శ్రుతివాక్యము ప్రమాణము. స్వదృక్ "ఆత్మజ్యోతిః సంరాడితి హోవాచ" అను శ్రుతి ప్రమాణము. హేతువు అనుటకు 'స ఇమాన్‌ల్లోకా న సృజత్' అను శ్రుతి ప్రమాణము. వ్యాపకుడు, ఇందుకు 'సత్యం జ్ఞానమనంతమ్' అను శ్రుతి ప్రమాణము. అసంగీ = సంగరహితుడు, నిస్సంగుడు, ఇందుకు 'అసంగో హ్యయం పురుషః' అను శ్రుతి ప్రమాణము. అనావృతుడు . ఇందుకు " పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే " అను శ్రుతివాక్యము ప్రమాణము. ( 19 )

టీ :- ఏతైరితి. పరైః శ్రేష్ఠైః దేహాద్భేదం విద్వాన్. అసద్భావం మిథ్యాదృష్టిం. (20)

టీ :- శ్రేష్ఠములైన, వివేకసమర్థములైన, ఈ పన్నెండు ఆత్మయొక్క లక్షణములచే దేహమునకన్న ఆత్మభేదమును ఎరింగినవాడు. అసద్భావం = మిథ్యా బుద్ధిని వదులుగాక. ( 20 )

శ్లో ॥ జ్వర్ణం యథా గ్రావసు హేమకారః
క్షేత్రేషు యోగై స్తదభిజ్ఞ ఆప్నుయాత్ ।
క్షత్రేషు దేహేషు తథాత్మ యోగై
రధ్యాత్మ విద్బ్రహ్మ గతిం లభేత ॥ 21 ॥

బంగారు గనులందలి రాళ్ళలో ( మెఱియు స్వర్ణకణములు గల రాళ్ళలో) ఆయా ఉపాయముల నెఱింగిన స్వర్ణకారుడు ఆయా ఉపాయములచే స్వర్ణమును పొందునో అట్లే క్షేత్రములైన దేహములందు (ఉన్నట్టి ఆత్మను) ఆత్మప్రాప్తికి తగిన ఉపాయములచే శరీరమందధిష్ఠించియున్న ఆత్మ నెరింగిన వాడు బ్రహ్మతత్వమును పొందుచున్నాడు. " బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి " అను వచనానుసారము బ్రహ్మమును ( ఆత్మను ) ఎరింగినవాడు బ్రహ్మయే అగుచున్నాడు. అని అర్థము. ( 21 )

టీ :- నన్వేవం వివిక్తాత్మనో ప్యపరోక్షానుభవేన బ్రహ్మతాప్రాప్తిః కథం స్యాత్? యతో హంకారాదికం త్యజేదిత్యపేక్షాయాం తత్ప్రాప్తిప్రకారం సదృష్టాంతమాహ - స్వర్ణమితి. స్వర్ణకారః స్ఫురత్స్వర్ణకణేషు గ్రావసు. యోగైః ఆత్మప్రాప్త్యుపాయైః బ్రహ్మగతిం బ్రహ్మతాం అధ్మాత్మవిత్ ఆత్మాధికృతకార్యకారణసంఘాతం జ్ఞాతా. (21)

టీ :- ఇట్లు విభిన్నమైన ఆత్మయొక్క జ్ఞానమును ఎరింగిన వారికైనను పరోక్షానుభవము లేనందున బ్రహ్మప్రాప్తి ఎట్లు కలుగును? ఎందువల్లనైతే అహంకారాదికమును వదులును గదా ! యందురేమో, అను అపేక్షయందు దాని ప్రాప్తి ప్రకారమును దృష్టాంత సహితముగా చెప్పెను. స్వర్ణము లభించు గనులందు మెఱయుచున్న స్వర్ణకంకణములు గల శిలలందు, యోగైః = ధమనాద్యుపాయములచే తదభిజ్ఞః = ఆ ఉపాయముల నెఱింగిన స్వర్ణకారుడు ఎట్లైతే స్వర్ణమును పొందునో, ఆత్మయోగైః = ఆత్మ ప్రాప్త్యుపాయములచే, బ్రహ్మ గతిం = బ్రహ్మత్వమును, అధ్యాత్మవిత్=ఆత్మాధికృతములైన కార్యకారణ సంఘాతముల నెఱింగినవాడు. (21)

శ్లో ॥ అష్టౌ ప్రకృతయః ప్రోక్తా స్త్రయ ఏవ హి తద్గుణాః ।
వికారాః షోడశాచార్యైః పుమానేకః సమన్వయాత్ ॥ 22॥

శ్లో ॥ దేహస్తు సర్వ సంఘాతో జగత్తస్థు రితి ద్విధా ।
అత్రైవ మృగ్యః పురుషో నేతి నేతీత్య తత్త్వజన్ ॥ 23 ॥

టీ :- అధ్యాత్మ వివేకపూర్వకం ఆత్మప్రాప్త్యుపాయానాహ - త్రిభిః. అష్టావితి. మూలప్రకృతిః. మహదహంకారౌ పంచ తన్మాత్రాణి చేత్యష్టౌ. త్రయః సత్త్వాదయః. తే చ ప్రకృతిగుణా ఏవ న తు భిన్నాః ఏకాదశేంద్రియాణి పంచమహాభూతాని చేతి షడశ పుమానాత్మా ఏకః ప్రోక్తః కపితాదిభిరాచార్యైః. ఏకత్వే హేతుః - ఏతేషు సాక్షిత్వేనాన్వయాత్. తదుక్తం. శ్లో. "మూలప్రకృతిర్వికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త, షోడశకశ్చ వికారో న ప్రకృతిర్నవికృతిః పురుషః" ఇతి. (22)

అధ్యాత్మ వివేకమును, ఆత్మ ప్రాప్త్యుపాయమును ' అష్టౌ ' అను మూడు శ్లోకములచే ఇట్లు చెప్పుచున్నాడు. మూల ప్రకృతి, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు అని మొత్తము ఎనిమిది ప్రకృతులుగా చెప్పబడినవి. సత్వ, రజః, తమస్సులనెడు మూడు ప్రకృతి గుణములే (తద్భిన్నములు గావు ) ఏకాదశ ఇంద్రియములు, పంచ మహాభూతములు, అని మొత్తము పదునారు వికారములు. పురుషుడు ఒక్కడు అని ఆచార్యులచేత చెప్పబడినది. వీనియందు సంబంధమును పొందియుండినట్టి శరీరము సర్వ సంఘాతరూపమైనది. అది జంగమము, స్థావరము అని రెండు విధములు. ఇది కాదని వదిలివేయక దానియందే పురుషుడు వెదక దగినవాడు. (22,23)

టీ :- అధ్యాత్మ జ్ఞానమును, ఆత్మ ప్రాప్తికి ఉపాయమును ' అష్టౌ ' ఇత్యాదిగా మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు. 1) మూల ప్రకృతి, 2) మహత్తు, 3) అహంకారము (4) తన్మాత్రలు ఐదు (5). మొత్తము ఎనిమిది (8). సత్వ, రజః, తమములనెడి మూడునూ ప్రకృతి గుణములే. వానికి భిన్నమైనవికావు. పదనొకండు ఇంద్రియములు. పంచమహాభూతములు అని పదునారు. పుమాన్ = ఆత్మ ఒకడే యని కపిలాది ఆచార్యులచే చెప్పబడినది. ఏకత్వమునందు హేతువు వీనియందు సాక్షి రూపముగా అన్వయించుట వలన అనునది. అది ఇట్లు చెప్పబడినది. " మూల ప్రకృతి, అవికృతి మహదాదులు ప్రకృతి, వికృతులు ఏడు. పదునారవ వికారమైతే ప్రకృతి వికృతము కానట్టి పురుషుడు " అని.(22)

టీ :- దేహ ఇతి. జగత్ జంగమం. తస్థుః స్థావరం అత్రైవ సర్వసంఘాత్మకే దేహ ఏవ. మృగ్యః అన్వేష్టవ్యః. సుకరం చైతదిత్యాహ - నేతి నేతీత్యన్యాపోహే క్రియమాణే. స్వయమేవా తత్త్యజన్ అనాత్మవర్గాత్పృథగుపలభ్యమాన ఇత్యర్థః. (23)

టీ :- జగత్తు చరము. తస్థుః = స్థావరము (అని రెండు విధములు) అత్రైవ= సర్వ సంఘాతాత్మకమైన దేహముననే పురుషుడు మృగ్యః = అన్వేషింపదగినవాడు. ఇది సులభ సాధ్యమేయని ఇట్లు చెప్పుచున్నాడు. కాదు కాదన అన్యాపోహ చేయబడుచుండ స్వయముగనే తద్భిన్నమైన వస్తువును వదిలిపెట్టుచు అనాత్మ వర్గమునకన్న వేరుగా అగుపడుచున్న అని అర్థము. (23)

శ్లో ॥ అన్వయ వ్యతిరేకేణ వివేకేనో శతాత్మనా ।
సర్వస్థాన సమామ్నాయై ర్విమృశద్భి రసత్వరైః ॥ 24 ॥

అన్వయ, వ్యతిరేక వ్యాప్తులద్వారా వివేకవంతమైన మనస్సుతో సృష్టి, స్థితి, లయ విషయములను శాంతముగా నెమ్మదిగా విమర్శించి ఆలోచించి శరీరభిన్నమైన ( శ్రేష్ఠుడైన ) ఆ పురుషుని గ్రహించనగును. ( 24 )

టీ :- అన్వయేతి. మణిషు సూత్రమివ సర్వత్రానుస్యూతత్వే నాన్వయః. అత ఏవ మణిభ్యః సూత్రస్యైవైకైకవ్యతిరేకశ్చ తయోర్ద్వంద్వైక్యం. తేన. పూర్వోక్తో వా. తేన ఉశతా శుద్ధేనాత్మనా మనసా. సర్గస్థానసమామ్నాయైః సృష్టిస్థితి సంహారైః. శ్రు. "యతో వా ఇమాని భూతాని జాయంత'' ఇత్యాది శ్రుత్యుక్త సర్గాద్యనుసంధానేనేత్యర్థః. విమృశద్భిః విచారయద్భిః అసత్వరైః అవ్యగ్రైః మృగ్యత ఇతి పూర్వేణాన్వయః. (24)

టీ :- మణులందు దారమువలె సర్వత్ర అనుసరించునదిగా అన్వయము. కావుననే మణులకంటే సూత్రమునకువలె ఏకైక వ్యతిరేకమును వానికి రెంటికి ద్వంద్వైక్యము, దానిచే ఏ వివేకము కల్గునో దానిచే కూడా యుండునట్టి శుద్ధమైన ఆత్మచే = మనసుచే సర్గస్థాన సమామ్నాయేః = సృష్టి స్థితి సంహారములచే " యతో వా ఇమాని భూతాని జాయంతే " ఇత్యాది శృతియందు చెప్పబడిన సర్గాదులను అనుసంధానము చేసుకొనుటము ద్వారా అని అర్థము. విమృశద్భిః = విచారించుచున్నట్టి, అసత్వరైః=వ్యగ్రులు కానట్టి వారిచే వెదుకదగినవాడు. అని పూర్వవాక్యముతో అన్వయము. ( 24 )

శ్లో ॥ బుద్ధేర్జాగరణం స్వప్నః సుషుప్తిరితి వృత్తయః ।
తా యే నైవాను భూయన్తే సోఽధ్యక్షః పురుషః పరః ॥25॥

బుద్ధియొక్క జాగరణము, స్వప్నము, సుషుప్తి ( నిద్రావస్థ ) యని అవస్థలు మూడు. అవి ఎవనిచే అనుభవించబడుచున్నవో వాడే సాక్షియైన పరమపురుషుడు. (25)

టీ :- విమర్శప్రకారమాహ - ద్వాభ్యాం. బుద్ధేరితి. అధ్యక్షః సాక్షీ. (25)

టీ :- ' బుద్ధేః ' ఇత్యాది రెండు శ్లోకములచే విమర్శ ప్రకారమును చెప్పుచున్నాడు. అధ్యక్షః = సాక్షి ( 25 )

శ్లో ॥ ఏభి స్త్రివర్ణైః పర్యస్తై ర్బుద్ధిభేదైః క్రియోద్భవైః ।
స్వరూపమాత్మనో బుద్ధ్యేద్గన్దై ర్వాయుమివాన్వయాత్ ॥26॥

శ్లో ॥ ఏతద్వారోహి సంసారో గుణకర్మ నిబంధనః ।
అజ్ఞానమూలో సార్థోపి పుంసః స్వప్న ఇవేష్యతే ॥ 27 ॥

త్రిగుణాత్మకములు, కర్మజన్యములునైన పూర్వోక్తములైన ఈ బుద్ధి భేదములచే, గంధములచే సమన్వయమునొందునట్టి వాయువును గంధము ద్వారా ఎఱింగినట్లు ఆత్మయొక్క స్వరూపమును ఎఱుంగదగును. అనగా బుద్ధి త్రిగుణాత్మకము కర్మత్వ, కర్త ృత్వమునైనందున ఈ పూర్వోక్తావస్థలు జాగృత్ - స్వప్న - సుషుప్తులు మూడును బుద్ధికి సంబంధించినవే కానీ ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మ బుద్ధియందన్వయించి యుండుట వలన ఆయవస్థలు కలదివలె భాసించును. వాస్తవముగా ఇది ఆత్మయొక్క స్వరూపమని యెఱుంగజాలము. అని భావము. ఈ సంసారము బుద్ధి ద్వారకమైనదే. అదియును బుద్ధియొక్క గుణకర్మ నిబంధనమైనట్టిది. ఈ సంసారము అజ్ఞానమూలము, మిథ్యాభూతమై స్వప్నమువంటి దగుచున్నది.(26,27)

టీ :- ఏభిరితి. అతః ఏభిః బుద్ధేర్భేదైః పరిణామైః పరస్తైః. పరితః క్షిప్తైః అనాత్మధర్మత్వేన నిరస్తైః. బుద్ధిధ్మత్వే హేతుః - వర్ణైః త్రిగుణాత్మకైఃక్రియోద్భవైః కర్మజన్యైః బుద్ధేరేవ త్రిగుణాత్మకత్వాత్ కర్మ కర్తృత్వాచ్చ తస్యా ఏవైతా అవస్థాః ఆత్మా తు బుద్ధ్యన్వయాత్ తదవస్థావానివ భాతి న తత్త్వత ఇవాత్మనః స్వరూపం బుద్ధ్యేత్ జానీయాదిత్యర్థః. అత్ర దృష్టాంతః - కుసుమధర్మైర్గంధైః తదాశ్రయం వాయుమివ. (26)

టీ :- ఆత్మ ధర్మములుగా పేర్కొనబడని సంవ్యాప్తములైన ఈ బుద్ధిభేదములచే బుద్ధి ధర్మములనుటలో హేతువు- త్రివర్ణైః = త్రిగుణాత్మకములైనవి. క్రియోద్భవైః= క్రియాజన్యములు అగుటచే బుద్ధియే త్రిగుణాత్మకము, కర్తృ కర్మాత్మకమైనందున ఈ పైన పేర్కొనబడిన అవస్థలు అట్టి బుద్ధికి సంబంధించినవే. ఆత్మయేదో బుద్ధియందు అన్వయించి యుండుటవలన ఆ అవస్థలు కలదివలె భాసించును. కాని వాస్తవముగా ఆ యవస్థలు కలది కాదు. అని ఆత్మయొక్క స్వరూపము ఎఱుంగతగినదని యర్థము. ఇందుకు దృష్టాంతము పుష్ప ధర్మములైన గంధములచే తదాశ్రయమైన వాయువును వలె అనునది. ( 26 )

టీ :- నను తర్హి యథా కుసుమోపాధికో పి వాయోర్గంధో వివేకజ్ఞానేన నివర్తతే ఏవమాత్మనః సంసారో న నివర్తత ఇత్యాశంక్యాహ - ఏతదితి. ఏతద్ద్వారః బుద్ధిద్వారకః తదవస్థాద్వారకో వా న స్వతః. హి యస్మాత్ బుద్ధేః యే గుణాః కర్మాణి చ తైర్నిబధ్యత ఇతి తథాసచజ్ఞానమూలః అతః స్తవత్వాద్విషమో దృష్టాంతః. (27)

టీ :- గంధము కుసుమోపాధికము. ఐనను వాయువునకు పేర్కొన బడుచున్నది. అట్టిది వివేకజ్ఞానముచే తొలగును. ఇట్లు చెప్పబడుచున్నది. ఏతద్వారః = బుద్ధి ద్వారకము లేదా తదవస్థా ద్వారమునైనది సంసారము. స్వతః సంభవము కాదు. ఎందువలన ననగా ! బుద్ధియొక్క ఏ గుణములు, కర్మలు గలవో, వానిచే కూర్చబడునది సంసారము. మరియును అజ్ఞానమూలము, కావున అపార్థభూతము. లేదా మిథ్యాభూతమునై స్వప్నము వలె యగుచున్నది. వాయువునకు గంధద్రవ్య సంబంధము వాస్తవమైనందున దృష్టాంతము విషమమగుచున్నది. ( 27 )

శ్లో ॥ తస్మా ద్భవద్భిః కర్తవ్యం కర్మణాం త్రిగుణాత్మనామ్ ।
బీజనిర్హరణం యోగః ప్రవాహో పరమోధియః ॥ 28 ॥

కావున మీచే త్రిగుణాత్మకములైన కర్మలయొక్క బీజమైన అజ్ఞానము నశింపజేసుకొనదగినది. బీజనిర్హరణము ఎట్లనగ యోగముద్వారా, ఏ విధముగా ననిన బుద్ధియొక్క జాగ్రాదాది రూపమైన ప్రవాహము నిరోధింపదగినది. ( 28 )

శ్లో ॥ తత్రోపాయ సహస్రాణా మయం భగవతోదితః ।
యదీశ్వరే భగవతి యథా యై రంజసారతిః ॥ 29 ॥

దానికిగల ఉపాయ సహస్రములలో ( వేయిఉపాయములలో ) ఇది భగవంతునిచే చెప్పబడినది, ఏదనగా, ఏ ధర్మముల ద్వారా నిర్దిష్టమార్గమున ఆచరించగ పూజ్యుడైన శ్రీమన్నారాయణునియందు రతి ప్రీతి కలుగునో అట్టి మార్గము భగవంతునిచే చెప్పబడినది. ( 29 )

టీ :– తస్మాదితి. యదేవం నిర్వృతిర్ఘటతే తస్మాద్బీజమజ్ఞానం. తస్యనిర్హరణం దహనం కిం? తత్ యోగః కథంభూతః ధియః ప్రవాహం జాగ్రదాదిరూపముపరమయతీతి తథా. (28)

టీ :– ఎందువలన నైతే ఈ నివృత్తి ఘటించుచున్నదో అందువలన బీజమైన అజ్ఞాన నాశము కూడా సంభవమగుచున్నది. అది యెట్లనగా యోగముద్వారా, ఆ యోగమెట్టి దనిన బుద్ధియొక్క ప్రవాహం = జాగ్రదాది రూపమును ఉపరమింపజేయునట్టిది.(28)

టీ :– తదేవం జ్ఞానప్రకారముక్త్వా తత్సాధనం ధర్మస్య తత్త్వం నారదోక్తమేవాహ – పంచభిః. తత్రేతి. యైర్ధర్మైః యథా యథావదనుష్ఠితైః రతిరితి యత్. అయముపాయో భగవతోక్తః. తథాపి – గీతాసు. శ్లో. "యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి

టీ :– ఇట్లు జ్ఞానప్రకారమును చెప్పి తత్సాధనమైన ధర్మతత్వమును నారదుడు చెప్పిన దానినే చెప్పుచున్నాడు. "తత్ర" అను ఐదు శ్లోకములలో. ఏ ధర్మమునైతే సంపూర్ణముగా అనుష్ఠించినంతనే భగవంతుడగు శ్రీమన్నారాయణునియందు రతి/ ప్రీతి/ భక్తి కలుగుననుట యేదో ఈ ఉపాయము భగవంతునిచే

దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్మి" తి. "భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః" ఇత్యాది చ. (29)

చెప్పబడినది. గీతయందు ఇట్లు చెప్పబడినది. "నీవు చేయునది, భుజించునది, హవనము చేయునది, దానము చేయునది, మరియు తపస్సు చేయునది ఏది కలదో అట్టి దానినంతయు, ఓ కౌంతేయా ! నాకు అర్పణము చేయుము. అని, మరియు నేను ఎంతటివాడనో ఎవడనో అను విషయమును భక్తితో ఎఱుంగుదురు. ఇత్యాది. (29)

శ్లో ॥ గురు శశ్రూషయా భక్త్యా సర్వలబ్ధార్పణేనచ ।
సంగేన సాధు భక్తానా మీశ్వరా రాధనేనచ ॥ 30 ॥

శ్లో ॥ శ్రద్ధయా తత్కథాయాంచ కీర్తనైర్గుణ కర్మణామ్ ।
తత్పాదాంబురుహధ్యానా త్తల్లింగేక్షా ర్హణాదిభిః ॥ 31 ॥

శ్లో ॥ హరిః సర్వేషు భూతేషు భగవానంత ఈశ్వరః ।
ఇతి భూతాని మనసా కామైస్తైః సాధు మానయేత్ ॥32॥

ప్రాణులెల్లరు గురు శుశ్రూషచేత, భక్తితో, లభించినంతయును అర్పించుట ద్వారాను, సాధువులయొక్క భక్తులయొక్క సహవాసముచే, ఈశ్వరుని ఆరాధనముచే, ఈశ్వరుని కథయందు శ్రద్ధ గలిగి యుండుటచేతను, ఈశ్వరుని గుణకర్మలు కీర్తించుటచేతను, ఆ భగవంతుని పాదపద్మములను ధ్యానించుటచేతను, ఆ భగవంతుని రూపములను గాంచుట, పూజించుట, నమస్కరించుట మొదలైన వాని చేతను పూజ్యుడైన ఈశ్వరుడగు హరి సర్వ ప్రాణులయందున్నాడని మనః పూర్వకముగా ఆ కోరికలచే బాగుగా తలంచునుగాక. ( 30 - 32 )

టీ :- తత్రైవాంతరంగాన్ ధర్మానాహ - గుర్వితి. గురోః శుశ్రూషయా - భక్త్యా ప్రేమ్ణా. సర్వేషాం లబ్ధానామర్పణేన. (30)

టీ :- ఈ సందర్భము వలననే అంతరంగ ధర్మముల నిట్లు చెప్పెను. గురువుయొక్క శుశ్రూషచే= భక్తిచే లేదా ప్రేమచే లభించిన సమస్తము అర్పణము చేతను.(30)

టీ :- శ్రద్ధయేతి. తస్య లింగానాం మూర్తీనాం ఈక్షణమర్హణం చాదిర్యేషాం. వందనాదీనాం. తైశ్చ. (31,32)

టీ :- ఆ భగవంతుని యొక్క లింగానాం = మూర్తులయొక్క ఈక్షణం = పూజ మొదలుగాగల అనగా నమస్కారము మొదలుగాగల వానిచే.(31,32)

శ్లో ॥ ఏవం నిర్జిత షడ్వర్గైః క్రియతే భక్తి రీశ్వరే ।
వాసుదేవే భగవతి యయా సల్లభతే రతిమ్ ॥ 33 ॥

దేనిచేతనైతే పూజ్యుడైన వాసుదేవునియందు ప్రీతిని పొందుచున్నాడో అట్టి ఈశ్వరభక్తిని కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనెడు అరి షడ్వర్గములను నిర్జించుట ద్వారా పొందుచున్నాడు. ( 33 )

టీ :- ఏభిరితి. నిర్జితః షణ్ణాం కామక్రోధలోభమోమ మద మాత్సర్యాణాం. వర్గో యైః. (33)

టీ :- కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడు అరి షడ్వర్గమును జయించినవాడై ఈశ్వరునియందు భక్తిని పొందినవాడగును. దానిచే భగవంతునియందు ప్రేమ భక్తి ఏర్పడును. భగవద్రతి యొక్క రూపములను " నిశమ్య " ఇత్యాది మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు. ( 33 )

శ్లో ॥ నిశమ్య కర్మాణి గుణానతుల్యాన్
వీర్యాణి లీలా తనుభిః కృతాని ।
యదాతి హర్షోత్పులకాశ్రు గద్గదం
ప్రోత్కంఠ ఉద్గాయతి రౌతి నృత్యతి ॥ 34 ॥

శ్లో ॥ యదాగ్రహ గ్రస్త ఇవ క్వచిద్ద సత్యా
క్రందతే ధ్యాయతి వందతే జనమ్ ।
ముహుః శ్వసన్ వక్తి హరే జగత్పతే
నారాయణేత్యాత్మ మతిర్గత త్రపః ॥ 35 ॥

మానవుడు భగవంతుని యొక్క లీలా తనువులచే చేయబడిన కర్మలను గూర్చి విని, సాటిలేని గుణములను, పరాక్రమములను తెలుసుకొని ఎప్పుడైతే ఆనందముచే పులకాంకురములు గలిగి ఆనంద భాష్పములను కార్చుచు గద్గద కంఠుడై ఎలుగెత్తి భగవంతుని గానమును పాడునో, ఏడ్చునో, నృత్యము చేయునో, ఎప్పుడైతే గ్రహముచే ఆవరించబడిన వాడువలె ఒకప్పుడు నవ్వుచు, ఒకప్పుడు అరచుచు, ధ్యానము చేయుచు, జనులకు నమస్కరించునో, మాటి మాటికి నిట్టూర్చుచు హరే! జగత్పతే! నారాయణా ! యని ఆత్మబుద్ధి కలవాడై

శ్లో ॥ తదా పుమాన్ముక్త సమస్త బంధనః
తద్భావ భావాను కృతాశయా కృతిః ।
నిర్దగ్ధ బీజాను శయోమహీయసా
భక్తి ప్రయోగేణ సమేత్యధోక్షజమ్ ॥ 36 ॥

సిగ్గువిడిచి పిలుచునో అప్పుడు పురుషుడు సమస్త బంధములను వీడినవాడై, ఆ భగవద్భావమును అనుసరించిన భావము కలవాడై ఆకారమును అనుకరించినవాడై దహింపజేయబడిన అజ్ఞానము, వాసన గల్గి గొప్పనైన భక్తి ప్రయోగముచే అధోక్షజుని చేరుకొనుచున్నాడు.(34,35,36)

టీ :- భగవద్రతేర్లింగాన్యాహ - త్రిభిః. నిశమ్యేతి. గుణాన్ భక్తవాత్సల్యాదీన్ అతిహర్షేణ ఉద్గతాః పులకాః అశ్రూణి చ తైః. గద్గదం యథా భవత్యేవం ప్రోత్కంఠః ఉద్గాయతి. (34,35)

టీ :- గుణాన్ = భక్తి వాత్సల్యాదులను, అత్యానందముచే కల్గిన పులకములు, అశ్రువుల చేతను, గద్గదమగునట్లున్న ప్రోత్కణ్ఠః = ముక్త కంఠము కలవాడై ఉచ్చై స్వరముతో గానము చేయుచు ( 34, 35 )

టీ :- తదేతి. తస్య భావః చేష్టాదిః. తస్య భావో భావనా. తేనానుకృతే. ఆశయాకృతీ. మనశ్శరీరే యస్య. నిర్దగ్ధం బీజమజ్ఞానం అనుశయో వాసనా చ యస్య సః. సమ్యగేతి ప్రాప్నోతి. (36)

టీ :- ఆ భగవంతుని యొక్క భావః = ఆ చేష్టాదికము వానియొక్క భావము = భావనతో అనుకరించబడిన మనః శరీరములు గలవాని యొక్క దహింపచేయబడిన బీజం = అజ్ఞానము, అనుశయః = వాసనగలవాడు బాగుగా ( అధోక్షజుని ) పొందుచున్నాడు. ( 36 )

శ్లో ॥ అధోక్షజాలంబ మహాశుభాత్మనః
శరీరిణః సంస్కృతి చక్ర శాతనమ్ ।
తద్బ్రహ్మ నిర్వాణ సుఖం విదుర్బుధా
స్తతో భజధ్వం హృదయే హృదీశ్వరమ్ ॥ 37 ।

ఇహ లోకమున అధోక్షజుని ఆలంబము మనఃస్పర్శ రాగద్వేషాది యుక్తమైన ప్రాణికి సంసృతి చక్రము యొక్క (సంసార బంధముయొక్క) నివర్తకమగుని పండితులు చెప్పెదరు. దానినే బ్రహ్మ నిర్వాణ సుఖముగా తద్వేత్తలు ఎఱుంగుచున్నారు. కాన హృదయేశుడగు ఆ పరమాత్మను హృదయమున భజించుడు.(37 )






టీ :- తతః కిమత ఆహ - అధోక్షజేతి. అధోక్షజస్యాలంబం మనసా స్పర్శం. పాఠాంతరే. తస్యాశ్రయణం. అశుభః రాగాది యుక్త ఆత్మా మనో యస్య. సంస్కృతిచక్రశాతనం తన్నివర్తకం. బుధా విద్వాంసః విదుః. తదేవ బ్రహ్మణి నిర్వాణం లయో మోక్షః. తదాత్మకం సుఖం విదుః హృదీశ్వరమంతర్యామిణం. (37)

టీ :- ఐన నేమి యనిన ఇట్లు చెప్పుచున్నాడు. అధోక్షజునియొక్క ఆలంబము అనగా మనస్సుచే స్పర్శించుట. పాఠాంతరమున అతనిని ఆశ్రయించుట. అశుభమాత్మనః, అశుభో = రాగాదులచే కూడిన, ఆత్మా = మనస్సు కలవానికి సంసారచక్ర నివర్తకముగా బుధులు ఎఱుంగుచున్నారు. ( అధోక్షజుని మనసా రాగద్వేషాది యుక్తమైన మనస్సుగల మానవునికి సంసారబంధము తొలగిపోవు చున్నదని భావము ) అదియే బ్రహ్మయందు నిర్వాణం = లయము. మోక్షము. తదాత్మకమైన సుఖముగా తలంతురు. హృదీశ్వరమ్= అంతర్యామిని.(37)

శ్లో ॥ కోఽతి ప్రయాసోఽసుర బాలకా హరే
రుపాస్వనే స్వే హృది ఛిద్ర వత్సతః ।
స్వస్యాత్మనః సఖ్యురశేష దేహినామ్
సామాన్యతః కిం విషయోపపాదనైః ॥ 38 ॥

ఓ అసురబాలకులారా ! ఆకాశమువంటి శూన్యమైన మీ హృదయమున నున్నట్టి మీ ఆత్మకు సఖుడైన హరిని ఉపాసించుట ఏమి కష్టము? సామాన్య ప్రాణులైన సూకరాదులవలె విషయానుష్ఠానముచే ఏమి ప్రయోజనము? (38)

టీ :- భక్తిరశక్యేతి చ న మంతవ్యమిత్యాహ - క ఇతి. ఛిద్రవత్ ఆకాశవత్, విషయానాముపపాదనైరార్జనైః. కిం తత్ర హేతుః? సర్వదేహినాం సామాన్యతః. విషయనిష్ఠత్వేన సూకరాది సాధారణ్యా పత్తేరిత్యర్థః. న చైవమాదౌ పౌనరుక్త్యం దోషః. నారదోక్తానువాదరూపత్వాదస్య ప్రకరణస్య. (38)

టీ :- భక్తి అశక్యమనియు తలంచరాదు. అని ఇట్లు చెప్పుచున్నాడు. "కః" ఇత్యాదిగా. ఛిద్రవత్ = ఆకాశమువంటి హృదయముననున్న విషయముల యొక్క ఉప పాదనములచే నేమి, అందుకు హేతువు సర్వప్రాణులకు సామాన్యముగ విషయ వాంఛలు కలిగి యుండుట వలన సూకరాది సాధారణ్యాపత్తి కలుగుట వలన యని యర్థము. ఇత్యాది వాక్కులందు పౌనరుక్త్య దోషము కలుగునని తలంచరాదు. ఎందులకనగ నారదుని పలుకులకు ఈ ప్రకరణము అనువాద రూపము. ( 38 )





శ్లో ॥ రాయః కలత్రం పశవః సుతాదయో
గృహెూ మహీ కుంజర కోశ భూతయః ।
సర్వేఽథ కామాః క్షణభంగురాయుషః
కుర్వంతి మర్త్యస్య కియత్ప్రియం చలాః ॥ 39 ॥

అర్థములు, కళత్రము, పశువులు, పుత్రాదులు, గృహములు, కోశము, సంపత్తులు, మరియు సకలవిధ కోరికలు అన్నియును చలములు. అట్టివి క్షణభంగురమైన ఆయువుకల మానవులకు ఏమి మేలు చేయును?. ( 39 )

టీ :– అనర్థకం చ విషయార్జనమిత్యాహ – రాయ ఇతి. రాయః అర్థాః. క్షణభంగురమాయుర్యస్య. తదుక్తమితిహాసేషు. శ్లో. "ధనం హి పురుషో లోకే పురుషం ధనమేవ వా, అవవ్యమేకం త్యజతి తస్మాత్కిం ధనతృష్ణయే" తి. (39)

టీ :– విషయార్జనము అనర్థకమని ఇట్లు చెప్పుచున్నాడు. రాయః = అర్థములు, (కలత్రము, పశువులు, పుత్రులు మొదలైనవారు, గృహములు, భూమి, గజములు, ధనాగారములు, సంపదలు ) క్షణములో నాశనమునందు ఆయువుకల మానవునకు ఎంతవరకు ప్రీతిని కలిగించును? ఇతిహాసములో అది ఇట్లు చెప్పబడుచున్నది. "లోకమున పురుషుడు ధనమును గానీ, ధనము పురుషుని గానీ అవశ్యముగా (ఒకటి మరొకదానిని ) వదులుచున్నది. కావున ఈ ధన తృష్ణచే ఏమి ప్రయోజనము?" అని. (39)

శ్లో ॥ ఏవం హి లోకాః క్రతుభిః కృతా అమీ
క్షయష్ణవః సాతిశయా న నిర్మలాః ।
తస్మాదదృష్ట శృతదూషణం పరం
భక్త్యైకయేషం భజతాత్మ లబ్ధయే ॥ 40 ॥

క్రతువులచే సాధించబడిన స్వర్గాదిలోకముల సుఖభోగాదులచే ఉత్కృష్టము లైనవే కాని నిర్మలములు కావు. పుణ్యము క్షీణించినంతనే నశించునవే. అందువలన ఆత్మ జ్ఞానము పొందుటకై ఏకైక సాధనమైన భక్తిచే అదృష్టము అశృతమునైన దూషణముగల పరమైన ఉత్కృష్టమైన ఈశ్వరుని భజించుడు. ( 40 )

టీ :- శ్లో. "యన్న దుఃఖేన సంభిన్నం న చ గ్రస్తమనంతరం, అభిలాషోపపన్నం చ సుఖం స్వర్గపదాస్పదమి" త్యేవంభూతాః స్వర్గాదిభోగా అపి న సేవార్హా ఇత్యాహ – ఏవం హీతి. క్షయిష్ణుత్వే హేతుః. క్రతుభిః కృతా ఇతి. శ్రు. "తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయత" ఇతి శ్రుతేః. అతఏవ. పుణ్యతారతమ్యేన సాతిశయాః న చ నిర్మలాః స్పర్ధాదిమత్త్వాత్. న విద్యతే దృష్టం శ్రుతం చ దూషణం యస్మిన్. (40)

టీ :- ఏదైతే దుఃఖముచే సంభిన్నము కానిదియు, అనంతరము పొందబడినదియు అభిలాషచే (క్రియాదులద్వారా) కల్గినదియునగు సుఖము కలదో అదియే స్వర్గపదము ఆస్పదము కాగలది. (అనగా స్వర్గసుఖము అని అర్థము) ఇత్యాది రూపములైన స్వర్గాది భోగములు గూడా సేవించదగవు. అని చెప్పుచున్నాడు. ఏవహీతి = ఏవం ఇత్యాదిగా. క్షయిష్ణుత్వేహేతుః = స్వర్గాది భోగములు నశించుటకు కారణము క్రతుభిః కృతా యని చెప్పెను. "ఈ లోకమున కర్మచే సాధించబడినది నశించుచున్నదో అట్లే ఈ లోకమున గావించబడిన పుణ్యములచే సంపాదించబడిన స్వర్గాది పుణ్యలోకము గూడా నశించును కదా!"యని శ్రుతి చెప్పిన వాక్యములిందు ప్రమాణము. అందు వలననే ఆ లోకములు పుణ్య తారతమ్యముచే అతిశయముగలవి కాని నిర్దుష్టములు, నిర్మలములు గావు. స్పర్ధాదులతో కూడియున్నందున అనునది కారణము చూపబడెడు, వినబడెడు దూషణము లేనిది. అదృష్ట శ్రుత దూషణమ్ (40)

శ్లో ॥ యదదర్థ్యేహ కర్మాణి విద్వన్ మాన్య సకృన్నరః ।
కరోత్యతో విపర్యాస మమోఘం విందతే ఫలమ్ ॥ 41॥

ఈ లోకమున విద్వన్మాన్యుడైన నరుడు దేనినైతే కోరుచున్నాడో అట్టి కర్మలను ఆచరించుచున్నాడు. దానిచే విపరీతమైన, అమోఘమైన ఫలమును పొందుచున్నాడు.(41)

టీ :- కించ. యదితి. యదర్థే యత్సంకల్ప్య. అతః సంకల్పితాత్. విపర్యాసం విపరీతం ఫలం అమోఘం అవశ్యం ప్రాప్నోతి. (41)

టీ :- ఇంతేకాక యదర్థ్య = ఏ సంకల్పము , కావున సంకల్పించిన దానికంటే విపర్యాసమైన ( భిన్నమైన ) విపరీతమైన అమోఘమైన (వ్యర్థము కాని) ఫలమును తప్పక పొందును. ( 41 )

శ్లో ॥ సుఖాయ దుఃఖమోక్షాయ సంకల్ప ఇహకర్మిణః ।
సదాప్నోతీహయా దుఃఖమనీహాయాః సుఖావృతః ॥ 42॥

కర్మయైన మానవుని యొక్క సుఖము కొఱకు, దుఃఖ మోక్షము కొఱకు గావించబడిన ఈ సంకల్పము కోటికతో కూడినందున దానిచే సుఖము కూడియున్నదై తను కోరినటువంటి దుఃఖము సదా కలిగించును. ( 42 )

టీ :- తదేవ దర్శయతి. సుఖాయేతి - ఈహయా ఇచ్ఛయా. క్రియయా వా. యః పూర్వమహానీయాః హేతోః సుఖేనావృతో వ్యాప్త ఆసీత్. స ఈహయా దుఃఖాప్నోత్యేవ. (42)

టీ :- దానినే చూపెట్టుచున్నాడు. సుఖాయ ఇత్యాదిగా. ఈహయం = ఇచ్ఛచే, క్రియచేతగానీ, ఏదైతే పూర్వము లేని కారణమున సుఖముచే ఆవృతః = వ్యాప్తమై ఉండెనో అదియే ఇచ్ఛచే దుఃఖమును కల్గించుచున్నది. సుఖముద్వారా దుఃఖము కలుగుట. ( 42 )

శ్లో ॥ కామాన్ కామయతే కామ్యైర్యదర్థ మిహపూరుషః ।
స వై దేహస్తు పారక్యో భంగురో యాత్యుపైతి చ ॥ 43॥

కామ్య కర్మలచే ఎవడైతే కామములను కోరుకొనునో అట్టివాడు అట్టి భోగములను పొందుటకై పారలౌకికమైన అనిత్యమైన దేహమును పొందును. అట్టి భోగానుభవము తరువాత ఆ శరీరము నష్టమగును. ( 43 )

టీ :- కించ. కామానితి. కామాన్ భోగాన్. కామ్యైః విషయైః కర్మభిర్వా పారక్యః శాదిభోగ్యః. న త్వాత్మీయః భంగురశ్చ. (43)

టీ :- ఇంతేకాక కామాన్ = భోగములను, కామ్యైః = విషయములచే, కర్మలచేత గానీ, పారక్యః = శ్వాదులచే అనుభవించదగినది స్వకీయమైనది మాత్రము కాదు. నశించునట్టిది నిత్యమైనది కాదు. ( 43 )

శ్లో ॥ కిము వ్యవహితా పత్య దారాగార ధనాదయః ।
రాజ్యం కోశ గజామాత్య భృత్యాప్తా మమతా స్పదాః ॥44॥

శరీరమునకంటే భిన్నములైన భార్యాపిల్లలు, ధనము మొదలైనవి ఎందులకు? మరియు కోశము, గజ సమూహము అమాత్య, భృత్య, ఆప్తవర్గము అంతయు మమతాస్పదమే కానీ వేరుగాదు. వీనితో ఏమియు ప్రయోజనము లేదు.(44)

టీ :- కిమ్విత్వితి. కిము దేహాత్ వ్యవహితాః అపత్యాదయః. మమతావిషయాః. పారక్యా ఇతి కిము వక్తవ్యం. (44)

శ్లో ॥ కిమేతైరాత్మనస్తుచ్ఛైః సహదేహేన నశ్వరైః ।
అనర్థై రర్థసంకాశైః నిత్యానంద మహోదధేః ॥ 45 ॥

టీ :- కించ. స్వయం పురుషార్థరూపస్య కిమేతైరిత్యాహ - కిమేతైరితి. (45)

శ్లో ॥ నిరూప్యతా మిహస్వార్థః కియాన్ దేమభృతోసురాః ।
నిషేకాదిష్వవస్థాసు క్లిష్య మానస్య కర్మభిః ॥ 46 ॥

టీ :- భోగావసరాభావాచ్చైతైః క ఉపయోగః? ఇతాహ - నిరూప్యతామితి. ప్రాచీనైః కర్మభిః క్లిశ్యమానస్య. కర్మభిః కియానర్థ ఇతి వా అన్వయః. (46)

టీ :- స్వదేహమునకన్న భిన్నములైన సంతానము మొదలైనవి మమతా విషయములా? పారక్యములు అనగా ఇతరుల భోగ సాధనములు , భోగముల అని చెప్పవలెను. ( 44 )

నిత్యానంద మహోదధియగు ఆత్మకు తుచ్ఛములు దేహముతోపాటు నశించునవి అర్థమువలె భాసించు అనర్థములైన వీనిచే ఏమి ప్రయోజనము? (45)

టీ :- ఇంతేకాక స్వయముగా పురుషార్థరూపుడైన వానికి అతి తుచ్ఛములైన వీనిచే నేమి ప్రయోజనము? అని చెప్పును. 'కిమేతై' రిత్యాది శ్లోకమున.(45)

ఓ అసురులారా! ఈ నిషేకము మొదలైన అవస్థలందు కర్మలచే బాధపడెడు దేహధారులకు స్వార్థము (స్వప్రయోజనము) ఏమిటో పరిశీలించుడు. ( 46 )

టీ :- భోగావసరమేలేనందున వీనిచే ఏమి ఉపయోగము? అని 'నిరూప్యతాం' అత్యాదిగా చెప్పెను. ప్రాచీనములైన నిషేకము మొదలైన కర్మలచే పీడించబడువానికి, కర్మలచే ఎంతటి స్వార్థము అని యైనను అన్వయము. (46)

శ్లో ॥ కర్మాణ్యారభతే దేహీ దేమేనాత్మాను వర్తినా ।
కర్మభిస్తనుతే దేహ ముబయంత్వవివేకతః ॥ 47 ॥

ప్రాణి ఆత్మానువర్తియైన దేహముచే పనులుచేయు (కర్మలు) ఆరంభించును. కర్మలచే మరొక శరీరమును సృష్టించుకొనును. ఇవి రెండును అవివేక మూలములే.(47)

టీ :- నను కర్మసు సమాప్తేషు భోగావసరస్యాత్తత్రాహ - కర్మాణీతి. న చేదం కర్మ. తత్ఫలం దేహాదికం చ. పరమార్ధ ఇత్యాహ - ఉభయం కర్మ చ దేహం చ. అవివేకతః ఆత్మాజ్ఞానేనైవ తనుతే. (47)

టీ :- కర్మలు సమాప్తము కాగా భోగావసరము కలుగును కదా ! అనిన ‘ కర్మాణి’ ఇత్యాదిగ చెప్పెను. ఈ కర్మ దానికి ఫలము కాదు. అని “ ఉభయం కర్మచ దేహంచ ” ఇత్యాదిగ చెప్పెను. అవివేకతః = అజ్ఞానము చేతనే దేహమును సృష్టించుకొనుచున్నాడు.(47)

శ్లో ॥ తస్మాదర్థాశ్చ కామాశ్చ ధర్మాశ్చ యదపాశ్రయాః ।
భజతానీహయాత్మాన మనీహం హరిమీశ్వరమ్ ॥48॥

కావున అర్ధములు, కామములు, ధర్మములును దేని నాశ్రయించి యుండునో అట్టి ఆత్మయైన ఈశ్వర స్వరూపుడైన హరిని నిష్కామముగా భజించుడు. (48)

టీ :- తస్మాదితి. యదుపాశ్రయాః యదధీనాః. (48)

టీ :- అర్థాదులు యదపాశ్రయాః = దేనికి అధీనములో ( 48 )

శ్లో ॥ సర్వేషామేవ భూతానాం హరిరత్మేశ్వరః ప్రియః ।
భూతైర్మహద్భిః స్వకృతైః కృతానాం జీవ సంజ్ఞకః ॥49॥

మహాభూతముల ( పృథివీ, జల, తేజో, వాయు, ఆకాశముల ) చే కావించబడిన జీవులను పేరుగల సమస్త భూతములకును ( ప్రాణులకును) హరియే ఆత్మేశ్వరుడు ప్రియమైనవాడు. ( 49 )

టీ :- సర్వేషామితి. భూతానాం ప్రాణినాం జీవసంజ్ఞితః అంతర్యామీ. (49)

టీ :- భూతానాం = ప్రాణులకు జీవసంజ్ఞగల అంతర్యామియైన వాడు. (49)

శ్లో ॥ దేవోఽసురో మనుష్యోవా యక్షో గంధర్వ ఏవచ ।
భజన్ముకుంద చరణం స్వస్తిమాన్స్యాద్యథా వయమ్ ॥50॥

దేవుడు కానిమ్ము లేదా అసురుడు, మనుష్యుడు కానిమ్ము, యక్షుడు లేదా గంధర్వుడైనను కానిమ్ము ముకుందుని చరణమును భజించువాడై మావలె క్షేమము గలవాడగును. ( 50 )

శ్లో ॥ నాలం ద్విజత్వం దేవత్వమృషిత్వం వాఽసురాత్మజాః ।
ప్రీణనాయ ముకుందస్య న వృత్తం న బహుజ్ఞతా ॥51॥

ద్విజత్వము గానీ, దేవత్వము, ఋషిత్వము గాని, నడవడి గానీ, బహుజ్ఞత గాని ఓ అసురబాలకులారా ! ముకుందుని సంతోష పరచజాలవు. (51)

టీ :- అసురాణామస్మాకమత్ర నాధికార ఇత్యపి న వాచ్య మిత్యాహ - పంచభిః. దేవ ఇతి. (50,51)

టీ :- అసురులమైన మాకు ఇందు అధికారము లేదనియు చెప్పదగదని ‘ దేవ’ మొదలైన ఐదు శ్లోకములచే చెప్పుచున్నాడు. ( 50, 51 )

శ్లో ॥ న దానం న తపోనేజ్యా న శౌచం న వ్రతాని చ ।
ప్రీయతేఽమలయా భక్త్యా హరిరన్యద్విడంబనమ్ ॥ 52॥

దానముగాని, తపస్సుగాని, యాగము గాని, శుచిత్వము గాని, వ్రతములు గానిమ్ము ముకుందుని సంతోషపరచ జాలవు. నిర్మలమైన భక్తిచేత మాత్రమే హరి సంతోష పరచబడును. ఇతరములన్నియు విడంబనములే.(52)

శ్లో ॥ తతో హరౌ భగవతిం భక్తిం కురుత దానవాః ।
ఆత్మౌపమ్యేన సర్వత్ర సర్వభూతాత్మనీశ్వరే ॥ 53 ॥

కావున ఓ దానవులారా ! అందువలన పూజ్యుడైన హరియందు భక్తిని కలిగియుండుడు. సకలప్రాణులయందు, సర్వభూతాత్ముడైన ఈశ్వరునియందు మీయందు వలెనే ప్రవర్తించుడు. (53)

టీ :- నేతి. అమలయా నిష్కామయా. విడంబనం నటన మాత్రం. (52,53)

టీ :- అమలయా = నిష్కామమైన, వేరొకటి విడంబనం = నటన మాత్రమే. (52,53)

శ్లో ॥ దైతేయా యక్షరాక్షాంసి స్త్రియః శూద్రా వ్రజౌకసః ।
ఖగా మృగాః పాపజీవా సంతి హ్యచ్యుతతాం గతాః ॥54॥

దైత్యులు, యక్షులు, రాక్షసులు, స్త్రీలు, శూద్రులు, పల్లెవాసులు, పక్షులు, మృగములు, పాపాత్ములు కూడా అచ్యుతుని భావమును పొందినవారు కలరు.(54)

టీ :- దైతేయా ఇతి. అచ్యుతాం అమృతత్వం. (54)

టీ :- అచ్యుతతాం = అమృతత్వమును. ( 54 ))

శ్లో ॥ ఏతావానేవ లోకేఽస్మిం పుంసః స్వార్థః పరః స్మృతః ।
ఏకాంత భక్తి గోవిందే యత్సర్వత్ర తదీక్షణమ్ ॥ 55 ॥

గోవిందునియందు ఏకాంత భక్తి కలిగి యుండుట సర్వత్ర ఆ గోవిందునే దర్శించుట యనునది ఏది గలదో అదియే ఈ లోకమున పురుషునకు శ్రేష్ఠమైన స్వార్థముగా చెప్పబడుచున్నది. ( 55 )

టీ :- అధ్యాయద్వయోక్తముపసంహరతి - ఏతావానితి. తదీక్షణం గోవిందదృష్ట్యా సంమాననం. (55)

టీ :- రెండధ్యాయములందు చెప్పబడిన దానిని ఉపసంహారము చేయుచున్నాడు. " ఏతావాన్ " ఇత్యాది శ్లోకమున. తదీక్షణం = గోవిందుడను దృష్టితో గౌరవించుట.(55)

**ఇతి శ్రీమద్భాగవత మహా పురాణే సప్తమ స్కంధే దైత్య పుత్రానుశాసనం నామ సప్తమోధ్యాయః ॥**

**ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి ఏడవ స్కంధము నందలి శ్రీధర భావార్థ దీపికయందు సప్తమాధ్యాయము టీకానువాదము.**





శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ అథ దైత్య సుతాః సర్వే శ్రుత్వా తదను వర్ణితమ్ ।
జగృహు ర్నిరవద్యత్వా న్నైవ గుర్వను శిక్షతమ్ ॥ 1 ॥

టీ :- అష్టమే తి రుషాసూనుం నిఘ్నన్ దైత్యో హతస్స్వయం, ఆవిర్భూయ నృసింహేన స చ బ్రహ్మాదిభిస్తు స్తతః (1)

శ్లో ॥ అథాచార్య సుతస్తేషాం బుద్ధిమేకాంత సంస్థితామ్ ।
ఆలక్ష్య భీత స్త్వరితో రాజ్ఞ ఆవేదయ ద్యథా ॥ 2 ॥

టీ :- అంతఃకృపాసుధా పూర్ణో బహిః క్రోధో నృకేసరీ, దైత్యేంద్ర మరిభావేన భజంతం స్వమభావయత్. అథేతి. ఏకాంతస్థితాం ప్రత్యఙ్నిష్ఠాం యథా యథావత్. (2)

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారదుడిట్లు చెప్పుచున్నాడు :-**

అప్పుడు దైత్య పుత్రులందరు ఆ ప్రహ్లాదుడు వివరించి చెప్పినది విని ఆ మార్గము వ్యర్థము కాని దగుటవలన గ్రహించిరి. గురువుచే శిక్షించ బడిన దానిని గ్రహించకుండిరి. ( 1 )

టీ :- అష్టమాధ్యాయమున హిరణ్యకశిపుడు మిక్కిలి కోపముతో పుత్రుని హింసించువాడై ఆవిర్భవించిన నృసింహునిచే స్వయముగ చంపబడినాడు. ఆ నృసింహుడు బ్రహ్మాదులచే స్తుతించబడెను. (1 )

అటు పిమ్మట గురు పుత్రుడు కేవలము హరియందే లగ్నమైన వారి బుద్ధిని గ్రహించినవాడై భయపడుచు వేగముగా ఉన్నదున్నట్లుగా రాజునకు తెలియ జేసెను.(2)

టీ :- హృదయమున కృపామృతముచే నిండినవాడైనను బయటకు క్రోధావేశ పూర్ణుడైన నృసింహుడు శత్రుభావముచే తనను భజించెడు దైత్యపతియైన హిరణ్యకశిపుని దయదలచి మోక్షమొసంగెను. ఏకాంత సంస్థితాం = తనకు భిన్నముగా భగవంతుని యందే లగ్నమైయున్న, యథా = ఉన్నది ఉన్నట్లుగా. (2)





శ్లో ॥ శ్రుత్వా తదప్రియం దైత్యో దుఃసహం తనయానయమ్ ।
కోపావేశ చలద్గాత్రః పుత్రం హంతు మనో దధే ॥ 3 ॥

దైత్యుడైన ఆ హిరణ్యకశిపుడు దైత్య పుత్రుల యొక్క సహింపశక్యము గానట్టి, అప్రియమైనట్టి తన విపక్షాశ్రయణమును గూర్చి విని కోపావేశముచే చలించు శరీరము గలవాడై పుత్రుని సంహరించుటకై మనస్సు పెట్టెను.(3)

టీ :- శ్రుత్వేతి. దైత్యః సపుత్రం హంతుం మనో దధే కథంభూతః కోపస్యావేశనోద్రేకేణ చలత్ గాత్రం వపుర్యస్య సః. (3)

టీ :- ఆ హిరణ్యకశిపుడును పుత్రుని చంపుటకు మనస్సును లగ్నము చేసెను. అట్టి దైత్యేంద్రుడెట్టివాడనిన కోపముయొక్క, ఆవేశేన = ఉద్రేకముతో చలించు గాత్రము=శరీరము గలవాడు. ( 3 )

శ్లో ॥ క్షిప్త్వా పరుషయా వాచా ప్రహ్లాద మత దర్హణమ్ ।
ఆహేక్షమాణః పాపేన తిర శ్చీనేన చక్షుషా ॥ 4 ॥

శ్లో ॥ ప్రశ్రయా వనతం దాన్తం బద్ధాంజలి మవస్థితమ్ ।
సర్పః పదాహత ఇవ శ్వసన్ ప్రకృతి దారుణః ॥ 5 ॥

అట్టి నిందకు యోగ్యుడు గాని ప్రహ్లాదుని పరుషమైన వాక్కులచే నిందించి రోషముతో గూడిన వక్రదృష్టితో చూచుచున్నవాడై కాలితో త్రొక్కబడిన సర్పమువలె నిట్టూర్చుచూ మిక్కిలి భయంకరుడై వినయముచే నమ్రుడై బద్ధాంజలియై నిలబడియున్న ఇంద్రియ నిగ్రహముగల ప్రహ్లాదుని ఇట్లనెను. 4,5

టీ :- క్షిప్త్వేతి. క్షిప్త్వా తిరస్కృత్య పాపేన సరోషేణ తిరశ్చీనేన వక్రేణ. (4,5)

టీ :- క్షిప్త్వా = తిరస్కరించి, పాపేన = రోషముతో గూడిన, తిరశ్చీనేన = వక్రమైన.(4,5)

శ్లో ॥ హే దుర్వినీత మందాత్మన్ కులభేద కరాధమ ।
స్తబ్ధం మచ్ఛాసనోద్ధూతం నేష్యేత్వాఽద్య యమక్షయమ్

ఓరీ దుర్వినీతుడా ! అల్పబుద్ధి కలవాడా ! కులవినాశకరా ! అధమా! స్తబ్ధుడా ! నా ఆజ్ఞనుల్లంఘించిన నిన్నీనాడు యమాలయమునకు పంపెదను. 6







॥6॥

టీ :- హే దుర్వినీతేతి. మందాత్మన్ అల్పబుద్ధే మదజ్ఞాలంఘినం త్వాం అద్య యమాలయం నేష్యామి. (6)

శ్లో ॥ క్రుద్ధస్య యస్య కంపన్తే త్రయోలోకాః సహేశ్వరాః ।
తస్యమే భీతవన్మూఢ శాసనం కింబలోऽత్యగాః ॥ 7 ॥

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ న కేవలం మే భవతశ్చ రాజన్
స వై బలం బలినాం చా పరేషామ్ ।
పరేవరేమీ స్థిర జంగమా యే
బ్రహ్మాదయో యేన వశం ప్రణీతా ॥ 8 ॥

టీ :- క్రుద్ధస్యేతి. అభీతవత్ కింబలం యస్య సః కింబలః. (7,8)

టీ :- హే మందాత్మన్ = ఓ అల్ప బుద్ధీ ! నా ఆజ్ఞ నతిక్రమించిన నిన్ను నేడు యమగృహమున కనిపెదను. ( 6 )

ఎవడు కోపించిన వాని వాని ప్రభువులతో గూడా ముల్లోకములు కంపించునో అట్టి నాకు భయపడని వాని వలె నున్న, నీవు ఓ మూఢుడా ! (ఏమి బలము కలవాడనని) కించిన్మాత్రము బలము కలవానివి నా శాసనమునతిక్రమించుచున్నావు.(7)

**ప్రహ్లాదుడిట్లనెను :-**

ఓరాజా! నాకు, నీకు మాత్రమే కాదు. ఇతర బలవంతులందరికిని ఆ హరియే బలము. ఇహ పరములందున్న ఏ స్థావర జంగమములు కలవో, బ్రహ్మాదులు కలరో అట్టి వీరందరును ఆతనిచే వశము గావించుకొన బడినారు. (8)

టీ :- భయపడనివాని వలె క్షుద్రమైన ( స్వల్పమైన ) బలము కలవాడు కింబలుడు.(7,8)







శ్లో ॥ స ఈశ్వరః కాల ఉరుక్రమో అసా
వోజః సహః సత్త్వ బలేంద్రియాత్మా ।
స ఏవ విశ్వం పరమః స్వ శక్తిభిః
సృజత్య వత్యత్తి గుణత్రయేశః ॥ 9 ॥

అతడే ఈశ్వరుడు ( సర్వ శక్తి సంపన్నుడు ),ఆయనే బహు పరాక్రమ సంపన్నుడు, అట్టి యితడే ఆది రూపుడు, సహనము గలవాడు, ధైర్యము గలవాడు, బలము, ఇంద్రియములు గలవాడు, శ్రేష్ఠుడైన అతడే, గుణత్రయాధీశుడే తన శక్తులచే విశ్వమును సృష్టించును, పాలించును, నశింపజేయును. ( 9 )

టీ :- వశం ప్రణీతా ఇత్యత్ర హేతుః. స ఈశ్వర ఇతి ఉరవః క్రమాః పాదవిక్షేపా యస్య బహు పరాక్రమ ఇతి వా. ఓజః ఇంద్రియపాటవం సహః మనసః పాటవం ఓజఆదిరూపః సత్త్వం ధైర్యం బుద్ధిర్వా.(9)

టీ :- వశము గావించుకొనబడినారు అనుటకు హేతువు ' సః హేతువు ' ఇత్యాది శ్లోకము. గొప్పనైన పాద విక్షేపములు గలవాడు = ఉరుక్రమః . బహుపరాక్రముడు అనియునైన. ఓజః = ఆది రూపుడు. సత్త్వం = ధైర్యము లేదా బుద్ధి. ( 9 )

శ్లో ॥ జహ్యాసురం భావ మిమం త్వమాత్మనః
సమం మనోధత్స్వ న సన్తి విద్విషః ।
ఋతే జితా దాత్మన ఉత్పథ స్థితాత్
తద్ధిహ్యనంతస్య మహత్సమర్హణమ్ ॥ 10 ॥

నీ యీ అసుర భావమును వీడుము. సమబుద్ధిని వహించుము. శత్రువులెవరును లేరు. జయించబడినట్టి, చెడుమార్గమున ప్రవర్తించునట్టి ఆత్మ కంటే శత్రువులు వేరెవరు లేరు. అదియే అనంతునకు గొప్ప పూజయగును. (10)

టీ :- మచ్ఛత్రుః అసౌ కథం మమాసి స ఏవ బలం స్యాదత ఆహ - జహీతి. ఆత్మనః స్వస్య స్వభావం త్యజ యతః అజితాదాత్మనో మనసః ఋతేవినా అన్యే విద్విషో న సంతి

టీ :- నా శత్రువైన యితడు నాకుగూడా బలమెట్లగుననిన ఇట్లు చెప్పెను. 'జహి' ఇత్యాదిగా. స్వస్య = తనయొక్క , భావం = భావము = స్వభావము. దానిని వీడుము. ఎందువల్లననగా జయించబడని ఆత్మ కంటే వేరే శత్రువులు

కించ తద్ధి తదేవ హి సామ్యేన మనసో ధారణమేవ సమర్హణం ఆరాధనం. (10)

లేరు. ఇంతేకాదు తద్ధి=అదియే కదా ! సమ భావముతో మనస్సు యొక్క ధారణమే సమర్హణం = ఆరాధనము ( 10 )

శ్లో ॥ దస్యూన్ పురాషణ్ణ విజిత్య లుంపతో
మన్యంత ఏకే స్వజితా దిశోదశ ।
జితాత్మనోజ్ఞస్య సమస్య దేహినాం
సాధోః స్వమేహ ప్రభవాః కుతః పరే ॥ 11 ॥

తనను కొల్లగొట్టెడు ఆర్గురు ( త్వగాది షడింద్రియములు ) దొంగలను ముందుగా జయించక కొందరు దశ దిక్కులచే తమచే జయించ బడినవని తలంతురు. జితాత్ముడు, జ్ఞాని, ప్రాణులన్నింటిలో సమభావమును కలిగియుండువాడునైన సజ్జనునకు తన అజ్ఞానము వలన కలిగెడు శత్రువు లెక్కడ నుందురు. ( 11 )

టీ :- మయా దిగ్విజయే సర్వే జితాః అతః సాంప్రతం న సంతీతి చేత్ తత్రాహ - దస్యూనితి. ఏకే భవాదృశా మందాః పురా ఆదౌ లుంపతః సర్వస్వం హరతః షడింద్రియలక్షణాన్ శత్రూన్ న విజిత్య అజిత్వా దశ దిశః స్వయం జితా ఇతి మన్యంతే సాధోస్తు జితచిత్తస్య. దేహినాం సమస్య- జ్ఞస్య విదుషః స్వాజ్ఞానకల్పితాః పరే శత్రవః కుతస్స్యుః. (11)

టీ :- ' నాచే దిగ్విజయ సందర్భమున శత్రువులందరు జయించబడినారు. కాన ఇప్పుడు శత్రువులు లేరు. ' అనిన సత్యము, అను విషయమున ఇట్లు చెప్పెను. 'దస్యూన్' ఇత్యాదిగ. కొందరు నీలాటి మందమతులు పురా = మొదట, లుంపతః = సర్వస్వమును హరించునట్టి షడింద్రియము లనెడు శత్రువులను అవిజిత్య = జయించక పది దిక్కులు స్వయముగా జయించబడినవని తలంతురు. జిత చిత్తుడైన సజ్జనునకైతే దేహధారులలో సమభావముగల జ్ఞస్య = పండితునకు తన అజ్ఞానముచే కల్పించబడిన పరే = శత్రువులు ఎక్కడ నుందురు?. ఎక్కడనూ ఉండరని భావము. ( 11 )

**హిరణ్యకశిపు రువాచ :-**

శ్లో ॥ వ్యక్తం త్వం మర్తు కామోసి యోతి మాత్రం వికత్థసే ।
ముమూర్షూణాంహి మందాత్మన్నను స్యు ర్విప్లవా
గిరః ॥ 12 ॥

**హిరణ్యకశిపుడిట్లు పలికెను :-**

ఇట్లు మిక్కిలి బడాయిలు పలుకుచున్న నీవు చావ గోరుచున్నావు. ఇది స్పష్టము. ఓ మందమతీ ! చావకోరెడు వారి మాటలు ఉపద్రవయుక్తములు గదా (12)

టీ :- వ్యక్తం నిశ్చితం విప్లుతాః అనన్వితార్థాః. (12)

టీ :- వ్యక్తం = నిశ్చితము. విప్లవాః = పొంతన లేనివి అని అర్థము. (12)

శ్లో ॥ యస్త్వయా మంద భాగ్యోక్తో మదన్యో జగదీశ్వరః ।
క్వాసౌయది స సర్వత్ర కస్మాత్ స్తంభే న దృశ్యతే ॥ 13॥

నీచే ఏమందభాగ్యుడైతే నాకంటే భిన్నమైన జగదీశ్వరుడుగా చెప్పబడినాడో వీడెక్కడనున్నాడు? ఒకవేళ అంతటనున్నాడనిన ఈ స్తంభమున ఏల అగుపడకున్నాడు?(13)

టీ :- య ఇతి. హే మందభాగ్య యద్యసౌ అస్తి? తర్హి క్వాస్తి ప్రహ్లాద ఆహ - స సర్వత్రాస్తి. హిరణ్యకశిపురాహ -కస్మాత్ స్తంభే నాస్తి? ప్రహ్లాదస్తు తం స్తంభం నిరీక్షమాణః నృత్యన్నాహ - దృశ్యత ఇతి. (13)

టీ :- ఓ దురదృష్టవంతుడా ! నాకన్న వేరైన జగదీశ్వరుడు ఉన్నట్లైతే అతడెక్కడ నున్నాడు? దానిని ప్రహ్లాదుడు " అతడు అంతటనున్నాడు "అని పల్కెను. అది విని హిరణ్యకశిపుడు అట్లైన ఈ స్తంభమున లేడేల? అని ప్రశ్నించెను. ప్రహ్లాదుడు ఆ స్తంభమును చూచుచున్నవాడై నమస్కరించుచు ఇట్లనెను. " కనబడుచున్నాడు " అని.(13)

శ్లో ॥ సోహం వికత్థ మానస్య శిరః కాయా ద్ధరామితే ।
గోపాయేత హరిస్త్వాద్య యస్తే శరణమీప్సితమ్ ॥ 14 ॥

అట్టి జగత్పతినైన నేను ఇట్లు బీరములాడెడు నీయొక్క శిరమును కాయమునుండి హరించుచున్నాను. ఎవడైతే నీకు రక్షకుడుగా ఇష్టమో అట్టి హరి నేడు నిను రక్షించుగాక. ( 14 )

టీ :- హిరణ్యకశిపుస్తత్ర తమపశ్యన్నాహ - సో హమితి. వికస్థమానస్య విపరీతం బ్రువాణస్య తే శిరః కాయాద్ధరామి పృథక్కరోమి,(14)

టీ :- హిరణ్యకశిపుడు ఆ స్తంభమున హరిని గానక ' సోహం ' ఇత్యాదిగ పల్కెను. "వికత్థ మానస్య " విపరీతము పలుకుచున్న నీ శిరమును శరీరమునుండి హరామి=వేరుచేయుదును. ( 14 )

శ్లో ॥ ఏవం దురుక్తై ముహుర్ధయన్ రుషా
సుతం మహాభాగవతం మహాసురః ।
ఖడ్గం ప్రగృహ్యో త్పతితో వరాసనాత్
స్తంభం తతాడాతి బలః స్వముష్టినా ॥ 15 ॥

మహాసురుడైన హిరణ్యకశిపుడు మహాభాగవతుడగు సుతుని ఇట్లు కఠినమైన చెడు మాటలచే పీడించుచున్నవాడై ఖడ్గమును పట్టుకొని తన సింహాసనము నుండి దిగ్గున లేచినవాడై మిక్కిలి బలము గలవాడై తన పిడికిలిచే స్తంభమును కొట్టెను. (15)

శ్లో ॥ తదైవ తస్మి న్నినదోతి భీషణో
బభూవ యేనాండకటాహ మస్ఫుటత్ ।
యద్వై స్వధిష్ణ్యోపగతం త్వజాదయః
శ్రుత్వా స్వధా మాప్యయ మంగ మేనిరే ॥ 16 ॥

అప్పుడే ఆ సభలో మిక్కిలి భయంకరమైన శబ్దము కలిగెను. దానిచే బ్రహ్మాండ భాండము పగిలినట్లాయెను. బ్రహ్మ మొదలైన వారు తమ స్థానము వరకు వ్యాపించిన ఆ శబ్దమును విని తమ స్థానము ( లోకము ) నాశమగుచున్నట్లు తలచిరి. ( 16 )

టీ :- ఏవమితి. ప్రహ్లాదేవ మూర్ధ్ని బద్ధాంజలినా నిరీక్షమాణం స్తంభం తాడితవాన్. (15,16)

టీ :- శిరమున అంజలి ఘటించిన ప్రహ్లాదునిచే చూడబడెడు స్తంభమును పిడికిలిచే కొట్టెను. ( 15, 16 )

శ్లో ॥ సవిక్రమన్ పుత్ర వధేప్సు రోజసా
నిశమ్య నిర్హ్రాద మపూర్వ మద్భుతమ్ ।
అంతః సభాయాం న దదర్శ తత్పదం
వితత్ర సుర్యేన సురారి యూథపాః ॥ 17 ॥

పరాక్రమముచే విక్రమించుచు పుత్రుని వధను గోరుచున్న ఆ దైత్యుడు ఇంతవరకు ఎన్నడును వినబడని అపూర్వమైన ఆ శబ్దమును విని సభలో ఆ శబ్దమున కాశ్రయమును కానకుండెను. ఆ శబ్దముచే దిగ్గజములవంటి దైత్యులు ఝడుసుకొనిరి.(17)

టీ :- అభిక్రమన్నితి. తద్పదం తస్య ధ్వనేరాశ్రయం. (17)

టీ :- తత్పదం = ఆ ధ్వనికి ఆశ్రయమును, ఏ శబ్దము చేతనైతే ( 17 )

శ్లో ॥ సత్యం విధాతుం నిజభృత్య భాషితం
వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః ।
అదృష్యతాత్యద్భుత రూపముద్వహన్
స్తంభే సభాయాం న మృగం న మానుషమ్ ॥18॥

తన భృత్యునిచే పలుకబడిన మాటను సత్యము గావించుటకు అఖిల ప్రాణులయందు తన వ్యాప్తిని నిరూపించుటకు అటు మానవుడు గానీ ఇటు సింహమును గానీ అద్భుతమైన నృసింహ రూపమును దాల్చి సభయందలి స్తంభమున అగుపడెను. ( ఇచ్చట ‘ నిజభృత్య భాషితం ’ అను దానికి తన భృత్యుడైన ప్రహ్లాదుని యొక్క “ భౌతికములైన భావము లందును మహా భూతములయందును ” అను మాటను సత్యము గావించుటకు మరొక విధముగా తన సేవకులైన సనకాదులచే పలుకబడిన మూడు జన్మలతో శాపమోక్షము కలుగుగాక యను జయవిజయుల గూర్చి శాపాంతర వచనమును సత్యము గావించుటకు అని గ్రహించనగును. ఇంకొక రకముగా తన భృత్యుడైన హిరణ్యకశిపునిచే బ్రహ్మను గూర్చి పలుకబడిన “ నీచే సృష్టించబడిన ప్రాణులవలన నీ మృత్యువు కలుగకుండుగాక ” యను మాటను సత్యము గావించుటకు, మరియు “ లోనగానీ, బయటగానీ, నరులచేగానీ, మృగములచే

టీ :- సత్యమితి. భగవాన్ తదా అదృశ్యత బభూవ కిమర్థం నిజభృత్యేన ప్రహ్లాదేన యద్భాషితం దృశ్యత ఇతి తత్సత్యం విధాతుం కర్తుం తథా అఖిలేషు భూతేషు స్వాత్మనో వ్యాప్తిం చ సత్యాం కర్తుం స్తంభే అదృశ్యత తత్కిమర్థం? శ్లో. “భౌతికేషు చ భావేషు భూతేష్వథ మహత్సు చ, భగవానాస్తే” ఇతి తేనైవ భృత్యేన యద్భాషితం తత్సత్యం కర్తుం తథా అత్యద్భుతం దైత్యఘాతుక మతిఘోరం రూపముద్వహన్ దధత్ తత్కిమర్థం నిజభృత్యైః సనకాదిభిః శాపానంతరమను తప్తైర్యద్భాషితం త్రిభిర్జన్మభిః శాపమోక్షో భవత్వితి తత్సత్యం కర్తుం తథా. అథవా అత్యద్భుతం బ్రహ్మసృష్టావదృష్టమశ్రుతం చ రూపముద్వహన్ దధత్ తచ్చ న మృగాకారం న చ మనుష్యాకార ముద్వహన్ సభాయాం మధ్యే అదృశ్యత తత్కిమర్థం? నిజభృత్యేన హిరణ్యకశిపునా బ్రహ్మాణం ప్రతి యద్భాషితం శ్లో. ‘‘భూతేభ్య స్త్వద్విసృష్టేభ్యో మృత్యుర్మాభూన్మమ ప్రభో” ఇతి. తథా నాంతర్న బహిరితి న నరైర్న మృగైరితి చ . బ్రహ్మణా చ నిజభృత్యేన యద్భాషితం

గానీ ” యను మాటను సత్యము చేయుటకు, మరొక పక్షమున తన భృత్యుడైన బ్రహ్మచే, హిరణ్యకశిపుని కోరికకు ‘ తథాస్తు ’ అని పలుకబడిన మాటను సత్యము గావించుటకు అను నర్థము స్వీకరింపనగును. ) ( 18 )

టీ :- భగవంతుడప్పుడు స్తంభమును, చీల్చుకొని అదృశ్యత = అగుపడెను. ఎందులకనిన? తన భృత్యుడైన ప్రహ్లాదునిచే ‘ అగుపించును ’ అని పలికిన మాటను సత్యం విధాతుం = కావించుటకు, అట్లే అఖిల భూతములందు తన వ్యాప్తిని గూడా సత్యము గావించుటకు స్తంభమున అగుపడెను. అది ఎందులకనిన? “భౌతిక భావము లందును మహాభూతములందును భగవంతుడున్నాడు” అని భృత్యుడైన ఆ ప్రహ్లాదునిచే పలుకబడినదానిని సత్యము చేయుటకు. అట్లే అత్యద్భుతమైన దైత్యఘాతుకమైన మిక్కిలి ఘోరమైన రూపమును ఉద్వహన్ = వహించినవాడై, అది యెందులకు? అనిన తన అనుచరులైన సనకాదులచే తాము శాపమొసగిన యనంతరము పశ్చాత్తాప పడుచు “ మూడు జన్మలచే శాపమోక్షమగుగాక ” అని పలికిన మాటలను సత్యము గావించుటకు అట్లే అత్యద్భుతమైన రూపమును బ్రహ్మ సృష్టిలో ఇంతవరకు అగుపడనిది, వినబడనిది నగు రూపమును వహించుచు అదియు మృగాకారమును కాదు, మనుష్యాకారమునుగాని రూపమునుద్వహించువాడై, సభామధ్యమున అగుపడెను. అది యెందులకనిన? తన భృత్యుడైన ( ద్వారపాలకుడైన ) హిరణ్యకశిపునిచే బ్రహ్మను గూర్చి పలుకబడిన “ నీచే

తత్తథాస్తీ త్వతి తత్సత్యం కర్తుం. న హి తద్బ్రహ్మసృష్టం భూతం న చ నరో వా మృగో వా న చ సభాగృహస్యాంతః న చ ప్రాంగణవత్ బహిః ఏవం తాభ్యాం భాషితం సత్యం కర్తుం. యచ్చ హిరణ్యకశిపునా భాషితం. శ్లో. "నూనమేతద్విరోధేన మృత్యుర్మే భవితే" తి తథా. శ్లో. "అయమకుతశ్చిద్భయో మర" ఇతి. యచ్చ నారదేన నిజభృత్యేన స్వయమింద్రం ప్రతి భాషితం తచ్చ అయం మహాన్ సంస్థాం న ప్రాప్స్యతి అనంతానుచర ఇత్యనేన స్వస్య భక్తపక్షపాతిత్వం చ యద్భాషితం తచ్చ కర్తుం అదృశ్యత చ కారాన్నిజభాషితం చ యత్ శ్లో. కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతీ" తి. తథా. "తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాది"త్యాది చ సత్యం కర్తుం అదృశ్యతేతి ద్రష్టవ్యం. అలమతివిస్తరేణ. (18)

సృష్టించబడిన ప్రాణులవలన నాకు మృత్యువు కలుగకుండుగాక " యను, అట్లే " లోన కాని, బయటగానీ ( మృత్యువు ) కలుగకుండుగాక" యను " మానవుల చేగను, మృగములచేతను వలదు " అను మాటలను, మరియు తన భృత్యుడైన బ్రహ్మచే " అట్లే యగుగాక " అను ఇరువురి మాటలను సత్యము గావించుటకు అది (నరసింహ రూపము) బ్రహ్మ సృష్టమగు భూతము (ప్రాణి) గాదు, మానవుడు గాదు, మృగము గాదు, సభాగృహములోన గానీ బయట ముంగిలిలో గానీ గాదు. ఇట్లు వారిరువురిచే పలుకబడిన మాటలను సత్యము గావించుటకు, ఏదైతే హిరణ్యకశిపునిచే " వీనికంటె విరోధముగా నా మృత్యువు నిశ్చయముగా కలుగుగాక " అని, దేనినుండియు భయములేనివాడై మరణములేనివాడై అనియు, మరియు ఏదైతే తన సేవకుడగు నారదునిచే ఇంద్రుని గూర్చి " గొప్పవాడగు ఇతడు నీచే మృత్యువు నొందడు " అని పలికిన వాక్కును " అనంతానుచరః " అను మాటచే శ్రీహరి యొక్క స్వభక్త పక్ష పాతిత్వమును ఏదైతే పలుకబడినదో దాని సత్యము చేయుటకు అట్లు అగుపడెను. ' చ ' కారము వలన తన మాటనుగూడా అది యేమన? ఓ కౌంతేయా ! నా భక్తుడు నశించిపోడు. " అని ", మృత్యు సంసార సాగరమునుండి వారిని ఉద్ధరింతును." ఇత్యాది తన వచనములను సత్యము గావించువాడై అగుపడెనని యెరుంగనగును. అతి విస్తారము చాలును. ( అనగా చెప్పదలచుకొన్నచో ఇంకను ఎంతో కలదు. విస్తారమగుచున్నందున ముగించుచున్నానని అర్థము ). ( 18 )

శ్లో ॥ స సత్త్వ మేవం పరితోఽపి పశ్యన్
స్తంభస్య మధ్యాదను నిర్జిహానమ్ ।
నాయం మృగో నాపి నరో విచిత్ర
మహెూ కిమేత న్నృ మృగేంద్ర రూపమ్ ॥ 19 ॥

టీ :- స ఇతి. స దైత్యః ఏవం ధ్వనిం శ్రుత్వా తదాశ్రయం సత్త్వం ప్రాణివిశేషం సర్వతో వలోకయన్ స్తంభస్య మధ్యాన్నిర్గచ్ఛత్ నృమృగేంద్రయోర్మిశ్రం రూపమహెూ కిమేతదితిమిమాంసితవా నితి శేషః. (19)

శ్లో ॥ మీమాంస మానస్య సముత్థితోఽగ్రతో
నృసింహ రూప స్తదలం భయానకమ్ ।
ప్రతప్త చామీకర చండ లోచనం
స్ఫుర త్సటాకేసర జృంభితాననమ్ ॥ 20 ॥

టీ :- మీమాంసమానస్యేతి. తస్యైవమలం భయానకం తత్ నృసింహరూపం మీమాంసమానస్యాగ్రతో నృసింహరూపో హరిః

దైత్యుడగు ఆ హిరణ్యకశిపుడు ఇట్టి అద్భుగమైన ధ్వనిని విని ఆ ధ్వని గావించిన ప్రాణికై స్తంభము చుట్టుపట్ల గాంచి ఎచ్చటను కనుగొన జాలకుండెను. అంతట స్తంభమును చీల్చుకొని దాని మధ్యనుండి బయటకు వచ్చుచున్న మృగేంద్ర రూపమును గాంచి, ఇది మృగము గాదు, నరుడును గాదు. ఆహా ! విచిత్రమైన ఈ రూపమేమి? అని సంశయ గ్రస్తుడయ్యెను.(19)

టీ :- ఆ దైత్యుడు ( హిరణ్యకశిపుడు ) ఇట్టి అద్భుతమైన ధ్వనిని విని దానికాశ్రయమైన ( కారణమైన ) ప్రాణిని గూర్చి అన్నివైపులా చూచుచున్నవాడై స్తంభమధ్యమునుండి వెడలి వచ్చుచున్న నృ - మృగేంద్రముల సంమిశ్రణ రూపమును చూచి ‘ ఆహా ! ఇది యేమి? ’ యని సంశయించుచుండెను. అని అధ్యాహారము.(19)

ఇట్లు ఆలోచనలోనున్న ఆ దైత్యుని ముందు నృసింహరూపుడైన హరి ఆవిర్భవించెను. ఆ రూపము మిక్కిలి భయానకముగానూ, మిక్కిలి కాచబడిన బంగారమువంటి లోచనములు గల్గి, ప్రకాశించెడు జడలు, కేసరములతో నోరుతెరుచుకొనియున్న ముఖము గలిగి యుండెను. ( 20 )

టీ :- అట్టి ప్రాణియొక్క ఇట్టి మిక్కిలి భయానకమైన ఆ నృసింహరూపమును గూర్చి తర్కించుచున్న ఆ హిరణ్యకశిపుని ఎదుట నృసింహరూపుడైన హరి

సముత్థితః.భయానకత్వమేవ దర్శయన్ తద్రూపమనువర్ణయతి – త్రిభిః ప్రతప్తేతి. ప్రతప్తం చామీకరం స్వర్ణమివ పింగాని చండాని లోచనాని యస్మిన్ సటాః జటాః కేసరాః కంఠరోమాణి స్ఫురద్భిః సటా కేసరైర్జృంభితః సాటోపం ఆసనం యస్మిన్. (20)

సముద్భవించెను. భయానకత్వమును చూపుచు ఆ నృసింహరూపమును వర్ణించుచున్నాడు. ‘ ప్రతప్త ’ ఇత్యాదిగా. ‘ విద్రావిత దైత్యదానవ ’ మను వాక్యము వరకు. ప్రతప్తం చామీకరణం=కాచబడిన బంగారమువంటి పిశంగవర్ణముగల భయమును గొల్పు లోచనములు గల, సటాః = జడలు, వేసరాః = కండ రోమములు, ప్రకాశించు సటా కేసరములచే, జృంభితం = ఆటోపముతో ఆననముగల, ( 20 )

శ్లో ॥ కరాల దంష్ట్రం కరవాల చంచల
క్షురాంత జిహ్వం భృకుటీ ముఖోల్బణమ్ ।
స్తబ్ధోర్ధ్వ కర్ణం గిరి కందరాద్భుత
వ్యాత్తాస్య నాసం హనుభేద భీషణమ్ ॥ 21 ॥

ఎత్తైన దంతములు గలిగి ఖడ్గమువలె చంచలమైన చురకత్తి ధారవలె నాలుక గలిగి భృకుటితో గూడిన ముఖముచే డాబుగలిగి ఉన్నతములై మేకులవలె నిక్కబొడిచిన చెవులు గల్గి, గిరి గుహలవలె లోతైన నోరు ముక్కుపుటలు గల్గి యుండెను. మరియు కపోల ప్రాంతముల విదారణముచే భయము గొల్పుచుండెను. ( 21 )

టీ :– కరాలాః తుంగాః దంష్ట్రా యస్మిన్ కరవాలః ఖడ్గః తద్వత్ చంచలా క్షురాంతవత్తీక్ష్ణా జిహ్వా యస్మిన్ భ్రుకుటీయుక్తేన ముఖేన ఉల్బణం. స్తబ్ధౌ ఉన్నతౌ శంఖవదూర్ధ్వౌ కర్ణౌ యస్మిన్ గిరికందరవదద్భుతం వ్యాత్తం ప్రసృతమాస్యం నాసా చ యస్మిన్. హనూ కపోలప్రాంతౌ తయోర్భేదేన విదారణే భీషణం. కర్ణాంతముఖ విస్తారమిత్యర్థః. (21)

టీ :– కరాలాః = ఉన్నతములైన కోరలు ( దంతములు ) గల, కరవాలః = ఖడ్గము, ఖడ్గములవలె చంచలములైన చురకత్తివలె తీక్ష్ణమైన నాలుకయుగల, భృకుటితో (బొమ్మముడితో) కూడిన ముఖముతో డాబు గల్గిన, సబ్ధములైన ( నిక్కబొడిచిన ) శంకులవలె పైకి నిల్చియున్న కర్ణములు గల, గిరి గుహవలె అద్భుతముగా విశాలమైన తెరువబడిన నోరు, ముక్కుపుటలుగల, కపోలప్రాంతముల విదారముచే భీషణమైన, కర్ణాంత ముఖ విస్తారమని యర్థము. ( 21 )

శ్లో ॥ దివి స్పృషత్కాయ మదీర్ఘ పీవర
గ్రీవోరు వక్షః స్థల మల్ప మధ్యమమ్ ।
చంద్రాంశు గౌరై శ్చురితం తనూరుహై
ర్విష్వగ్భుజానీక శతం నఖాయుధమ్ ॥ 22 ॥

ఆకాశము నంటుచున్న కాయము ( శరీరము ), పొట్టిగానుండి స్థూలమైన గ్రీవము ( కంఠము ), విశాలమైన వక్షఃస్థలము, సన్నని పొట్టగలిగి యుండెను. చంద్రకిరణములవలె తెల్లని తను రూపము ( ఒంటిపైగల వెంద్రుక) లచే వ్యాప్తమై, అన్ని వైపుల వ్యాపించెడు వందల కొలది భుజములు గల్గి నఖములే ఆయుధములుగా కలిగియుండెను. ( 22 )

టీ :- దివి స్పృశన్ కాయో యస్మిన్ అలుక్ సమాసః. అదీర్ఘా హ్రస్వా పీవరా స్థూలా గ్రీవా యస్మిన్. ఉరు విశాలం వక్షస్థలం యస్మిన్. తచ్చ అల్పం మధ్యమం ఉదరం యస్మిన్. చంద్రాంశు వద్గౌరైః తనూరుహైర్లోమభిః ఛురితం వ్యాప్తం విష్వన్ సర్వత్ర ప్రసృతా భుజాస్తేషామనీకాని స్తోమాస్తేషాం శతాని యస్మిన్ నఖాన్యేవాయుధాని యస్మిన్. (22)

టీ :- ' దివి స్పృషన్ కాయో యస్మిన్ ' అని అలుక్సమాసము. ఆకాశము నొరయు శరీరము గల, మిక్కిలి పొడవుగాని ( పొట్టిగానున్న ) నిండైన గ్రీవము = మెడగల,ఉరు= విశాలమైన వక్షస్థలమును గల్గి, సన్నని, మధ్యం = ఉదరముగల, చంద్రకిరణములవలె తెల్లని, తనూ రుహైః = రోమములచే, ఛురితం = వ్యాప్తమైన, విశ్వంచః = అన్ని వైపుల వ్యాప్తములైన భుజములయొక్క, అనీ కాని = సమూహములు, అట్టి సమూహముల శతములు గల, నఖములే ఆయుధములు గల రూపము ( ఆ నృసింహరూపము ).(22)

శ్లో ॥ దురాసదం సర్వ నిజేతరాయుధ
ప్రవేక విద్రావిత దైత్య దారవమ్ ।
ప్రాయేణ మేఽయం హరిణోరు మాయినా
వధః స్మృతోఽనేన సముద్యతేన కిమ్ ॥ 23 ॥

పొందుటకు శక్యము గాని తనవైన చక్రము మొదలైన, ఇతరములైన వజ్రాది శస్త్రోత్తములచే ఓడించబడిన దానవులు గల ఆ వైష్ణవ రూపమును గూర్చి మీమాంస చేయుచున్న ఆ దైత్యేంద్రుని ఎదుట నృసింహరూపుడైన హరి ఉద్భవించెను. మహామాయియైన ఈ హరిచే ఇట్లు నాయొక్క వధ గావించ తలంచబడినది కాబోలు. ఐనను ఇట్లుద్యమించెడు అతనిచే ఏమి యగును? ( 23 )

టీ :- దురాసదం ప్రాప్తుమశక్యం సర్వాణి చ నిజాని చక్రాదీని ఇతరాణి వజ్రాదీని తఏవాయుధప్రవేకాః శస్త్రోత్తమాః. తైర్విద్రావితా దైత్యదానవా యేన తద్రూపం మీమాంసమానస్య తస్యాగ్రతః సమవస్థిత ఇతి పూర్వేణాన్వయః. తదావిర్భావ ప్రయోజనవిమర్శపూర్వకం తేన సహ దైత్యస్య యుద్ధమాహ - సప్తభిః. ప్రాయేణేతి. ప్రాయేణ మహామాయావినా హరిణా. మే అయమేవంభూతో వధః మృత్యుహేతుః. స్మృతః చింతితః. తథాప్యనేన సముద్యతే న కిం స్యాదిత్యేవం బ్రువన్నభ్యపతదిత్యన్వయః. (23)

టీ :- దురాసదం = పొందుటకు శక్యము గాని, సమస్తమైన తన చక్రము మొదలైనట్టి, ఇతరములైన వజ్రాయుధము మొదలైనట్టి ఆయుధ ప్రవేకాః = ఉత్తమమైన శస్త్రములచే పారద్రోలబడిన దైత్యులు దానవులు కలవాడైనట్టి హరియొక్క ఆ నృసింహరూపమును గూర్చి ఆలోచించుచున్న దైత్యపతి యెదుట నృసింహుడు ఉద్భవించెను. అని పూర్వ శ్లోకముతో అన్వయము. అతని ఆవిర్భావము యొక్క ప్రయోజన విమర్శపూర్వకముగా ఆ నృసింహునితో పాటు దైత్యుని యుద్ధమును ఏడు శ్లోకములచే చెప్పెను. (బహుశః) మిక్కిలి మాయావియైన హరిచే ఈ విధమైన ఈ నృసింహరూపము నాయొక్క మృత్యు హేతువుగా తలంచబడినది కాబోలు. ఐనను ఉద్యమించుచున్న ఇతనిచే కిం = ఏమియు కాదు. ఈ విధముగ పలుకుచున్నవాడై (ఆ దైత్యుడు) నృసింహునిపై ఎదురుగా దుమికెను. అని అన్వయము. (నృసింహుని ఎదుట దుమికెను)(23)

శ్లో ॥ ఏవం బృవం స్త్వభ్యపతద్గదాయుధో
న దన్నృసింహం ప్రతి దైత్య కుంజరః ।
అలక్షితోగ్నౌ పతితః పతంగమో
యథా నృపింహౌజసి సోసురస్తదా ॥ 24 ॥

ఆ దైత్య కుంజరము ఇట్లు పలుకుచు గదాయుధుడై నినదించుచు నృసింహుని ఎదురు పడెను. అప్పుడు తన శక్తిని గ్రహించని శలభము ( మిడుత ) అగ్నియందు దుముకినట్లు ఆ అసురుడగు హిరణ్యకశిపుడు నృసింహ తేజోగ్నిలో పడి అదృశ్యమయ్యెను. ( 24 )

టీ :- తదా సో సురః. నృసింహస్యోజసి దీప్తౌజ పతితస్సన్ అలక్షితః అదృష్టో భూత్. (24)

టీ :- అప్పుడా అసురుడు నృసింహునియొక్క ఓజసి = కాంతియందు పడినవాడై అలక్షితః = అగుపడని వాడయ్యెను. ( 24 )

శ్లో ॥ న తద్విచిత్రం ఖలు సత్త్వ ధామని
స్వతేజసా యోను పురాపిబత్తమః ।
తతోభి పద్యాభ్యహన న్మహాసురో
రుషా నృసింహం గదయోరువేగయా ॥ 25 ॥

టీ :- సత్త్వధామని సత్త్వప్రకాశే హరౌ పతితస్య తమోమస్యా దర్శనం తద్విచిత్రం న భవతి. తత్ర హేతుః. యో హరిః పురా సృష్ట్యాదౌ ప్రలయకాలీనం తమః. ను అహో. అపిబత్తస్మిన్. (25)

పూర్వము సృష్ట్యాదిలో ప్రళయకాలపు తమస్సును తమ తేజముచే పానము చేసిన సత్త్వ ప్రకాశుడైన హరి విషయమున అది విచిత్రము కాదు కదా ! అనంతరము ఆ మహాసురుడైన హిరణ్యకశిపుడు నృసింహుని కెదురుపడి కోపముగో మిక్కిలి వేగము గల గదతో అతనిని కొట్టెను. ( 25 )

టీ :- సత్త్వ ధామని = సత్త్వప్రకాశము గల హరియందు ( హరిపై ) బడిన తమోమయుడైన దైత్యుని అదర్శనము ( అగుపడకుండుట ) అది విచిత్రము కాదు. అందుకు హేతువు ఏ హరి , పురా = సృష్ట్యాదియందు ప్రళయకాల సంబంధమైన తమస్సును = ఆహా ! పానము చేసెనో అట్టి హరి విషయమున ( అది విచిత్రము గాదు గదా ! ) ( 25 )

శ్లో ॥ తం విక్రమంతం సగదం గదాధరో
మహోరగం తార్క్ష్య సుతో యథా గ్రహీత్ ।
స తస్య హస్తోత్కలిత స్తధాసురో
విక్రీడతో యద్వదహి ర్గరుత్మతః ॥ 26 ॥

టీ :- తత ఇతి. తస్మిన్ విక్రమంతం తత స్తతః ప్రహరంతం. హస్తాదుత్కలితో నిః సృతః. (26)

గరుత్మంతుడు మహాసర్పమును గ్రహించినట్లు గదాధరుడైన నృసింహుడు మరల మరల కొట్టుచు విక్రమించు ఆ హిరణ్యకశిపుని అతని గద తోడను గ్రహించి గరుత్మంతునిచే సర్పము ఆడుకొనబడినట్లు తన చేతులనుండి బయటపడిన ఆ హిరణ్యకశిపునితో ఆడుకొనెను. ( 26 )

టీ :- విక్రమంతం = మరల మరల కొట్టుచున్న, హస్తా దుత్కలితః = చేతులనుండి బయట పడినవాడై. ( 26 )

శ్లో ॥ అసాధ్య మన్యంత హృతౌకసోమరా
ఘనచ్ఛదా భారత సర్వధిష్ణ్యపాః ।
తం మన్యమానో నిజవీర్య శంకితం
యద్ధస్తముక్తో నృమరిం మహాసురః
పునస్త మానంచత ఖడ్గచర్మణీ
ప్రగృహ్యా వేగేన జితశ్రమో మృధే ॥ 27 ॥

టీ :- తదా అసురాః దేవాః ధిష్ణ్యపాః లోకపాలాశ్చ. అస్యాధ్వ మన్యంత హృతాన్యోకాంసి స్థానాని యేషాం తే. తద్భియా ఘనచ్ఛదాః మేఘాంతరితాస్సంతః. యస్య హస్తాత్ స్వయం ముక్తః. తం నృహరిం. స్వవీర్యాచ్ఛంకితం మాన్యమానః. ఖడ్గచర్మణీ ప్రగృహ్యా. పునస్తం అసజ్జత అభ్యపద్యతేత్యన్వయః. (27)

శ్లో ॥ తం శ్యేనవేగం శతచంద్ర వర్త్మభిః
చరంత మచ్ఛిద్ర ముపర్యధో హరిః ।
కృత్వాట్టహాసం ఖరముత్స్వనోల్బణం
నిమీలితాక్షం జగృహే మహాజవః ॥ 28 ॥

ఓ జనమేజయ మహారాజా ! మహాసురుడైన హిరణ్యకశిపుడు శ్రీహరి హస్తములనుండి బయటపడుటను చూచిన, అపహరించమడిన నివాసముగల అసురులు, సకల సురాధిపతులను మేఘముల చాటున దాగిన వారై నరసింహుని చేష్టను అసాధువుగా (తగనిదిగా) తలంచిరి. ఆ హిరణ్యకశిపుడు ఆ నరహరి చేతులనుండి బయటపడి ఆ నరహరి తన పరాక్రమమునకు వెరసిన వానినిగా తలంచినవాడై కత్తి డాలు గైకొని శ్రమను వీడి వేగముగా యుద్ధమునకై మరల ఆ నరసింహుని ఎదుర్కొనెను. ( 27)

టీ :- అప్పుడు అమరాః = అమరులు ( దేవతలు ). సకల సురాధిపులు అయుక్తమని తలంచిరి. హరించబడిన నివాసములు కలవారు. ఆ దైత్యేంద్రుని వలన భయముచే ఘనచ్ఛదాః = మేఘములచే దాచబడినవారై ( మేఘముల చాటున దాగిన వారై ) ఎవని చేతి నుండి స్వయముగ వదలబడెనో అట్టి నరహరిని తన పరాక్రమమునకు భయపడిన వానినిగా తలచు వాడై కత్తీ - డాలు గ్రహించి మరల ఆ హరినపి ఆసంజత=పొందెను. (ఎదుర్కొనెను) అని అన్వయము. ( 27 )

మహా వేగము గల ఆ శ్రీహరి డేగవంటి వేగము కలిగినట్టి ఖడ్గ - చర్మ (డాలు) మార్గముల ద్వారా కొట్టుబడకుండా పైనుండి క్రిందనుండి చరించుచున్నట్టి, తీవ్రముగ మహా శబ్దముతో భయంకరముగ అట్ట హాసమును గావించుచున్నట్టి, భయముచే కన్నులు మూసుకొన్నట్టి ఆ అసురుని

టీ :- శ్యేనస్యేవ వేగో యస్య తం. శతచంద్రవర్త్మభిః ఖడ్గచర్మమార్గైః. అచ్ఛిద్రం యథాభవత్యేవముపర్యధశ్చరంతం. అట్టహాసమేవాహ - ఖరం తీవ్రం ఉత్స్వనేన మహాశబ్దేన ఉల్బణం భయంకరం. తద్భయేన హరేస్తేజసా చ నిమీలితే అక్షిణీ యస్య. (28)

శ్లో ॥ విశ్వక్ స్ఫురంతం గ్రహణాతురం హరిః
వ్యాలో యథాఖుం కులిశాక్షత త్వచమ్ ।
ద్వార్యూర ఆపత్య దదార లీలయా
నఖైర్యథాహిం గరుడో మహావిషమ్ ॥ 29 ॥

టీ :- గ్రహణే దృష్టాంతః. వ్యాలౌ యథా. ఆఖుం మూషకం. దృష్టాంతః. అహిం గరుడ ఇవేతి. విష్వక్ సర్వతః. స్ఫురంతం నిస్సరంతం. గ్రహణేనాతురం వివశం. ఇంద్రేణ సహ యుద్ధే

(హిరణ్యకశిపుని ) పట్టుకొనెను.(28)

టీ :- డేగవంటి వేగము కలవాడును, శతచంద్ర వర్త్మభిః = ఖడ్గ - చర్మ (డాలు) మార్గముల ద్వారా గాయములు కాకుండునట్లుగ పైనుండి, క్రింద నుండి (తిప్పించు కొనుచు ) తిరుగుచున్నవాడును, అట్టహాసము నిట్లు చెప్పుచున్నాడు. ఖరం = తీవ్రముగ, ఉత్స్వనేన = మహాశబ్దముతో, ఉల్బణం = భయంకరముగ, తద్భయేన = హరియొక్క తేజముచే కన్నులను మూసుకొన్నవాడై, ( 28 )

ఆ శ్రీహరి అంతట వరిగెత్తుచున్నట్టి, దేవేంద్రునిచే పట్టుకొనబడినప్పుడును వజ్రాయుధముచే గాయపడినట్టి, హిరణ్యకశిపుని సర్పము మూషికమును పట్టుకొన్నట్లు పట్టుకొని, పట్టుకొనుటచే బాధపడుచున్న ఆ దైత్యుని బయటను, లోపలను గాక ద్వారమునందు, భూమియందును ఆకాశమునందును గాక తన ఊరువులపై (తొడలపై) పడవేసుకొని, ప్రాణము ఉండీ లేనట్టి నఖములచే, రాత్రి లేదా పగలు కాకుండా సంధ్యా సమయమున గరుడుడు సర్పమును వలె చీల్చి చంపెను. ( 29 )

టీ :- గ్రహణమున దృష్టాంతము , సర్పము మూషికమును వలె, విదారణమునకు (చీల్చుటకు ) దృష్టాంతము , సర్పమును గరుడుడు (చీల్చినట్లు) వలె అని. విశ్వక్=అన్ని వైపుల ,స్ఫురంతం = వెడలుచున్న. గ్రహణము

తత్ప్రయుక్తేన కులిశేన అక్షతా స్వగపి యస్య ద్వారి సభాయాం. నాంతర్బహిః. ఊరుం ఊరౌ నిపాత్య న భూమౌ న చాంబరే నఖైః న తు వ్యసుభిరసుమద్భిర్వా. ఏవం దివానక్తపరిహారాయ. సంధ్యాయామితి ద్రష్టవ్యం. (29)

(పట్టుకొనుటచే), ఆతురం = వివశుడైనట్టి , ఇంద్రునితోడ యుద్ధమున అతడు ప్రయోగించిన వజ్రాయుధముచే చర్మము గూడా గాయపడినట్టి, ద్వారి = సభాద్వారమున లోనగాదు, బయటను గాదు. ఊరే=తొడపై పడవేసుకొని, భూమియందుగాదు, ఆకాశమునగాదు. గోళ్ళచేత ప్రాణముండి లేనట్టి వానిచే, ఇట్లే రాత్రింబవళ్ళును పరిహరించుటకై సంధ్యయందని గ్రహించనగును.(29)

శ్లో ॥ సదంబ దుష్ప్రేక్ష్య కరాలోచనో
వ్యాత్తాన నాంతం విలిహన్ స్వజిహ్వయా ।
అసృగ్ల వాక్తారుణ కేసరాననో
యథాంత్ర మాలీ ద్విపహత్యయా హరిః ॥ 30 ॥

ఆటోపముతో చూడశక్యము గాని భయంకరమైన లోచనములు గలవాడు, రక్త బిందువులచే తడిసి ఎఱ్ఱనైన కేసరములు, ఎఱ్ఱని కన్నులు కలవాడు, పొడవైన తన ముఖాగ్రమును (చివరను) తన నాలుకతో నాకుచున్నవాడును (మృగమైన సింహ లక్షణము) గజవధ గావించిన సింహమువలె నరసింహుని అస్త్రములను (ప్రేవులను) మాలగా కంఠమున దాల్చినవాడై, ( 30 )

టీ :- దైత్యేంద్రవధముక్త్వా తద్భృత్యవధమాహ - ద్వాభ్యాం. సంరంభేతి. సంరంభేణ దుష్ప్రేక్ష్యాణి కరాలాని లోచనాని యస్య అసృజో రక్తస్య లవైర్బిందుభిః అక్తాః సిక్తాః. అతఏవ అరుణాః కేసరా ఆననం చ యస్య సః కఇవ. ద్విపహత్యయా గజవధేన హరిః సింహో యథా. ఏవంభూతస్తస్యానుచరాన్ అహన్నిత్యుత్తరే ణాన్వయః. అన్త్రాణాం మాలాకణ్ఠే విద్యతే యస్య. (30)

టీ :- దైత్య వధని గూర్చి చెప్పి రెండు శ్లోకములచే అతని భృత్యవధను చెప్పెను. సంరంభముచే చూడ శక్యముగాని భయంకరములైన కన్నులు గలవాడును, అసృజః=రక్తము యొక్క లవైః = బిందువులచే, రక్తాః = తడుపబడినవి కనుకనే అరుణములైన కేసరములు , ఆననము ద్విపహత్యయా = గజవధచే , హరిః = సింహము వలె నున్నవాడై అతని అనుచరులను సంహరించెనని ఉత్తర శ్లోకముతో అన్వయము. అస్త్రముల ( ప్రేవుల ) మాలను కంఠమున దాల్చినవాడై ( 30 )

శ్లో ॥ నఖాంకురోత్పాటిత హృత్సరోరుహం
విసృజ్య తస్యానుచరానుదాయుధాన్ ।
అహన్సమంతాన్ నఖశస్త్ర పార్ష్ణిభిః
దోర్దండ యూథోఽనుపథాన్ సహస్రశః ॥31॥

నఖాంకురములచే చీల్చబడిన హృదయ కమలముగల హిరణ్యకశిపుని వదిలిపెట్టి, ఆయుధము లెత్తి అన్నివైపులనుండి వేలకొలదిగ పరుగెత్తుకొని వచ్చుచున్న ఆ దైత్యపతి అనుచరులను, అతని పక్షపాతులను ఆ నృమరి దోర్దండయూథము గలవాడై, నఖ పార్శిభాగములతో సంహరించెను. (31)

టీ :- నఖాంకురైరుత్పాటితం హృత్సరోరుహం యస్య తం. దోర్దండానాం యూథాని యస్య తమనుపంథా యేషాం తాన్ అన్యానపి తత్పక్షపాతిన ఇత్యర్థః. (31)

టీ :- నఖాంకురములచే చీల్చబడిన హృదయ కమలము గల ( హిరణ్యకశిపుని వీడి) దోర్దండములయొక్క యూథము ( సమూహము ) కలవాడై, ఆ దైత్యేంద్రుని మార్గము ననుసరించెడు వారిని, అతని యందు పక్షపాతముగల ఇతరులను గూడా అని అర్థము.(31)

శ్లో ॥ సటావధూతా జలదాః పరాపతన్
గ్రహాశ్చ తదృష్టి విముష్ట రోచిషః ।
అంబోదయః శ్వాస హతావిచక్షుశుః
నిర్హ్రాద భీతా దిగిభా విచక్రుశుః ॥ 32 ॥

నరసింహుని జూలుచే విదిల్చబడిన మేఘములు చెదిరి పోయెను. ( దీనిచే మేఘముల చాటున దాగియున్న దేవతలు బయటపడిరి ). వాని చూపుచే వినష్టమైన కాంతులు కలవిగా గ్రహములు కానిపించెను. సముద్రములు ఈ నరసింహుని శ్వాసచే తాడితములై క్షోభిల్లెను. నరసింహుని గర్జనకు భీతిల్లిన దిగ్గజములు భయముచే అరిచినవి. ( 32 )

టీ :- దైత్యవధవ్యగ్రస్య నృహరేరాటోపమాహ - ద్వాభ్యాం. సటాభిరవధూతాః. ప్రకంపితా జలదామేషాః పరాపతన్ వ్యశీర్యంతః. తస్య దృష్ట్యా విమృషం రోచిర్యేషాం గ్రహాణాం తే.

టీ :- దైత్యుడైన హిరణ్యకశిపుని వధయందు ఇతర దైత్య సంహారమునందును సంలగ్నుడైన నరసింహుని ఆటోపమును రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు. జూలుచే అంధూతాః = ప్రకంపితములైన జలదాః = మేఘములు,

తిరస్కృతప్రభాః. అభవన్నితి శేషః. దిగిభాః దిగ్గజాః. (32)

పరాపతన్ = చెదిరి పడెను. (దీనిచే మేఘముల చాటున ఉన్న ఏ దేవతలైతే కలరో వారు స్పష్టముగా చూతురుగాక. అని ఆజ్ఞాపించెనని యర్థము) . ఆ నరసింహుని చూపుచే కోల్పోయిన కాంతిగల గ్రహములు ఆతని దృగ్ రోచులచే తిరస్కరించబడినవని శేషము. దిగిభాః = దిగ్గజములు అని అర్థము. (32)

శ్లో ॥ ద్యౌస్తత్సటోత్క్షిప్త విమాన సంకులా
ప్రోత్సర్పతక్ష్మాచ పదాఽతి పీడితా ।
శైలా సముత్పేతురముష్య రంహసా
తత్తేజసా ఖం కకుభో నరేజిరే ॥ 33 ॥

అతని జటలచే చెల్లాచెదురు గావించబడిన విమానములతో ఆకాశము సంకులమయ్యెను. భూమియు ఆ నరసింహుని పదములచే మిగుల పీడించబడినదై, స్వస్థానమునుండి కదిలినది. ఇతని వేగమునకు శైలములు చలించినది. ఇతని తేజస్సునకు ఆకాశము దిక్కులు కాంతిని కోల్పోయినవి.(33)

టీ :- తస్య సటాభిరుతిక్షప్తాని విమానాని తైస్సంకులా వ్యాకులా వ్యాప్తా సతీ ప్రోత్సర్పత స్వస్థానాత్ ప్రకర్షేణోదసర్పచ్చలితా.(33)

టీ :- ఆ నరసింహునిజూలుచే ఎగురగొట్టబడిన విమానములచే, సంకులా= వ్యాప్తమైనది (ఆకాశము) ప్రోత్సర్పత = స్వస్థానమునుండి మిక్కిలి ఉదసర్పత్=చలించెను. (33) .

శ్లో ॥ తతః సభాయా ముపవిష్టముత్తమే
నృపాననే సంభృత తేజసం విభుమ్ ।
అలక్షిత ద్వైరథ మత్స్య మర్శణం
ప్రచండ వక్త్రం న బభాజ కశ్చన ॥ 34 ॥

అనంతరము సభయందు నృపుని ఆసనమున కూర్చున్నట్టి, తేజః సంపన్నుడైనట్టి, గుర్తించబడినట్టి ప్రతి యోద్ధుడు లేనట్టి వాడును, మిక్కిలి అసహనము కలిగినట్టి, భయంకరమైన వక్త్రము ( ఆననము ) కలిగినట్టి ఆ సర్వ సమర్థుడగు ఆ నరహరిని బయము వలన ఎవ్వరును సేవింపకుండిరి. (34)

శ్లో ॥ నిశమ్య లోకత్రయ మస్తక జ్వరం
తమాది దైత్యం హరిణా హత మృధే ।
ప్రహర్షవే తోత్కలితాననా ముహుః
ప్రసూన వర్షైః వవృషుః సురస్త్రియః ॥ 35 ॥

ముల్లోకములకు తలనొప్పి (జ్వరము ) గా నున్నట్టి ఆది దైత్యుడైన ఆ హిరణ్యకశిపుని హరిచే యుద్ధమున సంహరించబడిన వానినిగా విని సుర కాంతలు ఆనందాతిరేకముచే వికసించిన ముఖములు కలవారై పుష్పవర్షములచే మాటిమాటికి హరిని అభినందించి పూజించిరి .(35)

టీ :- స్వభృత్యైశ్వర్యమాశ్చర్యమివ మత్వా కౌతూహలేనేవ తస్యాసనే ఉపవిష్టం భయాత్ కోపేన న బభాజ నాసేవత న లక్షితో ద్వైరథః ప్రతియోద్ధా యేన. లోకత్రయస్య మస్తకజ్వరం శిరోవ్యధామివ దుస్సహం ప్రహర్షస్య వేగేన ఉత్కలితాని వికసితాన్యాననాని యాసాం తాః. నృహరిం వవృషుః. (34-35)

టీ :- తన భృతుని ఐశ్వర్యమును ఆశ్చర్యమునుగా తలచి కుతూహలముగా అతని (హిరణ్యకశిపుని) నృపాసనమున కూర్చొనియున్న ( నృహరిని ) భయము వలన ఎవ్వరును, న బభాజ = సేవించకుండిరి. (ఏ ఒక్కడును సేవించకుండెను ) ప్రతి యోద్ధలను ( తనతో సమాన బల పరాక్రమములు గలిగి యుద్ధముచేయ సాహసించు వానిని) కాంచనట్టివాడగు (ఆ నరసింహుడు) ముల్లోకములకు తలనొప్పిగా మారిన (శిరోవ్యధవలె సహింపశక్యముగాని ) వాడు. ఆనందము యొక్క వేగముచే (అతిశయముచే) ఉత్కలితాని = వికసితములైన ముఖములు గల సురకాంతలు పుష్ప వర్షములచే నృహరిని వర్షించిరి. ( 34 - 35 )

శ్లో ॥ తదా విమానా వలిభిర్నభస్తలం
దిదృక్షతాం సంకుల మాసనా కినామ్ ।
సురానకా దుందుభ యోథ జిఘ్నిరే
గంధర్వ ముఖ్యా ననృతుర్జగుః స్త్రియః ॥ 36 ॥

అప్పుడు చూడగోరి వచ్చిన స్వర్గవాసులయొక్క విమాన పంక్తులచే ఆకాశము సమ్మర్దముగా నుండెను. దేవదుందుభులు మ్రోగించబడెను. పటహ ధ్వనులు వ్యాపింప జేయబడెను. గంధర్వులు గానము చేయగా స్త్రీలు నర్తించిరి. (36)

శ్లో ॥ తత్రోప వ్రజ విబుధా బ్రహ్మేంద్ర గిరిశాదయః ।
ఋషయః పితరః సిద్ధా విద్యాధర మహోరగాః ॥ 37॥

శ్లో ॥ మనవః ప్రజానాం పతయో గంధర్వాప్సర చారణాః ।
యక్షాః కింపురుషాస్తాత వేతాలా స్సిద్ధ కిన్నరాః ॥ 38 ॥

శ్లో ॥ తే విష్ణు పార్షదాః సర్వే సునంద ముముదాదయః ।
మూర్ధ్ని బద్ధాంజలి పుటా ఆసీనం తీవ్ర తేజసమ్ ।
ఈడిరే నర శవార్దూలం నాతి దూర చరాః పృథక్ ॥39॥

బ్రహ్మేంద్ర రుద్రాది దేవతలు, ఋషులు, పితరులు, సిద్ధులు, విద్యాధరులు, మహోరగులు, మనువులు, ప్రజాపతులు, గంధర్వులు, అప్సరసలు, చారణులు, యక్షులు, కింపురుషులు, వేతాలులు, సిద్ధకిన్నరులు, ఆ సునంద కుముదాది విష్ణుపార్షదులందరును శిరమున మోడ్చిన అంజలులు గలవారై మహాతేజోవంతుడైన కూర్చునియున్న ఆ నరసింహుని కొంచెము దూరముననున్నవారై వేరువేరుగాకొల్చిరి.(37-39)

టీ :- నాకినాం దేవానాం. విమానావలిభిః. సురాణామానకాః పచహోః. తైర్జఘ్నిరేవాదితాః. స్త్రియో ప్సరసో ననృతుః. గన్ధర్వాజగుః. (36,37)

టీ :- నాకినాం = దేవతలయొక్క విమాన పంక్తులచే నభస్థలము సంకులమయ్యెను. సురులయొక్క ఆనకాః = పటహములు వారిచే, జిఘ్నిరే = మ్రోగించ బడినవి. స్త్రియః=అప్సరలు నాల్యము చేసిరి. గంధర్వులు గానము చేసిరి. గంధర్వులు, అచ్చరలు, చారణులును అని అర్థము. ( 36 - 38 )

టీ :- గంధర్వాప్సరసశ్చారణాశ్చేత్యర్థః. 38)

టీ :- నరశార్దూలం = పురుషోత్తమమ్. ( 39 )

టీ :- నరశార్దూలం = పురుషోత్తముని, ( 39 )





**బ్రహ్మ ఉవాచ :-**

శ్లో ॥ నతో త్మ్యనంతాయ దురంత శక్తయే
విచిత్ర వీర్యాయ పవిత్ర కర్మణే ।
విశ్వప్య సర్గ స్థితి సంయమాన్ గుణైః
స్వలీలయా సంధతేఽ వ్యయాత్మనే ॥ 40 ॥

టీ :- శ్లో. "బ్రహ్మాదయో నృసింహస్య శంకయాకులచేతసః, ఆరాదేవాస్తువన్ సప్తదశశ్లోక్యా పృథక్పృథక్".అనంతాయ అనంతం ప్రసాదయితుం నతో స్మి. అనంతత్వే హేతుః. దురంతాః శక్తయో యస్య తత్కుతః? విచిత్రాణి ప్రభావా యస్య. తత్కిమర్థం? పవిత్రాణి శోధకాని కర్మాణి యస్య విచిత్రవీర్యత్వ మేవాహ - విశ్వస్యేతి. సందధే సమ్యక్కుర్వతే. ఏవమపి అవ్యయాత్మనే అప్రచ్యుతస్వరూపాయ. (40)

**బ్రహ్మ ఇట్లు చెప్పెను :-**

అనంతుడవు, అంతము లేని శక్తిగలవాడవు, విచిత్రమైన పరాక్రమము గలవాడవు, పవిత్రములైన కర్మలు గలవాడవు, ప్రపంచముయొక్క సృష్టి, స్థితి, లయములను సత్వ, రజః, తమో గుణములచే నీయొక్క లీలచే కూర్చువాడవు, నిత్యమైన ఆత్మ గలవాడవునైన ఓ శ్రీహరీ ! నీకు నమస్కరించుచున్నాను. (40 )

టీ :- బ్రహ్మాది దేవతలు నృసింహుని యొక్క భయముచేత వ్యాప్తమైన చిత్తము గలవారై పదునేడు శ్లోకములచే దూరము నుండియే ఒక్కొక్కరు వేరు వేరుగా స్తుతించిరి. అనంతాయ = అనంతుడైన నిన్ను అనుగ్రహింప చేసుకొనుటకై నమస్కరించుచున్నాను. అనంతత్వమునకు కారణము దురంతమైన శక్తులు కలవాడు. అది యెందులకు? విచిత్రమైన వీర్యాణి = ప్రభావములు గలవాడు. అది యెందుకొఱకు?. ఏ పవిత్రాణి = శ్రవణ మాత్రముననే శోధకములైన కర్మలు గలవాడు. విచిత్ర వీర్యత్వమునే చెప్పుచున్నాడు. 'విశ్వస్య ' ఇత్యాదిగా. సందధతే = బాగుగా చేయువాడవైన . ఇట్లయ్యు అవ్యయాత్మనే=నాశములేని స్వరూపము గల్గిన వాడవగు ( నీకు నమస్కారము) అని బ్రహ్మ కొనియాడెను. (40)






ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

**శ్రీ రుద్ర ఉవాచ :-**

శ్లో ॥ కోపకాలో యుగాన్తస్తే హస్తోఽయ మసురోల్పకః ।
తత్సుతం పాహ్యుపసృతం భక్తంతే భక్త వత్సల ॥ 41 ॥

టీ :- రుద్రస్తు తత్కోపకాలాభిజ్ఞో నాయం కోపావసర ఇతి. తం ప్రార్థయతే - కోపకాల ఇతి. సహస్రయుగాంతస్తవ కోపస్య కాలః. కోపాయోగ్యశ్చాయమిత్యాహ - అల్పకః అత్యల్పః. అతః కోపానివృత్త్యా ప్రహ్లాదం మా హింసీరిత్యాహ - తత్సుతమితి. యద్వా అకాలే ప్యయం కోపః అస్య భక్తస్య రక్షణార్థమితి చేత్. తర్హి ఇదానీం కోపం త్యక్త్వా ఇమం పాహీత్యర్థః. (41)

**రుద్రుడిట్లు పలికెను :-**

" ఓ భక్తవత్సలా ! యుగాంతమునకు కోపకాలము ఇది కాదు. అత్యల్పుడైన అసురుడు (హిరణ్యకశిపుడు ) హతుడైనాడు. నీ దరి చేరిన ఆ అసురుని పుత్రుడు, నీభక్తుడునైన ప్రహ్లాదుని పాలించుము. (41 )

టీ :- రుద్రుడైతే అతని కోపముయొక్క కాలము నెరిగినవాడైనందున ఇది కోపావసరమైన (కోపమునకు దగిన) కాలము కాదని అతనిని ప్రార్థించుచున్నాడు. 'కోప ' అని. వేయి యుగముల యొక్క అంతము నీ కోపకాలము. ఇది కోపమునకు యోగ్యము కాదని చెప్పెను. అల్పకః=అత్యల్పుడు. అందువలన కోపము తొలగించక ప్రహ్లాదుని హింసించవలదు అని చెప్పెను. " తత్సుతం " అని. లేదా అకాలమందును కల్గిన ఈ కోపము ఈ భక్తుని రక్షణార్థమనినచో ఇప్పుడు కోపమును వదిలి ఇతనిని రక్షించుము. అని అర్థము. ( 41 )

**ఇంద్ర ఉవాచ :-**

శ్లో ॥ ప్రత్యానీతాః పరమ భవతా త్రాయతాన స్వభాగా ।
దైత్యా క్రాంతం హృదయ కమలం త్వద్గృహం ప్రత్యబోధి।
కాలగ్రస్తం కియదిద మహో నాథ శుశ్రూషతాం తే ।
ముక్తి స్తేషాం నహి బహుమతా నారసింహా పరైఃకిమ్॥42

**ఇంద్రుడిట్లు స్తుతించెను :-**

ఓ పరమ పురుషా ! దైత్యులచే హరించబడిన మా హవిర్భాగాదికము మమ్ము రక్షించెడు నీచే తిరిగి తేబడినవి. దైత్యాక్రాంతమైన మా హృదయకమలమును నీ గృహమని తెలిసికొనుము. ఓ నాథా ! నిన్ను సేవించెడు మాకు కాలగ్రస్తమైన ఈ సంపద ఎంత? నిన్ను సేవించువారికి ముక్తియు బహుమతము కాదు కదా ! ఓ నారసింహా ! ఇతరములచే నేమి ప్రయోజనము?" అని కొనియాడెను. ( 42 )

టీ :- ఇంద్రస్తు నాస్మాకం హవిర్భాగాదిలాభః పురుషార్థః. కింతు. తత్పరిచర్యైవ భవతా పునరనేన సంరంభేణైవ. తత్కార్యమేవ సాధితం. తస్య చ సిద్ధత్వాదుపసంహర. ఏనం క్రోధమిత్యాశయే నాహ - ప్రతీతి. హే పరమ నో స్మాన్. త్రాయతా రక్షతా భవతా స్వీయా ఏవ భాగాదైత్యాత్ ప్రత్యాహృతాః అంతర్యామిణః తవైవ యజ్ఞేషు భోక్తృత్వాత్. అస్మదీయం హృదయకమలం త్వద్గృహమేవైతావత్పర్యంతం భయహేతుత్వేనాస్మత్ త్స్మృతిపథే స్థితేన దైత్యేన ఆక్రాంతం వ్యాప్తం సత్. ప్రత్యబోధి తద్భయాపాకరణేన వికాసం నీతం తవ త్రైలోక్యైశ్వర్య సాధనార్థమయముద్యమ ఇతి చేత్ తత్రాహ - కాలగ్రస్తమితి. తే త్వాం. హే నరసింహస్య చాకారాభ్యాం ఆవిర్భూత. అపరైః స్వర్గాదిభిః కిమ్. (42)

టీ :- ఇంద్రుడైతే "హవిర్భాగాదులను పొందుటే మాకు పురుషార్థము గాదు. కానీ నీపరిచర్యయే పురుషార్థము. ఈ సంరంభముచే నీవైతే నీకార్యమునే సాధించుకొన్నావు. నీ కార్యము సిద్ధించినందున ఈ కోపమును ఉప సంహరించు కొనుము." అను ఆశయముచే ఇట్లు చెప్పెను. ఓ శ్రేష్ఠుడా! నః = మమ్ములను త్రాయతా = రక్షించుచున్న నీచే నీ హవిర్భాగములే దైత్యుని నుండి తెచ్చుకొనబడినవి. అంతర్యామివైన నీకే యజ్ఞములందు భోక్తృత్వమున్నందున, మా హృదయ కమలము నీ గృహమే. ఇంతవరకు భయ కారణమైన మా స్మృతి పథమున నిత్యమున్నట్టి దైత్యునిచే ఆక్రాంతం = వ్యాపించబడినదిగా, ఎఱుంగుము. భయమును దూరము చేయుట ద్వారా ఇప్పుడు వికసింపజేయబడినది. ఓయీ త్రైలోక్యైశ్వర్య సాధనమునకై నీ యీ ఉద్యమమనిన అచ్చట ఇట్లు చెప్పెను. ' కాలగ్రస్తం ' ఇత్యాదిగా. తే = నిన్ను హే నారసింహ= నరుని సింహము యొక్కయు ఆకారముచే పుట్టినవాడా ! అపరైః=ఇతరములైన స్వర్గాదులచే నేమి ఫలము? (42)

**ఋషయ ఊచుః :-**

శ్లో ॥ త్వం నస్తపః పరమమాత్థ యదాత్మ తేజో
యేనేద మాది పురుషాత్మగతం ససర్జ ।
తద్విప్ర లుప్త మమునాద్య శరణ్యపాల
రక్షా గృహీత వపుషా పునరన్వ మంస్థాః ॥ 43॥

**ఋషులిట్లు పలికిరి :-**

" ఓ శరణ్యపాలా ! నీవు మాకు తపస్సే శ్రేష్ఠమైనదని ఏదైతే చెప్పితివో అది నీ యొక్క తేజో రూపమే. అట్టి తపస్సుచేతనే. ఓ ఆదిపురుషా ! నీలో లీనమైయున్న ఈ విశ్వమును సృష్టించితివి కదా ! ఈ దైత్యునిచే లోపింపజేయబడిన అట్టి తపస్సును రక్షించుటకు స్వీకరించబడిన ఈ శరీరముచే మరల ఉద్ధరింపజేసితివి. ఇట్లు గావించి మరల తపము గావించుడని అనుజ్ఞనొసంగితివి. " అని పలుకుచు నమస్కరించిరి.(43)

టీ :- ఋషయస్తు తపః ప్రవర్తనేస్మాకం మహాననుగ్రహః కృత ఇత్యాహుః - త్వమితి. త్వం నో యదాత్థ పరమం ధ్యానలక్షణం తపః పరమత్వే హేతుః. ఆత్మనస్తవ తేజః ప్రభావరూపం తదేవాహుః. యేన తపసా ఆత్మని లీనమిదం విశ్వం. ససర్జ సృష్టవాన్ భవానితి శేషః. తత్ అమునా దైత్యేన విప్రలుప్తం కుంఠితం హే శరణ్యపాల అద్య రక్షార్థం గృహీతేనానేన వపుషా. పునరపి తపః కురుతేత్యభ్యను జ్ఞాతవానపి తస్మై తే నమ ఇత్యుత్తరశ్లోకగత చతుర్థపాదస్యానుషంగః.(43)

టీ :- ఋషులైతే, తపస్సును ప్రవర్తింపజేయుటచే మాకు గొప్ప అనుగ్రహము గావించబడినదని పలికిరి. నీవేదైతే పలికితివో మాకు పరమం = ధ్యానలక్షణమైనది, శ్రేష్ఠమైనది తపస్సు. " అని. తపస్సు శ్రేష్ఠమైనదనుటకు హేతువు, నీ తేజస్సు ప్రభావరూపమైనది తపము. అదిచే ఇట్లు చెప్పబడెను. ఏ తపము చేతనైతే తనలో లీనమైయున్న ఈ విశ్వమును ససర్జ = సృష్టించితివో, అట్టి తపస్సు ఈ దైత్యునిచే, విప్రలుప్తం = కుంఠితమైనదో, శరణు గోరి వచ్చిన వారిని పాలించువాడా ! నేడు (దానిని) రక్షించుటకు గ్రహించబడిన ఈ శరీరముచే మరల గూడా తపమాచరించుడని అనుజ్ఞనొసగినవాడవైతివి. అట్టి నీకు నమస్కారము. అని ఉత్తర శ్లోకమందలి చతుర్థ పాదముతో అన్వయము. ( 43 )

**పితర ఊచుః :-**

శ్లో ॥ శ్రాద్ధాని నోధి బుభుజే ప్రసభం తనూజైః
దత్తాని తీర్థ సమయేప్యబి బత్తిలాంబు ।
తస్యోదరా న్నఖ విదీర్ణ వపాద్య ఆర్చత్
తస్మై నమో నృహరయేఖిల ధర్మ గోప్త్రే ॥ 44 ॥

**పితరులు ఇట్లు పలికిరి :-**

ఓ నృసింహా ! మా పుత్రులచే శ్రద్ధగా పెట్టబడిన పిండప్రదానాదికమును ఎవడైతే బలాత్కారముగ భుజించుచుండేనో, అట్లే తీర్థస్నాన సమయమున ఒసగెడు తిలోదకమును గూడా త్రాగుచుండెనో, నీ గోళ్ళచే చీల్చబడిన వపగలిగినవాని (హిరణ్యకశిపుని ) ఉదరమునుండి వానిని (పిండములను, తిలోదకమును గూడా) కొని తెచ్చితివి. అట్టి అఖిల ధర్మ రక్షకుడవైన నీకు నమస్కారము. " ( 44 )

టీ :- పితరస్తు. శ్రాద్ధోద్ధరణేన తం పరమోపకారిణం ప్రణమంతి శ్రాద్ధానీతి. శ్రాద్ధాని శ్రద్ధయా యుక్తాని పిండాదీని నః అస్మభ్యం పుత్రైర్దత్తాని ప్రసభం బలాత్. స్వయమధికృత్య బుభుజే. కించ తీర్థస్నానసమయే దత్తం తిలోదకమప్యపిబత్. తాని తస్యోదరాత్ య ఆర్ఛత్ ఆహృతవాన్. కథంభూతాత్ సఖైః విదీర్ణా వపా యస్య తస్మాత్. వపావిదారణస్య తద్గతపిండోద్ధరణమేవ ఫలమితి భావః. (44)

టీ :- పితరులైతే, శ్రాద్ధముల నుద్ధరించుట ద్వారా పరమోపకారమును గావించిన శ్రీ నృసింహునికి నమస్కరించుచున్నాను. శ్రాద్ధాని = శ్రద్ధతో కూడిన పిండాదులు, నః=మా కొరకు పుత్రులచే నొసగబడినవి. వానిని, ప్రసభం = బలాత్కారముగ ఎవడైతే స్వయముగ చేరి భుజించెనో, ఇంతేగాక తీర్థస్నాన సమయమున ఇవ్వబడిన తిలోదకమునుగూడా త్రాగెనో, వానిని ( పిండములును, తిలోదకములును ) ఆ దైత్యుని ఉదరమునుండి ఎవడైతే, ఆర్ఛత్ = తెచ్చెనో, ఉదరమెట్టిదనిన, గోళ్ళచే చీల్చబడిన వప గలది. వపాది విదారణమునకు ఆ ఉదరమందలి పిండముల ఉద్ధరణమే ఫలమని భావము. (44)

**సిద్ధా ఊచుః :-**

శ్లో ॥ యోనోగతిం యోగసిద్ధా మసాధు
రహారషీద్యోగ తపో బలేన ।
నానా దర్పంతం నఖైర్నిర్దదార
తస్మై తుభ్యం ప్రణతాః స్మో నృసింహ ॥ 45 ॥

**సిద్ధులు ఇట్లు పలికిరి :-**

ఎవడైతే యోగతపో బలముచే మాయొక్క యోగసిద్ధమైన అణిమాది సిద్ధిని హరించి వేసెనో, అట్టి అనేకవిధముల దర్పము గల దైత్యుని నఖములచే చీల్చితివి. ఓ నృసింహా ! అట్టి నీకై ప్రణతులమగుచున్నాము. ( 45 )

టీ :- యోగసిద్ధాం గతిం అణిమాదిసిద్ధిం. నానాదర్పాః బహువిధాహంకారవికారా యస్య తం. తస్మై తుభ్యం. తం త్వాముద్దిశ్య. (45)

టీ :- యోగసిద్ధమైన గతిం = అణిమాది సిద్ధిని, నానా = అనేకములైన, దర్పాః=దర్పములు కలవాడు, వానిని. అట్టి నీకై ( నిన్ను ఉద్దేశించి ) (45)

**విద్యాధరా ఊచుః :-**

శ్లో ॥ విద్యాం పృథక్ధారయానురాద్ధాం
న్యషేధదజ్ఞో బలవీర్య దృప్తః ।
సయేన సంఖ్యే పశువద్ధతస్తం
మాయా నృసింహం ప్రణతాస్మ నిత్యం ॥ 46 ॥

టీ- విద్యామంతర్ధానాదిలక్షణాం. అనురాద్ధాం సంప్రాప్తాం. సంఖ్యే యుద్ధే. (46)

**విద్యాధరులు ఇట్లు పలికిరి :-**

బలవీర్యములచే మదించిన, ఎవడైతే జ్ఞానములేనివాడై పృథగ్ధారచే సంప్రాప్తమైన అంతర్ధానాది లక్షణములు గల విద్యను నిషేధించెనో, అట్టి వాడైన దైత్యుడు ఎవని చేతనైతే యుద్ధమున పశువువలె సంహరించబడెనో అట్టి మాయా నృసింహునకు నిత్యము నమస్కరింతుము. ( 46 )

టీ :- అంతర్ధానాది లక్షణములు గల విద్యను. అనురాద్ధాః = సంప్రాప్తమైన ( దానిని ) సంఖ్యే = యుద్ధమునందు. ( 46 )

**నాగా ఊచుః :-**

శ్లో ॥ యేన పాపేన రత్నాని స్త్రీ రత్నాని హృతానినః ।
తద్వక్షః పాటనేనాసాం దత్తానంద నమోస్తుతే ॥ 47 ॥

టీ :- రత్నాని ఫణాసు స్థితాని. స్త్రీరత్నాని చ. ఉత్తమాః స్త్రియః. ఆసాం స్త్రీణాం దత్త అనందోయేన తత్సంబోధనం. అస్మద్దత్తానందేతి పాఠాంతరే. అస్మాకం దత్త ఆనందో యేనేతి. 47

**నాగములు ఇట్లు ప్రార్థించినవి :-**

ఏ పాపాత్మునిచే మా రత్నములు, స్త్రీ రత్నములు హరించబడెనో అట్టి దైత్యుని వక్షఃస్థలమును చీల్చి చంపుటచే వారందరికీ ఆనందమొసగిన నీకు నమస్కారము. (47)

టీ :- రత్నాని = ఫణములందున్న రత్నములను. అట్లే స్త్రీ రత్నానిచ = ఉత్తమ స్త్రీలనుగూడా. ఆ స్త్రీలకు ఒసగబడిన ఆనందముగలవాడా యని సంబోధనము. పాఠాంతరమున మాకు ఆనందము నిచ్చినవాడా యని. (47)

**మనవ ఊచుః :-**

శ్లో ॥ మనవో వయం తవ నిదేశ కారిణో
దితిజేన దేవ పరిభూత సేతవః ।
భవతా ఖలః స ఉపసంహృతః ప్రభో
కరవామతే కిమనుశాధి కింకరాన్ ॥ 48 ॥

టీ :- నృసింహేనావలోకితాస్సంతః మూర్ధ్ని బద్ధాంజలయో మనవః ప్రోచుః. – మనవ ఇతి. మనవో వయం ధర్మపాలకాః. పరిభూతాః సేతవో వర్ణాశ్రమధర్మమర్యాదా యేషాం తే. అనుశాధి అనుశిక్షయ. (48)

**మనువులిట్లు ప్రార్థించిరి :-**

ఓ దేవా ! మేము నీ ఆజ్ఞను పాలించు మనువులము. దైత్యునిచే పరిభవించబడిన వర్ణాశ్రమ ధర్మమర్యాదగలవారమైతిమి. ప్రభూ ! ఆ నీచుడు నీచే సంహరించబడినాడు. మీకై ఏమి చేయుదుము. శాసించుము. ( 48 )

టీ :- నృసింహునిచే చూడబడినవవారై శిరమున అంజలి ఘటించినవారై మనువులిట్లనిరి. మనవో వయా ధర్మపాలకాః = మేము ధర్మమును పాలించు మనువులము. అవమాన పరచబడిన వర్ణాశ్రమధర్మ మర్యాదగలవారమైతిమి. అనుశాధి= నేర్పుము. ( 48 )

**ప్రజాపతయ ఊచుః :-**

శ్లో ॥ ప్రజేశా వయంతే పరేశాభిసృష్టా
న యేన ప్రజావై సృజామో నిషిద్ధాః ।
స ఏష త్వయా భిన్న వక్షాను శేతే
జగన్మంగళం సత్త్వమూర్తేవతారః ॥ 49 ॥

**ప్రజాపతులిట్లు పలికిరి :-**

ఓ పరేశా ! నీచే సృష్టింబడిన మేము ప్రజేశులము ( ప్రజాపతులము). ఎవనిచేత నిషేధింపబడిన వారమై ప్రజలను సృష్టించకున్నామో అట్టి ఈ హిరణ్యకశిపుడు నీచే భేదించబడిన వక్షముగలవాడై మరణించెను. ఓ సత్త్వమూర్తీ! నీ అవతారము జగత్తునకు మంగళకరమైనది. ఈ విధముగా అందరును స్తుతులను చేసిరి. ( 49 )

టీ :- ప్రజాపతయో పి తదవలోకితాః ప్రోచుః. - ప్రజేశా ఇతి. హే పరేశ తే త్వయా. అభిసృష్టాః ప్రజేశాః వయం. యేన నిషిద్ధాస్సంతః. ప్రజా న సృజామ. స ఏషః. భిన్నం వక్షో యస్య సునిశ్చితం. వృతశ్శేతే. అతః పరం ప్రజాస్స్రక్ష్యామ ఇతి హృష్యంత ఆహుః. - హే సత్త్వమూర్తే తవాయమవతారః జగన్మంగలం.(49)

**గంధర్వా ఊచుః :-**

శ్లో ॥ వయం విభోతే నటనాట్య గాయకా  
యేనాత్మసాద్వీర్య బలౌజసాకృతాః ।  
స ఏష నీతో భవతా దశా మిమాం  
కిముత్పదస్థః కుశలాయ కల్పతే ॥ 50 ॥

టీ :- గంధర్వా అపి తదవలోకితాః ప్రోచుః - హే విభో వయం తే త్వదీయాః నటా పర్తకాః.నాట్యే నృత్యే గాయకాశ్చ. యేన ఆత్మసాత్ స్వాధీనాః కృతాః. కథంభూతేన వీర్యం శౌర్యం. బలం శక్తిః తాభ్యామోజః ప్రభావో యస్య తేన. ఇమాం దశాం మృతిం. ఉచితమేతదిత్యాహుః కిమితి.(50)

టీ :- ప్రజాపతులను ఆ నృసింహునిచే చూడబడినవారై ఇట్లు పలికిరి. ఓ శ్రేష్ఠమైన ఈశుడా ! తే = నీచే మేము ప్రజాపతులుగ సృష్టించబడిన వారమై ఎవనిచేతనైతే నిషేధించబడి ప్రజలను సృజించుటలేదో అట్టి వీడు వక్షము చీల్చబడి నిశ్చయముగ, శేతే = మరణించెను. ఇకపై ప్రజలను సృష్టింతుమని సంతోషించుచు పలికిరి. ఓ సత్త్వమూర్తీ ! ఈ నృసింహావతారము జగత్తునకు మంగళహేతువగుచున్నది. (49)

**గంధర్వులిట్లు పలికిరి :-**

ఓ ప్రభూ ! మేము నీయొక్క నర్తకులము ( నటులము ). నాట్యము చేయువారము, గాయకులము, శౌర్యము, బలము ప్రభావములుకల ఎవని చేతనైతే తన యధీనము గావించుకొనబడినామో అట్టి వీడు నీచే ఈ స్థితిని పొందించబడినాడు. చెడు మార్గమున నున్నవాడు క్షేమమును పొందునా?(50)

టీ :- గంధర్వులు గూడా ఆ నృసింహునిచే చూడబడినవారై ఇట్లనిరి. ఓ విభో ! మేము తే = నీ వారము. నటాః = నర్తకులము. నాట్యే = నృత్యమునందు, గాయకులు గూడా ఏ దైత్యునిచే స్వాధీనులుగా చేసుకొనబడినామో, ఎటువంటి దైత్యునిచే. వీర్యం=శౌర్యము, బలం = శక్తి ఈ రెంటిచే ఓజః = ప్రభావము కలవాడు. దానిచే అట్టి వీడు ( దైత్యుడు ) నీచే ఈ దశను = మృత్యువును పొందించబడినాడు. ఇది యుక్తమే యని “ కిమితి ” ఇత్యాదిగా చెప్పెను.(50)

**చారణా ఊచుః :-**

శ్లో ॥ హరే తవాంఘ్రి పంకజం భవాపవర్గ మాశ్రితాః ।
యదేష సాధు హృచ్ఛయ స్త్వయా సురః సమాపితః ॥51॥

టీ :- భవాపవర్గం సంసారనివర్తకం. ఆశ్రయణే హేతుః. యదస్మాత్. సాధూనాం హృది భయజనకత్వేన శేతే తిష్ఠతీతి తథా. స ఏషో సురస్త్వయా సమాపితః అంతం నీతః. (51)

**చారణులిట్లు స్తుతించిరి :-**

ఓ హరీ ! సంసారబంధ వినాశకమైన నీ పాదకమలముల నాశ్రయించినాము. సజ్జనుల హృదయములలో భయమును కల్గింపజేయుటద్వారా నిదురించెడు ఈ దైత్యుడెవడైతే కలడో అట్టి ఈ అసురుడు నీచే సమాప్తి గావించబడినాడు. ( 51 )

టీ :- భవాపవర్గం = సంసార నివర్తకమైన, ఆశ్రయించుటయందలి కారణము- ఏ కారణమువల్లనైతే సాధువుల హృదయమునందు భయమును కలిగించుట ద్వారా శేతే=ఉంటున్నాడని. అట్లే ఈ అసురుడు నీచే సమాపితః= అంతమొందించబడినాడు.(51)

**యక్షా ఊచుః :-**

శ్లో ॥ వయమనుచర ముఖ్యాః కర్మభిస్తే మనోజ్ఞై
స్త ఇహ దితి సుతేన ప్రాపితా వాహకత్వమ్ ।
సతుజన పరితాపం తత్కృతం జానతాతే
నర హర ఉపనీతః పంచతాం పంచ వింశ ॥52॥

**యక్షులిట్లు కొనియాడిరి :-**

మేము మనోజ్ఞములైన కర్మలచే నీ అనుచరులలో ముఖ్యులమైనాము. అట్టి మేము ఈ దితి పుత్రునిచేత శిబికా వాహకులుగా చేయబడినాము. ఓ చతుర్వింశతి తత్త్వ నియామకా ! నరహరీ ! వాడు గావించు జనపరితాపము నెఱింగిన నీచే వాడు (దైత్యుడు ) మృత్యువును పొందించబడినాడు. ( 52 )

టీ :- మనోజ్ఞైః కర్మభిః అనుచరేషు ముఖ్యాః. పంచతాం మృత్యుం హే పంచవింశ. చతుర్వింశతి తత్త్వనియామక. (52)

టీ :- మనోహరములైన కర్మలచే నీ అనుచరులలో ముఖ్యులమైన నీవారమగుమేము దితి పుత్రుడైన హిరణ్యకశిపునిచే శిబికా వాహకులుగా చేయబడినాము. పంచతాం=మృత్యువును. హే పంచవింశ = చతుర్వింశతి తత్త్వములను నియమించువాడా ! ( 52 )

**కింపురుషా ఊచుః :-**

శ్లో ॥ వయం కిం పరుషాస్త్వం తు మహాపురుష ఈశ్వరః ।
అయం కుపురుషో నష్టో ధిక్కృతః సాధుభిర్యదా ॥ 53॥

**కింపురుషులిట్లు స్తుతించిరి :-**

మేము కింపురుషులము (తుచ్ఛప్రాణులము) నీవేమో మహాపురుషుడవు, ఈశ్వరుడవు. ఈ నీచుడు ఎప్పుడైతే సజ్జనులచే నింద్యుడైనాడో అపుడే (నీచే) నశింపజేయబడినాడు. ( 53 )

టీ :- కింపురుషాస్తు త్వాం స్తోతుం కే వయం వరాకా ఇత్యాహుః - వయమితి. వయం కింపురుషాస్తుచ్ఛప్రాణినః. త్వం తు మహానద్భుత ప్రభావః పురుషః. నన్వయం మహాన్ దైత్యో హత ఇతి కిం న వర్ణ్యతే ఇత్యాశంక్య కియదేతదిత్యాహుః. - అయమితి.(53)

టీ :- కింపురుషులైతే నిన్ను స్తుతించుటకు అమాయకులమైన మేమెవరము? అని పలికిరి.- " వయం " ఇత్యాదిగా. కింపురుషులమైన మేము తుచ్ఛప్రాణులము. నీ వేమో గొప్ప అద్భుత ప్రభావముగల పురుషుడవు. ఓయీ ! ఈ గొప్పనైన దైత్యుడు సంహరించబడెనని ఏల వర్ణించబడుటలేదు? అని శంకించి ఇది ఎంతటిదని పలికెను. " అయం " ఇత్యాది శ్లోకమున. ఎప్పుడైతే సాధుభిః = భగవద్భక్తులచే తిరస్కరించబడెనో అప్పుడే నశించెను. ( 53 )

**వైతాలికా ఊచుః :-**

శ్లో ॥ సభాసు సత్రేషు తవామలం యశో
గీత్వా సపర్యాం మహతీం లభామహే ।
యస్తాం వ్యనైషీద్భృశ మేషదుర్జనో
దిష్ట్యాహతస్తే భగవన్ యథాఽమయః ॥54॥

టీ :-సత్రేషు యజ్ఞేషు తే త్వయా హతః. ఏతద్దిష్ట్యా భద్రం కృతమ్. (54)

**కిన్నరా ఊచుః :-**

శ్లో ॥ వయమీశ కిన్నరగణా స్తవానుగా
దితిజేన విష్టిమమునాను కారితాః ।
భవతా హరే స వృజినోఽవసాదితో
నరసింహనాథ విభవాయ నో భవ ॥ 55 ॥

టీ :- అమునా దితిజే. విష్టిం నిర్మూల్యం కర్మ. అను నిరంతరం. కారితాః. అతః పరం. నః విభవాయ సమృద్ధయే. భవ. (55)

**వైతాళికులిట్లు కీర్తించిరి :-**

సభలలో, సత్రములలో నీ యొక్క అమలమైన యశస్సును గానము చేసి గొప్ప సపర్యను పొందుచున్నాము. ఓ భగవంతుడా ! ఎవడైతే శీఘ్రముగా అట్టి సపర్యను తొలగించెనో అట్టి ఈ దుర్జనుడు అదృష్ట వశమున రోగమువలె నీచే నశింప జేయబడినాడు. ( 54 )

టీ :- సత్రేషు = యజ్ఞములందు, తే = నీచే హతుడయ్యెను. ఇది దైవ వశమున మంగళము గావించబడినది. ( 54 )

**కిన్నరులు ఇట్లు ప్రార్థించిరి :-**

ఓ ఈశా ! కిన్నరగణమైన మేము నీ అనుచరులము. ఈ దైత్యునిచే నిరంతరము నిర్మూల్యముగా ( వెట్టి ) చాకిరీ చేయించబడినాము. అట ఈ దైత్యుడు పాపాత్ముడు నీచే అంతమొందించబడినాడు. ఓ నరసింహనాథా ! మాయొక్క సమృద్ధికై అనుగ్రహించుము. ( 55 )

టీ :- ఈ దైత్యునిచేత విష్టిం = నిర్మూల్యముగా ( వెట్టి ) చాకిరి నిరంతరము చేయించబడినాము. ఇటుపైన మాయొక్క విభవాయ= సమృద్ధికై అగుదువు గాక. (55)

**విష్ణు పార్షదా ఊచుః :-**

శ్లో ॥ అద్యైతద్ధరి నరరూపమద్భుతం తే
దృష్టం నః శరణద సర్వలోక శర్మ ।
సోఽయంతే విధికర ఈశ విప్రశప్త
స్తస్యేదం విధన మనుగ్రహాయ విద్మః ॥ 56 ॥

టీ :- నో స్మాకం భక్తానాం శరణద ఆశ్రయప్రద. సర్వేషాం లోకానాం శర్మ మంగలం. ఏతదద్భుతం రూపం. అద్యైవ దృష్టం న తు పూర్వం. విధికరః కింకరః. (58)

**ఇతి శ్రీమద్భగవతే మహాపురాణే సప్తమ స్కంధే ప్రహ్లాదానుచరితే దైత్య రాజవధే నృసింహస్తవో నామ అష్టమోఽధ్యాయః ॥**

**విష్ణుపార్షదులు ఇట్లు కీర్తించిరి :-**

ఓ ఆశ్రయదాతా ! ఈరోజు ఈ అద్భుతమైనట్టి, సర్వలోక మంగళకరమైనట్టి నీ నరసింహరూపము చూడబడినది ( దర్శించబడినది ). ఓ ఈశా ! ఇదిగో మేము విప్రులైన సనకసనందనాదులచే శపించబడిన నీ కింకరులము. అట్టి ఈ నాయొక్క వధ నా అనుగ్రహమునకే యని ఎరుంగుదును. ( 56 )

టీ :- నః = మాకు భక్తులకు శరణద = ఆశ్రయప్రదా ! సమస్త లోకములకు, శర్మ=మంగళకరమైన ఈ అద్భుతరూపము ఈనాడే దర్శించుకొనబడినది. పూర్వమెన్నడును చూడబడలేదు. విధికరః = కింకరుడు. ( 56 )

**ఇది శ్రీమద్భాగవతమను మహాపురాణమందలి సప్తమస్కంధమున ప్రహ్లాదాను చరితమందు దైత్యరాజవధయందు నృసింహస్తవమను ఎనిమిదవ అధ్యాయము.**





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఏవం సురాదయః సర్వే బ్రహ్మ రుద్ర పురస్సరాః ।
నోపైతు మశకన్ మన్యు సంరంభం సుదురా సదమ్॥ 1॥

టీ :- నవమే బ్రహ్మణా భీత్యా చోదితో సురబాలకః, కోపం ప్రశమయన్నస్తౌన్న ృసింహమతిభీషణమ్. "ఉగ్రో ప్యనుగ్ర ఏవాయం స్వభక్తానాం నృకేసరీ, కేసరీవ స్వపోతానామన్యేషాముగ్రవిగ్రహ" ఇత్యాద్యాగమోక్తాం భక్తానుకంపితామాహ - సప్తభిః. ఏవమితి. ఏవం దూరత ఏవ స్థిత్వా స్తువంతః. మన్యునా సంరంభః. ఆవేశో యస్య తం ఉపగంతుం నావక్నువన్. (1)

శ్లో ॥ సాక్షాత్ శ్రీః ప్రేషితా దేవైః దృష్ట్వా తన్మహదద్భుతమ్ ।
అదృష్టాశ్రుత పూర్వత్వాత్సా నోపేయాయ శంకితా ॥2॥

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారదుడిట్లు చెప్పుచున్నాడు :-**

ఇట్లు బ్రహ్మ రుద్ర ప్రభృతి సకల సురాదులు క్రోధావేశము గల్గినట్టి, దరి జేర రానట్టి నరసింహుని సమీపించుటకు అశక్తులైరి. ( 1 )

టీ :- తొమ్మిదవ అధ్యాయమున బ్రహ్మదేవునిచే భీతితో ప్రేరేపించబడిన అసుర బాలకుడగు ప్రహ్లాదుడు అతిభీషణుడైన నరసింహుని కోపమును చల్లార్చుచు స్తుతించెను. ఈ నృకేసరి ఉగ్రుడేయైనను తన భక్తులకు ఉగ్రము లేనివాడే (చల్లనివాడే) ఎట్లైతే సింహము తన పిల్లలకు మృదువుగా, ఇతరులకు ఉగ్రరూపము కల్గియుండునో అట్లే ఇత్యాది ఆగమోక్తమైన భక్తులందు భగవంతుని దయను " ఏవం " అను సప్తశ్లోకములచే చెప్పెను. ఇట్లు దూరమునుండియే నిలిచి స్తుతించువారై కోపముతో సంరంభః = ఆవేశము గల అతనిని ఉప = సమీపమునకు వెడలుటకు అశక్తులైరి. (1)

అట్టి గొప్ప అద్భుతమైన రూపమును గని దేవతలచే సాక్షాల్లక్ష్మీదేవి నరహరి దరికి పంపించబడినది. అట్టి రూపము ఇంతకు పూర్వము చూడబడనిది, వినబడనిదియు నైనందున ఆ లక్ష్మి భయము గలదై సమీపించలేకుండెను. ( 2 )

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ





టీ :- శ్రీర్లక్ష్మీర్దేవైః ప్రేషితాపి మహదద్భుతం రూపం దృష్ట్వా శంకితా సతీ. నోపేయాయ నోపజగామ. అద్బుతత్వే హేతుః అదృష్టేతి. (2)

టీ :- శ్రీః = లక్ష్మి దేవతలచే పంపబడినదై కూడా మహాద్భుతమైన ఆ రూపమును గాంచి భయమందినదై అతనిని చేరబోకుండెను. అద్భుతమనుటకు హేతువు " అదృష్ట" ఇత్యాదికము. ( 2 )

శ్లో ॥ ప్రహ్లాదం ప్రేషయామాస బ్రహ్మావ స్థిత మంతికే ।
తాత ప్రశమయోపేహి స్వ పిత్రే కుపితం ప్రభుమ్ ॥ 3 ॥

అప్పుడు బ్రహ్మ సమీపమున నున్న ప్రహ్లాదుని ' నాయనా ! నీ తండ్రియెడ కోపించియున్న ప్రభువును చేరబొమ్ము. కోపమును చల్లార్చుము. ' అని చెప్పి పంపించెను. (3)

శ్లో ॥ తథేతి శనకై రాజన్ మహాభాగవతోర్భకః ।
ఉపేత్య భువి కాయేన ననామ విధృతాంజలిః ॥ 4 ॥

మహాభాగవతోత్తముడైన ఆ బాలుడు అట్లేనని అంగీకరించి ఓ రాజా ! నరహరిని సమీపించి భూమిపై సాగిలపడి అంజలి ఘటించెను. ( 4 )

టీ :- ప్రహ్లాదమితి. ఉపేహి ఉపగచ్ఛ. (3,4)

టీ :- ఉపేహి = చేరబొమ్ము. ( 3-4 )

శ్లో ॥ స్వపాదమూలే పతితం తమర్భకం
విలోక్యదేవః కృపయి పరిప్లుతః ।
ఉత్థాప్య తచ్ఛీర్ష్ణ్య దధాత్కరాంబుజం
కాలాహి విత్రస్త ధియా కృతా భయమ్ ॥ 5 ॥

అప్పుడు దేవుడైన నరహరి తన పాదమూలమున పడిన ఆ అర్భకుని చూచి దయాసముద్రుడై లేపి కాలసర్పమునకు భయపడిన మనస్సుగలవారికి అభయ రూపమైన అభయమొసగెడు తన కరాంబుజమును ఆ బాలుని శిరమున పెట్టెను. (5)

టీ :- స్వపాదేతి. కాల ఏవాహిస్తస్మాద్విత్రస్తాధీర్యేషాం తేషాం. కృతమభయం యేన తత్. (5)

టీ :- కాలవే సర్పము దానివలన భయపమొందిన బుద్ధిగలవారికి గావించబడిన అభయముగల కరాంబుజము. ( 5 )

శ్లో ॥ సతత్కర స్పర్శ ధుతాఖిలా శుభః
సపద్యభివ్యక్త పరాత్మ దర్శనః ।
తత్పాద పద్మం హృదినిర్వృతో దధౌ
హృష్యత్తనుః క్లిన్న హృదశ్రులోచనః ॥ 6 ॥

టీ :- స ఇతి. తస్య కరస్పర్శేన ధుతం నిరస్తం. అఖిలమశుభం యస్య సపది తత్ క్షణమేవ. అభివ్యక్తం అపరోక్షభూతం. పరం ఆత్మదర్శనం బ్రహ్మజ్ఞానం యస్య. నిర్వృతస్సన్. హృది దధౌ. హృష్యంతీ రోమాంచితా తనుర్యస్య క్లిన్నం ప్రేమ్ణా ఆర్ద్రం హృత్ యస్య. అశ్రూణి లోచనయోర్యస్య. పరమపురుషార్థతయా దధౌ. న సాధనత్వేనేత్యర్థః. (6)

ఆ నృసింహుని కరస్పర్శచే నిరస్తమైన సకల పాపములు కలవాడును, తక్షణమే అభివ్యక్తమైన బ్రహ్మజ్ఞానము కలవాడును, ఆర్ద్రమైన హృదయము ఆనందబాష్పములచే గూడిన లోచనములు గలవాడును అగు ఆ ప్రహ్లాదుడు సంతృప్తి గలవాడై , ఆనందించు తనువుగలవాడై ఆ నరసింహుని పాద పద్మమును హృదయమున దాల్చెను. ( 6 )

టీ :- ఆ నృసింహునియొక్క కరస్పర్శచే ధుతం = తొలిగించబడిన పాపము గలవాడు, సపది = తక్షణమే, అభివ్యక్తం = ప్రత్యక్షమైన, పరాత్మదర్శనం = బ్రహ్మజ్ఞానము గలవాడు. ఆనందమొందినవాడై హృదయమున (హరిపాద పద్మమును) ధరించెను. హృష్యంతీ=రోమాంచితమైన శరీరము గలవాడు, క్లిన్నం = ప్రేమార్ద్రమైన హృదయము గలవాడై, అశ్రువులు నేత్రములందు గలవాడు, ఆనందభాష్పములు గలవాడు, పరమ పురుషార్థత్వముచే ( హరిని హృదయమున ) దాల్చెను. సాధనత్వముగా కాదు అని అర్థము. ( 6 )

శ్లో ॥ అస్తౌషీద్ధరిమేకాగ్ర మనసా సు సమాహితః ।
ప్రేమ గద్గదయా వాచా తన్న్యస్త హృదయేక్షణః ॥ 7 ॥

టీ :- సుసమాధిమేవాహ - అస్తౌషీదితి. తస్మిన్నేవ న్యస్తం హృదయమీక్షణే చ యేనేతి. (7)

అనంతరము ఆ హరియందు నిల్పబడిన హృదయము చూపులు గలవాడై సమాహిత చిత్తుడై ప్రేమచే గద్గదమైన వాక్కుతో ఏకాగ్రచిత్తముతో ఆ శ్రీహరిని స్తుతించెను.(7)

టీ :- సుసమాధిని గూర్చియే ఇట్లు చెప్పెను. అతనియందే కూర్చబడిన హృదయపు దృష్టిగలవాడై ( ప్రహ్లాదుడు ). ( 7 )







**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ బ్రహ్మాదయః సురగణా మునయోథ సిద్ధాః
సత్త్వైక తానమతయో వచసాం ప్రవాహైః ।
నారాధితుం పురుగుణై రధునాపి పిప్రుః
కితోష్టు మర్హతి సమే హరిరుగ్ర జాతేః ॥ 8 ॥

టీ :- శ్లో. "స్వస్మిన్నివ సమస్తేషు తత్క్ృపామృతవృష్టయే, ప్రహ్లాదస్తౌతి సత్ప్వద్యైర్ద్విచత్వారింశతా హరిం" శ్రీధరీయో యం శ్లోకః. తత్ర తావదాత్మనో భగవతః స్తుతావనధికారమివా శంక్యాధికారం భావయన్నాహ - పంచభిః. బ్రహ్మాదయ ఇతి. మునయో మననశీలాః. సిద్ధాః జ్ఞానినో పి. కథంభూతాః. సత్త్వఏకైకస్మిన్ తానో విస్తారో యస్యాస్సా. మతిర్యేషాం. తథావిధా అపి వచసాం ప్రవాహైరపి తథా బహుభిర్వక్ష్యమాణైర్గుణైరపి. యమారాధయితుం నపేపుః న పూర్ణాః నచ శక్తా ఇత్యర్థః. స హరిః. మే మయా కిం కథం. తోష్టుం తోషం ప్రాప్తుం. అర్హతి? తత్ర హేతుః. ఉగ్రా ఘోరా ఆసురీ జాతిర్యస్య. (8)

**ప్రహ్లాదుడిట్లు చెప్పెను :-**

ప్రహ్లాదుడు సత్వగుణమొక్కటియే వ్యాప్తమైన మతులుగల బ్రహ్మాది దేవ గణము, మననశీలురైన మునులు వాక్ప్రవాహముచే, విశేష గుణములచే నేటికిని హరిని ఆరాధించుటకు అశక్తులగుచున్నారు. అట్టి క్రూరజాతియగు దైత్య పుత్రుడైన నాకు సంతోషపెట్టుటకు తగునా? ( 8 )

టీ :- తనయందు వలెనే సమస్త ప్రాణులందును ఆ శ్రీహరియొక్క కృపామృతదృష్టి కలుగుటకై ప్రహ్లాదుడు నలుబది రెండు మంచి పద్యములచే హరిని స్తుతించెను. అని. అచ్చటనేమో తనకు భగవంతుని స్తుతియందు అధికారములేనట్లుగా భావించుచు ఇట్లనెను. " బ్రహ్మాదయః " అను ఐదు శ్లోకములచే. మునయః = మన శీలురు. సిద్ధాః=జ్ఞానవంతులును, వారెట్టివారనిన, సత్వగుణమొక్కటియే, తానః = విస్తారము గలిగినట్టి బుద్ధిగలవారు (కేవలము సత్వగుణము చేతనే వ్యాప్తమైన బుద్ధిగలవారని అర్థము) అట్టి వారైనను వారి వాక్కులయొక్క ప్రవాహముచేతను (స్తోత్రములచేతను) అట్లే అనేకమైన వక్ష్యమాన గుణములచేతను ఏ హరిని ఆరాధించుటకు న పిప్రుః=పూర్ణులు కాకుండిరో, అశక్తులైరో అని అర్థము. అట్టి హరినాకు ఎట్లు సంతోషమునొందుటకు తగును? దానికి కారణము " ఉగ్రజాతేః " ఉగ్రా = ఘోరమైన ఆసురీజాతి కలవాడును,(8)







శ్లో ॥ మన్యేధనాభిజన రూప తపః శ్రుతౌజః
ప్రభావ బల పౌరుష బుద్ధియోగాః ।
నారాధనాయహి భవన్తి పరస్య పుంసో
భక్త్యాతు తోష భగవాన్ గజయూధ పాయ ॥ 9 ॥

ధనము, సత్కులమందు పుట్టుట, సౌందర్యము, తపస్సు, శాస్త్ర పాండిత్యము, ఇంద్రియ నైపుణ్యము, తేజము, ప్రతాపము, ప్రజ్ఞా, యోగము అను గుణము పరమపురుషుని ఆరాధనకు చాలవు. భగవంతుడు కేవలము భక్తిచేతనే గజేంద్రునకై సంతోషపడెను గదా !. ( 9 )

టీ :- ఏవం హరితోషణే స్వస్యాయోగ్యతామాశంక్య. యోగ్యతాం సంభావయతి. ద్వాభ్యాం. మన్య ఇతి. అభిజనః సత్కులే జన్మ. రూపం సౌందర్యం, శ్రుతం పాండిత్యం. ఓజః ఇంద్రియనైపుణ్యం. తేజః కాంతిః. ప్రభావః ప్రతాపః. పౌరుషముద్యమః. బుద్ధిః ప్రజ్ఞాయోగో ష్టాంగః. ఏతే ధనాదయో ద్వాదశాపి గుణాః. పరమస్య పుంసః. ఆరాధనాయ న భవంతి. హి యతః కేవలయా భక్త్యైవ. గజేంద్రాయ తుష్టో భవత్. (9)

టీ :- ఇట్లు హరిని సంతోషపెట్టుటకు ( ప్రహ్లాదుడు ) తన అయోగ్యతను శంకించి యోగ్యతను భావించుచున్నాడు. “ మన్యే ” ఇత్యాది రెండు శ్లోకములతో. అభిజనః=సత్కులమందు పుట్టుట, రూపం = సౌందర్యము, శ్రుతం = పాండిత్యము, ఓజః = ఇంద్రియనైపుణ్యము, తేజః = కాంతి, ప్రభావః = ప్రతాపము. పౌరుషం=ఉద్యమము, బుద్ధిః = ప్రజ్ఞ, యోగః = అష్టాంగయోగము. ఈ ధనాదులకు పన్నెండు గుణములు గూడా పరమపురుషుని యొక్క ఆరాధనమునకు చాలవు. ఎందువల్లననగా కేవలమైన భక్తిచేతనే శ్రీహరి గజేంద్రునకై సంతోషపడెను. ( అనుగ్రహించెనని అర్థము)(9)

శ్లో ॥ విప్రాద్విషడ్గుణ యుతా ఉరవిందనాభ
పాదారవింద విముఖా చ్ఛ్వపచం వరిష్ఠమ్ ।
మన్యే తదర్పిత మనోవచనే హితార్థప్రాణం
పునాతి సకులం న తు భూరిమానః ॥ 10 ॥

నారాయణమూర్తియొక్క పాదపద్మములకు ( సేవ ) విముఖుడైనట్టి ద్వాదశగుణయుక్తుడైన విప్రునకంటే భగవంతుని పాదపద్మములయందు అర్పించబడిన మనస్సు, వాక్కు, ఈ హితము, అర్థము, ప్రాణములుగల ఛండాలుని శ్రేష్ఠమైన వానినిగా తలంచెదను. అతడు తన వంశమునంతయు పవిగ్రము చేయును. గొప్ప గర్వము గలిగిన విప్రుడు తనను గూడా పవిత్రము గావించుకొనజాలడు. ఇక తనకులమును గూర్చి చెప్పనేల? . ( 10 )

టీ :- ఏవం భక్త్యైవ కేవలయా హరేస్తోషస్సంభవతీత్యుక్తం. ఇదానీం భక్తిం వినా నాన్యత్కించిత్తోషహేతురిత్యాహ - విప్రాది. పూర్వోక్తాః ధనాదయః యే ద్విషట్. ద్వాదశ గుణాస్తైర్యుక్తాత్ విప్రాదపి శ్వపచం పరిష్ఠం మన్యే. యద్వా - సనత్సుజాతోక్తాః ద్వాదశజ్ఞానోదయో గుణాః.ద్రష్టవ్యాః. తదుక్తం. శ్లో. "జ్ఞానం చ సత్యం దమస్తపశ్చ హ్యామాత్సర్యం హ్రీస్తితిక్షానసూయా. యజ్ఞశ్చ దానం చ ధృతిశ్శమశ్చ వ్రతాని వై ద్వాదశబ్రాహ్మణస్యే" తి. కథం భూతాత్ విప్రాత్. అరవిందనాభస్య పాదారవిందా ద్విముఖాత్. కథం భూతం శ్వపచం. తస్మిన్ అరవిందనాభే అర్పితా మనఆదయో యేన తం. ఈహితం కర్మ. వరిష్ఠత్వే హేతుః స ఏవంభూతశ్శ్వపచః. సర్వం కులం పునాతి. భూరిర్మానో గర్వో యస్య. స తు విప్రః. ఆత్మానమపి న పునాతి. కుతః కులం. యతో భక్తిహీనస్యైతే గుణా గర్వాయైవ భవంతి. న తు శుద్ధయే అతో హీన ఇతి భావః. (10)

టీ :- ఇట్లు భక్తిచేతనే శ్రీహరికి సంతోషము కలుగుచున్నదని చెప్పబడినది. ఇప్పుడు భక్తి లేకుండ వేరొకటేదియు ఆ హరియొక్క సంతోషహేతువు లేదని చెప్పెను. "విప్రాత్" ఇత్యాదిగ. పూర్వోక్తములైన ధనాది, ద్విషట్ = పన్నెండు గుణములతో గూడిన విప్రున కంటెను చండాలుని శ్రేష్ఠునిగా తలంతును. లేదా సనత్సుజాత ప్రోక్తములైన ధర్మాది ద్వాదశ గుణములు గ్రహించదగినవి. అది యిట్లు చెప్పబడినది. ధర్మము, సత్యము, దమము, తపము, అమాత్సర్యము, హ్రీ, తితిక్షా, అనసూయా, యజ్ఞము, దానము, ధృతి, శ్రుతము అనునవి పన్నెండు బ్రాహ్మణుని వ్రతములుగా చెప్పబడినవి. (ధర్మము=వర్ణాశ్రమములకు విధించబడిన సంధ్యోపాసనాద్యనుష్ఠానము, సత్యము=హింసా వర్జితమైన యథార్థభాషణము, దమము= జిహ్వోపస్థాది నిగ్రహము, తపము = కృచ్ఛ్రములైన చాంద్రాయణాద్యాచరణము, అమాత్సర్యము = పర గుణముల సహనము, హ్రీ = అకార్య విషయమున లజ్జ, తితిక్షా = క్రోధనిమిత్తమున్నను అట్టి క్రోధమును పొందకుండుట, యజ్ఞము = జ్యోతిష్టోమాదికము, దానం = బహిర్వేది సంవిభాగము, ధృతిః = అత్యంతమైన ఆపదలోనూ వ్రతాదులను వీడకుండుట, శ్రుతం=అర్థ గ్రహణ సహితమైన వేదాధ్యయనము, ) అని. లేదా " శమము, దమము, తపము, శౌచము, క్షాన్తి, ఆర్జవము, విరక్తత, జ్ఞానము, విజ్ఞానము, సంతోషము, సత్యము, ఆస్తిక్యము అనునవి పన్నెండు గుణములు " అని. ఎటువంటి విప్రునకంటే ఎట్టి ఛండాలుని ఆ అరవిందనాభుని పదారవిందముల సేవా విముఖుడైన విప్రునకంటే, ఎట్టి

చండాలుని. ఆ కమలనాభుని యందర్పించబడిన మనస్సు మొదలైనవి చండాలుని. ఈహితం=కర్మ. శ్రేష్ఠత్వమునకు కారణము- ఇట్టి గుణములు గల చండాలుడు కులమును పావన మొనర్చును. గొప్పనైన మానః = గర్వముగల విప్రుడు తనను కూడా పావనము చేసుకొనజాలడు. ఇక కులమును గూర్చి చెప్పనేల? ఎందువల్ల ననగా భక్తిహీనునకీ గుణములు గర్వమును కల్గించుటకే యగును. పరిశుద్ధి గావించజాలవు. అందువలననే హీనుడని భావము. ( 10 )

శ్లో ॥ నైవాత్మనః ప్రభురయం నిజలాభ పూర్ణో
మానం జనాద విదుషః కరుణో వృణీతే ।
యద్యజ్జనో భగవతే విదధీత మానం
తచ్చాత్మనే ప్రతి ముఖస్య యథా ముఖశ్రీః ॥ 11॥

ఈ ప్రభువు అల్పజనుడి నుండి తనకు పూజను కోరడు. అనగా ధనాద్యర్పణమును వాంఛించడు అని అర్థము. అతడు తనకు ప్రాప్తించిన దాని తోడనే తృప్తినొందువాడు. ఆయన కరుణాంతరంగుడు. జనులు ఏ యే విధముగా ధనాదులతో భగవంతుని పూజింతురో దానినే తమకు పొందెదరు. ఎట్లైతే ముఖమునకు గావించుకొనిన తిలకభూషణాద్యలంకారాదులచే దర్పణమందలి ప్రతిబింబమునకు కల్గునో ఇదియునిట్లే . అంతేగానీ ప్రతిబింబమునకే సాక్షాత్తుగా అలంకరింపరాదుగదా!.(11)

టీ :- తర్హి కిం ధనాద్యర్పణేన సన్మానం ప్రాకృత ఇవ భగవానపేక్షతే ? నేత్యాహ - నైవేతి. అయం ప్రభురీశ్వరః. అవిదుషో అల్పకాజ్జనాత్ మానం పూజాం. ఆత్మనో ర్థేన వృణీతే నేచ్ఛతి.

టీ :- అట్లైన ఆ ప్రాకృతుని వలె భగవంతుడు ధనాద్యర్పణతో గూడిన సంమానము నపేక్షించునాయనిన కాదని ఇట్లు చెప్పెను. ఈ ప్రియః = ఈశ్వరుడు, అవిదుషః=అల్పజనుని వలన, మానం = పూజను తనకైన వృణోతి

యతో నిజలాభేనైవ పూర్ణః తర్హి పూజాం నేచ్ఛత్యేవ. తత్రాహ – కరుణః కృపాలుః. అతో వృణీతే చ. తత్ర హేతుః. యద్యదితి యత్ యత్. యం యం మానం యద్వా. యద్యస్మాత్. యద్యేన ధనాదినా. భగవతే మానం విదధీత, తదేవాత్మనే భవతి. నాన్యస్య. యథా ముఖే కృతైవ తిలకాదిశ్రీః శోభా ప్రతిబింబస్య భవతి. న తు సాక్షాత్తస్యైవ కర్తుం శక్యతే తద్వత్. (11)

= ఇచ్ఛగించడు. ఎందువల్లననగ ( ఆహరి ) తనకు కల్గిన దానిచేతనే పూర్ణుడు ( తృప్తుడు ) అట్లైన పూజనే కోరడనిన ఇట్లు చెప్పెను. కరుణః = దయగలవాడు కావున ( పూజను ) కోరును. అందుకు కారణము ‘ యద్యద్ ’ అని చెప్పబడినది. ఏ ఏ పూజను లేదా ఎందువల్లనైతే ఏదేది ఏ ధనాదికముచే భగవంతునకు పూజగావించబడునో అదియే తనకు కలుగును. వేరొక ఫలము గలుగదు. ఎట్లనిన ముఖమున గావించుకొనబడిన తిలకాది శోభయే (దర్పణమందలి) ప్రతిబింబమునకు కల్గును. సాక్షాత్తుగా ప్రతిబింబమునకే అలంకరించుటకుదరు గదా! అట్లే ఇదియును. ( 11 )

శ్లో ॥ తస్మాదహం విగత విక్లవ ఈశ్వరస్య
సర్వాత్మనా మహి గృణామి యథా మనీషమ్ ।
నీచో జయాగుణ విసర్గమను ప్రవిష్టః
పూయేత యేనహి పుమానను వర్ణితేత ॥ 12 ॥

కావున నేను నీచజన్ముడనైనను అనుమానము వీడి ఈశ్వరుని మహిమను సర్వ ప్రయత్నముచే హృదయపూర్వకముగ నా బుద్ధికి తోచినట్లుగా వర్ణించెదను. భగవంతుని మహిమను వర్ణించుట ద్వారా నీచుడైనను, అవిద్యావంతుడైనను, గుణవిసర్గమును పొందినవాడై పవిత్రుడగును. శుద్ధుడగును. ( 12 )

టీ :– యస్మాదేవం భగవాన్ భక్త్యైవ తుష్యతి. తస్మాదితి. తస్మాదహం నీచో పి విగతవిక్లబః గతాశంకస్సన్. ఈశ్వరస్య మహి మహిమానం. సర్వప్రయత్నేన స్వమనీషానుసారేణానువర్ణయామి అజానతో పి స్తుతికరణే హేతుమాహ –

టీ :– ఎందువల్లనైతే భగవంతుడు భక్తిచేతనే సంతోషించునో అందువలననే నేను నీచుడనైనను విగత విక్లవః = భయము వీడిన వాడనై ఈశ్వరుని, మహి = మహిమను సర్వప్రయత్నముతో నా బుద్ధికి తగినట్లుగ వర్ణించుచున్నాను. తెలియని వాడైనను స్తుతి గావించుటకు కారణము ఇట్లు



నీచ ఇతి. యేనైవ మహిమ్నా అనువర్ణితేన అజయా అవిద్యయా. గుణవిసర్గం సంసారమనుప్రవిష్టః పుమాన్. పూయేత శుద్ధ్యేత. తన్మహిమ్నః. అన్యస్య తథా శోధకత్వాభావాదిత్యర్థః. (12)

శ్లో ॥ సర్వేహ్యమీ విధికరాస్తవ సత్త్వధామ్నో
బ్రహ్మాదయో వయమివేశన చోద్విజంతః ।
క్షేమా భూతయ ఉతాత్మ సుఖాయ చాస్య
విక్రీడితం భగవతో రుచిరావతారైః ॥ 13 ॥

టీ :- తదేవమాత్మనః స్తుతావనధికారం పరిహృత్య ఇదానీం తం స్తువన్ కోపోపసంహారం ప్రార్థయతే - ద్వాభ్యాం. సర్వ ఇతి. భో ఈశ అమీ. ఉద్విజంతో బిభ్యంతః. సర్వే బ్రహ్మాదయః సత్త్వమూర్తేస్తవ. విధికరాః. తన్నియోగకర్తారో భక్తా ఏవ నాన్యే. న చ వయమసురా ఇవ వైరభావేన ఏతే భక్తాః. కింతు శ్రద్ధయైవ తవ రుచిరైర్విక్రీడితం వివిధం క్రీడనం అస్య విశ్వస్య క్షేమాదిప్రయోజనాయ. న తు భయోత్పాదనాయ. (13)

చెప్పబడినది. ఏ మహిమాను వర్ణన చేతనైతే అవిద్యచే సంసారమును పొందిన పురుషుడు పూయేత = శుద్ధిపొందునో ఆ స్తుతి భక్తిహీనునకు శోధకత్వమును కల్గింపనందువలన అని అర్థము. ( 12 )

ఓ ఈశా ! భయపడుచున్న ఈ బ్రహ్మాదులందరును సత్త్వమూర్తియైన నీ కింకరులే. నీ ఆజ్ఞను పాలించువారే. అసురులమైన మావలె వైరభావముతో భక్తులు గారు. శ్రద్ధతోడనే భక్తులైనవారు. నీయొక్క అందమైన అవతారములచే గావించబడు వివిధక్రీడయంతయు ఈ విశ్వముయొక్క క్షేమమునకు, ఐశ్వర్యమునకు, లేదా ఆత్మ సుఖమునకే కదా !.(13)

టీ :- ఇటు స్తుతించుటకు తన అనధికారమును పరిహరించి ఇప్పుడు స్తుతించుచు నరసింహుని కోప పరిహారమును ప్రార్థించుచున్నాడు. ' సర్వేహి ' అను రెండు శ్లోకములచే. ఓ ఈశా ! ఈ ఉద్విజంతః = భయపడుచున్న బ్రహ్మాదులందరు సత్త్వస్వరూపుడవైన నీ విధికరాః = ఆదేశమును పాలించువారు భక్తులే కాని వేరుగాదు. వయం = అసురులవలె వైర భావముతో భక్తులుగారు. నీ యొక్క అందమైన అవతారములచే గావించు క్రీడ ఈ విశ్వముయొక్క క్షేమాది ప్రయోజనములకే గాని భయోత్పాదనకు గాదు. ( 13 )



శ్లో ॥ తద్యచ్ఛ మన్యు మసురశ్చ హతస్త్వయాద్య
మోదేత సాదురపి వృశ్చిక సర్ప హత్యా ।
లోకాశ్చ నిర్వృతి మితాః ప్రతియంతి సర్వే
రూపం నృసింహ విభజనాః స్వరంతి ॥ 14 ॥

అందువలన వీరి భయమును తొలిగించుటకై కోపమును ఉపసంహరించుకొనుము. కోపకారణమైన అసురుడు ( హిరణ్యకశిపుడు ) నేడు నీచే హతము గావించబడినాడు. లోకోపద్రవ కారణమైన తేళ్ళు – పాముల యొక్క సంహారముచేత సజ్జనుడు ఆనందించునుగాక. లోకములు సుఖమును, ఆనందమును పొందినవై నీ యొుక్క క్రోధోపసంహారమును ఎదురుచూచుచున్నవి. ఓ నృసింహా ! జనులందరు భయ నివృత్తికై నీ రూపమును స్మరింతురు. ( 14 )

టీ :– తదితి. తత్తస్మాదేషాం భయపరిహారాయ. మన్యుం.యచ్ఛ ఉపసంహార, యదర్థే అయం సచాసురః సాధూనాం సంతోషార్థం అద్య పరం క్రోధేన కార్యభావాత్తం నియచ్ఛ. నను అన్యేషాం వధేన సాధుః కిం మోదేత? తత్రాహ – వృశ్చికాదేః పరోపకరదవ కారిణో న్యత ఏవ జాతయా హత్యా వధేన తృతీయార్థే ప్రథమా తస్యైతద్భద్రం జాతమితి సాధురపి మోదేతైవ. తర్హి బహూనాం సుఖావహత్వాదముం క్రోధం న త్యక్ష్యామీతి చేత్తత్రాహ – లోకాశ్చ నిర్వృతిం ఇతాః ప్రాప్తాస్సంతః. ప్రతియంతి క్రోధోపసంహారం ప్రతీక్షంతే. తర్హి జానానాం పునర్భయాభావాయ మన్యుం ధారయామీతి చేత్తత్రాహ – రూపమితి. విభయాయ భయ నివృత్త్యై. ఏతద్రూపస్మరణాదేవ భయనివృత్తేర్న మన్యుధారణేన

టీ :– తత్ = అందువలన ఈ బ్రహ్మాదులయొక్క భయమును పరిహరించుటకై కోపమును యచ్ఛ = ఉపసంహరించుకొనుము. ఎందుకొరకై ఈ కోపమును పొందితివో దానికి కారణభూతుడైన ఆ అసురుడు సజ్జనుల సంతోషము కొఱకు నేడు నీచే చంపబడినాడు. ఇక పై క్రోధముతో పని లేనందున దానిని విరమించుము. ఇతరులను సంహరించుటవలన సాధువులు సంతోషింతురా ఏమి? అనిన ఇట్లు చెప్పెను. ఇతర ప్రాణులనుండి పుట్టినట్టి, పరులకుపద్రవము కలిగించునట్టి, తేళ్ళు , పాములు మొదలైన వాటి సంహారము వలన అతనికే భద్రముకలిగెనని సాధువు కూడా ఆనందమును పొందునే కదా ! అటులైన చాలామందికి సుఖమును గూర్చుటవలన ఈ క్రోధమును వదలననిన అందుల కిట్లనెను. లోకములును, సంతోషమును ఇతాః = పొందినవై, ప్రతియంతి = క్రోధోప సంహారమును ఎదురుచూచుచున్నవి.

కృత్యమస్తీత్యర్థః. (14)

శ్లో ॥ నాహం బిభేమ్యజిత తేతి భయానకాస్య
జిహ్వార్క నేత్ర భ్రుకుటీ రభసోగ్ర దంష్ట్రాత్ ।
ఆంత్రస్రజః క్షతజ కేసర శంక కర్ణా
న్నిర్హ్రాద భీత దిగిభా దరిభిన్నఖాగ్రాత్ ॥ 15 ॥

టీ :- త్వం చేద్బిభేషి. తర్హి, త్యజామీతి చేత్తత్రాహ – నాహమితి. భో అజిత. తే అస్మాత్ రూపాత్. అహం న బిభేమి. కథంభూతాత్ ఆస్యం జిహ్వా చ అర్కసదృశనేత్రాణి చ . భ్రుకుటీనాం రభస ఆటోపశ్చ. ఉగ్రాః దంష్ట్రాశ్చ. ఏతాని అతిభయానకాని యస్మాన్ తస్మాత్. ఆంత్రమయ్యః స్రజో యస్మిన్ తత్ ఆంత్రసక్ తస్మాత్. క్షతజాక్తాః కేసరాః యస్మిన్ శంకువదున్నతౌ స్తద్ధౌ కర్ణౌ యస్మిన్. ఏవంభూతాదపి తే రూపాదహం న బిభేమి. (15)

అట్టియెడ మరల భయము లేకుండుటకై కోపమును కలిగియుండుననిన ఇట్లు చెప్పెను. ‘ రూపం ’ ఇత్యాదిగా. విభయాయ = భయనివృత్తికై, ఈ రూపము యొక్క స్మరణము వలననే భయనివృత్తి కలుగుటవలన మన్యువును కలిగియుండుట వలన ప్రయోజనం లేదని యర్థము. (14)

ఓ అజితా ! మిక్కిలి భయానకమైన ఆస్యము, జిహ్వ, సూర్య సదృశములైన నేత్రములు, కనుబొమల ఆటోపము, ఉగ్రమైన కోరలు గలదియు, ప్రేవులమాలలు రక్తముతో తడిసిన కేసరములు, శంకులవలె ఉన్నతము, స్తబ్దములైన కర్ణములు గలదియు, గర్జనచే భయపడెడు దిగ్గజములు గలదియు శత్రువులను భేదించు నఖాగ్రములు గలదియునగు నీ ఈ రూపమువలన నేను భయపడను. ( 15 )

టీ :- ఒకవేళ నీవు భయపడుతున్న క్రోధమును వదిలెదననిన ఇట్లు చెప్పుచున్నాడు. ‘నాహం ’ అని . ఓ అజితా ! నీ యీ రూపమునకు నేను భయపడుటలేదు. రూపమెట్టిదనిన ముఖము, నాలుక, సూర్యసదృశములైన నేత్రములు, కనుబొమలు ఆటోపము, భయంకరమైన కోరలు (దంతములు), ఇవి అతి భయానకమైనవి కలిగియున్నది. ఇంకను ప్రేవులమాలలు ధరించినట్టిది. రక్తముచే తడిసిన జూలు ( కేసరములు ) కలది. శంఖముల వలె ఉన్నతములైన, స్తబ్దములైన కర్ణములు గలది, గర్జనచే భయపడెడు

శ్లో ॥ త్రస్తోఽస్మ్యహం కృపణ వత్సల దుఃసహోగ్ర
సంసార చక్ర కదనాద్గ్రసతాం ప్రణీతః ।
బద్ధః స్వకర్మభి రుశత్తమ తేఽంఘ్రిమూలం
ప్రీతోఽపవర్గ శరణం హ్వయసే కదాను ॥ 6 ॥

టీ :- మహద్భయం త్వదన్యదస్తీత్యాహ - త్రస్తో స్మీతి. దుస్సహం యదుగ్రం సంసారచక్రే కదనం దుఃఖం. తస్మాదహం త్రస్తో స్మి. తత్ర చ గ్రసతాం హింస్రాణాం మధ్యే స్వకర్మభిర్బద్ధస్సన్ ప్రణీతః నిక్షిప్తో స్మి. హే కృపణ వత్సల. హే ఉశత్తమ కదా ను. త్వం ప్రీతస్సన్. అపవర్గరూపం శరణం తవాంఘ్రికమలం ప్రతిహ్వాయనే మామాహ్వాయసి. (16)

దిగ్గజములు గలది, శత్రుభేదకములైన నఖాగ్రములు గలది, ఆ నరసింహ రూపము. అట్టి రూపము వలన నేను భయపడను అని నరసింహునితో పల్కెను. ( 15 )

కృపణులయెడ వాత్సల్యము కలవాడా ! సహించశక్యముగాని ఉగ్రమైన సంసార చక్రమందలి దుఃఖమునకు నేను భయపడుచున్నాను. ఆ సంసార చక్రమందు హింసిచువారి మధ్య నా కర్మలచే బంధింపబడియున్నాను. ఓ ఉశత్తమా ! హరే ! నీవు నాపై ప్రసన్నమైన హృదయము కలవాడవై అపవర్గమునకు శరణమైన నీ పాదమూలమునకు ఎప్పుడు నన్ను పిలిచెదవో కదా ! ( 16 )

టీ :- మహాభయము వేరొకటియు కలదని పలికెను. ' త్రస్తోస్మి ' యని. ఏదైతే దుస్సహమైన, ఉగ్రమైన సంసార చక్రమందలి కదనం = దుఃఖము కలదో దానివలన (దానికి ) భయపడుచున్నాను. అందును మ్రింగెడు, హింసించెడు క్రూర ప్రాణులమధ్య నా కర్మలచే బంధించబడిన వాడనై ప్రణీతః = పెట్టబడినాను. ఓ దీనవత్సలా ! ఓ వుశత్తమా! నీవెప్పుడు ప్రీతుడవై అపవర్గ ( మోక్ష ) రూపమైన శరణమగు నీ పాదకమలమును గూర్చి హ్వయసే = నన్ను పిలిచెదవో కదా ! ( 16 )

శ్లో ॥ యస్మాత్ప్రియా ప్రియ వియోగ సయోగజన్మ
శోకాగ్నినా సకలయోనిషు దహ్యమానః ।
దుఃఖౌషధం తదపి దుఃఖ మతద్ధియాహం
భూమన్ భ్రమామి వదమేతం దాస్యయోగమ్॥17॥

టీ :- దాస్యేసతి. మత్ప్రీతిరితి చేత్ . తర్హి నానాయోనిషు క్లిశ్యమానస్య మను. దాస్యజ్ఞానాభావాత్. త్వమేవ తదుపదిశేతి ప్రార్థయతే - యస్మాదితి. యస్మాత్ ప్రియైరప్రియైశ్చ యథాసంఖ్యం వియోగసంయోగాభ్యాం జన్మ యస్య తేన శోకాగ్నినా. సకలయోనిషు దహ్యమానో స్మి. దుఃఖస్య ప్రతీకారః కార్య ఇతి చేత్తత్రాహ - దుఃఖస్యౌషధం ప్రతీకారః. తదిపి దుఃఖమేవ. ఏవమపి. అతద్ధియా దేహాద్యభిమానేన. ముహ్యామి అతః హే భూమన్ విభో, మే తవ దాస్యరూపం యోగం నిస్తారోపాయం వద. (17)

శ్లో ॥ సోహం ప్రియస్య సుహృదః పరదేవతాయా
లీలా కథాస్తవ నృసింహ విరించి గీతాః ।
అంజస్తితర్మ్యనుగృణన్ గుణ విప్రముక్తో
దుర్గాణితే పద యుగాలయ హంస సంగః ॥18॥

ఓ విభూ ! ఎందువలననైతే ప్రియాప్రియములతో సంయోగ వియోగములు కలుగుటవలన పుట్టెడు శోకాగ్నిచే అనేకయోనులందు పుట్టిన వాడనై దహించబడుచున్నాను. దుఃఖమునకు ఔషధము ( ప్రతీకారము) దుఃఖమే. ఐనను అసత్య బుద్ధిచే దేహాద్యభిమానముచే భ్రమించుచున్నాను. నాకు నీయొక్క దాస్యరూపమైన విస్తారోపాయమును తెలియజెప్పుము. (17 )

టీ :- దాస్యము కలిగిన నాకు ప్రీతి యనినచో అట్లైన అనేక జన్మలను పొంది బాధలనొందు నాకు దాస్యమును గూర్చిన జ్ఞానము లేనందున నీవే ఆ జ్ఞానము నుపదేశించుమని ప్రార్థించుచున్నాడు. ఎందువల్లననగా ప్రియులతో వియోగము, అప్రియులతో సంయోగముల వలన కలిగిన శోకాగ్నిచే సకల జన్మలలో దహింపజేయబడుచున్నాను. దుఃఖమునకు ప్రతీకారము గావించదగిన దనినచో అందులకు ఇట్లనెను. దుఃఖమునకు ఔషధం = ప్రతీకారము అదియును దుఃఖమే. ఇట్లైనను అసత్య బుద్ధిచే దేహాద్యభిమానముచే మోహమునొందుచున్నాను. కావు హే భూమన్ = ఓ విభో ! నాకు నీ దాస్యరూపమైన యోగం = నిస్తారోపాయమును చెప్పుము.(17)

ఓ నృసింహా ! అట్లు మోమమును పొందినట్టి నేను, నీ దాసుడనైన నేను నీ యొక్క పదయుగళమే నివాసముగల భక్తులైన జ్ఞానులయొక్క సహవాసముగలవాడనై ప్రియుడవు, స్నేహితుడవు, పరదేవతవునైన నీయొక్క

టీ :- నను దాస్యయోగే ప్రవృత్తస్యాపి. తదంతరాయభూతానాం పూర్వోక్తానాం నానాదుఃఖానాం కుతః పరిహారః? తత్రాహ - స ఇతి. సో హం త్వద్దాసస్సన్. భో నృసింహ, తవ లీలా కథా అను గృణన్. దుర్గాణి మహాదుఃఖాన్యంజసా తితర్మి తరామి న గణయిష్యామీత్యర్థః. తత్ర హేతుః - గుణైః రాగాదిభిః విశేషేణ ప్రయుక్తస్సన్ తత్కుతః? తే పదయుగమేవాలయో యేషాం భక్తానామతస్తఏవ హంసాః. జ్ఞానినః తైస్సంగో యస్య మమ సోహం కథం భూతస్య కథాస్త్రాహ - ప్రియస్యేత్యాది కుతో జ్ఞాతాః? విరించగీతాః విరించేన గీతాః తత్సంప్రదాయప్రవృత్తాః. తథా చాథర్వణీ శ్రుతిః. " దేవా హ వై ప్రజాపతిమబ్రువన్ని" త్యాది. దాస్యే ప్రశీత్తస్య భగవదనుగ్రహేణ సత్సంగః తతో వీతరాగతయా భగవద్గుణానువర్ణనం. తతశ్చ న దుఃఖాదిభిరభవస్యాదితివాక్యార్థః. (18)

విరించిగీతములైన కథలను సేవించుచు రాగాది గుణములనుండి ముక్తుడనై దుస్తరములైన మహాదుఃఖములను తత్వ జ్ఞానముచే దాటుదును. ( 18 )

టీ :- ఐనను దాస్య యోగముచే ప్రవర్తించినను అందులకంతరాయ రూపములైన పూర్వోక్తములైన దుఃఖములకు పరిహారమెట్లనిన ఇట్లనెను. అట్టి నేను ఓ నృసింహా! నీ దాసుడనై నీ లీలా కథలను సేవించుచు దాట శక్యము గాని మహాదుఃఖములను తత్వ జ్ఞానముచే తితిర్మి = దాటెదను. అనగా తత్వ జ్ఞానముచే ఆ దుఃఖములను లెక్కించనని అర్థము. అందుకు కారణము గుణైః = రాగద్వేషాది గుణములచే విశేషముగ వదలబడిన వాడనై, అది యెందులకు నీ పదయుగళమే ఆలయమైన భక్తులే హంసాః=జ్ఞానవంతులు వారితో సంగము గలనాకు, అట్టి నేను ఎటువంటి నీ కథలనుచోట ఇట్లనెను. 'ప్రియస్య' ఇత్యాదిగా. ఎట్లు కథలు తెలుసుకొనబడినవి. విరించిచే గానము చేయబడినవి, అనగా ఆతని సాంప్రదాయ ప్రవృత్తములు. ఈ విషయమున అధర్వణీయ శృతి "దేవతలు ప్రజాపతిని అడిగిరట" ఇత్యాది. దాస్యమున ప్రవర్తించిన వానికి నీ అనుగ్రహముచే సజ్జన సహవాసము. అందువలన రాగాదులు తొలగుటచే భగవంతుని గుణములను స్తుతించుటకు అటుపైన దుఃఖాభినయము కలుగదని వాక్యార్థము. ( 18 )

శ్లో ॥ బాలస్య నేహ శరణం పితరౌ నృసింహ
నార్తస్య చాగద ముదన్వతి మజ్జతోనౌః ।
తప్తస్య తత్ప్రతి విధిర్య ఇహాంజసేష్టః
తావద్విభో తనుభృతాం త్వదుపేక్షితానామ్ ॥19॥

ఓ నరసింహా ! బాలునకు తల్లిదండ్రులు రక్షకులు కారు. రోగపీడితునకు ఔషధసేవనమును ప్రతీకారము గాదు. సముద్రమున మునిగిపోవు వానికి నావ రక్షణ కాజాలదు. తపించు వానికి అందుకు ప్రతీకారముగ ఈ లోకమున యదార్ధజ్ఞానము ఇష్టమా? కానేకాదు. ఓ విభో ! ( సర్వసమర్ధా ! ) నీచే ఉపేక్షించ బడిన వారికి నీవే శరణము గాని అన్యము గాదు. ( 19 )

టీ :- నను దుఃఖైస్తప్తస్య తత్ప్రతీకారో లోకే ప్రసిద్ధ ఏవ. కిం మద్దాస్యాదినా? తత్రాహ – బాలస్యేతి. భో నృసింహ, తప్తస్య. తత్ప్రతివిధిః దుఃఖప్రతీకారః. ఇహ లోకే యోంజసా ఇష్టః సః త్వయోపేక్షితానాం తావదేవ క్షణమాత్ర మేవ న త్వాత్యంతికః. తదేవాహ – బాలస్య పితరౌ శరణం రక్షకౌ. ఇహ – న భవతః. తాభ్యాం పాల్యమానస్యాపి తస్య దుఃఖదర్శనాత్. క్వచిద్గర్తాదిషు తాభ్యామేవ తద్దదదర్శనాచ్చ. న చార్తస్య రోగిణః అగదమౌషధం శరణం. తయా సహ మజ్జనదర్శనాత్ . అతస్త్వమేవ శరణమిత్యర్ధః. అథ చైవం కాక్వా వ్యాఖ్యేయం తప్తస్య తత్ప్రతివిధిర్య ఇహ తావత్ప్రసిద్ధః. సత్త్వదుపేక్షితానాం కిం మంజసా ఇష్టః? అపి తు నేష్ట ఏవ. యద్వా – యస్తావదిహ ప్రతివిధిరిష్టః. స కిమంజసా? నైవ. అంజసేత్యాదియోజ్యం. బాలస్యేత్యాది పూర్వవదేవ. (19)

టీ :- దుఃఖములచే తపించువానికి అందుకు ప్రతీకారము లోకమున ప్రసిద్ధమే కదా! ఐనప్పుడు నా దాస్యాదులతో ఏమి పని అనిన ఇట్లనెను. ' బాలస్య ' అని. ఓ నృసింహా! తపించు వానికి తత్ప్రతి విధిః = దుఃఖ ప్రతీకారము ఈ లోకమున ఏ తత్వ జ్ఞానముచే ఇష్టమో అది నీచే ఉపేక్షించబడిన వారికి తావదేవ = క్షణ మాత్రమే. శాశ్వతము గాదు. దానినే చెప్పెను. బాలునకు తల్లిదండ్రులు శరణం = రక్షకులు గారు . వారిచే పాలించ బడుచున్నప్పటికిని ఆ బాలునకు దుఃఖములు గలుగుట అగుపడుచుండుటవలన, ఒకప్పుడు అజీగర్తుడు మొదలైన వారి విషయమున ఆ తల్లి దండ్రులవలననే వారి వధ అగుపడుచుండుట వలనను ( బాలునకు తలిదండ్రులు రక్షకులు కాజాలరు) ఆర్తుడైన రోగికి అగదం = ఔషధము శరణము గాదు. ఔషధము సేవించబడిననను మృత్యువు అగుపడుచుండుటవలన ఉదన్వతి = సముద్రమున మునిగిపోవు పురుషునకు నావ శరణము గాదు. ఆ నావతో బాటు మునుగుట అగుపడుట వలన కావున నీవే శరణము అని అర్థము. లేదా ఇట్లు నాకు స్వరముచే

శ్లో ॥ యస్మిన్యగతో యర్హియేనచ యస్య యస్మాత్
యస్మై యథా యదుత యస్త్వ పరః పరోవా ।
భావః కరోతి వికరోతి పృథక్స్వభావః
సంచోదిత స్తదఖిలం భవతః స్వరూపమ్ ॥ 20॥

టీ :- నను క్వచిత్ కుతశ్చిత్ రక్షకో పి దృశ్యత ఏవేత్యాశంక్య తత్రాపి తద్రూపేణ త్వమేవ రక్షక ఇత్యురరీకృత్య. తస్యైవ సర్వాత్మకతామాహ – యస్మిన్నితి. అపరో అర్వాచీనః పిత్రాదిః. పరో బ్రహ్మాదిర్వా. భావః కర్తా. తత్తత్కారకైః యద్యత్కరోతి. తత్సర్వం భవత ఏవ స్వరూపం. న తు పృథక్. యస్మిన్నధికరణే.

వ్యాఖ్యానించదగినది. తపించు వానికి అందుకు ప్రతీకారము ఏదైతే ఈ లోకమున ప్రసిద్ధమై యున్నదో ఆ ప్రతీకారము నీచే ఉపేక్షించబడిన వారికి తత్వ జ్ఞానముచే ఇష్టమా? కాని ఇష్టము కాదు గదా ! లేదా ఏవిధమైన ప్రతీకార మిచ్చుట ఇష్టమో అది తత్వ జ్ఞానము చేతనేనా ? తత్వ జ్ఞానముచే కానేకాదు. అని చెప్పబడినది. " బాలస్య " ఇత్యాదికము పూర్వము మాదిరిగానే. (19)

ఒకానొకప్పుడు, ఎందులకో. ఎవనిచేతనో, ఒకానొక సమయమున, ఒకానొకడు, ఒకానొకనికి, ఎప్పుడో , ఎట్లో, ఎవడో ఒకడు, తనవాడో, పరవాడో రక్షించువాడుగా అగుపడుచున్నాడు. కాని నీకంటే వేరుగాడు. వాని రూపమున రక్షించువాడవు నీవే. ఇచ్చట ఏఅధికరణమునందు, ఏ కారణము వలన, ఏ కాలమున, ఏ కారణముచే, ఎవనిచే ప్రేరేపించబడిన వాడై, ఎవనియొక్క, ఎవని వలన, ఎవని కొఱకు, దేనిని ఎవడు చేయునోయని ఇందు సప్త విభక్తులు చెప్పబడినవి. ( 20 )

టీ :- ఒకానొకప్పుడు, ఎందులకో, ఏదో కారణముచే, ఎప్పుడో ఒకప్పుడు, ఒకానొకడు రక్షకుడుగా అగుపడుచున్నాడు కదా ! యని శంకించి అచ్చటను ఆ రూపమున నీవే రక్షకుడవని అంగీకరించి అతనికే సర్వాత్మతను చెప్పెను. ' యస్మిన్ ' అని. అపరః=అర్వాచీనుడైన పిత్రాదికము. పరః = బ్రహ్మ మొదలగు వారైనను భావః= కర్తగా అయా ద్వితీయాది కారకములచే ఏదేది

యతో నిమిత్తాత్. యర్హి యస్మిన్ కాలే యేన కారణేన యేన హేతునాకర్త్రా సంచోదితశ్చ యస్య సంబంధి యస్మాదపాదానాత్. యస్మై సంప్రదానాయ యమీప్సితతమం యః కర్తేత్యేవం సప్త విభక్త్యర్థాః యథా యేన ప్రకారేణేతి క్రియావిశేషణభూతానామ వ్యయానామర్థః. పృథక్స్వభావః సత్త్వాదిప్రకృతిం. కరోతి ఉత్పాదయతి. వికరోతి రూపాంతరం నయతీతి. (20)

చేయునో అది యంతయు నీయొక్క స్వరూపమే. అందుకు భిన్నమైనది కాదు. దేనియందు ( అధికరణము ) ఎందువలన ( నిమిత్తము ) యర్హి = ఏ కాలమందు, ఏ కారణముచే ( కరణము ) ఎవనిచే ( హేతుకర్త )య ప్రేరేపించబడినవాడై, యెవనిది ( సంబంధి ) ఎవనివలననైతే ( అపాదానము ) ఎవనికొఱకు (సంప్రదానము ) దేనినైతే ( కర్మ ) ఎవడు ( కర్త ) ఇట్లు సప్త విభక్త్యర్థములు. యథా = ఏ ప్రకారముగ అని క్రియావిశేషణ రూపములైన అవ్యయములయొక్క అర్తము. పృధక్స్వభావః = సత్వము మొదలైన ప్రకృతి. కరోతి = పుట్టించుచున్నది. వికరోతి=రూపాంతరము నొందించును అని.(20)

శ్లో ॥ మాయా మనః సృజతి కర్మ మయం బలీయః
కాలేన చోదిత గుణానుమతేన పుంసః ।
ఛందో మయం యదజయాఽర్పిత షోడశారం
సంసార చక్ర మజకోఽతి తరే త్వదన్యః ॥ 21 ॥

నీ అంశయైన పురుషుని అనుమతిచే కాలముచే క్షోభితమైన గుణములు గల మాయాకర్మ మయమైన, దుర్జయమైన మనస్సును సృజించును. ఓ అజా! వేదోక్తకర్మయే ప్రధానముగాగల జీవుని అవిద్యచే అతని భోగమునకై అర్పించబడిన షోడశ వికారములుగల యే సంసార చక్రాత్మకమైన మనస్సు కలదో దానిని నీకంటే వేరొకడు ఇవరు జయించగలరు? ( 21 )

టీ :- అతో న్యస్య రక్షకస్యాభావాదసంసారిత్వాచ్చ నిత్యముక్తస్య మేవమాం శరణాగతం రక్షేతి ప్రార్థయతే - ద్వాభ్యాం. మాయేతి. త్వదంశస్య పుంసో నుమతేన ఈక్షణరూపేణ అనుగ్రహేణ. మనః ప్రధానం లింగం. మాయా సృజతి. కథంభూతా? కాలేన

టీ :- అందువలన వేరొక రక్షకుడు లేనందున నీవు అసంసారివైనందున నిత్యముక్తుడవైన నీవే శరణాగతుడవై నన్ను రక్షించుము. అని ప్రార్థించును. ‘ మాయా’ అని రెండు శ్లోకములచే. నీ అంశగల పురుషునిచే అనుమతేన = ఈక్షణరూపమైన అనుమతిచే ( అనుగ్రహముచే ) మనః = మనః ప్రధానమైన

చోదితాః క్షోభితాః గుణాః యస్యాః. కథంభూతం మనః? కర్మమయం కుర్వద్రూపం. బలీయః దుర్జయం, ఛందోమయం. వేదోక్తకర్మప్రధానం చ. అజయా జీవస్యావిద్యయా. తద్భోగార్థం అర్పితాః షోడశారాష్షోడశవికారాః యస్మిన్. యదేవం భూతం సంసారచక్రాత్మకం మనః తత్కో తితరేత్? భో అజ త్వదన్యః త్త్రతః పృథక్ స్థితః త్వామభజన్నిత్యర్థః. (21)

శ్లో ॥ సత్యంహి నిత్య విజితాత్మగుణః స్వధామ్నా
కాలో వశీకృత విస్రుజ్య విసర్గ శక్తిః ।
చక్రే విసృష్ట మజయేశ్వర షోడశారే
నిష్పీడ్యమాన ముపకర్ష విభో ప్రపన్నమ్ ॥ 22 ॥

టీ :- నను మమాపి మాయాసంబంధాత్ కర్తృత్వాద్యవిశేషాచ్చ త్వత్తః కో విశేష ఇత్యత ఆహ. - స ఇతి. స్వధామ్నా చిచ్ఛక్త్యా నిత్యం విజితాః ఆత్మనో బుద్ధేర్గుణా యేన స హి త్వం యతః కాలః మాయాప్రేరకః అతఏవ వశీకృతా విస్రుజ్యానాం కార్యాణాం

చిహ్నమును మాయ సృష్టించుచున్నది. మాయ వట్టిది. కాలముచే చోదితాః = క్షోభింపజేయబడిన గుణములు గలది. మనస్సెట్టిది? కర్మమయా = కుర్వద్రూపమైనది. బలీయః = జయింపశక్యము కానిది. ఛందోమయం = ఛందోమయమైన వేదమున చెప్పబడిన కర్మయే ప్రధానము కాగలదియు, అజయా = జీవుని యొక్క అజ్ఞానముచే అతని భోగమునకై అర్పించబడిన పదునారు అరాః = వికారములు కలది. ఏదైతే ఇట్టి సంసార చక్రాత్మకమైన మనస్సు కలదో దానిని ఎవరు అతిక్రమించగలరు? ఓ అజా ! త్వదన్యః = నీకంటే వేరైనవాడు లేడు. నిన్ను భజించకుండగ అని అర్థము. ( 21 )

చిచ్ఛక్తిచే నిత్యము సూచించబడిన బుద్ధి యొక్క గుణములు గల అట్టి నీవు మాయా ప్రేరకమైన కాలము గదా ! కావుననే కార్య కారణ శక్తి గలవాడవు. ఓ అజయేశ్వరా ! విభూ ! షోడశార చక్రమున త్రోయబడి ( చెరుకుగడ వలె) పీడింపబడు ( పిండబడు ) చున్నట్టి నిన్నే శరణముగా వేడుకొనెడు నన్ను నీ సమీపమునకు చేర్చుకొనుము. ( 22 )

టీ :- ఓయీ నాకు గూడా మాయా సంబంధముండుట వలన, కర్తృత్వాదులందు విశేషము లేకుండుట వలనను నీకంటే విశేషమేమి? అని పలికెను. ‘ సః ’ అని. స్వధామ్నా=చిచ్ఛక్తితో నిత్యము జయించబడిన ఆత్మనః = బుద్ధియొక్క గుణములు గలవాడవు గదా ! ఎందువల్లనగా కాలః = మాయా ప్రేరకుడవో, అందువలననే వశము గావించుకొనబడిన విస్రుజ్యానాం =

విసర్గాణాం సాధనానాం చ శక్తిర్యేన అతః ఇక్షుదండవన్నిష్పీడ్య మానం మాం ఉపకర్షస్వ సమీపం నయ. (22)

కార్యములయొక్క , విసర్గాణాం = సాధనముల యొక్కయు శక్తులు గల నీచే (సంసార చక్రమున పడద్రోయబడిన నన్ను ) అందువలన చెఱకు గడవలె పీడించబడు నన్ను ఉపకర్ష = నీ సమీపమునకు చేర్చుకొనుము. ( 22 )

శ్లో ॥ దృష్టా మయా దివి విభోఽఖిల ధిష్ణ్య పానా
మాయుః శ్రియో విభవ ఇచ్ఛతి యాం జనోఽయం
యేఽస్మత్పితుః కుపితహాస విజృంభిత భ్రూ
విస్ఫూర్జితేన లులితాః స తు తే నిరస్తః ॥ 23 ॥

ఓ విభూ ! స్వర్గమున అఖిలదేవతలు ఏ విధమైన అయువు, సంపదలు, వైభవములను పొందిరో జనము దేనిని కోరెదరో అట్టి భోగము లన్నింటిని చూచితిని. ( అన్నియు తుచ్ఛములే ). మా తండ్రి గారు కల్గిన భోగభాగ్యము లన్నియు కోపించిన నీ యొక్క హాస , వికృత భ్రూభంగ విస్ఫూర్జిత మాత్రమున నశింపజేయబడినది. (23)

టీ :- నను లోకపాలానాం భోగాన్ భుంక్ష్వ పిత్ర్యం రాజ్య మిదం దాస్యామి తత్ కిమితి సంసారాదుద్విజసే? తత్రాహ - త్రిభిః. దృష్టా ఇతి శ్రియః సంపదః. విభవః ఉద్భవః. ఆయు రాదయో దృష్టా ఇతి కాక్వా తేషాం తుచ్ఛత్వముక్తం తదేవాహ - యే అస్మత్పితుః కోపహాసవిజృంభిత భ్రూభంగమాత్రేణ విధ్వస్తాః స చ త్వయా నిరస్తః. (23)

టీ :- ఓయీ లోకపాలుర భోగములను అనుభవించుము. లేదా నీ పితృసంబంధమైన రాజ్యమును ఇదుగో ఇవ్వగలను. సంసారమువలన ఎందులకు భయపడుచున్నావు? అచ్చట ఇట్లనెను. ‘ దృష్టా ’ ఇత్యాది మూడు శ్లోకములతో. శ్రియః = సంపదలు. విభవః = ఉద్భవము. ఆయువు మొదలైనవి చూడబడినవి. అని కాకకు స్వరముచే వాని యొక్క తుచ్ఛత్వము చెప్పబడినది. దానినే ఇట్లు చెప్పెను. మా తండ్రియొక్క ఏ సంపదలైతే కలవో అవి అన్నియు నీ యొక్క కోపముతో హాసముతో గూడిన వికృతమైన భ్రూభంగము చేతనే నశింపజేయబడినవి. అతడును నీచే అంతమొందించబడినాడు. (23)

శ్లో ॥ తస్మాదమూస్తనుభృతా మహమాశిశోజ్ఞ
ఆయుః శ్రియం విభవమైంద్రియ మావిరించాత్
నేచ్ఛామితే విలులితా నురు విక్రమేణ
కాలాత్మనోపనయ మాం నిజభృత్య పార్శ్వమ్
॥24॥

టీ :- యస్మాదేవం. తస్మాదితి. తస్మాత్ ఆశిషః భోగాన్ జ్ఞః తత్పరిపాకవిత్ అహం ఐంద్రియం ఇంద్రియైర్భోగ్యం బ్రహ్మణో భోగమభివ్యాప్య కిమపినేచ్ఛామి తే కాలాత్మనా ఉరువిక్రమేణ విలులితాన్ విధ్వస్తాన్ అణిమాదీనపి. (24)

అందు వలన బ్రహ్మ మొదలు శరీరధారులయొక్క భోగములను, జ్ఞానమును, ఆయువును, సంపదలను, వైభవములను, ఇంద్రియములచే అనుభవించదగిన సుఖములను కాలాత్ముడవైన నీ విక్రమముచే నశింపజేయబడువానిగా ఎంచుచున్నాను. కాన వానిలో దేనిని గూడా నేను కోరుకొనుటలేదు. నన్ను నీ భృత్యుల ప్రక్కన చేర్చుకొనుము. ( 24 )

టీ :- ఎందువల్లనైతే సంపదలు భోగభాగ్యము లిట్లు అనిత్యములో అందువలన ఆశిషః=భోగములను, జ్ఞః = తత్పరిపాకమును, ఎరింగిన నేను ఐంద్రియం = ఇంద్రియ ములచే అనుభవించదగిన బ్రహ్మయొక్క భోగములు మొదలుకొని వేనిని కూడా కోరుటలేదు. కాలాత్ముడవైన నీ విక్రమముచే, విలులితాన్ = విచ్ఛిన్నము చేయబడిన అణిమాది సిద్ధులను గూడా ( ఇచ్ఛగించను ). (24)

శ్లో ॥ కుత్రాశిషః శ్రుతి సుఖా మృగతృష్ణి రూపాః
క్వేదం కలేవర మశేషరుజాం విరోహః ।
నిర్విద్యతే నతుజనో యదసీతి విద్వాన్
కామానలం మధులవైః శమయందురాపైః ॥ 25॥

శ్రవణపేయములును, ఎండమావుల రూపములును ఐన (ఆశిషః) భోగములు ఎక్కడ? సమస్తరోగములకు ఉద్భవ స్థానమైన ఈ కలేవరమెక్కడ? ఐనప్పటికిని ఇట్టి విషయము నెఱింగియు జనము కామాగ్నిని మధుతుల్యములైన పొందశక్యము గాని సుఖలేశములచే శమింపజేయుచు విరక్తిని పొందుటలేదు. (25)

టీ :- కించ వర్తమానకాలే పి న భోగార్హా ఇత్యాహ - కుత్రేతి. శ్రుతిః శ్రవణం తదేవ సుఖం యాసు తాః మృగతృష్ణికావన్మిథ్యా భూతాశ్చాశిషః క్వ ! అశేషాణాం రుజాం రోగాణాం విరోహం ఉద్భవస్థానం క్వచేదం కలేబరం? ఏవం చేత్ సర్వో పి జనః కిం న విరజ్యతే? తత్రాహ - యదపి ఇతి ఏవం విద్వానయం జనస్తథాపి న నిర్విద్యతే విరక్తో న భవతి. కుతః? కామ ఏవానలః తం మధుంతుల్యైః సుఖలవైః దుస్సాధైరపి శమయన్ కామాగ్నిశమనవ్యగ్రస్య నిర్వేదే ప్యవకాశో నాస్తీత్యర్థః. యద్వా అచింత్యమిదం త్వన్మాయాచేష్టితమితి భావః. (25)

టీ :- ఇంతేగాక వర్తకాలమందును భోగార్హములు గావు. అని చెప్పెను. 'కుత్ర' ఇతి. శ్రుతిః = శ్రవణము అదియే సుఖము గాగలది. ఎండమావి వలె మిథ్యాభూతములైన భోగములెక్కడ? అశేషములైన రుజాం = రోగములకు విరోహః = ఉద్భవస్థానమైన ఈ శరీరమెక్కడ? ఇట్లైన సమస్త జనము ఎందుకు వైరాగ్యము పొందుటలేదనిన ఇట్లనెను. యదపి = ఐనప్పటికిని ఈ విధముగా ఎఱింగినప్పటికి ఈజనము న నిర్విద్యతే=విముక్తి పొందుటలేదు. ఎందులకు? కోరికయను అగ్నిని మధుతుల్యములైన స్వల్ప సుఖముల చేతను శమింపజేయు చున్నవాడై (వైరాగ్యము నొందుటలేదు) . కామాగ్నిని శమింపజేయు కార్యమున వ్యగ్రుడైన వానికి నిర్వేదమును పొందే అవకాశము లేదని యర్థము. లేదా నీ మాయా చేష్టలు ఊహించరానివని భావము. (25 )

శ్లో ॥ క్వాహం రజః ప్రభవ ఈశ తమోధికేఽస్మిన్
జాతః సురేతరకులే కవతవాను కంపా ।
న బ్రాహ్మణో న తు భవస్య న వైర మాయా
యన్మేర్పితః శిరసి పద్మకరః ప్రసాదః ॥ 26 ॥

ఓ ఈశా ! రజోగుణముచే పుట్టిన నేనెక్కడ? తమోగుణ భూయిష్ఠమైన సురేతర కులమున = అసురకులమున పుట్టితిని. నీ దయ ఎక్కడ? పద్మమువలె సకల సంతాపహరమైన నీ కరము బ్రహ్మయొక్క శిరమున గానీ, శివుని శిరమున గానీ, రమా శిరమున గానీ అర్పించబడలేదు ( ఉంచబడలేదు ). అనుగ్రహ రూపమైన అట్టి నీ కరము నా శిరమున నుంచబడినది. ( 26 )

టీ :- తర్హి త్వం కథం నిర్విణ్ణో పి మయి ప్రవృత్తయా త్వత్కృపయైవేత్యాశయేనాహ - క్వేతి. రజసైవ ప్రభవో జన్మ యస్య సః

టీ :- అట్లైన నీవెట్లు విరాగివైతివి? అనర్హుడనైనను నాయందు ప్రవర్తింపజేయ బడిన నీ కృప చేతనే ( విరక్తుడనైతిని ) అను ఆశయముచే యని చెప్పెను.

సప్తమ్యంతం వా కుతవిశేషణం. తమో ధికం యస్మిన్ తస్మిన్ సురేతరాణాం అసురాణాం కుతే జాతో హం క్వ చ తవానుకంపా? తామేవాహ – బ్రహ్మాదీనాం శిరసి యో నైవర్పితః సః పద్మవత్సకల సంతాపహరః కరః ప్రసాదః పురుషార్థరూపో మే శిరస్యర్పిత ఇతి యత్ యయానుకంపయేతి వా. (26)

శ్లో ॥ నైషాపరావరమతిర్భవతో ననుస్యా
జ్జన్తోర్యథాత్మ సుహృదో జగస్తథాపి ।
సంసేవయా సురతరోరివ తే ప్రసాదః
సేవానురూపముదయో న పరావరత్వమ్ ॥ 27॥

టీ :– ఇదానీం న చ త్వయీదమతివిచిత్రమిత్యాహ – నైషేతి. ఏతే బ్రహ్మాదయ ఉత్తమాః అయమసురో నీచ ఇత్యేషా పరావరమతిః జంతోః ప్రాకృతస్య యథా తథా భవతో నైవ

' క్వ ' యని. రజోగుణము చేతనే పుట్టుకగల నేను లేదా రజః ప్రబవే యని సప్తమ్యంతముగా ఇది కులవిశేషణమైనను గావచ్చును. తమోగుణాధికముగల (అజ్ఞాన బహులమైన) అసురుల కులమున పుట్టిన నేనెక్కడ? నీ అనుగ్రహమెక్కడ? దానినే ఇట్లు చెప్పెను. బ్రహ్మాదుల శిరమున ఏ కరము అర్పించబడలేదో అట్టి పద్మమువలె సకల సంతాపహరమైన నీకరః=పురుషార్థ రూప అనుగ్రమ ప్రదమైన కరము నా శిరమున అర్పించబడిన దనుట యేదో. అట్టి ఇది యద్ = ఏ నీ అనుగ్రహముచేతనే అని గానీ.(26)

ప్రాకృత జన్మమునకు వలె వీడు నావాడు. వీడు పరవాడు అనెడు స్వ పర భేద బుద్ధి నీకు లేదు గాక. ఎందులకనగా జగమునకు నీకు, మిత్రునకు నీకు భేదములేదు. ఐనప్పటికిని సేవ ననుసరించి నీ అనుగ్రహము కలుగుచున్నది. అచ్చట సేవాను రూపముగా తత్తదిచ్ఛాను గుణముగా ధర్మాధికములు కలుగుచున్నవి. ఎట్లైతే సురతరువును ఏ కోరికతో సేవించిన అట్టి ఫలమే కలుగునో అట్లే నీ సేవయు అంతే గాని హెచ్చుతగ్గులుండవు కదా! ( 27 )

టీ :– ఇది నీ బుద్ధియొక్క విచిత్రము గాదు అని ఇట్లనెను. ' నైషా ' యని. ఈ బ్రహ్మాదులు ఉత్తములు. ఈ (నేను) అసురుడు, నీచుడు అనెడు ఈ శ్రేష్ఠుడు ,నీచుడనెడు బుద్ధి ప్రాకృతజనునకు వలె నీకు అస్సలు ఉండదు.

స్యాత్. అత్ర హేతుః జగతః ఆత్మనః సుహృదశ్చ తర్హి సర్వత్ర మత్ప్రసాదః ఏకరూపః కి న స్యాత్? తత్రాహ సంసేవయా తవ ప్రసాదో భవతి తత్ర చ సేవానురూపం తత్తదిచ్ఛానుసారేణ ధర్మాదీనాముదయో భవతి ఏవం ప్రసాదవైచిత్ర్యే సత్యపి వైషమ్యాభావే దృష్టాంతః. సురతరుర్యథా సేవకస్య సంకల్పానుసారేణ ఫలం దదాతి న చ విషమస్తద్వత్ న పరావరత్వం అత్ర కారణమితి శేషః. (27)

ఇందుకు కారణము జగమునకు ఆత్మీయుడవు మిత్రుడవు అట్టి నీకు అట్లైన సర్వత్ర ఈ రూపమైన నా అనుగ్రహము కలుగుట లేదు కదా ! యనిన ఇట్లు చెప్పెను. చక్కని సేవచే నీ అనుగ్రహము కలుగుచున్నది. అందుకు సేవానుగుణముగా వారి వారి కోరిక ననుసరించి ధర్మార్థ కామమోక్షములు కలుగును. ఇట్లైనప్పటికిని వైషమ్యము (భేదభావము) లేకుండుట విషయమున దృష్టాంతమును చూపుచున్నాడు. ఎట్లైతే కల్ప వృక్షము సేవించు వానికి సంకల్పానుసారముగనే ఫలము నిచ్చుచున్నది. భేద భావమున ఇచ్చుట లేదు. అట్లే ఇచ్చుట శ్రేష్ఠాశ్రేష్ఠములు కారనము కాదని శేషము. ( కూర్చబడినది). (27)

శ్లో ॥ ఏవం జనం నిపతితం ప్రభవాహి కూపే
కామాభి కామమను యః ప్రపతన్ ప్రసంగాత్ ।
కృత్వాత్మసా త్సురర్షిణా భగవన్ గృహీతః
సోహం కథం ను విసృజే తవ భృత్య సేవామ్॥28॥

ఓ భగవాన్ ! దేవర్షియైన నారదునిచే ( పూర్వము ) ఆత్మ సదృషునిగా జేసి అనుగ్రహించబడితిని. అట్టి నేను నీ భృత్యు సేవను ఎట్లు పరిత్యజింతును. ( 28)

టీ :- ఏతచ్చ త్వభ్భృత్య కృపయా మయా ప్రాప్తమితి త్వభ్భృత్య పార్శ్వమేవ మాం నయేత్యాశయేనాహ - ఏవమితి. యథా త్వయానుకంపితో స్మి ఏవం నారదేన ఆత్మసాత్కృత్వా పూర్వమను గృహీతః సోహం కథం ను త్వభ్భ ృత్యసేవాం విసృజామి? కథంభూతో నుగృహీతోస్మి ప్రభవ ఏవ అహిస్తేన యుక్తః కూపః

టీ :- ఇదియు నీకు గల భృత్యులందలి కృపచే నాచే పొందబడినది. అని నీ భృత్యుల ప్రక్కనే నన్ను చేర్చుకొనుము అను ఆశయముచే చెప్పెను. ‘ ఏవం ’ అని. ఎట్లైతే నీచే అనుగ్రహించబడితినో అట్లే నారదునిచే ఆత్మ సదృశునిగా జేసుకొని పూర్వమనుగ్రహించబడిన నేను ఎట్లు నీ భృత్య సేవను వదిలి పెట్టెదను? ఎట్లు అనుగ్రహించబడితిని. సంసారమనే సర్పయుక్త కూపము,

తస్మిన్ కామానభితః కామయమానం జనం పతితమను తత్ప్రసంగాత్ ప్రపతన్యో హం తదేవం త్వభ్భృత్యస్య శ్రీనారద స్యానుగ్రహేణ త్వయాత్యంతమనుకంపితోస్మి అయమేవ చ మమ పరమో నుగ్రహః న పునరిదమతితుచ్ఛం మత్ప్రాణ రక్షణాది. (28)

అందు కోర్కెలన్నింటా వ్యాప్తుడై కోరికలు కోరుచు పడెడు జనము ననుసరించి వారి సహవాసమున ఆ సంసార కూపమున బడెడు ఏ నేనైతే కలనో అట్టి నేను నీ భృత్యుడగు నారదుని అనుగ్రహమున నీచే మిక్కిలి అనుగ్రహించ బడితిని. ఇదియే పరమానుగ్రహము. అంతే కానీ అతి తుచ్ఛమైన నా యీ ప్రాణరక్షణాదికము అనుగ్రహము కాదు. (28 )

శ్లో ॥ మత్ప్రాణ రక్షణ మనంత పితుర్వధశ్చ
మన్యే స్వభృత్య ఋషి వాక్య మృతం విధాతుమ్।
ఖడ్గం ప్రగృహ్య యదవోచ దస ద్విధిత్సు
స్త్వామీశ్వరో మదపరోవతు కం హరామి ॥29॥

ఓ అనంతా ! నా ప్రాణ రక్షణము, నా తండ్రి వధయు నీ భృత్యుడైన నారదమహర్షి యొక్క వాక్యమును సత్యము గావించుటకే యని తలంతును. ఖడ్గమును గ్రహించి మా తండ్రి ' నేను గాక మరొకడెవడు ఈశ్వరుడు ఎవనిని రక్షించునో రక్షించుగాక. ఇదిగో నీ శిరమును ఖండింతును. ' అని పలికిన అట్టి మాటలను అసత్యము గావించుటకును నీవు నన్ను రక్షించితివని భావింతును. (29 )

టీ :- న చేదం త్వయా మదనుగ్రహార్థం కృతం కిం త్వన్యార్థ మిత్యాహ - మదితి. భో అనంత యదేతన్మత్ప్రాణరక్షణం మాం హంతుముద్యతస్య మత్పితుర్వధశ్చ తదుభయం స్వభృత్య ఋషివాక్య మృతం విధాతుమిత్యహం మన్యే. కుతః? యద్యస్మాత్ ఆసత్ అయుక్తం విధిత్సుః ఖడ్గం ప్రగృహ్యావోచత్ కిం మదపరో మద్వ్యతిరిక్తశ్చేదీశ్వరో స్తి తర్హి త్వామిదానీమవతు తవ కం శిరో

టీ :- ఇదియును నీచే నా అనుగ్రహము కొఱకై చేయబడలేదు. కానీ ఇతరుల కొఱకే యని చెప్పెను. ఓ అనంతా ! ఏదైతే యీ నా ప్రాణ రక్షణము, నన్ను చంపుటకుద్యమించిన నా తండ్రియొక్క వధయు అను నీ రెండును తన భృత్యుడైన నారదమహర్షి వచనమును ఋతం = సత్యమును గావించుటకని నేను తలంచుచున్నాను. ఎందులకనగా అయుక్తమైన పనిని గావించ గోరుచు కత్తిచేతబూని ( మాతండ్రి ) పలికెను. ఏమి? మదపరః = నాకంటే వేరుగా

హం హరామీతి పాఠాంతరే త్వయమేవార్థః. యద్యదాఅవోచత్ తదా యత్ర్పాణరక్షణమితి వాన్వయః, ఏతచ్చ సత్యం విధాతుం నిజభృత్యభాషితమిత్యత్రైవ బహుధా వ్యాఖ్యాతం. (29)

ఈశ్వరుడున్నట్లైన నిన్నిపుడు కాపాడుగాక. నీయొక్క కం = శిరమును నేను ఖండించుచున్నాను. అని. పాఠాంతరమునందును ఇదే అర్థము. ఏదైతే మాటను ఎప్పుడు ( అతడు ) పల్కెనో నీ ప్రాణరక్షణము ( గావించబడెను ) అని అన్వయము. ఇదియు " సత్యం విధాతుం నిజ భృత్య భూషితమం " అను చోటనే చాలా వ్యాఖ్యానించబడినది. (29)

శ్లో ॥ హేకస్త్వమేవ జగదేత దముష్య యత్వ
మాద్యంతయోః పృథగవస్యసి మధ్యతశ్చ ।
సృష్ట్వా గుణవ్యతికరం నిజమాయ యేదం
నానేవత్తై రవసిత స్తదను ప్రవిష్టః ॥ 30 ॥

ఈ జగము నంతయు నీవే ఒక్కడవే. దీని ఆద్యంతము లందును మధ్యయందును నీవే నిలిచి యున్నావు. నీ మాయచే గుణ పరిణామాత్మకమైన ఈ జగమును సృష్టించి అందు ప్రవేశించి భిన్న విభిన్న వ్యక్తులవలె నీవొక్కడవే రక్షకుడుగా భాసించుచున్నావు.(30)

టీ :- న చేదం పక్షపాతేన రక్షణం దైత్యహననం చ త్వయి స్వాభావికం కింతు మాయాగుణోపాధికం సర్వాత్మకే త్వయి స్వతస్తదయోగాదిత్యాహ - ఏక ఇతి. ఏతజ్జగత్ త్వమేవైకః యద్యతః ఆయుష్యాదావంతే చ పృథగవస్యపి . పృథగవ్యస్యసి విరామం కరిష్యసి సన్మాత్రతయాకారణత్వేనావధిత్వేన వా వర్తస ఇత్యర్థః అతో మధ్యతశ్చ త్వమేవ కుతస్తర్హి భేదప్రతీతిస్తత్రాహ - నిజమాయయా గుణపరిణామాత్మకమిదం జగత్ సృష్ట్వా తదను ప్రవిష్టస్త్వం తైర్గుణైర్వ్తైతుభూతైర్నానేవ స్రష్టేన రక్షక ఇవ హంతేవ

టీ :- పక్షపాతముతో ఈ రక్షణము, దైత్య ( హిరణ్యకశిపుడు ) హననమును నీయందు స్వాభావికము గాదు. కాని మాయా గుణముయొక్క ఉపాధివలన కలిగినది. సర్వాత్ముడవైన నీయందు స్వతః సిద్ధముగా అది యుక్తముగాదు. అని ఇట్లు చెప్పెను. ' ఏకః ' ఇత్యాదిగా. ఈ జగత్తు నీవొక్కడవే ( నీవే ఈ ప్రపంచము) యద్ = ఎందువలన ఈ జగముయొక్క ఆదియందు అంతమునందును భిన్నమైన రూపము గలవాడవై రక్షింతువు. నశింపజేతువు. సన్మాత్రముగా కారణరూపముగా అవధిరూపముగా నుందువని అర్థము. అందువలన మధ్యయందును నీవే. అట్లైన ఈ భేద ప్రతీతి ఎందులకనిన

చివసితః ప్రతీతః తదుక్తం స్కంధోపక్రమే. శ్లో. "నిర్గుణో పి హ్యజో వ్యక్తో భగవాన్ ప్రకృతేః పరః, స్వమాయాగుణమావిశ్య బాధ్యబాధకతాం గత" ఇత్యాది. (30)

ఇట్లు చెప్పెను. స్వకీయమైన గుణ పరిణామాత్మకమైన ఈ జగత్తును సృజించి అందు ప్రవేశించిన నీవు హేతురూపములైన ఆ గుణములచే వేరు వేరు వ్యక్తులవలె రక్షకునివలె, హంతకునివలెను భాసించుచున్నావు. ( అంతే కానీ అది నిజము కాదు ) అదియే స్కంధపురాణోపక్రమమందు ఇట్లు చెప్పబడినది. " భగవంతుడు నిర్గుణుడు, జన్మరహితుడైనను అవ్యక్తుడు. ప్రకృతికంటె భిన్నమైన వాడైనను తనచే సృష్టించబడిన మాయా గుణమును ప్రవేశించి బాధ్యుడుగానూ, బాధకుడుగానూ అగుచున్నాడు. " ఇత్యాదిగా. ( 30 )

శ్లో ॥ త్వం వా ఇదం సదసదీశ భవాంస్తతోఽన్యో
మాయా యదాత్మ పరబుద్ధిరియం హ్యపార్థా ।
యద్యస్య జన్మనిధనం స్థితి రక్షణంచ
తద్వై తదేవ వసుకాలవ దష్టి తర్వోః ॥ 31 ॥

నీవే ఈ కార్యకారణమైన జగత్తు, నీకంటే భిన్నము గాదు. ఓ ఈశా! నీవేమో దానికంటే భిన్నమైన వాడవు. ఎందువల్లననగా ఇతడాత్మీయుడు, ఇతడు పరుడు, అను ఈబుద్ధి అపార్థమైన ఈ మాయయే. ఎందులకనిన ఎవని జన్మము, ఈక్షణము, స్థితి, మరణమును మాయయే. బీజము – తరువుల కార్యకారణ భావమును వసు – కాలమాత్రమే. ( 31 )

టీ :– నను యద్యేతజ్జగదహనమేవ తర్హి జగతో వైషమ్యేణ మమ వైషమ్యమపి కిం న స్యాదిత్యత ఆహ – త్వమితి. త్వం వా త్వమేవేదం సదసత్ కార్యకారణాత్మకం జగత్ న త్వత్తః పృథక్ భవాంస్తు తతోన్యః ఆద్యంతయోః పృథగవస్థానాత్ యత్ యస్మాదేవం అతో యమాత్మీయోయం పర ఇతి యా బుద్ధిః సా

టీ :– ఓయీ ఒకవేళ ఈ జగత్తు నేనే ఐనప్పుడు జగత్తునకు వైశమ్యముండుటచే నాకుగూడా వైషమ్యమెందులకు కలుగదనిన ఇట్లు చెప్పెను. త్వంవై = నీవే ఈ సదసత్=కార్యకారణాత్మకమైన జగత్తుకంటే భిన్నమైనవాడవు. సృష్టియొక్క ఆద్యంతములందు వేరువేరుగ నుండుటవలన, యత్ = ఎందువలన ఇట్లు ఇతడు ఆత్మీయుడు, ఇతడు పరుడనెడు ఏ బుద్ధిగలదో అది అసత్యము

అపార్థా మాయైవ కార్యకారణయోః పరమకారణాభేదం దృష్టాంతేన సాధయతి – యద్యతః యస్య జన్మ ఈక్షణం ప్రకాశశ్చ యస్మిన్నిధనం చ స్థితిశ్చ తద్వై తదేవ వసుకాలవదష్టితర్వోః అష్టిర్బీజం కారణం తరుః కార్యం తయోర్యథా వసుకాలమాత్రత్వం. అయమర్థః. కాలశబ్దేన నీలత్వాద్యసాధారణగుణయోగాత్ పృథ్వీ వసుశబ్దేన వస్తుమాత్రం భూతసూక్ష్మం రసాది జలం వా తత్ర తరౌ యథా పృథ్వీమయబీజ జలమాత్రత్వం తస్య చ భూతసూక్ష్మమాత్రత్వం ఏవం సర్వమపి కార్మకారణాత్వకం జగత్ పరమకారణాత్మకమేవేతి. తథా చ పారమర్షం సూత్రం. – "తదనన్యత్వమారంభణశబ్దాదిభ్య" ఇతి. శ్రుతిశ్చ. "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమి"తి. (31)

మాయయే. కార్యకారణ భేదమును దృష్టాంతముచే సాధించుచున్నాడు. యత్ = ఎందువలన ఎవని జన్మము ఈక్షణం = ప్రకాశమును, దేనియందైతే మరణము – స్థితియు తద్వై=అదియే నిజము. అష్టిః = బీజము, కారణము. తరువు = వృక్షము కార్యము వానికి ఎట్లు వసుకాల మాత్రత్వము కలదో అట్లే, ఇది దీని అర్థము. కాలశబ్దముచే నీలత్వాది అసాధారణ గుణయోగమువలన పృథ్వీ, వసుశబ్దముచే వస్తుమాత్రమైన భూత సూక్ష్మము. అందు తరువునకెట్లైతే పృథ్వీమయమైన బీజమాత్రత్వము. ఇట్లు కార్యకారణాత్మకమైన సకల జగము పరమ కారణాత్మకమేయని. అదియే పారమర్ష సూత్రము. " ఆ అనన్యత్వము ఆరంభణ శబ్దాదులవలన " అని. శ్రుతియు – " వాచారంభణము వికారరూపము నామధేయము. మృత్తికా యను నదియే సత్యము అని. (31)

శ్లో ॥ న్యస్యేదమాత్మని జగద్విలయాంబు మధ్యే
శేషేత్మనా నిజసుఖానుభవో నిరీహః ।
యోగేన మీలిత దృగాత్మ నిపీత నిద్ర
స్తుర్యే స్థితోన తు తమో న గుణాంశ్చ యుంక్షే॥32

ఈ జగత్తును ఆత్మచేతనే ( నీ చేతనే ) నీయందు ఉంచుకొని నీ సుఖమునే అనుభవించుచు నిష్క్రియుడవు, నిరీహుడవై ప్రళయోదకముయొక్క మధ్యలో నిదురించుచున్నావు. యోగముచే కనులు మూసుకొన్న వాడవై నీ యొక్క స్వరూప ప్రకాశముచే నిపీతమైన నిద్రగలవాడవై జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు భిన్నమైన చతుర్థావస్థయందున్న వాడవైతివి. అంతేకానీ

నిదురించిన వానివలె తమస్సును కూర్చుటలేదు. లేదా గుణములను గానీ కూర్చుటలేదు. ( 32 )

టీ :- తత్ర తావదంతే పృథగవస్థానం దర్శయతి. - న్యస్యేతి. ఇదం జగత్. ఆత్మన్యేవ నిక్షిప్య స్వసుఖమేవానుభవో యస్య. నిష్క్రియస్సన్ ప్రలయోదకమధ్యే. శయనం కరోషి తర్హి కిం జీవస్యేవ మమాపి తమోవృత్తిరూపానిద్రాస్తి న హి. యోగ ఏవ తు బహిర్వృత్త్యభావసామ్యాత్ నిద్రోచ్యత ఇత్యాహ - యోగేన మీలితే దృశౌ యేన ఆత్మనా స్వరూపప్రకాశేన నిపీతా నిద్రా యేన యతః. తుర్యే అవస్థాత్రయాతిరిక్తే స్వరూపే స్థితస్త్వం న తు సుప్త ఇవాత్మని తమో యుంక్షే న యోజయసి న పశ్యసి జాగ్రత్స్వప్నయరివ గుణాన్ విషయాంశ్చేత్యర్థః. (32)

టీ :- అక్కడనైతే అంతమునందు వేరుగా నుండుటను చూపుచున్నాడు. 'న్యస్యేదం' అని. ఈ జగత్తును నీచే నీయందే నీయందే నిలుపుకొని నీ సుఖమునే అనుభవించుచు నిష్క్రియుడవై ప్రళయజల మధ్యమున శయనించుచున్నావు. అట్లైన నాకుగూడా జీవునకు వలె తమోవృత్తి రూపమైన నిద్ర కలదా? లేదులేదు. కానీ యోగమే బహిఃప్రవృత్తి లేకుండుట యను సామ్యముచే నిద్రయని చెప్పబడుచున్నది యని పలికెను. యోగముచే మూయబడిన కన్నులు ఆత్మ స్వరూప ప్రకాశముచే త్రావబడిన నిద్రగలనీవు, ఎందువల్లనైతే జాగ్రత్స్వప్న సుషుప్తులకు అతీతమైన నాల్గవ స్వరూపమునందున్నావో నిదురించిన వానివలె నీవే నీయందు తమస్సును చేకూర్చుట లేదు. చూచుటలేదు. జాగ్రత్స్వప్నము లందువలె విషయములను కూర్చుటలేదని యర్థము. ( 32 )

శ్లో ॥ తస్యైవతే వపురిదం నిజకాల శక్త్యా
సంచోదిత ప్రకృతి ధర్మణ ఆత్మ గూఢమ్ ।
అంభస్యనంత శయనాద్విరమత్సమాధే
ర్నాభేర భూత్స్వ కణికా వటవన్మహాబ్జమ్ ॥33॥

జల మధ్యమున శయనించియున్న అట్టి నీ ప్రకృతి ధర్మములైన సత్వాదులు గల శేష పర్యంకమునుండి విరమించెడు సమాధిగల నీ నాభి నుండి నీ కణము ఏకార్ణవముయొక్క ఉదకమునుండి సూక్ష్మమైన వటబీజమునుండి మహావటవృక్షమువలె నీయందే గూఢమైయున్న గొప్పనైన కమలము పుట్టినది.(33)

టీ :- ఇదానీం కారణత్వేనాదావపి పృథగవస్థానం దర్శయన్మధ్యతశ్చ త్వమేవేత్యేతత్ప్రపంచయతి - చతుర్భిః. తస్యేతి. యస్త్వమంభసి శేషే. తస్యైవ తే ఇదం జగత్. వపుః స్వరూపం నాన్యస్య యతస్త్వం మధ్యతోపి స్యాః తస్య కథంభూతస్య నిజయా కాలశక్త్యా సంచోదితాః ప్రకృతేర్ధర్మాః సత్వాదయో యేన స్వరూపత్వే హేతుః. అనంతశయనాత్ శేషపర్యంకాత్. విరమత్సమాధిర్యస్య తస్య తవ నాభేస్సకాశాదేకార్ణవోదకే. మహాబ్జం లోకపద్మమభూత్. కథం భూతం? ఆత్మని త్వయ్యేవ గూఢం సత్ స్వకణికాతః సూక్ష్మాద్వటబీజాన్మహావట ఇవ. (33)

టీ :- ఇపుడు కారణరూపముగా ఆదియందు భిన్నముగా ఉండుటను చూపుచు మధ్యయందును నీవేయను ఈ విషయమును ప్రకటించుచున్నాడు, నాల్గుశ్లోకములతో. ఏ నీవైతే జలమధ్యమున శయనించుచున్నావో అట్టి నీ శరీరమే ఈ జగత్తు. ఇతరుని రూపము కాదు. ఎందువల్లనైతే నీవు ఈ సృష్టికిమధ్యయందును ఉన్నావు. ఏ విధమైన సృష్టియొక్క స్వకీయమైన కాల శక్తిచే ప్రేరేపించబడిన ప్రకృతి ధర్మములు సత్వాదులు గల స్వరూపత్వమున హేతువు అనంతశయనాత్ = శేష పర్యంకమునుండి విరమించు సమాధిగల నీ నాభినుండి ఏకార్ణవమైన ఉదకమునందు మహాబ్జం = బ్రహ్మలోక భూతమైన పద్మము పుట్టెను ఎటువంటిది? ఆత్మని = నీయందే గూఢముగనున్నదై కణమునుండి పుట్టినది. సూక్ష్మమైన వటబీజమునుండి మహావటవృక్షమువలె పుట్టినది. (33)

శ్లో ॥ తత్సంభవః కవిరతోఽన్యదపశ్య మాన
స్త్వాంబీజమాత్మని తతం స్వబహిర్విచింత్య ।
నావిందదబ్దశత మప్సునిమజ్జమానో
జాతేఽంకురే కథముహోపలభేత బీజమ్ ॥ 34॥

అట్టి కమలమున పుట్టిన బ్రహ్మ పద్మము వినా వేరేమియు అగుపడనివాడై బీజభూతమైన నిన్ను తనలోనే వ్యాప్తమై యున్ననూ తనకంటె బయట వేరుగా ఉన్నవానినిగా భావించి వంద సంవత్సరములు నీటమునిగి ఆ పద్మమునకు బీజమును (ఉపాదాన కారణమును ) తెలుసుకొనలేకపోయెను. ఆహా ! అంకురము పుట్టిన పిదప బీజమెట్లు లభించును? ( 34 )

టీ :- తదేవం కారణత్వేనానుగతస్సన్ మధ్యతశ్చ త్వమేవ వర్తస ఇత్యుక్తం. ఏతదేవ శుద్ధసత్త్వస్య బ్రహ్మణో నుభవేన స్ఫుటయితుం తస్య ప్రాక్తనీమవస్థామాహ – తదితి. తస్మిన్నబ్జే సంభవో యస్య సః. కవిర్బ్రహ్మా అతః పద్మాదన్యదపశ్యమానస్సన్ బీజం ఉపాదానకారణభూతం త్వాం తతం స్వస్మిన్ వ్యాప్తం. సంతమపి నావిందత్ యుక్తం చైతత్. ఉహ అహెూ జాతే సతి. బీజం తదనుగతం కారణం పృథక్. కథం నామ బహిరుపలభేత పుమాన్ పశ్యేత. (34)

టీ :- అందువలన ఇట్లు కారణరూపముగ అనుసరించినవాడవై మధ్యనుండియు నీవే ఉంటున్నావు. అని చెప్పబడినది. దీనినే శుద్ధసత్వ రూపుడైన బ్రహ్మయొక్క అనుభవంతో స్పష్టము గావించుటకు అతని ప్రాచీన అనుభవమును చెప్పెను. ఆ కమలమున పుట్టుకగల. కవిః = బ్రహ్మతను పుట్టిన పద్మము వినా మరొకటేదియు అగుపడకుండుటచే మూలకారణమైన నిన్ను తనలోనే వ్యాప్తమై ఉన్నప్పటికీ ఎఱుంగజాలకుండెను. ఇది యుక్తమే. ఉహ = ఆహా ! మెలక పుట్టినది కాగా దానిని అనుసరించియుండెడు కారణమును పురుషుడు ఎట్లు చూచును? ( 34 )

శ్లో ॥ సత్వాత్మయోని రతి విస్మిత ఆస్థితోఽబ్జం
కాలేన తీవ్ర తపసా పరిశుద్ధభావః ।
త్వామాత్మనీశ భువిగంధమివాతి సూక్ష్మం
భూతేంద్రియాశయ మయే వితతం దదర్శ ॥ 35॥

ఆ బ్రహ్మ ఆశ్చర్యమునపొంది మరల తన కమలమును చేరెను. తగు సమయమున తీవ్రమైన తపస్సు గావించి పరిశుద్ధభావము కలవాడై పంచభూతములకు ఇంద్రియములకు నివాసముగనున్న తనయందే ఓ ఈశా! భూమియందు అతి సూక్ష్మముగా నున్న గంధమువలె నున్న నిన్ను సంపూర్ణముగా దర్శించెను. ( 35 )

టీ :- భవదుపాసనయా తు స్వస్మిన్నేవ దృష్టవానిత్యాహ – సత్వితి. పరావృత్తాబ్జమాశ్రితస్సన్. తీవ్రేణ తపసా ధ్యానేన అనేన సన్మాంరతరూపేణోపాదానతయా దర్శనముక్తం. (35)

టీ :- నిన్ను తపస్సుచే కొలుచుటచేత తనలోనే నిన్ను కనుగొనెనని ఇట్లు చెప్పెను. 'సతు' అని. తిరిగివచ్చి కమలమున నున్నవాడై తీవ్రమైన తపసా = ధ్యానముచే. ఇట్లు చెప్పుటచే సన్మాత్రరూపముగా ఉపాదానత్వముచేత దర్శనము చెప్పబడినది. ( 35 )

శ్లో ॥ ఏవం సహస్రవాదనాంఘ్రి శిరఃకరోరు
నాసాస్య కర్ణ నయనాభరణాయుధాఢ్యమ్ ।
మాయామయం సదుపలక్షిత సన్నివేశం
దృష్ట్వా మహాపురుష మాప ముదం విరించిః ॥36॥

టీ :- ఈశ్వరత్వేన చ దృష్ట్వా కృతార్థో భవతీత్యాహ - ఏవమితి. ఏవం అనేన ప్రకారేణ సహస్రపరిమితాని యాని వదనాదీని తైరాఢ్యం. సమృద్ధం. మాయామయం మాయాప్రధానం సతా ప్రపంచేనోపలక్షితః సన్నివేశః పాదాదిరచనా యస్య. (36)

శ్లో ॥ తస్మై భవాన్హయ శిరస్తనువంచ బిభ్ర
ద్వేదద్రుహావతి బలౌ మధుకైటభాఖ్యౌ ।
హత్వాఽనయచ్ఛృతి గణాంస్తు రజస్తమశ్చ
సత్త్వం తవ ప్రియ తమాం తనుమా మనంతి॥37॥

టీ :- తథా చ. భవాంస్తస్యానుగ్రహం కృతవానిత్యాహ - తస్మాఇతి. హయగ్రీవమూర్తిం బిభ్రత్సన్. రజస్తమోరూపౌ మధుకైటభాఖ్యౌ హత్వా తస్మై శ్రుతిగణాన్ సమర్పితవాన్ తత్ర హేతుః. సత్త్వమితి. (37)

ఎట్లనిన అపరిమితములైన ముఖములు, పాదములు, శిరస్సులు, కరములు, ఊరువులు, ముక్కులు, నోర్లు, చెవులు, కన్నులు, ఆభరణములు, ఆయుధములచే నొప్పుచున్న, ప్రపంచముచే గుర్తించబడుచున్న పాదాది సన్నివేశముగల మాయా రూపుడైన మహాపురుషునిచూచి విరించి ( బ్రహ్మ ) ఆనందమొందెను. ( 36 )

టీ :- ఈశ్వర రూపముగా గాంచి కృతార్థుడయ్యెనని చెప్పెను. ఏవం = ఈ విధముగా సహస్రం = అపరిమితములైన ఏ వదనాదులు కలవో వానిచే ఆఢ్యం = సమృద్ధమైన. మాయామయం = మాయాప్రధానమైన, సతా = ప్రపంచముచే గుర్తించబడినవాడై సంనివేశః = పాదాది రచన గలవాడు.(36)

హయగ్రీవ శరీరమును దాల్చి, వేదములకు ద్రోహము గావించెడు అతిబలులైన మధుకైటభులను వారిని చంపి వేదములను సత్వ, రజః, తమోగుణములను ఆ బ్రహ్మకు తెచ్చి యిచ్చితివి. ఆ తనువు నీకు మిక్కిలి ప్రియమైనదిగా చెప్పెదరు. (37)

టీ :- మఱియును నీవు అతనిని అనుగ్రహించితివని పలికెను. ‘ తస్మై ’ అని. హయగ్రీవ రూపమును దాల్చినవాడవై రజః తమోరూపులైన మధుకైటభులనువారిని చంపి ఆ ఆత్మభవునకు ( బ్రహ్మకు ) వేదముల సమూహమును సమర్పించితిని. అందుకు హేతువు ‘ సత్వం ’ ఇత్యాదిగా. చెప్పబడినది. ( 37 )

శ్లో ॥ ఇత్థం నృతిర్యగృషి దేవ ఝషావతారైః
లోకాన్విభావయసి హంసి జగత్ప్రతీపాన్ ।
ధర్మం మహాపురుష పాసి యుగానువృత్తం
ఛన్నః కలౌ యదభవ స్త్రియుగోఽథ సత్వమ్ ॥38॥

ఇట్లు మానవ, జంతు, ఋషి, దేవ, చేపల అవతారములచే లోకములను పాలించుచున్నావు. లోక కంటకులను చంపుచున్నావు. ఓ మహా పురుషా ! యుగానువృత్తమైన ధర్మమును కాపాడుచున్నావు. ఎందువల్లనైతే అట్టి నీవు కలియుగమున ప్రచ్ఛన్నుడవైతివో ఆ కారణమున నీవు క్షత్రియుడవుగా ప్రసిద్ధుడవైతివి.(38)

టీ :- ఏకస్త్వమేవేత్యాదిభిరష్టభిశ్లో కైః. యదుక్తం పక్షపాతేన రక్షణం. తద్విపక్షవధశ్చ సత్త్వోపాధితో న తు స్వత ఇతి. తదుపసంహరతి – ఇత్థమితి. విభావయసి పాలయసి. హంసి ఘాతయసి. కలౌ తు తత్తు న కరోషి. యతః తదా త్వం ఛన్నో భవః యతః. త్రిష్వేన యుగేష్వావిర్భావాత్స ఏవంభూతస్త్వం త్రియుగ ఇతి ప్రసిద్ధః. (38)

టీ :- ‘ ఏకస్త్వమేవ ’ ( 7-9-30 ) ఇత్యాది అష్ట శ్లోకములచే ‘ పక్షపాతముచే రక్షణము. అతని విపక్షము యొక్క సంహారము గావించుటయు ’ అనునది ఏదైతే చెప్పబడినదో అది ఉపాధి కర్తృకము. స్వయంకృతము గాదు. అని దానిని ఉపసంహరించుచున్నాడు. ‘ఇత్థం’ ఇత్యాదిగా. విభావయసి = పాలించుచున్నావు. హంసి = కొట్టుచున్నావు. (చంపుచున్నావు). కలియుగమందైతే అది చేయుటలేదు. ఎందుకనగా అప్పుడు నీవు ప్రచ్ఛన్నుడవైతివి. అందువలన మూడు యుగములందును. పుట్టుట వలన నీవు త్రియుగః= త్రియుగుడవుగా ప్రసిద్ధుడవైతివి. ( 38 )

శ్లో ॥ నైతన్మనస్తవ కథాసు వికుంఠనాథ
సంప్రీయతే దురిత దుష్టమసాధు తీవ్రమ్ ।
కామాతురం హర్ష శోక భయైషణార్తం
తస్మిన్ కథం తవగతిం విమృషామి దీనః ॥ 39॥

ఓ వైకుంఠనాథా ! ఈ మనస్సు బహుచెడ్డది. పాపపుది. దుష్టమైనది. దుర్భరమైనది.కామాతురము. హర్ష, శోక, భయైషణముచే బాధలు పొందునది. ఐనను నీ కథలయందు సంతోషపడుట లేదు. ఇట్లుండ దీనుడనైన నేను నీ గతిని ఎట్లు ఆలోచింతును? ( 39 )

టీ :- తదేవం భగవతస్తత్త్వం నిరూప్యస్వస్య చ తద్విచారాయోగ్యతాం నివేదయన్ప్రార్థయతే - త్రిభిః నైతదితి. అసాధు బహిర్ముఖం తీవ్రం దుర్భరం. హర్షశోకహయైరేషణత్రయేణ చార్తం దుఃఖితమపి త్వత్కథాసు న సంప్రీయతే తస్మిన్ ఏవంభూతే మనసి సతి. కథం తవ తత్త్వం విచారయామి. (39)

టీ :- అట్లు ఈ భగవంతుని తత్త్వమును నిరూపించి తనకు అతనిని గూర్చిన విచారమునందు అయోగ్యతను విన్నవించుచు ప్రార్థించుచున్నాడు. ' నైతత్ ' అని మూడు శ్లోకములచే. అసాధు = బహిర్ముఖము. తీవ్రం = ధరింప శక్యము గానిది. హర్షము, శోకము, భయముల ఏషణా ( ఇచ్ఛా ) త్రయముచే ఆర్తం = దుఃఖమును పొందినదైనను నీ కథలందు ప్రీతి పొందుటలేదు. తస్మిన్ = ఈ మనస్సు ఈ విధమైన దగుచుండగ నేను నీ తత్త్వమును గూర్చి ఎట్లు ఆలోచింతును? ( 39 )

శ్లో ॥ జిహ్వైకతోఽచ్యుత వికర్షతి మాఽవితృప్తా
శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్ ।
ఘ్రాణోఽన్యతశ్చ పలదృక్ క్వచ కర్మశక్తిః
బహ్వ్యః సపత్న్య ఇవ గేహ పతింలునంతి ॥40॥

ఓ అచ్యుతా ! ఎందును తృప్తిగాంచని జిహ్వ నన్ను ఒకవైపునకు లాగును. శిశ్నము మరోవైపునకు ఆకర్షించును. త్వగింద్రియము, ఉదరము, శ్రవణేంద్రియము ఎక్కడికో లాగును. ప్రాణేంద్రియము మరోవైపునకు కొనిపోవును. చంచలమైన చక్షురింద్రియము ఎచ్చటికో తీసుకొనిపోవును. అనేక సపత్నులు గృహపతిని తలోవైపు లాక్కొనిపోయినట్లు కర్మేంద్రియములు ఇట్లు ఛేదించుచున్నవి (చీల్చుక తినుచున్నవి).(40)

టీ :- కించ. జిహ్వేతి. జిహ్వా అవితృప్తా సతీ భో అచ్యుత మా మాం. యతో మధురాదిరసస్తత ఆకర్షతి ఉదరం తు క్షుదా సంతప్తం సద్య ఏవ యత్కించిదాహారమాత్రం ప్రతి చపలా దృక్ చక్షుః. కర్మశక్తిః కర్మేంద్రియాణి లునంతి త్రోటయంతి. (40)

టీ :- ఇంతేకాక జిహ్వ తృప్తి పొందినదై ఓ అచ్యుతా ! మా = నన్ను మధుర రసముగల చోటికి ఆకర్షించును. ఉదరమేమో ఆకలిచే అలమటించునదై వెంటనే ఏదోకొంత ఆహారమును గూర్చి ( లాగును ) చపలాదృక్ = చక్షువు. కర్మశక్తిః = కర్మేంద్రియములు లునన్తి = ఛేదించివేయుచున్నవి. (40)

శ్లో ॥ ఏవం స్వకర్మ పతితిం భవవైతరణ్యా
మన్యోఽన్య జన్మమరణాశన భీత భీతమ్ ।
పశ్యన్ స్వపర విగ్రహ వైర మైత్రం
హంతేతి పారచరపీ పృహి మూఢమద్య ॥ 41 ॥

ఇట్లు తమ కర్మలచే సంసారమనెడు వైతరణీ నది ( యమద్వారము నందున్నది) యందు పడినట్టి, పరస్పర జన్మ, మరణ, అశనములచే భయముతోనున్నట్టి, తమ-పర విగ్రహములందలి క్రమముగా వైరమును, మైత్రిని కల్గి యున్నట్టి మూఢబుద్ధిగల ఈ జననమును చూచుచు నీవు ఓ పారచరా ! (నదియొడ్డున నున్న వాడా ! ) నిత్యముక్తా! హంతకుడవనియా? ఆహా ! కష్టము. దయతలచి నేడు వైతరణీ నదిని దాటించి పాలించుము.(41)

టీ :- న కేవలమహమేక ఏవం కష్టాం దశామాపన్నః కింతు. మహాజనోప్యేవమేవ క్లిశ్యతి. అతః సర్వజనం పాలయేతి ప్రార్థయతే - ఏవమితి. భవః సంసార ఏవ వైతరణీ యమద్వారనదీ తస్యాం అన్యోన్యతోయాని జన్మాదీని తేభ్యో తిభీతం స్వేషాం పరేషాం విగ్రహేషు దేహేషు యథాయథం వైరం మైత్రం చ యస్య ఏవంభూతం మూఢజనం పశ్యన్. హే పారచర. తస్మాఃపారే స్థితః. నిత్యముక్త హంతేతి అహో కష్టమిత్యేవమనుకంప్య అద్యపిపృహి వైతరణ్యా ఉత్తార్య పాలయ. (41)

టీ :- నేనొక్కడను మాత్రమే ఇట్లు కష్టదశను పొందలేదు. మహాజనము గూడా ఇట్లే బాధలనొందుచున్నది. కాన జనులందరను పాలించుమని ప్రార్థించుచున్నాడు. 'ఏవం' అని. భవః = సంసారమే వైతరణీ = యమద్వారమునందలి నది. దానియందు అన్యోన్యమైన జన్మ మరణాదులవలన భయం భయంగానున్న, తమ పర విగ్రహములందు క్రమముగా వైరము మైత్రియుగల ఇట్లు మూఢమైయున్న జనమును చూచుచు నీవు, ఓ పారచరా! ఆ వైతరణీ ఒడ్డుననున్న, నిత్యముక్తా ! హంత యనియా? ఆహా ! కష్టమనియే దయతలచి, పీపృహి = వైతరణిని దాటించి పాలించుము. ( 41 )

శ్లో ॥ కోన్వత్ర తేఽఖిల గురో భగవన్ ప్రయాస
ఉత్తారణేఽస్య భవసంభవ లోపహేతోః ।
మూఢేషువై మహదనుగ్రహ ఆర్తబంధో
కింతేన తే ప్రియజనా నను సేవతాం నః ॥ 42॥

అఖిల గురూ ! భగవాన్ ! ఈ ప్రపంచము యొక్క సృష్టి, స్థితి, లయకారకుడవైన నీకు ఈ జననమును భవసాగరమునుండి దాటింపజేయుట యేమి కష్టము? ఓ ఆర్తబంధో ! నీకు ప్రియమైన జనులను సేవించెడు మాకు

దాటింపజేయుటచే ఏమి ఫలము? మూఢులైన వారిని ఉత్తరింపజేసిన అది గొప్ప అనుగ్రహము. ( 42 )

టీ :- ఏకేన మయా కథం సర్వో జనస్తారణీయ ఇతి చేత్తత్రాహ – కఇతి. కోనుతే అత్ర సర్వజనోత్తారణే ప్రయాసః? న కోऽపి కుతః? అస్య విశ్వస్య. భవసంభవలోపానాం ఉత్పత్తి స్థితి సంహారణాం హేతోః. తతో పి కిమేతత్ దుష్కరమితి భావః. ఉచితం చేత్తదిత్యాహ – మూఢేష్వితి. త్వాం చ త్వదీయాంశ్చ తారయిష్యామి. ఇమం దురాగ్రహం మా కృధా ఇతి చేత్తత్రాహ –తవ యే ప్రియజనా ప్రియతమా భక్తాః. తానను సేవమానానాం నోస్మాకం తేనోత్తారణేనకిం? కోతి ప్రయాసోऽసుర బాలకా హరేః కోన్వత్ర తేऽఖిల గురో భగవన్ ప్రయాసః, ప్రహ్లాద ఇత్థ ముపమంత్ర్య మిథో నరాణా మీశేన సఖ్య మకరోదపనీయ మాయామ్ (42)

టీ :- నేనొక్కడనే సమస్తజనము నెట్లు తరింపజేగుననిన ఇట్లు చెప్పెను. ‘ కోను ’ అని. నీకు సర్వజనులను తరింపజేయుటయందు కష్టమేమి? ఏమియును లేదు. ఎందులకనిన ఈ ప్రపంచముయొక్క భవసంభవలోపానాం = ఉత్పత్తి, స్థితి, సంహారములకు కారణమైన నీకు ( ఇది ఎట్లు కష్టము? ) ఐనప్పుడు ఇది దుష్కరమా? ఏమి? అని భావము. ఇది తగినదేయని ఇట్లు చెప్పెను. ‘ మూఢేషు ’ అని. నిన్ను నీవారిని కూడా తరింపజేతును. మొండిపట్టు పట్టవద్దనిన ఇట్లనెను. నీకు ఎవరైతే ప్రియజనాః = భక్తులు కలరో వారిననుసరించి సేవించు నః = మాకు ఆ ఉత్తరాయణముచేత నేమి ఫలము? “ ఓ సురబాలకులారా ! హరికి అతి ప్రయాసము ఏది? ఓ అఖిలగురూ ! భగవన్ ! నీకీ విషయమున కష్టమేమి? ఇట్లు ప్రహ్లాదుడు ఇరువురిని పిలిచి మాయను తొలగించి నరులకు ఈశ్వరునితో సఖ్యము గావించెను.(42)

శ్లో ॥ నైవో ద్విజే పర దురత్యయ వైతరణ్యా
స్త్వద్వీర్య గాయన మహామృత మగ్న చిత్తః ।
శోచేతతో విముఖ చేతస ఇంద్రియార్థ
మాయా సుఖాయభరముద్వహతో విమూఢాన్॥43

ఓ సర్వోత్తమా ! నీ వీర్య గాథలను గానము చేయుటయను అమృతమున మునిగియున్న చిత్తము గలవాడవై తరింప శక్యము గాని వైతరణి వలన భయపడుట లేదు. ఇంద్రియార్థములు ( ప్రయోజనములు ) ఐన మాయా సుఖమునకై కుటుంబాది భారమును వహించునట్టి, నీవీర్య గాథా గానమును చేయుటకు విముఖ చిత్తులైన ఈ మూఢులను గూర్చి విచారించుచున్నాను.(43)

టీ :- నను ప్రియజనసేవామాత్రేణ కథం తవ సంసారతరణ మిత్యాశ్యంక్య తదేవ వివృణ్వన్ పరిహరతి – నైవేతి. హే పరమ సర్వోత్తమ, త్వదీర్యగాయనమేవ మహామృతం తస్మిన్ మగ్నం చిత్తం యస్య సో హం భవవైతరణ్యాః నైవోద్విజే. కింతు విమూఢాన్ శోచామి తానేవాహ – తతో మహామృతా ద్విముఖం చేతో యేషాం. ప్రత్యుత ఇంద్రియార్థనిమిత్తం యన్మాయాసుఖం తదర్థం భరం కుటుంబాదిభారముద్వహతః. (43)

టీ :- వత్సా ! ప్రహ్లాదా ! నిన్నైతే తరింపజేతును. అంతతో కృతార్థుడవు కమ్ము. ఈ పట్టుదలతో నేమిపని యనిన ఇట్లనెను. ‘ నైవ ’ యని. హేపర = సర్వోత్తమా ! నీవీర్య గానమే మహామృతము. దానియందు మునిగిన చిత్తము గల అట్టి నేను సంసారమనెడు వైతరుణికి జంకుటలేదు. కాని విమూఢులైన వారిని గూర్చి బాధపడుచున్నాను. వారిని గూర్చియే ఇట్లనెను. తతః = నీ విక్రమగానమనే మహామృతము నుండి పరాఙ్ముఖమైన చిత్తముగలవారిని గూర్చి, లేదా ఇంద్రియార్థ=ఇంద్రియముల నిమిత్తమై ఏ మాయా సుఖము గలదో దాని గూర్చి భరం=కుటుంబాది భారమును వహించు వారిన గూర్చి (చితించుచున్నాను ). (43)

శ్లో ॥ ప్రాయేణ దేవమునయః స్వ విముక్త కామా
మౌనం చరంతి విజనేన పరార్థ నిష్ఠాః ।
నైతాన్విహాయ కృపణాన్విముక్ష ఏకో
నాన్యం త్వదస్య శరణం భ్రమతోను పశ్యే ॥ 44॥

దేవా ! మునులు సాధారణముగా తమ కోరికలను త్యజించినవారై పరార్థపరులై నిర్జన ప్రదేశములందు మౌనముగా చరింతురు. ఈ దైన్యులను వదిలి నేనొక్కడినే మోక్షమును పొందగోరను. ఎంతగా ఆలోచించినను ఈ జనమును తరింపజేయుటకు నీకన్న వేఱైన మఱొకనిని శరణముగా గాంచుటలేదు. ( 44 )

టీ :- త్వం తావన్ముక్తిం గృహాణ తేషాం తు తత్త్వజ్ఞానం మునయ ఉపదేక్ష్యంతీతి చేత్తత్రాహ – ప్రాయేణేతి. న విముముక్షే ముక్తిం నేచ్ఛామి. తర్హ్యన్యం కమపిప్రార్థయ మామేవ కిమితి నిర్బధ్నాసీతి చేత్ తత్రాహ – త్వత్తోన్యమస్య జనస్య శరణం న పశ్యామి..(44)

టీ :- నీవు మాత్రము ముక్తిని గ్రహించుము. వారినేమో తత్త్వజ్ఞులైన మునులు వుపదేశించెదరు. అనిన విషయమును చెప్పుచున్నాడు. ‘ ప్రాయేణ ’ అని. న విముముక్షే=ముక్తిని కోరను. అట్లైన వేరొకని ఎవరినేని ప్రార్థించుము. నన్నే ఎందెకు ప్రార్థించుచున్నావు ( నిర్బంధించుచున్నావు). అనిన ఇట్లనెను. నీకంటే వేరొకని ఈ జననమునకు శరణముగా గాంచుటలేదు. ( 44 )

శ్లో ॥ యస్మైథునాది గృహమేధి సుఖం హి తుచ్ఛం
కండూయనేన కరయోరివ దుఃఖ దుఃఖమ్ ।
తృప్యంతి నేహ కృపణా బహు దుఃఖభాజః
కండూతివన్మనసిజం విషహేత ధీరః ॥ 45 ॥

టీ :- నన్వేతి స్త్రీసంభోగాదినా సుఖిన ఏవ న కృపణాస్తత్రాహ -యదితి. కరయోః కండూయనేన సంఘర్షణేనేవ. దుఃఖమనుదుఃఖం యస్మిన్? తర్హి దుఃఖత్వాదేవ తతో నిర్విద్యముచ్యేరన్ తత్రాహ - కృపణాః కాముకాః. బహుదుఃఖభాజోపి. ఇహ గృహమేధిసుఖేన తృప్యంతి. అలమితి న మన్యంతే. కండూతివత్కామస్య దుస్సహత్వాత్, నను కేచిత్కండూతిమపి. సహంతే కామం చేతి చేత్తత్రాహ - త్వత్ప్రసాదాస్తు కశ్చిద్ధీర ఏవ మనసిజం కామం విషహేత. న సర్వే. అత్రాపి కండూతివదితి దృష్టాంతః. (45)

ఏదైతే మైథునము ( సంభోగము ) మొదలుగాగల గృహస్థుల సుఖములు గలవో అవి తుచ్ఛములైనవి. చేతులకు కల్గిన కండూయనము (దురద, తీట)చే కరములకు అతి దుఃఖము కల్గినట్లే సంభోగాది సుఖములును దుఃఖకరములే. (45 )

టీ :- ఓయీ వీరు స్త్రీ సంభోగాదులచే సుఖులే కదా ! దీనులు కారు అనిన ఇట్లనెను.'యది' అని. కరములయొక్క కండూయనేన = సంఘర్షణవలె, దుఃఖమను దుఃఖమును అనగా దుఃఖముపై దుఃఖమును కల్గినది సంసారము. అట్లైన దుఃఖమున్నందు వల్లనే అటుపై నిర్వేదమును పొంది, ముక్తులగుదురనిన ఇట్లనెను. కృపణాః = దీనులైన కాముకులు బహు దుఃఖభాజనులైనను ఈ గృహమేధి సుఖమున న తృప్యంతి = చాలునని తలంచరు. దురదవలె కామమునకును దుఃఖమును సహించు భావమున్నందున, కొందరు దురదను , కామమును కూడా సహించుకొందురనిన ఇట్లు చెప్పెను. నీ అనుగ్రహమున ఎవడో ఒక ధీరుడు మాత్రమే నీ అనుగ్రహమున మనస్సున బుట్టిన కామమును (కోర్కెను) సహించుకొనుగాక. అందరు సహింపజాలరు. ఇచ్చటను “ కండూతివలె ” అని దృష్టాంతము. ( 45 )

శ్లో ॥ మౌన వ్రత శ్రుత తపోధ్యయన స్వధర్మ
వ్యాఖ్యారహో జప సమాధయ ఆపవర్గ్యాః ।
ప్రాయః పరం పురుషతే త్వజితేంద్రియాణాం
వార్తా భవంత్యుత న వాత్ర తు దాంభికానామ్॥46

ఓ అంతర్యామీ ! మౌనము, వ్రతపాలన, శ్రుతము, తపము, అధ్యయనము, ధర్మము, వ్యాఖ్య, ఏకాంతజీవనము, జపము, సమాధి అను నీ పది అపవర్గ హేతువులు. సాధారణముగా అవి అజితేంద్రియులకు ఇంద్రియభోగముల కొఱకైన జీవనోపాధులు, దాంభికులకైతే జీవనోపాధులును అగునో కావో అనిశ్చయమే. ( 46 )

టీ :- నను మౌనాదిభిః మోక్షసాధనైః సుతభైవ తేషామపి ముక్తిః? తత్రాహ – మౌనేతి. హే పురుష అంతర్యామిన్. యే మౌనాదయో దశ. అపవర్గాః అపవర్గహేతవః ప్రసిద్ధాః రహః వివిక్తవాసః తే తు ప్రాయశః అజితేంద్రియాణాం ఇంద్రియభోగాయ అర్థార్థం. విక్రీణతాం వార్తాః జీవనోపాయా భవంతి. దాంభికానాం వార్తా అపి భవంతి వా. న హి దంభస్యానియతఫలత్వాత్. (46)

టీ :- ఓయీ మౌనము మొదలైన మోక్ష సాధనములచే వారికిని ముక్తి సులభమే. అనిన ఇచ్చట ఇట్లనెను. 'మౌన' అని. హే పురుషా ! ఓ అంతర్యామీ! మౌనాదులు ఏ పది ఆపవర్గ్యాః = అపవర్గ హేతువులు ప్రసిద్ధములో, రహః = వివక్త వాసము. ఆ అపవర్గ హేతువులైతే సాధారణముగా అజితేంద్రియాణాం = ఇంద్రియ భోగము కొఱకైన అర్థము కొఱకు అమ్మెడు వారికి వార్తాః = జీవనోపాయములు అగుచున్నవి. దాంబికులకైతే జీవనోపాయములును అగునో, కాదో దంభమునకు ఫలము నిశ్చయము కానందున. ( 46 )

శ్లో ॥ రూపే ఇమే సదసతీ తవదేవ సృష్టే
బీజాంకురావివ న చాన్య దరూపకస్య ।
యుక్తాః సమక్ష ముభయత్ర విచిన్వతే త్వాం
యోగేన వహ్నిమివ దారుషు నాన్యతః స్యాత్॥47॥

బీజము అంకురములవలె ఈ కార్య కారణములు నీ రూపములుగనే వాదముచే ప్రకాశింపజేయబడినవి. (ప్రకటింపబడినవి). ప్రాకృతరూపాది శూన్యుడవైన నీకు దీనికి భిన్నమైన " స్వసమవేతమగు దేవదత్తాదులకు గౌరత్యాదికమువలె " గుణములేదు. కాన విజితేంద్రియులే భక్తియోగముచే

టీ :- తత్వజ్ఞానం భక్తిం వినా సకామైః మౌనాదిభిర్న. భవత్యేవే త్యాహ – త్రిభిః. రూపే ఇతి. బీజాంకురామవివ ప్రవాహాపన్నే. ఇమే సదసతీ కార్యకారణే. ఏవ. తేరూపే. ఉపలక్షణభూతే. వేదేన దృష్టే ప్రకాశితే న చాన్యత్స్వసమవేతం గౌరత్వాదికమివ దేవదత్తాదేః. కుతః? అరూపకస్య ప్రాకృతరూపాదిశూన్యస్య. అతః యుక్తా సంయతా ఏవ. భక్తియోగేన ప్రత్యక్షం త్వాముభయత్ర కార్యే కారణే చానుగతం పశ్యంతి. మథనేన దారుషువహ్నిమివ నాన్యతస్స్యాత్ జ్ఞానమితి శేషః. యద్వా జ్ఞాన ప్రకారేమేవాహ – ఏతదుభయమన్యతః ప్రధానపరమాణ్వాదేర్న స్యాత్. శ్రు. “స ఐక్షత” త్యాది శ్రుతేః. అతస్త్వమేవ కారణత్వాత్సర్వత్రానుస్మృత ఇతి. (47)

నిను కార్యమునందు కారణమునందును అనుగతమైన వానినిగా ప్రత్యక్షము గాంచెదరు. ఎట్లనిన దారుషు=కట్టెలందు మథనముచే అగ్నిని గాంచినట్లు అని ఉపమానము. వేఱొండు దానిచే తత్వజ్ఞానము కలగదు. ( 47 )

టీ :- నీ జ్ఞానము ( ఆత్మ జ్ఞానము ) భక్తి లేనిదే సకాములచే మౌనాదులతో కలుగదు కదా ! యనిన ఇట్లనెను. ‘ రూపే ’ అను మూడు శ్లోకములచే. బీజాంకురములవలె ప్రవాహము పొందిన ఈ సతసతీ = కార్యకారణములే నీ రూపే = రూపములుగా (వుపలక్షణ భూతములు ) వేదముచే సృష్టే = ప్రకటించబడినవి (సృష్టించబడినవి). వేఱొకటి స్వసమవేతమైన దేవదత్తాదులకు గల శ్వేతత్వాదికము గాదు. ఎందులకు? అరూపకస్య = ప్రాకృత పురుషునకువలె రూపాదులు లేనట్టి, అందువలన యుక్తాః=ఇంద్రియ నిగ్రహముగల మునులే భక్తి యోగముచే ప్రత్యక్షమైన నిన్ను ఉభయత్ర కార్యమందు కారణమునందును అనుగతమైన వానినిగా చూచెదరు. మథనము చేయుటద్వారా దారువులందు వహ్నిని చూచినట్లు నీ జ్ఞానము వేరు విధములుగా కలుగదని శేషము. లేదా జ్ఞాన ప్రకారమునే ఇట్లు చెప్పెను. ఈ కార్య కారణ ద్వయము ఇతరము వలన ప్రధాన పరమాణ్వాదులవలన కలుగదు గాక. ‘ అతడు చూచెను ’ ఇత్యాది శ్రుతి వలన. అందువలన నీవే కారణ రూపుడవగుట వలన సర్వత్ర ( అను స్యూతుడవు ) వ్యాపించు వాడవు. అని ( 47 )

శ్లో ॥ త్వం వాయురగ్ని ర్వియదంబు మాత్రాః
ప్రాణేంద్రియాణి హృదయం చిదనుగ్రహశ్చ ।
సర్వం త్వమేవ సగుణో విగుణశ్చ భూమన్
నాన్యత్త్వదస్త్యపి మనో వచసా నిరుక్తమ్ ॥ 48 ॥

నీవే వాయువు, అగ్నివి, ఆకాశము, జలము, ప్రాణములు, ఇంద్రియములు, హృదయము, బుద్ధి, అహంకారములు నీవే. స్థూలము, సూక్ష్మము, సర్వము నీవే. మనస్సుచేత, వాక్కుచేతను ప్రకటించబడినది. నీకంటే వేఱేమియు లేదు. ( 48 )

టీ :- తదేవాహ - త్వమితి. హృదయం మనః చిత్ చిత్తం. అనుగ్రహః అహంకారః. తద్దేతావర్గో వా. సగుణః స్థూలః. విగుణః సూక్ష్మః మనశ్చ. వసశ్చ. మనోవచః తేన నిరుక్తం ప్రకాశితం. కిమపి త్వత్తోన్యన్నాస్తి. (48)

టీ :- దానినే ఇట్లు చెప్పెను. ' త్వం వాయుః ' అని, హృదయం = మనస్సు, చిత్=చిత్తము, అనుగ్రహః = అహంకారము దేవతా వర్గము, సగుణః = స్థూలమైన వాడవు, విగుణః = సూక్ష్మ రూపుడవు, మనోవచః = మనస్సు,వాక్కును, వానిచే నిరుక్తం=ప్రకాశితము ఏదియును నీకంటే భిన్నము లేదు. ( 48 )

శ్లో ॥ నైతే గుణా న గుణినో మహదాదయో యే
సర్వే మనః ప్రభృతయః సహదేవ మర్త్యాః ।
ఆద్యంత వంత ఉరుగాయ విదంతి హిత్వా
మేవం విమృశ్య సుధియో విరమంతి శబ్దాత్ ॥49॥

ఈ మహదాదికమైన గుణవంతములు, మనస్సు మొదలైనవి. దేవతలు, మర్త్యులు అందరూ ఆద్యంతము కలవారు. అనాద్యంతములు గల నిరుపాధియైన నిన్ను తమలోనే అనుగతమై యున్ననూ ఎఱుంగకున్నారు. ఇట్లు ఆలోచించిన విద్వాంసులు ఓ ఉరుగాయా! నిన్ను ఎఱింగినవారై శబ్దాధ్యయనాది వ్యాపారమునుండి ఉపశమించుచున్నారు. సమాధిచే నిన్నే కొలుచుచున్నారు. ( 49 )

టీ :- అభక్తాస్తు స్వస్మిన్ననుగతమపి త్వాం న జానంతీత్యాహ - నేతి. ఏతే గునాద్యభిమానినో దేవాః. ఆద్యంతవంతః. జడోపాధిత్వాత్. అనాద్యంతం. నిరుపాధికం త్వాం. న విందంతి. హి యస్మాత్ సుధియో విద్వాంసః. ఏవం విచార్య. శబ్దాత్ అధ్యయనాదివ్యాపారా ద్విరమంతి. త్వామేవ సమాధినోపాసత ఇత్యర్థః. తథా చ శ్రుతిః. "కిమర్థా వయమధ్యేష్యామహే కిమర్థా వయం యక్ష్యామహా" ఇతి. నానుధ్యాయాత్ బహూంచ్ఛబ్దాన్వాచో విగ్లాపనం హి తదితి చ స్మృతిశ్చ. శ్లో. "యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి, తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చే" త్యాది. (49)

టీ :- భక్తిలేనివారు తమలో అనుగతమై యున్ననూ నిన్నెరుంగరని ఇట్లు చెప్పెను. 'నైత' అని. ఈ గుణాద్యభిమానులైన దేవులు ఆద్యంతములు కలవారు. జడోపాధి గల్గియుండుటవలన అనాద్యంతుడవైన = నిరుపాధిగల నిన్నెరుంగరు. ఎందువల్లననగా సుధియః = విద్వాంసులు ఇట్లు విచారించి శబ్దాత్ = అధ్యయనాది వ్యాపారమునుండి విరమించుచున్నారు. సమాధిచే నిన్నే ఉపాసించుచున్నారు ( కొలుచుచున్నారు ), అని అర్థము. శ్రుతి ఇట్లు చెప్పుచున్నది. " మేమెందులకు అధ్యయనము చేయుచున్నాము? ఎందులకు పూజించుచున్నాము. " అని. " బహు శబ్దములను చదువ వలదు. అది చదువుటబట్టి అలసటయే " అని. స్మృతియు " మోహవ్యాప్తమైన నీబుద్ధి ఎప్పుడైతే మోహమును వీడునో అప్పుడు నిర్వేదము నొందెదవు. శ్రోతవ్యమును గూర్చి శ్రుతమును గూర్చియు " ఇత్యాదికము. ( 49 )

శ్లో ॥ తత్తేర్హత్తమ నమః స్తుతి కర్మపూజాః
కర్మ స్మృతిశ్చరణయోః శ్రవణం కథాయామ్ ।
సంసేవయాత్వయి వినేతి షడంగయా కిం
భక్తిం జనః పరమహంస గతౌ లబేత ॥ 50 ॥

ఓ అర్హత్తమా ! నమస్కారము, స్తుతికర్మ, పూజా, పరిచర్య, చరణస్మరణము, కథాశ్రవణము అను షడంగములు గల చక్కని సంసేవనము లేకుండగ పరమహంసముల మార్గమున నీయందు జనము ఎట్లు భక్తిని పొందును? భక్తి లేకుండగ ముక్తి ఎట్లు లభించును. ( 50 )

టీ :- ఉపసంహరతి. - తదితి. హే అర్హసత్తమ ననుస్తు స్తుతి కర్మపూజాః ప్రణిపాతస్తుతికర్మార్పణాని కర్మ చ పరిచర్యా.

టీ :- ఉపసంహారము గావించుచున్నాడు. తదితి, ఓ అర్హత్తమా ! నమస్కారము, స్తుతికర్మ, పూజ, ప్రణిపాతము, స్తుతి, సర్వ కర్మార్పణములు,

చరణయోః స్మృతిశ్చ. కథాయాం శ్రవణం చేత్యేవం. షడంగయా సమ్యక్సేవయా వినా. పరమహంసానాం గతౌ. ప్రాప్యే త్వయి. జనః కథం భక్తిం లభేత? యస్మాదేవం భక్తిం వినా. న మోక్షః న చ భక్తిః సంసేవయా వినా. అతః ప్రాక్ ప్రార్థితదాస్యయోగమేవ దేహీతి ప్రకరణార్థః. (50)

కర్మ = పరిచర్య, చరణముల స్మృతియు, కథయందు శ్రవణమును అను ఈ ఆరంగములుగల మంచి సేవ లేకుండగా పరమహంస మార్గమున నీవు పొందదగిన వాడవగుచుండగ జనము భక్తినెట్లు పొందును? ఎందువల్లనైతే ఇట్టి భక్తి లేకుండగా మోక్షములేదు. మంచి సేవ లేకుండగ భక్తి లేదు. అందువలన పూర్వము ప్రార్థించబడిన నీ దాస్య యోగముచే ఇమ్మని ప్రకరణార్థము. ( 50)

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ఏతావద్వర్ణిత గుణో భక్త్యా భక్తేన నిర్గుణః ।
ప్రహ్లాదం ప్రణితం ప్రీతో యత మన్యురభాషత ॥ 51 ॥

**నారదుడు ఇట్లు చెప్పెను :-**

భక్తుడైన ప్రహ్లాదునిచే భక్తితో ఇంతవరకు వర్ణించబడిన గుణములు కల నిర్గుణుడైన భగవంతుడు క్రోధమునుపసంహరించుకొనిన వాడై ప్రణతుడైన ప్రహ్లాదునితో ఇట్లనెను. ( 51 )

టీ :- ఏతావదితి. ఏతావతా వర్ణితా గుణా యస్య. యతమన్యుః. ఉపసంహృతకోపః. (51)

టీ :- ఇంతలైన వర్ణించబడిన గుణములు కలవాడు. యతమన్యుః = తొలగింప జేసుకొనబడిన కోపము గలవాడై ( 51 )

**శ్రీ భగవానువాచ :-**

శ్లో ॥ ప్రహ్లాద భద్ర భద్రంతే ప్రీతోహంతేసురోత్తమ ।
వరం వృణీష్వాభిమతం కామా పూరో
స్మ్యహం నృణామ్॥52॥

**శ్రీ భగవంతుడైన నరసింహుడిట్లు పలికెను :-**

ఓ అసురోత్తమా ! భద్రా ! నేను ప్రసన్నుడనైతిని. నీకు ఇష్టమైన వరమును కోరుకొనుము. నేను మానవులయొక్క కోరికలను తీర్చువాడను కదా! నీకు శుభ మగును గాక. ( 52 )

టీ :- ప్రహ్లాదేతి. కామాన్పూరయతీతి. తథా. యద్వా. పురుషార్థప్రవాహో స్మీత్యర్థః. (52)

టీ :- కామములను ( కోరికలను ) పూరించుచున్నాడు. ( తీర్చుచున్నాడని) అట్లు కామపూరుడు, లేదా పురుషార్థముల ప్రవాహ రూపుడనై యున్నానని అర్థము. (52 )

శ్లో ॥ మాను ప్రీణత ఆయుష్మన్ దర్శనం దుర్లభం హి మే ।
దృష్ట్వా మాం న పునర్జంతు రాత్మానం తప్తుమర్మతి ॥53॥

ఓ ఆయుష్మంతుడా ! చిరంజీవీ ! నన్ను సంతోషపరచని వానికి నా దర్శనము దుర్లభము కదా ! నన్ను దర్శించిన ప్రతి ప్రాణి మరల తాను తాపములను పొంద తగదు. ( 53 )

టీ :- మామితి. అప్రణీతః. తప్తుం అపూర్ణకామత్వేతి. శోచితుం. (53)

టీ :- అప్రీణతః = సంతోషపరచని వానికి, తప్తుం = తీరని కోరికలు గలవాడై తపించుటకు ( దుఃఖించుటకు ) ( 53 )

శ్లో ॥ ప్రీణంతి హ్యత మాం ధీరాః సర్వ భావేన సాధనః ।
శ్రేయస్కామా మహాభాగాః సర్వాసా మాశిషాం పతిమ్ ॥54॥

సజ్జనులు, శ్రేయస్సును కోరేవారు, మహానుభావులైన ధీరులు సకల ఆశీస్సులకు అధిపతినైన నన్ను సంతోష పరచుదురు కదా !. ( 54 )

టీ :- ప్రీణంతీతి. ప్రీణంతి తోషయంతి. (54)

టీ :- ప్రీణయంతి = సంతోషపెట్టు చున్నారు. ( 54 )

శ్లో ॥ ఏవం ప్రలోభ్య మానోపి వరైర్లోక ప్రలోబనైః ।
ఏకాన్తిత్వాద్భగవతి నైచ్ఛత్తాన సురోత్తమః ॥ 55 ॥

ఇట్లు జనులను ప్రలోభపరిచెడు వరములచే ప్రలోబపెట్టబడిన వాడైనను ఆ అసురోత్తముడైన ప్రహ్లాదుడు భగవంతునియందు ఏకాంత భక్తి గలవాడైనందున ఆ వరముల నిచ్ఛగించకుండెను. ( 55 )

టీ :- ఏవమితి. ఏకాంతిత్వాత్ నిరుపాధికభక్తత్వాత్. (55)

ఇతి శ్రీమద్భగవతే మహాపురాణే సప్తమ స్కంధే
ప్రహ్లాదానుచరితే భగవత్ స్తవో నామ నవమోఽధ్యాయః ॥

టీ :- ఏకాంతిత్వాత్ = ఉపాధి రహితమైన భక్తి కలిగియున్నందున ( 55 )

ఇది శ్రీమద్భాగవత మహా పురాణమునందు సప్తమ స్కంధమున శ్రీధరీయ
భావార్థ దీపిక యందు టీకాను వాదమున తొమ్మిదవ అధ్యాయము.





### దశమోஉధ్యాయః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ భక్తి యోగస్య తత్సర్వ మంతరాయ తయార్భకః ।
మన్య మానో హృషీకేశం స్మయమాన ఉవాచ హ ॥ 1 ॥

టీ :-దశమేత్వనుగృహ్యాముం భక్తమన్తర్హితే హరౌ, ప్రసజ్గాద్ధరిణా రుద్రేకృతోஉనుగ్రహ ఈర్యతే (1) తత్సర్వం వరజాతమ్ (1)

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ మామాం ప్రలోభయోత్పత్యా సక్తం కామేషు తైర్వరైః ।
తత్సంగ భీతో నిర్విణ్ణో ముముక్షుస్త్వా ముపాశ్రితః॥ 2॥

టీ :- ఉత్పత్యా స్వభావేనైవాసక్తం మామ్. తేషాం కామానాం సజ్గాద్భీతః. (2)

### దశమాధ్యాయము

**నారదుడిట్లు చెప్పెను :-**

ఆ నరసమూహామునంతయు భక్తి యోగమునకు ఆటంకముగా భావించువాడై అర్భకుడగు ప్రహ్లాదుడు చిరునగవు చిందించుచు హృషీకేషునితో ఇట్లు పలికెను. ( 1 )

టీ :- దశమాధ్యాయమునందు భక్తుడైన ఈ ప్రహ్లాదుని అనుగ్రహించి హరి అంతర్ధానము చెందినవాడు కాగా ప్రసంగవశమున హరిచే రుద్రునకు గావించిన అనుగ్రహమును గూర్చి చెప్పబడుచున్నది. తత్సర్వం వరజాతమ్ ( 1 )

**ప్రహ్లాదుడిట్లనెను :-**

పుట్టుక తోడనే కోరికలందు ఆసక్తుడనైన నన్ను ఆ వరములచే ప్రలోభపరచకుము. కామముల సంగమునకు వెరిసిన వాడనై విరక్తుడనై మోక్షమును కోరువాడనై నిన్నాశ్రయించితిని. ( 2 )

టీ :- ఉత్పాత్యా పుట్టుక తోడనే స్వాభావికముగానే (కామములందు) అనాసక్తుడనైన నన్ను, తేషా = అ కామముల యొక్క సంగమువలన భయపడు వానిని ( 2 )



శ్లో ॥ భృత్య లక్షణ జిజ్ఞాసుర్భక్తం కామేష్వ చోదయత్ ।
భవాన్ సంసార బీజేషు హృదయ గ్రంథిషు ప్రభో ॥ 3 ॥

ఓ ప్రభూ ! నీవు భృత్యుని లక్షణములను ఎరుంగగోరిన వాడవై భక్తుడనైన నన్ను సంసార హేతువులైన హృదయపు లోతులందలి కామములందు ప్రేరేపించితివి. ( 3 )

శ్లో ॥ నాన్యథాతేఽఖిలగురో ఘటేత కరుణాత్మనః ।
యస్య ఆశిష ఆశాస్తే న స భృత్యః స వై వణిక్ ॥ 4 ॥

ఓ అఖిలగురూ ! అట్లుగాక కరుణాత్ముడవైన నీకిట్లు చేయుట పొసగదు. స్వామినుండి ఆశీస్సులను, సంపదలను ఎవడైతే కోరునో అట్టివాడు భృత్యుడు గాదు. ధనముచే సేవకుని సేవలను గైకొనెడు వాడు స్వామి గాదు. అతడు వణిజుడు. (4)

టీ :–నను కిమహం భక్తం ప్రలోభయామి. న హి కింతు వరవృణీష్వేతి. వదతస్తవాభిప్రాయో ఽ న్య ఏవేత్యాహ – భృత్యలక్షణేతి. హృదయస్యగ్రన్థివద్బన్ధకేషు. (3)

టీ :–అన్యథా ఽ నర్థసాధనే ప్రవర్తనం న ఘటేతేత్యర్థః. కథమేవం భృత్యలక్షణ జ్ఞానంస్యత్తత్రాహ – యః ఇతి. తేత్వత్తః. (4)

టీ :– మరో విధముగా అనర్థసాధనమునందు ప్రవర్తించుట ఘటించదు అని అర్థము. ఇట్లు భృత్య లక్షణ జ్ఞానము ఎట్లు కటుగుననిన ఇట్లు చెప్పెను. ‘ యః ’ అని. తే= నీవలన ( 3,4 )

శ్లో॥ ఆశాసానో న వై భృత్యః స్వామిన్యాశిష ఆత్మనః ।
న స్వామీ భృత్యతః స్వామ్య మిచ్ఛన్యో రాతి చాశిషః॥ 5॥

స్వామినుండి ఆశిషః = సంపదలను తనకై కోరెడువాడు భృత్యుడు గాడు. భృత్యునినుండి స్వామ్యమును కోరుచున్నవాడై ఎవడైతే అతనిని ధనములను, సంపదలను ఒసంగునో అతడు స్వామియు గాడు. (5)

టీ :-నను కామనయాపి సేవ్యసేవకయోః స్వామి భృత్యభావః ప్రసిద్ధః. సత్యమ్. సోపాధి కో ఽ సౌ న తు తాత్త్విక ఇత్యాహ - స్వామిన్యాత్మన ఆశిషో ఽ పేక్షమాణోనైవ భృత్యః. భృత్య హేతుకమాత్మనః స్వామ్యమిచ్ఛన్యో భృత్యాయ దదాతి స చ నైవ స్వామీ. (5)

టీ :- ఓయీ కామన తోడను సేవ్య సేవకులకు స్వామి - భృత్య భావము ప్రసిద్ధమే కదా ! సత్యము. అది సోపాధికమైనది తాత్వికమైనది కాదని ఇట్లు చెప్పెను. స్వామినుండి తనకు భోగ భాగ్యములనపేక్షించువాడైనచో అతడు భృత్యుడు గాడు. భృత్యుని కారణముగా తనకు స్వామ్యమును కోరుచు భృత్యునకు ( ధనాదుల ) నొసంగిన అతడు స్వామియు గాడు.(5)

శ్లో ॥అహం త్వ కామస్త్వద్భక్తస్త్వంచ స్వామ్య న పాశ్రయః ।
నాన్యథేహా వయోరర్థో రాజసేవకయోరివ ॥ 6 ॥

నేనేమో కోరికలు లేనివాడను. నీ భక్తుడను, నీవేమో అనపాశ్రయుడవు, స్థిరమైన ఆశ్రయమైన స్వామివి. రాజ సేవకులకు వలె ఇందు మనకు వేరే విధముగా ప్రయోజనము లేదు. ( 6 )

టీ :- ఆవయోస్తు తాత్వికో ఽ సావిత్యాహ - అహంత్వితి. అనపాశ్రయో నిరభిసన్ధిః. అన్యథా కామాద్యభిసన్దినార్థః ప్రయోజనం నాస్తి. (6)

టీ :- మా ఇరువురి స్వామి భృత్య భావము ( ప్రహ్లాద, భగవంతుల స్వామి భృత్య భావము) సోపాధికము గాదు తాత్వికము. అని ఇట్లు చెప్పెను. ' అహంతు ' అని. అనపాశ్రయము=నిరభిసంధియైన వాడవు. ( అనగా అనిత్యమైన రూపగుణాదులకు ఆశ్రయమైన వాడవు గాదు) అట్లు గాక కామాది సంబంధముతో ప్రయోజనము లేదు.(6)

శ్లో ॥యది రాసీశ మేకామాన్ వరాంస్త్వం వరదర్షభ ।
నామానా హృద్య సంరోహం భవతస్తు వృణే వరమ్ ॥7॥

ఓ వరదర్షభా ! వరములొసంగు వారిలో శ్రేష్ఠమైన వాడా ! ఒకవేళ నీవు నా కోరికలను వరమొసంగ దలంచినచో నా హృదయమందు కామములు పుట్టకుండగా వరమును నీనుండి నేను కోరుచున్నాను. ( 7)

టీ :–నను తథాపి పరమోదారస్య మమ సంతోషార్థం కిమపి వృణీష్వేతి చేదతఆహ – యదీతి. కామాఙ్కురాణామసంరోహం అనుత్పత్తిమ్. భవతః సకాశాత్. (7)

టీ :– ఓయీ అయినప్పటికిని పరమోదారుడనైన నా యొక్క సంతోషము కొఱకు ఏదేని వరించుమనినచో ఇట్లనెను. ' యది ' అని. కామమనెడు అంకురములయొక్క అసంరోహం = అనుత్పత్తిని. (ఇచ్చట కామము ఒక మొలకతో అభేదముగా చెప్పబడినది). భవతః = నీనుండి, (7)

శ్లో ॥ ఇంద్రియాణి మనః ప్రాణ ఆత్మా ధర్మో ధృతిర్మతిః ।
హ్రీ శ్రీస్తేజః స్మృతిః సత్యం యస్య వశ్యంతి జన్మనా ॥8॥

ఇంద్రియములు, మనస్సు, ప్రాణము, ఆత్మ, ధర్మము, ధృతి, మతి, హ్రీ, శ్రీ, తేజస్సు, స్మృతి, సత్యము, ఎవనికైతే జన్మతోడనే నశించునో (8)

టీ :–నను కామోత్పత్తౌ సత్యాం కో దోషస్తత్రాహ – ఇంద్రియాదీని యస్య జన్మనా నశ్యన్తి. ఆత్మాదేహః. (8)

టీ :– ఓయీ కామోత్పత్తి గల్గిన నేమిదోషమనిన ఇట్లు చెప్పెను. ' యది ' ఇత్యాదిగా. ఇంద్రియాదులు ఎవనికైతే పుట్టుకతోడనే నశించునో, ఆత్మా = దేహము. ( 8 )

శ్లో ॥ విముంచతి యదా కామాన్ మానవో మనసి స్థితాన్ ।
తర్హ్యేవ పుండరీకాక్ష భగవత్త్వాయ కల్పతే ॥ 9 ॥

ఏ మానవుడైతే తన హృదయమందుండెడు కామములను ఎప్పుడైతే వదలగలడో ఓ పుండరీకాక్ష ! అప్పుడే అతడు భగవద్భావమును పొంద తగుచున్నాడు. (9)

టీ :–కామాభావే గుణ మాహ – విముఞ్చతీతి. భగవత్త్వాయ త్వత్స మానైశ్వర్యాయ. తథా చ శ్రుతి. "యదా సర్వే ప్రముచ్యన్తే కామాయే ఽ స్య హృది శ్రితాః, అథమర్త్యో ఽ మృతో భవత్యత్ర బ్రహ్మసనుశ్నుతే". ఇతి. (9)

టీ :– కామము లేనిచో గుణమేమియో ఇట్లు చెప్పెను. ' విముంచతి' యని. (మానవుడు మనస్సునందలి కామములను వదిలినప్పుడు మాత్రమే) భగవత్తత్వాయ= భగవత్సమాన ఐశ్వర్యమునకై (తగుచున్నాడు) శ్రుతియు ఇట్లు చెప్పుచున్నది. " ఎవని హృదయమందు ఉండెడు సమస్త కోరికలు

ఎప్పుడు తొలిగిపోవునో అప్పుడే మానవుడమరుడగు చున్నాడు. బ్రహ్మసముడగుచున్నాడు. ” అని. (9)

శ్లో ॥నమో భగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే ।
హరయేద్భుత సింహాయ బ్రహ్మణే పరమాత్మనే ॥ 10 ॥

మహాత్ముడవు, పురుషుడవు, అద్భుతమైన సింహ రూపుడవు, బ్రహ్మవు, పరమాత్మవు, హరివియగు పూజ్యుడవైన నీకు నమస్కారము.(10)

టీ :- నిర్దోషాన్కామాన్దాతుమిచ్ఛన్తం ప్రత్యాఖ్యాస్యన్నమస్యతి - నమఇతి. (10)

టీ :- నిర్దోషములైన కోరికల నిచ్చుటకు కోరుచున్న భగవంతునకు సమాధానమిచ్చుచున్నవాడై ఇట్లనెను. ‘ నమః ’ ఇత్యాదిగా. ( 10 )

**నృసింహ ఉవాచ :-**

శ్లో ॥నైకాంతినో మే మయిజాత్విహాశిష
ఆశాసతేముత్రచ యే భవద్విధ ।
అథాపి మన్వంతర మేతదత్ర
దైత్యేశ్వరాణా మనుభుంక్ష్వ భోగాన్ ॥ 11 ॥

**నృసింహుడిట్లు పలికెను :-**

నా యొక్క ఏకాంత భక్తులు ఎప్పుడు కూడా ఇహ పరములందు నా వద్ద భోగములను సంపదలను కోరనే కోరడు. ఐనప్పటికిని నీవు ఈ మన్వంతరము వరకు నా కథలను సేవించుచు ఇచ్చట దైత్యేశ్వరుల యొక్క భోగముల ననుభవించుము. (11)

టీ :- సత్యమేకాన్తభక్తస్త్వం తథాపి మదాజ్ఞాకరణీయేత్యాహ - ‘న’ ఇతి. మే ఏకాన్తినః కదాచిదపి ఇహాముత్ర చ మయ్యాశిషో న వాఞ్ఛన్త్యేవ, తథాప్యేతన్మన్వన్తరమాత్రం భోగాన్భున్క్ష్వ. (11)

టీ :- నిజమే నీవేకాంత భక్తుడవు. ఐనను నా ఆజ్ఞ పాటించవలసినదే, అని ఇట్లు చెప్పెను. ‘ న ’ అని. నా యొక్క ఏకాంత భక్తులు ఎప్పుడును ఇహ, పరములందును నా వద్ద భోగభాగ్యములను కోరరు గదా ! ఐనను ఈ మన్వంతరము వరకు మాత్రము భోగములను అనుభవించుము. (11)

శ్లో ॥ కథామదీయా జుషమాణః ప్రియా
స్త్వమాదేశ్య మామాత్మని సంతమేకమ్ ।
సర్వేషు భూతేష్వధియజ్ఞమీశం
యజస్వ యోగేన చ కర్మ హిన్వన్ ॥ 12 ॥

టీ :–నను తర్హి బన్ధః స్యాదిత్యతాహ – "కథా" ఇతి ద్వాభ్యామ్. సర్వేషు భూతేషు సన్తమేకమీశం యజ్ఞాధిష్ఠాతారం మామాత్మన్యావేశ్య యజస్వ, తర్హ్యనేనైవాపి కర్మణా బంధః స్యాన్నేత్యాహ – యోగేన మయ్యర్పణేన కర్మహిన్వన్ త్యజన్ యజస్వ. (12)

శ్లో ॥ భోగేన పుణ్యం కుశలేన పాపం
కలేవం కలజవేన హిత్వా ।
కీర్తిం విశుద్ధాం సురలోక గీతాం
వితాయ మామేష్యసి ముక్త బంధః ॥ 13 ॥

టీ :– కిం చ భోగేన సుఖానుభవేన ప్రారబ్ధం పుణ్యం హిత్వా ముక్త బంధస్సన్ లోకానుగ్రహార్థం కీర్తిం చ విస్తార్య మాం

సమస్త భూతములందుండెడు ఏకైక ప్రభువునైన యజ్ఞముల నధిష్ఠించి యుండెడు నన్ను ఆత్మలో భజించుము. యోగముచే నాయందర్పణ ద్వారా కర్మలను త్యజించుచు సేవించుము. (అట్లైన నీకీ కర్మబంధము కలుగదు). (12)

టీ :– అటులైన సంసారబంధము కలుగును కదా ! యనిన ఇట్లనెను. 'కదా' యని రెండు శ్లోకములతో. సమస్త భూతములందుండెడు ఏకైక ఈశుడను యజ్ఞాధిష్ఠాతను ఐన నన్ను నీ యందు ఆదేశింప జేసుకొని భజించుము. అట్లైనను ఈవిధముగా ఆచరించుట చేతను బంధము కలుగదా యనిన ఇట్లనెను. యోగముచే నాయందర్పించుట ద్వారా కర్మను హిన్వన్ = త్యజించుచు భజించుము. ( 12 )

భోగభాగ్యముల ననుభవించుట ద్వారా పుణ్యమును, పుణ్యా చరణముచే పాపమును త్యజించిన వాడవై కాలక్రమమున ఈ కలేబరమును వదిలి సురలోకమున గానము చేయబడు కీర్తిని ఆర్జించి ముక్త బంధుడవై నన్ను చేరెదవు. ( 13 )

టీ :– ఇంతే కాక భోగేన = సుఖానుభవముచేత గతమున సంపాదించ బడిన పుణ్యమునువదిలి సంసారబంధమును త్యజించిన వాడవై

ప్రాప్స్యసి. కుశలేన పుణ్యాచరణేన పాపం హిత్వేతి భిభిషామాత్రమ్. అన్యథా తస్య రాజ్యే ప్రవృత్తేః. న తు తస్యప్రాచీనం పాపమస్తి. 'తదధిగమ ఉత్తర పూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్' ఇతి న్యాయాత్. 'తత్సుకృత దుష్కృతే విధునతః' ఇతి శ్రుతేశ్చ. నచేదం ప్రారబ్ధపాపాభిప్రాయమ్, తస్య భోగేనైవ క్షయాత్, కుశలేన హిత్వేతి వచనానుపపత్తేః. నచాసావవిద్వానితి వాచ్యమ్, భగవతైవ కృతార్థత్వస్యానన్తరం వక్ష్యమాణత్వాత్. అత ఏవ యోగేన కర్మహిన్వన్నితీదమపి లోకసంగ్రహార్థే కర్మణి ప్రవర్తితస్య అనుద్వేగ మాత్రాయేతి సర్వమనవద్యమ్. (13)

లోకములకాదర్శము కొఱకై కీర్తిని కూడా విస్తరింపజేసి నన్ను పొందెదవు. కుశలేన = పుణ్యా చరణముచే పాపమును వదిలి యనునది బెదురు మాత్రమే. లేనిచో అతనికి రాజ్యమున ప్రవృత్తి కలుగకుండును. అందులకు అతనికైతే గతమున చేయబడిన పాపము లేదు. " రాబోవు కాలమున పాపములంటకుండుట, గతకాలమున గావించబడిన పాపములు నశించుట, అనునవి ఆ పరబ్రహ్మను పొందుట యందలి హేతువులుగా ఉపదేశించ బడినందున " అను న్యాయమున, ' ఆ పుణ్య పాపములను వదిలించుకొను వానికి ' అను శ్రుతి వలనను, ఇది గతమున చేయబడిన పాపము నుద్దేశించి చెప్పబడినది కాదు. అనుభవము చేతనే దాని నాశము ( క్షయము ) కలుగుట వలన, " కుశలేన హిత్వా " అను వచనమునకు అనుపపత్తి కలుగుటవలన, అతడు ఎరిగిన వాడు కాదు (అవిద్వాంసుడు ) అని చెప్పతగదు. కృతార్థతను పొందిన పిదపనే భగవంతునిచే చెప్పబడినందున, కావుననే ' యోగముచే కర్మను వదిలిన వాడై ' అనునదియు లోకోపదేశమునకై కర్మయందు ప్రవర్తించిన వానికి అనుద్వేగము కలుగకుండుటకు మాత్రమే అని సర్వము యుక్తమే. (13).

శ్లో ॥ య ఏతత్ కీర్తయేన్మహ్యం త్వయా గీత మిదం నరః ।
త్వాంచ మాంచ స్మరన్ కాలే కర్మబంధాత్ప్రముచ్యతే ॥ 14 ॥

నిన్ను, నన్ను, ఈ నా చరితమును స్మరించుచు నాకై నీచే గావించ బడిన ఈ స్తుతి గానమును ఎవరైతే కీర్తింతురో వారును తగు సమయమున ముక్తి బొందుదురు. (14)

టీ :-కిం చ - య ఇతి. త్వాం చ మాం చేదం మచ్చరిత్రం చ స్మరన్నేతత్ స్తోత్రం యః కీర్తయేత్ సో ఽ పి కర్మబంధాద్వి ముచ్యతే. కుతస్తవ బంధశఙ్కేత్యర్థః. (14)

టీ :- ఇంతు గాక "యః" అని. నిన్ను, నన్నును, ఈ నా చరిత్రమును స్మరించుచు ఈ స్తోత్రమును ఎవరైతే కీర్తింతురో వారును కర్మబంధమునుండి ముక్తినొందుదురు. ఐనప్పుడు నీకు బంధ శంక ఎందులకని అర్థము. (14)

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో ॥ వరం వరయ ఏతత్తే వరదేశాన్మహేశ్వర ।
యదనిందత్పితామేత్వాం అవిద్వాం స్తేజ ఐశ్వరమ్ ॥15॥

శ్లో ॥ విద్ధామర్షాశయః సాక్షా త్సర్వలోక గురుం ప్రభుం ।
భ్రాతృహేతి మృషాదృష్టి స్త్వద్భక్తే మయిచాఘవాన్ ॥16॥

**ప్రహ్లాదుడు ఇట్లు పలికెను :-**

ఓ మహేశ్వరా ! వరదేశుడవైన నీనుండి ఈ వరమును కోరుచున్నాను. ఏదైతే అజ్ఞానియైన నా తండ్రి తేజోవంతుడవు, ఈశ్వరుడవైన నిన్ను నిందించెనో, కోపపీడ చిత్తుడై సాక్షాత్తుగ సర్వలోక గురువైన, ప్రభువైన నిన్ను గూర్చి భ్రాతృహంతకుడవని అసత్యబుద్ధి గలవాడై నీ భక్తుడనైన నాయందు పాపకార్యముల నొనర్చెనో (15,16)

టీ:- ఈశ్వరాజ్ఞయా ప్రాప్తకర్మాధికార సన్పితుర్నిష్కృతిం ప్రార్థయతే త్రిభిః. వరం వరణీయమేతదపరం వృణేత్వేత్తః. (15)

టీ :- ఈశ్వరాజ్ఞచే పొందబడిన కర్మాధికారము గలవాడై తండ్రికి నిష్కృతి కలుగుటకై మూడు శ్లోకములచే ప్రార్థించుచున్నాడు. వరం = కోరదగినది మరొకటి కోరుచున్నాను. తే = నీనుండి. (15)

టీ:- విద్ధో ఽ మర్షేణ క్రోధేనాశయో యస్య. (16)

టీ :- ఆమర్షేణ=క్రోధముచే పీడించబడిన ఆశయము (మనస్సు) కలవాడు.(16)

శ్లో॥ తస్మాత్పితామే పూయేత దురంతా ద్దుస్తరాదఘాత్ ।
పూతస్తేఽపాంగ సందృష్ట స్తదాకృపణ వత్సల ॥ 17 ॥

టీ:- తే ఉపాఙ్గేన సందృష్టో ఉతః పూత ఏవ తథాపి భో కృపణ వత్సల, కార్పణ్యేన ప్రార్థయ ఇత్యర్థః. (17)

అందువలన నాతండ్రి (కలిగిన) దురంతమైన, దుస్తరమైన పాపము నుండి పవిత్రుడగును గాక. ఓ కృపణవత్సలా ! అప్పుడు నీ అపాంగవీక్షణచే కాంచబడిన వాడై పవిత్రుడగును. ( 17 )

టీ :- నీ యొక్క అపాంగముచే చూడబడిన వాడు కాన పవిత్రుడే. ఐనను ఓ దీనవత్సలా ! దైన్యముచే ప్రార్థించుచున్నాను అని అర్థము.(17)

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ త్రిః సప్తభిః పితా పూతః పితృభిః సహతేనఘ !
యత్సాధోఽస్య గృహేజాతో భవాన్ వై కులపావనః ॥18॥

టీ:- యద్యపి కశ్యపో మరీచిర్బ్రహ్మేతి తత్పితుస్త్రయ ఏవ పూర్వజా స్తథాపి త్రిః సప్తభిః సహేతి ప్రాకల్ప గత పితృభి ప్రాయేణోక్తమ్ యద్యస్మాత్. (18)

**భగవంతుడిట్లు చెప్పెను :-**

దానికి సమాధానముగా భగవంతుడిట్లు చెప్పెను. ఓ సజ్జనా! పావనుడవగునీవు ఇతని వంశమందు పుట్టినందుననే ఓ పుణ్యాత్ముడా! ఈ నీ తండ్రి ఇరువదియొక్క పూర్వ పితరులతోడ (ఇరువదియొక్క తరములతో పాటు) పవిత్రుడైనాడు. ( 18 )

టీ :- కశ్యపుడు, మరీచి, బ్రహ్మయని అతని తండ్రులు ( పితరులు ) మువ్వురే పూర్వజులైనప్పటికీ ఇరువదియొక్క పితరులతోడ యని పూర్వ కల్పములందలి పితరులను అభిప్రాయముతో చెప్పబడినది. యత్ = ఏ కారణమున. (18)

శ్లో॥ యత్ర యత్రచ మద్భక్తాః ప్రశాంతాః సమదర్శినః ।
సాధవః సముదాచారాస్తే పూయంత్వపి కీకటాః ॥19॥

ప్రశాంతచిత్తులు, సమదర్శులు, సాధులు, సదాచార సంపన్నులు నైన మద్భక్తులు ఎచ్చటెచ్చటనుందురో అట్టి కీకటదేశములైన, తత్సదృశములైన వంశములైనను పరిశుద్ధములగుచున్నవి. ( 19 )

టీ :-సమ్యగుత్తమాచారో యేషాం తే కీకటా అపి దేశాస్తతుల్య వంశాశ్చ పూయన్తే శుద్ధా భవన్తి. (19)

టీ :- మంచి ఉత్తమమైన ఆచారముగలవారుగల ఆ ' కీకట ' అను దేశములైనను వానితో సదృశములైన వంశములైనను పూయంతే=శుద్ధ ములగుచున్నవి. ( 19 )

శ్లో ॥సర్వాత్మనా న హింసంతి భూతగ్రామేషు కించన ।
ఉచ్చావచేషు దైత్యేంద్ర మద్భావేన గతస్పృహాః ॥ 20 ॥

ఓ దైత్యేంద్రా ! వీతరాగులైన వారు నేనే అను భావముచే చిన్న పెద్ద అను ప్రాణి లోకమును హృదయ పూర్వకముగా ఏ కొంచెమును హింసించరు. (20)

టీ :-నను త్వద్భక్తానామయం మహిమేతి న చిత్రమ్, అహం తు తాదృశో న భవామీతి చేత్తత్రాహ - సర్వాత్మనేతి ద్వాభ్యామ్. మద్భావేన మద్భక్త్యా విగతా స్పృహా యేషామ్. (20)

టీ :- నీ భక్తులకు ఇట్టి మహిమ కలదనుట చిత్రము గాదు కదా ! ఐనను నేనైతే అట్టి వాడను గాదు. అనిన ఇట్లు చెప్పెను. ' సర్వాత్మనా' అను రెండు శ్లోకములచే. మద్భావేన = నాయందలి భక్తితో తొలగిపోయిన కోరికటు గలవారు. ( 20 )

శ్లో ॥భవంతి పురుషాలోకే మద్భక్తాస్త్వా మనువ్రతాః ।
భవాన్మేఖలు భక్తానాం సర్వేషాం ప్రతిరూపధృక్ ॥ 21 ॥

లోకమున నిన్ను అనుసరించెడు పురుషులు కొందరు నాభక్తులగు చున్నారు. నాభక్తులందరకు నీవు ఉపమానాస్పదుడవు కదా! అని అర్థము. (21 )

టీ:- త్వామనుగతా యేకేచిత్పురుషాః తే ఉ ప్యేవం లక్షణాః సన్తః మద్భక్తాః. భవన్త్ యతో భవాన్మేభక్తానాం సర్వేషాం ప్రతిరూపధృ గుపమాస్పదమ్. శ్రేష్ఠః ఖిల్విత్యర్థః. (21)

టీ :- నిన్ననుసరించెడు ఏ పురుషులైతే కలరో వారునూ ఇట్టి లక్షణములే కలవారగుచున్నవారై నా భక్తులగుచున్నారు. కాన నీవు నా భక్తులకు అందరికిని ప్రతిరూపధృక్ = ఉపమానాస్పదుడవు. శ్రేష్ఠుడవు గదా ! అని అర్థము. (21)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ కురుత్వం ప్రేతకార్యాణి పితుః పూతస్య సర్వశః ।
మదంగ స్పర్శనేనాంగ ! లోకాన్యాస్యతి సుప్రజాః ॥22॥

ఓ అంగా ! నా శరీర స్పర్శచే అన్ని విధములుగా పవిత్రుడైన నీ తండ్రికి నీవు ప్రేత కార్యములను గావింపుము. పుణ్యలోకములను చేరగలడు. (22)

టీ:- మదఙ్గ స్పర్శేన సర్వశఃపూతస్య తే పితుః పాపశఙ్కైవనాస్తి. కేవలం పుత్ర కృత్యాని ప్రేతకార్యాణికురు. (22)

టీ :- నా యొక్క అంగస్పర్శచే అన్ని విధముల పవిత్రుడైన నీ తండ్రికి పాప శంకయే లేదు. కేవలము పుత్రకృత్యములైన ప్రేతకార్యములను గావించుము. (22)

(ఉత్తరక్రియలు పుత్రుని కర్తవ్యము. ప్రేతలకుకాదు.)

శ్లో ॥ పిత్ర్యంచ స్థానమాతిష్ఠ యథోక్తం బ్రహ్మ వాదిభిః ।
మయ్యావేశ్య మనస్తాత ! కురు కర్మాణి మత్పరః ॥23॥

నాయనా ! వేదవేత్తలచే చెప్పబడినట్లుగా నీ పితృసంబంధమైన సింహాసనమును అధిష్ఠించుము. బ్రహ్మవాదులచే చెప్పబడిన మాటల నతిక్రమించక నాయందు మనస్సు నిలిపినవాడవై పనులను నాయందర్పించి సమస్త కార్యములను నిర్వహించుము. ( 23 )

('మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే । శ్రద్ధయా పరయోపేతా తేమే యుక్త తమా మతాః॥" (12-2) అని గీతావచనము ఇచ్చట స్మరించదగును ).

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ప్రహ్లాదోపి తథాచక్రే పితుర్యత్సాం పరాయకమ్ ।
యథామ భగవాన్ రాజన్ అభిషిక్తో ద్విజోత్తమైః ॥24॥

శ్లో ॥ ప్రసాద సుముఖం దృష్ట్వా బ్రహ్మ నరహరి హరిమ్ ।
స్తుత్వా వాగ్భిః పవిత్రాభిః ప్రాహదేవాదిభిర్వృతః ॥25॥

**బ్రహ్మోవాచ :-**

శ్లో ॥ దేవదేవాఖిలాధ్యక్ష భూతభావన పూర్వజ ।
దిష్ట్వా తే నిహతః పాపో లోక సంతాపనోసురః ॥26॥

టీ:- బ్రహ్మవాదిభిర్వేదవాదిభిః. ఉక్తమనతిక్రమ్య మత్పరః సత్కర్మాణి కురు. (23,24,25,26)

శ్లో॥ యోసౌలబ్దవరో మత్తో నవధ్యో మమ సృష్టిభిః ।
తపోయోగ బలోన్నద్ధః సమస్త నిగమానహన్ ॥ 27 ॥

**నారదుడిట్లు పలికెను :-**

ఓ రాజా ! భగవంతుడిట్లు చెప్పినట్లుగా బ్రాహ్మణోత్తములచే పట్టాభిషిక్తుడై ప్రహ్లాదుడు కూడా తండ్రియొక్క ప్రేతకర్మను గావించెను. (24)

ప్రసన్నుడై సుముఖముగా నున్న నరసింహరూపుడగు హరిని చూచి బ్రహ్మ, దేవాదులతో కూడినవాడై పవిత్రములైన వాక్కులచే స్తుతించి ఇట్లనెను. (25)

**బ్రహ్మ ఈ విధముగా పలికెను :-**

ఓ దేవ దేవా ! అఖిలాధ్యక్షా ! భూతభావనా ! పూర్వజా ! లోకములకు సంతాపమును కలిగించెడు పాపుడైన ఆ హిరణ్యకశిపుడను అసురుడు అదృష్టముమే నీవలన చంపబడినాడు. (26)

టీ :- బ్రహ్మవాదిభిః = వేదపండితులచే చెప్పబడిన దానిని అతిక్రమించక నాయందాసక్తుడవై సకలకర్మలను గావించుము.
(23, 24, 25, 26)

వాడు నాచే వరములను పొంది మత్తుడై నా సృష్టములైన ప్రాణులచే అనవధ్యుడై తపోయోగబలముచే గర్వితుడై సకల వేదములను ధ్వంసమొనర్చెను. ( 27 )

టీ :–మమ సృష్టిభిః మయాసృష్టైర్భూతైః. సమస్తాన్నిగమాన్ధర్మా నిత్యర్థః. అహన్‌హతవాన్. స త్వయా హతః ఏతద్దిష్ట్యాభద్రమ్. (27)

శ్లో॥ దిష్ట్యాస్య తనయః సాధుః మహాభాగవతోర్భకః ।
త్వయా విమోచితో మృత్యో ర్దిష్ట్యాత్వాం సమితోధునా ॥28॥

టీ:– సమితః సమ్యక్ ప్రాప్తః. (28)

శ్లో॥ ఏతద్వపుస్తే భగవన్ధ్యాయతః ప్రయతాత్మనః ।
సర్వతో గోప్తృ సంత్రాసాన్మృత్యోరపి జిఘాంసతః ॥29॥

టీ:– సర్వతః సంత్రాసాత్ గోప్తృరక్షకమ్. (29)

**నృసింహ ఉవాచ :–**

శ్లో ॥మైనం వరో సురాణాంతే ప్రదేయః పద్మసంభవ ।
వరః క్రూర నిసర్గాణా మహీనా మమృతం యథా ॥ 30 ॥

టీ :– మమ సృష్టిభిః = నాచే సృష్టించబడిన ప్రాణులచేత, సమస్తమైన, నిగమాన్ = ధర్మములను అని అర్థము. అహన్ = హతము గావించెను. ఆ అసురుడు నీచే హతమార్చబడినాడు. ఇది దైవవశమున శుభము.(27)

వీని తనయుడైన, సజ్జనుడైన, మహాభాగవతుడగు బాలుడు దైవవశమున నీచే మృత్యువునుండి విడిపించబడినవాడై ఇప్పుడు నిన్ను బాగుగా చేరుకొన్నాడు. ( 28 )

టీ :– సమితః = బాగుగా పొందెను. ( 28 )

ఓ భగవాన్ ! అన్ని విధముల భయములనుండి రక్షించెడు ఈ నీ శరీరమును నిశ్చలమనస్కుడై ధ్యానించునట్టి వానిని హింసించెడు (చంపెడు) మృత్యువునుండి కూడా ముక్తి కలుగును. అని బ్రహ్మ నరహరిని కొనియాడెను. (29)

టీ :– అన్ని రకముల భయములనుండి గోప్తృ = రక్షకుని. ( 29 )

**నరసింహుడిట్లు పలికెను :–**

ఓ పద్మ సంభవా ! అసురులకు నీవు ఇట్టి వరములనీయవలదు. క్రూరస్వభావము గలవారికి ఇచ్చెడు ఇట్టి మహత్తరమైన వరములు పాములకు అమృతము ( పాలు ) పోసినట్లు కాగలదు. అని. ( 30 )

టీ :- ఏవం వరస్త్వయా న ప్రదేయః. క్రూరో నిసర్గ స్వభావో యేషామ్. అమృతం క్షీరమ్. (30)

టీ :- ఇట్టి గొప్పనైన వరము నీచే ఇవ్వ దగదు. క్రూరమైన, నిసర్గః=స్వభావము గలవానికి, అమృతం = పాలు. ( 30 ).

**నారద ఉవాచ :-**

**నారదుడు ఇట్లు చెప్పుచున్నాడు :-**

శ్లో ॥ ఇత్యుక్త్వా భగవాన్ రాజన్ స్తత్రైవాంతర్ధధే హరిః ।
అదృశ్యః సర్వభూతానాం పూజితః పరమేష్ఠినా ॥ 31 ॥

ఓ రాజా ! ఇట్లు చెప్పినవాడై భగవంతుడు అచ్చటనే అంతర్ధానమయ్యెను. సమస్త ప్రాణులకు అదృశ్యుడైన ఆ భగవంతుడు బ్రహ్మచే పూజింపబడెను. ( 31 )

శ్లో ॥ తతః సంపూజ్య శిరసా వవందే పరమేష్ఠినమ్ ।
భవం ప్రజాపతీందేవాన్ ప్రహ్లాదో భగవత్కలాః ॥ 32 ॥

తర్వాత ప్రహ్లాదుడు భగవదంశ సంభూతులైన పరమేష్ఠికి, ప్రజాపతులకు, దేవతానీకమునకు శిరసానమస్కరించెను. చక్కగా పూజించెను.(32)

శ్లో ॥ తతః కావ్యాదిభిః సార్థం మునిభిః కమలాసనః ।
దైత్యానాం దానవానాం చ ప్రహ్లాదమకరోత్పతిమ్ ॥ 33 ॥

అనంతరము శుక్రుడు మొదలైన మునులతోడ కమలాసనుడు ప్రహ్లాదుని రాక్షసులకు, దానవులకు ప్రభువును గావించెను. ( 33 )

శ్లో ॥ ప్రతినంద్య తతోదేవాః ప్రయుజ్య పరమాశిషః ।
స్వధామాని యయూరాజన్ బ్రహ్మాద్యాః ప్రతిపూజితాః ॥34॥

ఓ రాజా ! అటు పిమ్మట ప్రహ్లాదుని దేవతలు గొప్పగ ఆశీర్వదించి, అభినందించి, బ్రహ్మాదిదేవతలు తిరిగి పూజలందుకొని తమ తమ నివాసములకేగిరి. ( 34 )

శ్లో ॥ ఏవం తా పార్షదౌ విష్ణోః పుత్రత్వం ప్రాపితో దితేః ।
హృదిస్థితేన హరిణా వైర భావేన తౌ హతౌ ॥ 35 ॥

ఇట్లు ఆ విష్ణు పార్షదులు ( ద్వారపాలురు ) దితికి పుత్రులై జన్మించి హృదయమందే యుండెడు హరిచే వైరభావముతో చంపబడినారు. (35)

టీ :–శిశుపాల దన్తవక్త్రయోర్ద్విషతోః శ్రీకృష్ణసాయుజ్యం కథమితి యత్పృష్టం తదేవ తయోః పూర్వజన్మకథనాదిభిః ఉపపాదితు ముపసంహరతి – ఏవమితి సప్తభిః. దితేః పుత్రత్వం ప్రాపితౌ. విప్రశాపేనేత్యుత్తరస్యానుషఙ్గః. (31 – 36)

టీ :– ద్వేషించెడు శిశుపాల దంతవక్త్రులకు శ్రీకృష్ణుని సాయుజ్యమెట్లు కలిగినదని ఏదైతే అడుగబడినదో దానినే పూర్వజన్మ వృత్తాంతములను వర్ణించుట మొదలైన వానిచే ఉపపాదించుచు ఉపసంహారము గావించుచున్నాడు. ‘ ఏవం ’ ఇత్యాది ఏడు శ్లోకములతో. దితియొక్క పుత్రరూపమును పొందించబడినారు. విప్రశాపముతో యని ముప్పదియారవ శ్లోకముతో సంబంధము. ( 31 – 36)

శ్లో॥ పునశ్చ విప్రశాపేన రాక్షసౌ తౌ బభూవతుః ।
కుంభకర్ణ దశగ్రీవౌ హతౌ తౌ రామ విక్రమైః ॥ 36 ॥

మరియును విప్రశాపముచే రావణ కుంభకర్ణులను రాక్షసులైరి. వారు రాముని పరాక్రమములచే చంపబడిరి. ( 36 )

శ్లో॥ శయానౌ యుధినిర్భిన్న హృదయౌ రామ సాయకైః ।
తచ్చిత్తౌ జహతుర్దేహం యథా ప్రాక్తన జన్మని ॥ 37 ॥

వారు రాముని బాణములచే యుద్ధమున చీల్చబడిన హృదయములు గలవారై, పడిపోయినవారై పూర్వజన్మమునందు వలెనే ఆ హరియందే చిత్తముగలవారై తనువు చాలించిరి. ( 37 )

టీ:– తచ్చిత్తౌ శ్రీరామే చిత్తం యయోస్తౌ. (37)

టీ :– తచ్చిత్తౌ = శ్రీరామునియందు చిత్తముగలవారై. ( 37 )

శ్లో ॥ తావిహాథ పునర్జాతౌ శిశుపాల కరూషజౌ ।
హరౌ వైరానుబంధేన పశ్యతస్తే సమీయతుః ॥ 38 ॥

ఆ రావణకుంభకర్ణులు (అట్లు శ్రీరామునిచే అంతమొందించ బడిన వారై) మరల ఈ లోకమున శిశుపాల దంతవక్త్రులుగా జన్మించిరి. వారు హరియందలి వైరానుబంధముచే అతనినే ( ఎల్లవేళలా ) దర్శించుచు ఆతనిని పొందిరి. ( 38 )

టీ :–కరూషజో దన్తవక్త్రః, హరౌసాయుజ్యం సమీయతుః. (38)

టీ :– కరూషజః = దంతవక్త్రుడు. ( మరియు శిశుపాలుడు ) హరి సాయుజ్యమును పొందిరి. ( 38 )

శ్లో ॥ ఏనః పూర్వకృతం యత్తద్రాజానః కృష్ణ వైరిణః ।
జహుస్త్వంతే తదాత్మానః కీటః పేశస్కృతో యథా ॥ 39 ॥

పూర్వము గావించిన పాపము ఏదో దానినా కృష్ణవైరులైన రాజులు అంతమున అతనినే హృదయమున దాల్చినవారై గూడుకట్టి అందుంచబడిన కీటకములు భ్రమరముచే గానము చేయబడుచు, దానినే స్మరించుచు భ్రమరములైనట్లు తాదాత్మ్యము నొందిరి. ( 39).

టీ :–కృష్ణనిన్దాదినా పూర్వకృతం చ యదేనః పాపం తద్ధ్యానేన తదాత్మానః సన్తః జహుః. తదాత్మత్వే దృష్టాన్తః – కీటః పేశకృతః ధ్యానేన యథా తదాత్మాభవతీతి. (39)

టీ :– శ్రీకృష్ణుని నిందాదులచే కలిగిన పాపమును అతనిని (మనస్సున) ధ్యానించుట ద్వారా తాదాత్మ్యము నొందినవారై వదిలివేసిరి. తాదాత్మ్యము నొందుటకు దృష్టాంతము – ( భ్రమర కీటక న్యాయము ) భ్రమరముచే తేబడిన కీటకము మట్టిచే నిర్మితమైన గూటిలో బంధించబడి భ్రమరముచే నిత్యము గానము చేయబడుచు దానినే స్మరించుచు క్రమముగా భ్రమరముగా రూపొందును. అట్లే వీరునూ హరిసాయుజ్యము నొందిరని చెప్పబడినది. (39 )

శ్లో ॥ యథా యథా భగవతో భక్త్యాప మయాభిధా ।
నృపాశ్చైద్యాదయః సామ్యం హరేస్తచ్చింతయా యయుః ॥40॥

శిశుపాలుడు మొదలైన రాజులు గూడా భక్తులు భగవదభేద దర్శన పూర్వకమైన భక్తిచే ఎట్లైతే శ్రీహరి సామ్యమునొందెదరో అట్లే ద్వేషము చేత గూడా అతనిని చింతించుట ద్వారా ఆ హరి సామ్యమును పొందిరి.(40)

శ్లో ॥ఆఖ్యాతం సర్వమేతత్తే యన్మాంత్వం పరిపృష్టవాన్ ।
దమ ఘోష సుతాదీనాం హరేః సామ్య మపిద్విషామ్ ॥ 41 ॥

నీవు నన్ను అడిగినట్లుగ శత్రువులైన శిశుపాలాదులకు కల్గిన హరి సామ్యమును గూర్చియు సర్వము ఇదిగో నీకు చెప్పబడినది. 41

టీ :–అభిదా భేదదర్శన శూన్యయా, హరేః సామ్యం సారూప్యమ్. (40,41)

టీ :– అభిదా = భేద బుద్ధి లేనట్టి (పరమయా = జ్ఞాన వైరాగ్యములకంటే శ్రేష్ఠమైన వైర భావముచే ) సామ్యం = సారూప్యమును (పొందిరి). (40,41)

శ్లో ॥ఏషా బ్రహ్మణ్య దేవస్య కృష్ణస్య చ మహాత్మనః ।
అవతార కథా పుణ్యా వధో యత్రాది దైత్యయోః ॥ 42 ॥

ఇదిగో ఈ ఆఖ్యానమునందు బ్రహ్మ స్వరూపుడైన విష్ణువుని, తదవతారమైన మహాత్ముడగు శ్రీకృష్ణుని పుణ్యమైన అవతారకథ, అందు ఆదిదైత్యులైన రావణ కుంభకర్ణుల వధ చెప్పబడినది. ఇచ్చట అవతారకథ యనిన నృసింహావతార కథయని గ్రహించనగును. (42)

టీ :– ప్రహ్లాద చరితార్థముపసంహరతి – ఏషేతి చతుర్భిః. అవతారః శ్రీనృసింహరూప తస్య కథా ఆఖ్యాతేతి లిఙ్గవ్యత్యయః పూర్వేణాన్వయః ఇతి. చక్ర. (42)

టీ :– ప్రహ్లాద చరిత ప్రయోజనమును ముగించుచున్నాడు. ' ఏషా ' యను శ్లోకము మొదలు నాల్గింటిచే. అవతారః = నృసింహావతారము యొక్క కథ చెప్పబడినది అని శేషము. ( 42 )

శ్లో ॥ప్రహ్లాదస్యాను చరితం మహాభాగవతస్య చ ।
భక్తిః జ్ఞానం విరక్తిశ్చ యాథాత్మ్యం చాస్య వై హరేః ॥43॥

మరియు మహాభాగవతుడైన ప్రహ్లాదచరిత్రము, భక్తి– జ్ఞాన– వైరాగ్యముల స్వరూపము, ఈ హరియొక్క యథార్థ భావమును నిరూపించబడినది. ( 43 )

టీ :-ప్రహ్లాదస్యానుచరిత మిత్యాదేః సమామ్నాతమితి తృతీయే నాన్వయః. అస్యేతి తృతీయార్థే షష్ఠీ. అనేన ప్రహ్లాదేన ఉక్తమిత్యధ్యాహారః. అస్యేత్యనేనోక్తం సర్గస్థితిత్యప్యయానామీశస్య హరేర్యాథ్యాత్మ్యం తత్త్వమ్, అనేనకృతం హరేర్గుణ కర్మానువర్ణనం చేత్యర్థః. (43)

శ్లో ॥సర్గ స్థితి త్యప్య యేశస్య గుణ కర్మాను వర్ణనమ్ ।
పరావరేషాం స్థానానాం కాలేన వ్యత్యయో మహాన్ ॥44॥

శ్లో ॥ధర్మో భాగవతానాం చ భగవాన్ యేన గమ్యతే ।
ఆఖ్యేనేస్మిన్ సమామ్నాత మాధ్యాత్మిక మశేషతః ॥ 45 ॥

టీ :- పరావరేషాం దేవ- దైత్యాదీనాం యానిస్థానాని తేషాం వ్యత్యయః విపర్యాసః. (44)

టీ:- ఆధ్యాత్మికమాత్మానాత్మ వివేకాది. (45)

శ్లో ॥య ఏతత్పుణ్య మాఖ్యానం విష్ణోర్వీర్యోప బృంహితమ్ ।
కీర్తయేచ్ఛ్రద్ధయా శ్రుత్వా కర్మపాశై ర్విముచ్యతే ॥ 46 ॥

టీ :- ప్రహ్లాదుని యొక్క చరిత్రము ఇత్యాది వాక్యమునకు ‘ సమామ్నాతం’ (చెప్పబడినది) అను మూడవ శ్లోకములోని పదముతో అన్వయము. ‘అస్య’ అను దానిచే సృష్టి, స్థితి, లయములకీశుడైన హరియొక్క యాథాత్మ్యం=తత్త్వము అని చెప్పబడినది. ఈ ప్రహ్లాదునిచే గావించబడిన హరియొక్క గుణకర్మాను వర్ణనము కూడ యని అర్థము. (43)

సృష్టి, స్థితి, లయములకు ఈశుడైన హరియొక్క గుణకర్మల వర్ణనము, దేవదైత్యులయొక్క స్థానములు కాలక్రమమున గొప్ప విపర్యాసము నొందుట, మరియు భగవంతుని పొందెడు మార్గమైన భాగవతుల ధర్మము, సంపూర్ణమైన ఆధ్యాత్మిక జ్ఞానము బాగుగ చెప్పబడినది. ( 44, 45 )

టీ :- పరావరేషాం = దేవ దైత్యాదులయొక్క ఏ యే స్థానములైతే కలవో వాని యొక్క వ్యత్యయము = విపర్యాసము. ( 44 )

టీ :- ఆధ్యాత్మినం = ఆత్మానాత్మ వివేకాదికము. ( 45 )

విష్ణువుయొక్క వీర్యములను (పరాక్రమములను) ఉపవర్ణించునట్టి పుణ్య ప్రదమైన ఈ ఆఖ్యానమును ఎవరైతే శ్రద్ధగావిని కీర్తించెదరో వారు కర్మబంధమునుండి విముక్తినొందెదరు. (46)

టీ :- ఏతచ్ఛ్రవణాది ఫలమాహ - 'యః' ఇతి ద్వాభ్యామ్. ఏతచ్ఛ్రుత్వా యః కీర్తయేత్. (46)

టీ :- దీనిని శ్రవణాదులవలని ఫలమునిట్లు చెప్పెను. ' యః ' ఇత్యాది రెండు శ్లోకములతో. దీనిని విని ఎవడైనా కీర్తించినట్లైతే. (46)

శ్లో ॥ ఏతద్య ఆది పురుషస్య మృగేంద్ర లీలాం
దైత్యేంద్ర యూధప వధం ప్రయతః పరేత ।
దైత్యాత్మజస్య చ సతాం ప్రరస్య పుణ్యం
శ్రుత్వాఽనుభావ మకుతో భయమేతి లోకమ్ ॥ 47

ఎవడైతే ఈ ఆది పురుషుడైన నృసింహుని లీలను, మదగజము వంటి దైత్యేంద్రుడైన హిరణ్యకశిపుని సంహారమును శ్రద్ధగా చదువునో, దైత్యాత్మజుడైన, సజ్జన శ్రేష్ఠుడైన ప్రహ్లాదుని పుణ్యప్రభావమును వినునో అతడు ఏ విధమైన భయము లేని వాడై వైకుంఠమును పొందును. 47

టీ :-ఏతదేతాం మృగేన్ద్రస్య లీలాం.. తామేవాహ - దైత్యేన్ద్రస్య యూధపానాం చ వధమ్. యః శుచిః సన్ పఠేత. పుణ్యమను భావం ప్రభావం మతినిశ్చయం వా. లోకం వైకుంఠం. (47)

టీ :- ఏతత్ = ఏతాం = ఈ మృగేంద్రునియొక్క (నరసింహుని యొక్క) లీలను, దానినే ఇట్లు చెప్పెను. దైత్యేంద్రుని యొక్క (హిరణ్యకశిపునియొక్క) సైన్యాధిపతులయొక్క యు వధను, ఎవడైతే శుచియై పఠించునో, పుణ్యమైన అనుభావం = ప్రభావమును, మతినిశ్చయమునైనను, లోకం=వైకుంఠమును. ( 47 )

శ్లో ॥ యూయం నృలోకే బత భూరి భాగా
లోకం పునానా మునయోఽభియంతి ।
యేషాం గృహానా వసతీతి సాక్షా
ద్గూఢంపరం బ్రహ్మ మనుష్య లింగమ్ ॥ 48 ॥

ఎవరి గృహములను సాక్షాత్తు ఆ పరం బ్రహ్మ మనుష్య రూపుడై గూఢముగ నివసించుచున్నాడో అట్టి కారణమున ఆ మీ గృహములను, లోకములను పవిత్రము చేయుచున్న మహానుభావులైన మునులు చేరవచ్చుచున్నారు. కావున మీరే ఈ లోకమున గొప్ప అదృష్టవంతులు.(48)

టీ :-అహో ప్రహ్లాదస్య భాగ్యం యేన దేవో దృష్టో వయం తు మన్దభాగ్యా ఇతి విషీదన్తం ప్రత్యాహ - యూయమితి త్రిభిః. యేషాం యుష్మాకం గృహ్యాన్మునయోఽభియన్తి సర్వతః సమాయాన్తి. తత్కస్య హేతోః, యేషు గృహేషు నరాకారం గూఢం సచ్ఛ్రీకృష్ణాఖ్యం పరంబ్రహ్మ సాక్షాద్వసతీతి. (48)

టీ :- ఆహా ! ప్రహ్లాదుని భాగ్యము, ఎందుచేతననగా దేవుడైన పరమాత్మ దర్శించబడినాడు. మేమైతే మందభాగ్యులము అని దుఃఖించెడు వానిని గూర్చి ఇట్లు చెప్పెను. ' యూయం ' ఇత్యాది మూడు శ్లోకములచే. ఏ మీయొక్క గ్రహములను మునులు అభియంతి = అన్నివైపుల వచ్చుచున్నారు. అది ఏ కారణమున, ఏ గృహములందు నరాకారమున గూఢముగా నున్న శ్రీకృష్ణుడనెడు సాక్షాత్తు పరబ్రహ్మ నివసించు చున్నాడో.(48)

శ్లో ॥స వా అయం బ్రహ్మ మహద్విమృగ్య
కైవల్య నిర్వాణ సుఖానుభూతిః ।
ప్రియః సుహృద్యః ఖలు మాతులేయ
ఆత్మాఽర్హణీయో విధికృద్గురుశ్చ ॥ 49 ॥

మీ ఇళ్ళలో నుండెడు ఆ శ్రీకృష్ణుడు సాక్షాత్తు ఆపరం బ్రహ్మయే. మహానుభావులచే వెతుకబడుచున్న ఏ కైవల్య నిర్వాణ సుఖము, నిరుపాధిరూపము కలదో అదియే ఈయన. ఎవడైతే మీకు ప్రియమైన వాడో, మిత్రుడో, మేనమామ కుమారుడో, పూజ్యుడో, విధిచే ఏర్పరచబడిన గురువో అతడే ఆత్మస్వరూపుడు. ( 49 )

టీ :-నను కృష్ణోఽస్మాకం మాతులేయం కథం బ్రహ్మేత్యుచ్యతే తత్రాహ - స వా ఇతి. సోఽయం బ్రహ్మైవ. కథం భూతః. మహద్భిః విమృగ్యం యత్కైవల్యనిర్వాణ సుఖం నిరుపాధిః పరమానందః తదనుభూతిరూపో వో యుష్మాకం ఖలుప్రియం సుహృదిత్యాది రూపో భవతి. విధికృదాజ్ఞానువర్తీ. (49)

టీ :- కృష్ణుడు మా మేనమామ పుత్రుడు కదా ! బ్రహ్మయని ఎట్లు చెప్పుచున్నాడు. అనిన ఇట్లు చెప్పెను. ' సవా ' యని. అట్టి ఈతడు బ్రహ్మయే. ఎట్టివాడు. మహానుభావులచే వెతుకదగిన కైవల్య నిర్వాణ సుఖమైన నిరుపాధియైన వాడు . పరమానందానుభూతి రూపుడు. మీకు ప్రియమైనవాడు, మిత్రుడు ఇత్యాది రూపము కలవాడు కదా ! విదికృత్=ఆజ్ఞానువర్తి. ( 49 )

శ్లో ॥న యస్య సాక్షాద్భవ పద్మజాదిభీ
రూపం ధియా వస్తుతయోప వర్ణితమ్ ।
మౌనేన భక్త్యోపశమేన పూజితః
ప్రసీద తామేష స సాత్వతాం పతిః ॥ 50 ॥

శ్లో ॥స ఏష భగవాన్ రాజన్ వ్యతనో ద్విహతం యశః ।
పురా రుద్రస్య దేవస్య మయే నానంత మాయినా ॥ 51 ॥

టీ :–నను పరబ్రహ్మచేత్కథం దృష్టసహస్ర స్త్రీషు రతిః, కథంవాఽ ధర్మాద్యాచరణం తస్యేత్యత ఆహ – నేతి. తస్యరూపం తత్త్వం భవాదిభిరపి ధియాస్వబుద్ధ్యా వస్తుతయేదమిత్థమితి సాక్షాన్నోప వర్ణితం స యుష్మాకం స్వయమేవ ప్రసన్నః అస్మాకం తు మౌనాధిసాదనై స్తత్ప్రసాదః ప్రార్థనీయ ఏవేత్యాహ – మౌనేనేతి. స ఏష సాత్వతాం పతిర్నః ప్రసీదతు. న హి ప్రహ్లాదస్య గృహేషు పరంబ్రహ్మావసతి. న చ తద్దర్శనాయ మునయస్తద్గృహానభియన్తి, న చ తస్య బ్రహ్మ మాతులేయాది రూపేణ వర్తతే. న చ స్వయమేవ ప్రసన్నమతో యూయమేవ తతోఽపి అస్మత్తోఽపి భూరిభాగా ఇతి భావః. (50)

ఎవని రూపము సాక్షాత్తు భవుడు, బ్రహ్మ మొదలైన వారి చేతను వాస్తవముగా వర్ణించబడలేదో, మౌనముగా, భక్తితో, ప్రశాంతితో అట్టి లోకేశ్వరుడు పూజింపబడెనో, ఓరాజా ! పూజ్యుడా ! పూర్వము అనంతమాయావియగు మయునిచే నశింపజేయబడిన దేవుడైన రుద్రునియొక్క యశస్సును అతడే విస్తరింపజేసెను. ( 50, 51 )

టీ :– పరబ్రహ్మ యైనచో పదునారువేల భామలందు రతిగలవాడగుట యెట్లు? అధర్మాదులను నాచరించుటయు నెట్లు ? అతనికి పొసగును? అనిన ‘ న ’ ఇత్యాది శ్లోకముచే చెప్పెను. అతని తత్వము, రూపము శివుడు మొదలైన వారిచేతను ధియా = బుద్ధిచే వాస్తవముగా ‘ఇది ’ యని సాక్షాత్తుగా వర్ణించబడలేదు. అట్టివాడు స్వయముగనే మీకు ప్రసన్నుడైనాడు. మాకైతే మౌనము, తపము మొదలైన సాధనములచే అతని అనుగ్రహము వేడుకొనదగినదే కదా ! యని ఇట్లు చెప్పెను. ‘మౌనేన’ ఇత్యాదిగా . ఆ యీ సకలప్రాణులకు పతియగు పరబ్రహ్మ మాయెడ ప్రసన్నుడగు గాక. ప్రహ్లాదుని గృహములందు పరబ్రహ్మ నివసించుటలేదు. అతనిని దర్శించుటకు మునులు అతని గృహములకు చేర వచ్చుటను లేదు. బ్రహ్మ అతని మేనమామ పుత్రాది రూపమున ఉండడము లేదు. స్వయముగను ప్రసన్నము కాలేదు. కాన మీరే మాకంటెను గొప్ప అదృష్టవంతులు అని భావము. ( 50 )

టీ :-నన్వన్యైర్దుష్కరం త్రిపుర భేదాదికం శ్రీరుద్రః కృతవాన్ స ఏవం భూత ఈశ్వరోఽప్యస్య తత్త్వం న జానాతీతి కథమిత్య పేక్షాయాం తస్యాప్యేతత్సాహాయ్యాదేవ అసౌ ప్రభావో న కేవల స్యేతి వక్తుమాఖ్యాన ముపక్షిపతి – 'స ఏష' ఇతి. (51)

టీ :- అన్యులచే దుష్కరమైన త్రిపుర భేదాదికమును శ్రీ రుద్రుడు గావించెను గదా ! అట్టి ప్రభావ సంపన్నుడైన ఆ ఈశ్వరుడు గూడా అతని తత్త్వము ఎఱుంగకున్నాడనుట ఎట్లు ? అని తెలుసుకొనగోరిన, అతనికిని ఈతని సహాయముననే ఈ ప్రభావమబ్బినది. అంతేకాని స్వయముగనే అతనికా ప్రభావములేదు. అని తెలుపుటకీ ఆఖ్యానమును ప్రవేశసెట్టుచున్నాడు. ' స ఏష ' ఇత్యాదిగా. ( 51 )

**రాజోవాచ :-**

శ్లో ॥ కస్మిన్ కర్మణి దేవస్య మయోహన్ జగదీశితుః ।
యథాచోపచితా కీర్తిః కృష్ణేనానేన కథ్యతామ్ ॥ 52 ॥

**రాజు ఇట్లు పలికెను :-**

జగదీశ్వరుడైన దేవునియొక్క కీర్తిని ఏ కార్యమునందు మయుడు నాశము గావించెను. ఈ కృష్ణునిచే ఆ కీర్తి మరల వృద్ధిగావించు కొనబడినదో తెలుపబడుగాక యని యుధిష్ఠరుడు ప్రశ్నించెను. ( 52)

టీ :-రాజా యుధిష్ఠిర ఉవాచ. జగదీశితుః దేవస్య కీర్తిం కస్మిన్ కర్మణి మీవోహతవాన్. (52)

టీ :- జగదీశ్వరుడైన దేవుని కీర్తిని ఏ విధమైన కర్మ ( పని ) యందు మయుడు భంగము గావించెను. ( 52 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ నిర్జితా అసురాదేవై ర్యుధ్య నేనోప బృంహితైః ।
మాయినాం పరమాచార్యం మయా శరణ మాయయుః ॥53॥

**నారదుడిట్లు పలికెను :-**

ఈ శ్రీకృష్ణునిచే వృద్ధిగావించబడిన దేవతలచే యుద్ధమున అసురులు ఓడింపబడినవారై మాయావులకు పరమాచార్యుడైన మయుని శరణు పొందిరి. ( 53 )

టీ:- అనేన కృష్ణేన ఉపబృంహితైః సంవర్ధితైః. (53)

టీ :- ఈ శ్రీకృష్ణునిచే ఉపబృంహితైః = వృద్ధిగావించబడిన. (53)

శ్లో॥ సనిర్మాయ పురస్తిస్రో హైమరౌప్యాయసీ ర్విభుః ।
దుర్లక్ష్యాపాయ సంయోగా దుర్వితర్క్య పరిచ్ఛదాః ॥ 54 ॥

ఆ మయుడు బంగారు, వెండి, ఇనుములతో మూడు పురములను నిర్మించి వారికొసంగెను. ఆ పురములు గ్రహించ శక్యముగాని గమనాగమనములు, ఊహింపరాని వస్త్రభూషణాదులు కలవై యుండెను.(54)

టీ:- హైమీచరౌప్యాచాయసీ చేతి తిస్రః పురోనిర్మాయతేభ్యః దదావితిశేషః. దుర్లక్ష్యావసాయ సంయోగౌ గమనాగమనే యాసాం తాః నిర్మాయాఽసురేభ్యో దదావితిశేషః. ఇతి చక్ర. దుర్వితర్క్యాః పరిచ్ఛదా యాసు. (54)

టీ :- హేమమయము, రౌప్యము, అయోమయమునగు మూడు పురములను నిర్మించి వారికి ' దదౌ ' ( ఇచ్చెను ) అని శేషము. దుర్లక్ష్యములైన అపాయ సంయోగౌ = గమనా గమనములు గల్గినట్టివి. ఊహించ శక్యముగాని వస్త్రాభరణములు గలిగినట్టివి. ఊహించ శక్యముగాని వస్త్రాభరణములును కల్గినట్టివి ( ఆ పురములు ) (54)

శ్లో ॥తాభిస్తేసుర సేనాన్యో లోకాం స్త్రీన్సేశ్వరాన్ నృప ।
స్మరంతో నాశయాం చక్రుః పూర్వవైర మలక్షితాః ॥ 55 ॥

అట్టి పురముల ద్వారా ఆ అసుర సేనలు, సేనాపతులు పూర్వవైరమును స్మరించుచు అదృశ్య రూపులై ప్రభువులతో కూడిన లోకముల నన్నింటిని నాశనము గావించిరి. ( 55 )

శ్లో ॥తతస్తే సేశ్వరా లోకా ఉపాసాద్యేశ్వరం విభో ।
త్రాహి న స్తావకాం దేవ వినష్టాం స్త్రిపురాలయైః ॥ 56 ॥

ఓ ప్రభూ ! అప్పుడు ప్రభువులతో గూడిన ఆ లోకములు (ఇంద్రాది లోకపాలకులు) ఈశ్వరుని చేరుకొని ఓ దేవా ! త్రిపురవాసులైన అసురులచే నాశమొందింపబడు నీవారమైన మమ్ము రక్షించుమని పలికిరి. (56)

టీ :-సేనాన్యః. సేనాపతయః. పూర్వవైరం స్మరన్తః. (55,56)

శ్లో ॥ అథానుగృహ్య భగవాన్మా భైష్టేతి సురాన్విభుః ।
శరం ధనుషి సంధాయ పురేష్వస్త్రం వ్యముంచత ॥ 57 ॥

శ్లో ॥ తతోఽగ్నివర్ణా ఇషవ ఉత్పేతుః సూర్యమండలాత్ ।
యథా మయూఖ సందోహా నా దృశ్యంత పురోయతః ॥58॥

టీ :-అస్త్రం అభిమన్త్రితం శరం పురేషువ్యముఞ్చత (57)

టీ:- తతః శరాత్ సూర్యమణ్డలాన్మయూఖ సందోహారశ్మిసమూహా ఇవ. యతో యేభ్యః, 'పుర్యామస్త్రం' ఇతి పాఠః. (58)

శ్లో॥ తై స్పృష్టా వ్యసనః సర్వే నిపేతుః స్మ పురౌకసః ।
తానానీయ మహాయోగీ మయఃకూప రసేఽక్షిపత్ ॥ 59 ॥

టీ :- సేనాన్యః = సేనాపతులు, పూర్వమందలి వైరమును స్మరించుచు (ప్రభువులతో పాటు లోకముల నన్నింటినీ ఇతరులకు అగోచరులై నాశమొందించిరి ). ( 55, 56 )

అనంతరము భగవంతుడైన విభువగు పరమేశ్వరుడు సురుల ననుగ్రహించి భయపడకుడని చెప్పినవాడై ధనుస్సున బాణమును సంధించిన వాడై ఆ త్రిపురములందు అభిమంత్రితమైన శరమును ప్రయోగించెను. అప్పుడు శరము వలన సూర్యమండలమునుండి అగ్ని వర్ణముగల కిరణ సమూహముల వలె శరములు ఎగిసినవి. వాని వలన ఆ పురములు అగుపడకుండెను. ( 57, 58 )

టీ :- అస్త్రం = అభిమంత్రితమైన శరమును పురములందు ప్రయోగించెను. (57)

టీ :- తతః = ఆ బాణము వలన సూర్యమండలమునుండి మయూఖ సందోహా = రశ్మి సమూహములవలె, యతః = ఏ బాణములవలన(58)

వానిచే స్పృశింపబడిన ఆ పురములందు నివసించెడు అసురులు అందరు విగత ప్రాణులై పడిపోయిరి. మహాయోగియైన మయుడు వారిని తెచ్చి రస కూపమున వేసెను. అనగా స్వయముగా నిర్మించబడిన అమృత కూపమున వేసెనని అర్థము. ( 59 )

టీ:- కూపరసే స్వయం నిర్మిత కూపామృతే. (59)

టీ :- కూపరసే=స్వయముగా నిర్మితములైన కూపామృతము నందు. (59)

శ్లో ॥సిద్ధామృత రసస్పృష్టా వజ్రసారా మహౌజసః ।
ఉత్తస్థుర్మేఘ దలనా వైద్యులా ఇవ వహ్నయః ॥ 60 ॥

సిద్ధామృత రసముచే స్పృశించబడినట్టి ఆ అసురులు వజ్ర సదృశమైన బలము, గొప్ప తేజస్సుగలవారై మేఘభేదినులగు విద్యుద్రూపములైన అగ్నులవలె లేచిరి. ( 60 )

టీ:- వజ్రసారా వజ్రవద్దృఢాఙ్గాః. మహౌజసో మహాబలాః. మేఘదలనా మేగభేదినో విద్యుద్రూపా మహ్నాయ ఇవ. (60)

టీ :- వజ్రసారాః = వజ్రమువలె దృఢమైన అంగములు గలవారై. మహౌజసో = మహాబలురైనవారై, మేఘదలనాః = మేఘములను భేదించెడు విద్యుత్ రూపములైన అగ్నులవలె ( లేచిరి ) ( 60 )

శ్లో ॥విలోక్య భగ్న సంకల్పం విమనస్కం వృషధ్వజం ।
తదాయం భగవాన్విష్ణు స్తత్రోపాయ మకల్పయత్ ॥ 61 ॥

భగ్నమైన సంకల్పముగల విమనస్కుడగు శంకరుని చూచి అప్పుడీ పూజ్యుడైన విష్ణువు అచ్చట ఒక ఉపాయమును గావించెను. (61)

శ్లో ॥వత్స ఆసీత్తదా బ్రహ్మ స్వయం విష్ణు రయం హి గౌః ।
ప్రవిశ్య త్రిపురం కాలే రస కూపామృతం పపౌ ॥ 62 ॥

అప్పుడు బ్రహ్మ లేగదూడ అయ్యెను. ఈ విష్ణువు స్వయముగా గోవు అయ్యెను. మధ్యాహ్న సమయమున త్రిపురములను ప్రవేశించి రస కూపమందలి అమృతమును త్రావెను. ( 62 )

శ్లో ॥తేఽసురా హ్యపి పశ్యంతో న న్యషేధ న్విమోహితాః ।
తద్విజ్ఞాయ మహాయోగీ రససారా నిదం జగౌ ॥ 63 ॥

ఆ అసురులును విమోహితులై దానిని చూచుచును అడ్డు కొనకుండిరి. మహాయోగియైన మయుడు అది ఎఱిగిన వాడై రసపాలకులను గూర్చి ఇట్లు చెప్పెను. ( 63 )

శ్లో ॥ స్వయం విశోకః శోకార్తాన్ స్మరందైవ గతిం చ తామ్ ।
దేవోఽసురో నరోఽన్యోవా నేశ్వరోఽస్తీహ కశ్చన ॥ 64 ॥

శ్లో ॥ ఆత్మనోఽన్యస్య వా దిష్టం దైవేనోపోహితుం ద్వయోః ।
అథా సౌ శక్తిభిః స్వాభిః శంభోః ప్రాధానికం వ్యధాత్ ॥65

స్వయముగ శోకమును వీడినవాడై శోకార్తులైన అసురులను, మఱియు ఆ దైవగతిని స్మరించుచు దేవుడు గానీ, అసురుడుగానీ, నరుడు గానీ, అన్యుడుగానీ తనకుగానీ, ఇతరులకు గానీ దైవముచే గావింప సంకల్పించిన దానిని పరిహరించుటకు సమర్థుడు గాడు. అనంతరము ఈ శ్రీకృష్ణుడు తన శక్తులతో శంకరునకు సంగ్రామ సాధనములను గావించెను. (64, 65)

టీ :- కాలే మధ్యాహ్న ఇత్యర్థః. అగ్రేముహూర్తేఽభిజిదీశ్వర ఇత్యుక్తేః. కాలే మధ్యాహ్నే. (61 - 64)

టీ :- కాలే = మధ్యాహ్నమునందు ( 61 - 64 )

శ్లో ॥ ధర్మ జ్ఞాన విరక్త్యృద్ధి తపో విద్యా క్రియాదిభిః ।
రథం సూతం ధ్వజం వాహాన్ ధనుర్వర్మ శరాదియాత్ ॥66॥

శ్లో ॥ సన్నద్ధో రథమాస్థాయ శరం ధనురుపాదదే ।
శరం ధనుషి సంధాయ ముహూర్తేఽభిజితీశ్వరః ॥ 67 ॥

శ్లో ॥ దదాహ తేన దుర్భేద్యా హరోఽథ త్రిపురో నృప ।
దివి దుందుభయో నేదు ర్విమాన శత సంకులాః ॥ 68 ॥

ధర్మ, జ్ఞాన, విరక్తి, బుద్ధి, తప, విద్యా, క్రియాదులైన శక్తులచే రథమును, సూతుని, ధ్వజమును, గుఱ్ఱములను ( అశ్వములను ), ధనుస్సును, కవచమును, శరములు మొదలైన వానిని గావించెను. ఈశ్వరుడు దీనిని గ్రహించి యుద్ధసన్నద్ధుడై రథము నధిష్ఠించి ధనుర్బాణములను గైకొనెను. అభిజిన్ముహూర్తమున ధనుస్సున శర సంధానము గావించి హరుడు అప్పుడు ఆ శరముచే దుర్భేద్యములైన త్రిపురములను దహించివేసెను. ఆకాశమున వందలకొలది విమానములు సంకులములై దుందుభులను మ్రోగించెను. (66 -68)

శ్లో ॥దేవర్షి పితృ సిద్ధేశా జయేతి కుసుమోత్కరైః ।
అవాకిరన్ జగుర్హృష్టా ననృతుశ్చాప్సరోగణాః ॥ 69 ॥

దేవ, ఋషి, పితృ, సిద్ధాధిపులు జయ జయ ధ్వానములు గావించువారై పుష్ప సముదాయములచే శివుని ముంచెత్తిరి. గానము చేసిరి. ఆనందముతో అప్సరలు నాట్యమాడిరి. ( 69 )

శ్లో ॥ఏవం దగ్ధ్వా పురస్తిస్రో భగవాన్పురహా నృప ।
బ్రహ్మాదిభి స్తూయమానః స్వధామ ప్రత్య పద్యత ॥ 70 ॥

ఓ రాజా ! పురారి ఈ విధముగా పురములను మూడింటిని దగ్ధము గావించి బ్రహ్మాదులచే స్తుతించబడువాడై తన స్థానమగు కైలాసమును చేరుకొనెను. ( 70 )

టీ :–ఆత్మనో వా అన్యస్య వా ద్వయోరపి వా దైవేన దిష్టముపకల్పితం అపోహితుం పరిహర్తుమిహ కశ్చిదపీశ్వరః సమర్థోనాస్తి పూర్వశ్లోకార్థేన సమ్బంధాదయమన్వయోబోధ్యః అసౌ శ్రీకృష్ణః ప్రధనం సంగ్రాహ స్తత్సాధనం (65,66)

టీ :– తనకు గానీ ఇతరునకు గానీ ఇరువురకు గానీ దైవముచే దిష్టం=కల్పించబడిన దానిని అపోహితుం = తొలగించుటకు ఇచ్చట ఎవ్వడును ఈశ్వరః = సమర్థుడు గాడు ( లేడు ). ఈ శ్రీకృష్ణుడు ప్రధనం=యుద్ధము . అందుకు సాధనముగా ( 65, 66 )

టీ :– అభిజితి మధ్యాహ్నే. (67)

టీ :– అభిజితి = మధ్యాహ్నమున ( 67 )

టీ :–విమానశతాని సఙ్కులాని సంకీర్ణాని యేషాం తే దేవాదయః కుసుమోత్కరై రవాకిరన్ ఇత్యుత్తర శ్లోకేన అన్వయః. (68 – 70)

టీ :– వందలకొలది విమానము సంకులాని= వ్యాప్తములైనవి, అట్టి విమానములు గల దేవాదులు (దుందుభులను మ్రోగించిరి) (68–70)






శ్లో ॥ ఏవం విధాన్యస్య హరేః స్వమాయయా
విడంబమానస్య నృలోక మాత్మనః ।
వీరాణి గీతాన్యృషిభి ర్జగద్గురో
ర్లోకాన్పునానాన్య పరం వదామి కిమ్ ? ॥ 71 ॥

టీ :–ఆదిత ఆరభ్య స్కంధార్థం నిగమయతి – ఏవం విధానీతి. నృలోకం నరాకారం ఆత్మనో విడమ్బమానస్యానుకుర్వతః. (71)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే యుధిష్ఠిర నారద సంవాదే త్రిపుర విజయో నామ దశమోధ్యాయః ॥

తన మాయచే నరాకారమున తాననుకరించెడు విష్ణువుయొక్క ఈవిధములైన వీరగాథలు ఋషులచే గానము చేయబడినవై లోకములను పవిత్రము గావించుచున్నవి. ఇంకను నీకేమి చెప్పుదును? అని నారదుడు ధర్మజునితో పలికెను. ( 71 )

టీ:– ప్రారంభమునుండి స్కంధార్థమును చెప్పుచున్నాడు. 'ఏవం విదాని' అని. నృలోకం= నరాకారమును తనకు విడంబమానస్య = అనుకరించెడు. (71)

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి సప్తమ స్కంధము నందలి యుధిష్ఠిర నారద సంవాదమున శ్రీధర భావార్థ దీపికా టీక వ్యాఖ్యనమున త్రిపుర విజయమను పదియవ అధ్యాయము.




శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**శ్రీశుక ఉవాచ :-**

శ్లో ॥ శ్రేత్వే హితం సాధు సభా సభాజితమ్
మహత్త మాగ్రణ్య ఉరుక్రమాత్మనః ।
యుధిష్ఠిరో దైత్య పతేర్ముదాయుతః
పప్రచ్ఛ భూస్తనయం స్వయం భువః ॥ 1 ॥

టీ :- తదేవం దశభిర్జ్ఞాన భక్తియోగావుదీరితౌ, అథపఞ్చభి రధ్యాయైః కర్మయోగో ఽనువర్ణ్యతే. (1)

**యుధిష్ఠిర ఉవాచ :-**

శ్లో॥ భగవన్ శ్రోతుమిచ్ఛామి నృణాం ధర్మ సనాతనమ్ ।
వర్ణాశ్రమాచార యుతం యత్ పుమాన్ విందతే పరమ్ ॥2॥

టీ :- ఏకాదశే నృణాం ధర్మాః సాధారణ్యేన వర్ణితాః, విశేషేణ చ వర్ణానాం ముఖ్యాముఖ్యావ్చ యోషితామ్. (2)

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**శ్రీశుకుడు ఇట్లు పలుకెను :-**

భగవంతునియందు మనస్సుగల మహాత్ములలో ముఖ్యుడైన దైత్యపతి, సజ్జన సభలలో గౌరవించబడిన ప్రహ్లాదుని యొక్క చరిత్రమును విని యుధిష్ఠిరుడు సంతోషమును కూడినవాడై స్వయంభువుని తనయుడైన నారదుని మరల ఇట్లు ప్రశ్నించెను. (1)

టీ :- ఇట్లు పది అధ్యాయములందు జ్ఞాన, భక్తి యోగములు చెప్పబడినవి. అనంతరము ఐదు అధ్యాయములలో కర్మ యోగము వర్ణించబడును. ( 1 )

**యుధిష్ఠరుడిట్లు ప్రశ్నించెను :-**

ఓ భగవన్ ! వర్ణాశ్రమాచారములతో గూడిన సనాతనమైన మానవ ధర్మమును వినగోరుచున్నాను. ఏ ధర్మము నాచరించుట వలన మానవుడు శ్రేష్ఠమైన జ్ఞానమును, భక్తిని పొందునో దానిని తెల్పుము.(2)

టీ :- ఏకాదశాధ్యాయమున మానవ ధర్మములు సాధారణముగా వర్ణించ బడినవి. వర్ణ ధర్మములు విశేషముగా వర్ణించబడినవి. స్త్రీలయొక్క ముఖ్యాముఖ్య ధర్మములు చెప్పబడినవి. ( 2 )

శ్లో ॥ భగవాన్ ప్రజాపతే సాక్షాదాత్మజః పరమేష్ఠినః ।
సుతానాం సమ్మతో బ్రహ్మం స్తపోయోగ సమాదిభిః ॥3॥

నీవు సాక్షాత్తుగా ప్రజాపతి పుత్రుడవు. హే బ్రహ్మన్ ! తపో,యోగ, సమాధులచే పరమేష్ఠి ( బ్రహ్మ ) పుత్రులలో సమ్మతమైన వాడవు. ( 3)

టీ :- దైత్యపతేః = ప్రహ్లాదస్య, సాధూనాం సభాసు సభాజితం సత్కృత మీహితం శ్రుత్వా పునర్నారదం పప్రచ్ఛ. కథంభూత స్యేహితమ్. మహత్తమానామగ్రణ్యో ముఖ్యస్య. తత్రహేతుః - ఉరుక్రమే ఆత్మా మనో యస్య. (2,3)

టీ :- దైత్యపతేః = ప్రహ్లాదుని యొక్క, సజ్జనులయొక్క సభలలో, సభాజితం = సత్కృతమైన, ఈహితం = చరితమును విని మరల నారదుని ప్రశ్నించెను. ఎట్టివానియొక్క చరితము ? మిక్కిలి గొప్పవారిలో అగ్రణ్యః = ముఖ్యునియొక్క అందుకు కారణము, ఉరుక్రముని (విష్ణువు) యందు ఆత్మా = మనస్సుగలవాని యొక్క వినవలెను కోరికయందలి హేతువు ఎందువలన నైతే ధర్మము అనుష్ఠింపబడినందున పరం = జ్ఞానమును భక్తిని గూడా యెఱుంగునో ( 2, 3 )

శ్లో ॥ నారాయణ పరావిప్రా ధర్మం గుహ్యం పరం విదుః ।
కరుణాః సాధవః శాంతా స్త్వద్వి న తథాఽపరే ॥ 4 ॥

నారాయణునియందాసక్తులైన విప్రులు శ్రేష్ఠమైన, రహస్యమైన ధర్మము నెఱుంగుదురు. కరుణ స్వభావులైన, శాంతమనస్కులైన నీవంటి సజ్జనులును ఎఱిగెదరు. నీయట్లు ఇతరులెఱుంగ జాలరు గదా !. (4)

టీ :- నను స్మృతికారైర్ధర్మ ఉక్త ఏవ తత్రాహ - నారాయణపరా ఇతి. (4)

టీ :- స్మృతికారులచే ధర్మము చెప్పబడినది గదా ! యనిన ఇట్లు చెప్పెను. ' నారాయణ పరాః ' యని. ( 4 )

**నారద ఉవాచ :-**

శ్లో॥ న త్వా భగవతే జాయ లోకానాం ధర్మహేతవే ।
వక్ష్యే సనాతనం ధర్మం నారాయణ ముఖాచ్ఛ్రుతమ్ ॥5॥

**నారదుడు ఇట్లు పలికెను :-**

పూజ్యుడు, అజుడునైన శ్రీమన్నారాయణునకు మ్రొక్కి లోకులకు ధర్మజ్ఞానము కలుగుటకై ఆ నారాయణుని ముఖమునుండి వినబడినట్టి సనాతన ధర్మమును చెప్పెదను. ( 5 )

టీ :- అజాయ = శ్రీనారాయనాయ. తస్యైవ ముఖాచ్ఛృతమ్. (5)

శ్లో ॥ యోవతీర్వాత్మనోందేన దాక్షాయణ్యాంతు ధర్మతః ।
లోకానం స్వస్తయేధ్యాస్తే తపో బదరికా(శమే ॥ 6 ॥

టీ:- తన్ముఖాదాత్మనః (శవణం సంభావయన్విశినష్టి - య ఇతి. (6)

శ్లో ॥ ధర్మమూలం హి భగవాన్ సర్వదేవ మయో హరిః ।
స్మృతంచ తద్విదాం రాజన్యేన చాత్మా (ప్రసీదతి ॥ 7 ॥

టీ :- (ప్రథమం. స్మృతం చ స్మృతిః తద్విదాం వేదవిదామ్. యేన చాత్మా (ప్రసీదతి తుష్యతి చ. తథా చ యాజ్ఞవల్క్యః - "(శుతిః స్మృతిః సదాచారః స్వస్య చ (ప్రియమాత్మనః. సమ్యక్సంకల్పజః కామో ధర్మమూలమిదం స్మృతమ్" ఇతి. మనుశ్చ - "వేదోఖిలో ధర్మమూలం స్మృతిశీలే చ తద్విధామ్, ఆచారశ్చైవ సాధూనాం ఆత్మనస్తుష్టిరేవచ" ఇతి. (7)

టీ :- అజాయ = జన్మ రహితుడైన శ్రీనారాయణునకై ( నమస్కరించి) అతని ముఖమునుండియే వినబడినట్టి . ( 5 )

ఏ భగవంతుడైతే తన అంశతో ధర్మముగా దాక్షాయణీ దేవి యందు అవతరించిన వాడై లోకక్షేమమునకై బదరికా(శమమున తపస్సు గావించెనో ... ( 6 )

టీ :- ఆతని ముఖమునుండి తన (శవణమును ( వినుటను ) ఊహించుచు ( భావించుచు ) చెప్పెను. ' యః ' అని. ( 6 )

సర్వదేవ మయుడైన, పూజ్యుడైన ఆ హరి ధర్మమునకు మూలము. ((ప్రమాణము). ఓ రాజా ! అతని స్మరణము వేదవేత్తల మనస్సునకు ఆనందమును కలిగించును. ( 7 )

టీ :- ముందుగా ధర్మము విషయమున (ప్రమాణమును చెప్పెను. ' ధర్మ' యని. ధర్మమునకు మూలం (ప్రమాణము ( హరిః ). స్మృతంచ = స్మృతి, తద్విదాం = వేదవేత్తలకు దేనిచేతనైతే ఆత్మ (ప్రసన్నమగునో అనగా ఆనందించునో యాజ్ఞ్యవల్క్యుడిట్లు చెప్పెను. ' శృతి, స్మృతి, సదాచారము, తనకు ఆత్మరూపుడైన భగవంతునకు (ప్రియము, మంచి సంకల్పము వలన కల్గిన కామము, అనునది ధర్మమూలమని చెప్పబడినది. ' అని. మనువును

శ్లో॥ సత్యం దయా తపః శౌచం తితిక్షేక్షా శమో దమః ।
అహింసా బ్రహ్మచర్యం చ త్యాతః స్వాధ్యా ఆర్జవమ్ ॥8॥

శ్లో ॥ సంతోషః సమదృక్ సేవా గ్రామ్యేహో పరమఃశనైః ।
నృణాం విపర్యయే హేక్షా మౌన మాత్మ విమర్శనమ్॥9॥

శ్లో ॥ అన్నాద్యాదేః సంవిభాగో భూతేభ్యశ్చ యథార్హతః ।
తేష్వాత్మ దేవతా బుద్ధిః సుతరాం నృషు పాండవ ॥10॥

టీ :- తత్ర తావన్నరమాత్ర సాధారణ ధర్మమాహ - తత్ర సత్యాద్యాయోఏవ వింశతిర్భక్త్యుపకరణీభూతాః, శ్రవణాద్యా నవ తు సాక్షాద్భక్తిరేవేతి జ్ఞేయమ్ ఇతి చక్ర. సత్యమితి పఞ్చభిః- తప ఏకాదశ్యుపవాసాది. ఈక్షాయుక్తా వివేకః. శమో మనసః సంయమః. దమో బాహ్యేన్ద్రియాణామ్. త్యాగో దానమ్. స్వాధ్యాయో యథోచిత జపః.(8)

టీ :- సంతోషో దైవలబ్ధేనాలం బుద్ధిః. సమదృశాం మహతాం సేవా. గ్రామ్యేహోపరమః ప్రవృత్త కర్మభ్యో నివృత్తిః.

ఇట్లు చెప్పెను. " అఖిలమైన వేదము, స్మృతి, శీలము, సాధుజనుల ఆచారము, ఆత్మ తుష్టియు ధర్మమూలము" అని. ( 7 )

సత్యము, దయా, ఏకాదశ్యాది వ్రతము, శౌచము, సహనము, యుక్తాయుక్త వివేకము, మనఃసంయమనము, బాహ్యేంద్రియ నిగ్రహము, అహింస, బ్రహ్మచర్యము, దానము, స్వాధ్యాయము, ఋజుత్వము, దైవలబ్ధముచే సంతృప్తి, మహాత్ములసేవ, గ్రామ్యమైన కోరికల నుండి నివృత్తి, నిష్ఫల క్రియల ఈక్షణము, వృథాలాప నివృత్తి, ఆత్మ విమర్శనము, అన్నాదుల సంవిభాగము (భూతాదులకు), భూతాత్మలందు దేవతాబుద్ధి అనగా సర్వభూతములందు అత్మయని, దేవతయనియు భావన. (8-10)

టీ :- అచ్చట నరమాత్ర సాధారణ ధర్మమును ' సత్య ' ఇత్యాది ఐదు శ్లోకములచే చెప్పెను. తపః = ఏకాదశీ ఉపవాసాదికము. ఈక్షా=యుక్తాయుక్త వివేకము, శమః = మనస్సుయొక్క నిగ్రహము, దమః = బాహ్య ఇంద్రియములైన ' త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఆఘ్రాణముల నిగ్రహము. త్యాగః = దానము, స్వాధ్యాయః = యథోచిత జపము. ( 8 )

టీ :- సంతోషః = దైవానుగ్రహమున లభించినదానితోడ తృప్తి, సకలమును సమబుద్ధితో గాంచెడు మహాత్ముల సేవ, గ్రామ్యేహోపరమః=ప్రవర్తించిన

విపర్యయేహేక్షా విపరీతకాలాసు చేష్టాసు హేయదృష్టిః ఇతి సిద్ధాం. నిష్ఫల క్రియాణామీక్షణం. మౌనం వృథాలాప నివృత్తిః. ఆత్మవిమర్శనం దేహాది వ్యతిరిక్తాత్మానుసంధానం. (9)

కర్మలనుండి నివృత్తి. విపర్యయేహేక్షా = నిష్ఫలక్రియలను ఈక్షించుట. మౌనం = వృథాలాపములనుండి విరమించుట. ఆత్మవిమర్శనం = దేహమునకంటే భిన్నమైన ఆత్మను అనుసంధానము గావించుకొనుట. ( 9 )

టీ :- ఆత్మేతి దేవతేతి చ బుద్ధిః. బుద్ధిర్భావనా. (10)

టీ :- ఆత్మయన దేవతయనియు భావన ( 10 )

శ్లో ॥ శ్రవణం కీర్తనం చాస్య స్మరణం మహతాం గతేః ।
సేవేజ్యాఽవనతి ర్దాస్యం సఖ్యమాత్మ సమర్పణమ్ ॥11॥

శ్లో ॥ నృణామయం పరోధర్మః సర్వేషృాం సముదాహృతః ।
త్రింశల్లక్షణవాన్ రాజన్ సర్వాత్మా యేన తుష్యతి ॥12॥

మఱియు నారాయణుని కథాశ్రవణము, భగవన్నామ కీర్తనము, స్మరణము, సమదృక్కులైన మహాత్ములయొక్క సేవా, భగవదర్చనము, నమస్కారము, దాస్యము, సఖ్యము, ఆత్మసమర్పణము అనునవి సర్వ మానవులకు పరమధర్మమని చెప్పబడినది. ఇట్లు సత్యము మొదలైన ఇరువది యొక్కటి భక్త్యుపకరణీ భూతములైనవి. మరియు 'శ్రవణము' మొదలైన తొమ్మిది సాక్షాద్భక్తి రూపములైనవి మొత్తము ముప్ఫది గుణములు కలవాడుగా మానవుడు ఉండవలెను. అటులైన ఓరాజా! పర్వాత్మయైన హరి సంతోషించును. (11,12)

టీ :- అస్య శ్రీకృష్ణస్య శ్రవణాదయో నవ. ఇజ్యా = అర్చనమ్. (11)

టీ :- ఈ శ్రీకృష్ణుని యొక్క శ్రవణము, కీర్తనము ఇత్యాది. ఇజ్యా=అర్చనము. ( 11 )

టీ :- ఏవం త్రింశల్లక్షణవాన్. (12)

టీ :- ఇట్లు ' సత్యము ' మొదలైన ఇరువదియొక్కటి, ' శ్రవణము ' మొదలైన తొమ్మిది మొత్తము ముప్ఫది లక్షణములు కలవాడు. (12 )

శ్లో ॥ సంస్కారా యత్రా విచ్ఛిన్నాః సద్విజోజో జగాదయమ్ ।
ఇజ్యాధ్యయన దానాని విహితాని ద్విజన్మనామ్ ।
జన్మ కర్మావదాతానాం క్రియాశ్చాశ్రవ చోదితాః ॥ 13

మంత్ర యుక్తములైన గర్భదానాది సంస్కారములు ఎవని విషయముననైతే అవిచ్ఛిన్నముగ నిర్వర్తించబడునో అతడు ద్విజుడు. బ్రహ్మ ఎవనినైతే ఈ విధమైన సంస్కార యుక్తునిగా చెప్పెనో అతడు ద్విజుడు. మఱియు యాగము చేయుట, వేదాధ్యయనము, దానము చేయుట ద్విజన్ములకు విహితములైనవి. జన్మముచేతను, కర్మము చేతను పరిశుద్ధులైన ద్విజులకు బ్రహ్మచార్యాశ్రమ విహితములైన క్రియలును చెప్పబడినవి. ( 13 )

టీ :- ఇదానీం వర్ణధర్మాన్వక్తుం ద్విజానాం లక్షణమాహ - సంస్కారామన్త్రవన్తో గర్భాదానాదయో యస్మిన్నవిచ్ఛిన్నాః స ద్విజః తర్హి శూద్రస్యాపి సంస్కారావిచ్ఛేదే సతి ద్విజత్వంస్యాత్తత్రాహ - అజో బ్రహ్మ యమేవం భూత సంస్కారయుక్తం జగాద స ద్విజః. శూద్రం తు న మంత్రవత్సంస్కారయుక్తం జగాద నచోపనయన వన్తం అతో నాఽ సౌ ద్విజః. తథా చ స్మృతిః - "వివాహమాత్ర సంస్కారం శూద్రోఽపి లభతాం సదా, నకేనచిత్సమసృజచ్ఛందసా తం ప్రజాపతిః" ఇతి. శ్రుతిశ్చ 'గాయత్ర్యా బ్రాహ్మణమసృజత్. త్రిష్టుభారాజన్యమ్. జగత్యా వైశ్యమ్. నకేనచిచ్ఛూద్రమ్' ఇతి. అతో వివాహవ్యతిరిక్త సంస్కారస్యా నావశ్యకత్వా దుపనయనస్య తు సర్వథా నిషేధాన్న తస్య ద్విజత్వమిత్యర్థః. 'సద్విజో వైదికా దయః' ఇత్యేవం రూపే. పాఠాంతరే వైదికాదయ ఇతి

టీ :- ఇప్పుడు వర్ణ ధర్మములను చెప్పుట కుపక్రమించి ద్విజుల లక్షణమునిట్లు చెప్పెను. మంత్రయుక్తములైన గర్భాదానాది సంస్కారములు అవిచ్ఛిన్నముగా ఎవనియందు కల్గునో అతడు ద్విజుడు. అటులైన శూద్రునకు సంస్కారముల యొక్క విచ్ఛేదము కలుగని యెడల ద్విజత్వము కలుగును గాక యనిన అచ్చట ఇట్లు చెప్పెను. అజః = బ్రహ్మ ఎవనినైతే ఇటువంటి సంస్కార యుక్తునిగా చెప్పెనో అతడే ద్విజుడు. శూద్రుని నైతే మంత్రయుక్తమైన సంస్కారము కలవానినిగ చెప్పకుండెను. ఉపనయన వక్తునిగ కూడా చెప్పకుండెను. అందువలన ఇట్టి శూద్రుడు ద్విజుడు కారాదు.' స్మృతియు ఇట్లు చెప్పుచున్నది. "శూద్రుడు కూడా ఎల్లప్పుడు వివాహమాత్ర సంస్కారమును పొందునుగాక. అతనిని ప్రజాపతి ఏ విధమైన ఛందస్సుచేతను సృష్టించ కుండెను." అని. శ్రుతియు "గాయత్రీ ఛందముచే బ్రాహ్మణుని సృజించెను. త్రిష్టుప్ ఛందముచే రాజలోకమును, జగతీ ఛందముచే వైశ్యుని సృష్టించెను.

గర్భాధానాదయ ఇత్యర్థః. త్రైవర్ణికానాం ఆవశ్యకాన్ ధర్మానాహ – ఇజ్యేతి. జన్మనా విశుద్ధేన కులేన కర్మణా చాచారేణా వదాతానాం శుద్ధానామ్. దుష్కులానాం దురాచారాణాం చ నైతాని విహితానీత్యర్థః. బ్రహ్మచర్యాద్యాశ్రమ విహితాః క్రియాశ్చ. శూద్రస్య తు వర్ణధర్మా ఏవ, ఆశ్రమభేదేకృత విశేషాభావాత్. (13)

శ్లో ॥ విప్రస్యాధ్యనాదీని షడన్యస్యాప్రతిగ్రహః ।
రాజ్ఞో వృత్తిః ప్రజా గోప్తు రవిప్రాద్వా కరాదిభిః ॥ 14 ॥

శూద్రుని ఏ ఛందము చేతను సృష్టించలేదు. ” అని. అందువలని శూద్రునకు వివాహవ్యతిరిక్తములైన సంస్కారములు అనావశ్యకములైనందున, ఉపనయనమైతే సర్వదా నిషిద్ధమైనందున ద్విజత్వము లేదు. పాఠాంతరమున వైదికాదులైన గర్భదానాదులు అని అర్థము. త్రైవర్ణికములైన వారికి ( బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ) ఆవశ్యక ధర్మములను చెప్పెను. ‘ ఇజ్యా ’ ఇత్యాదిగా. జన్మచేత పరిశుద్ధమై కులముచే, కర్మచేతను, ఆచారము చేతను అదాతానాం = శుద్ధులైన వారికి. దుష్కులానాం = దుష్టమైన కులము కలిగిన, దురాచారము కలిగిన వారికిని ఈ సంస్కారములు విధించబడలేదు . శూద్రునకు వర్ణ ధర్మములే, ఆశ్రమ భేదముచే గావించబడు విశేషములు లేనందున యని అర్థము. ( 13 )

విప్రునకు యజనం ( యజ్ఞము చేయుట ), అధ్యయనం (వేదాధ్యయనము), దానము చేయుట అను వర్ణ ధర్మములతోపాటు యాగము చేయించుట, అధ్యాపనం ( వేదములు చెప్పుట ), ప్రతిగ్రహః (దానము గ్రహించుట ) అను ఆఱు జీవికాధర్మములతో సహా షట్కర్మలు విహితములైనవి. ‘అన్యస్య అపరిగ్రహః’ అని . క్షత్రియునకు ప్రతిగ్రహమునకు భిన్నమైన యాజనము, అధ్యాపనము అను జీవికాకర్మలును ఆపదలందు అంగీకరించ బడినవి. ప్రజాపాలకుడైన క్షత్రియునకు ( రాజునకు ) విప్రునకంటే భిన్నమైన వారినుండి కప్పము (పన్ను ) మొదలైన వాని ద్వారా జీవిక అంగీకరిచబడినది.

టీ :- బ్రాహ్మణాదీనాం చతుర్ణామపి వృత్తిరూపాన్ ధర్మారాహ - విప్రస్యేతి సార్ధైః సప్తభిః. విప్రస్య షట్ కర్మాణి విహితానీత్యనుజ్ఞః. తత్ర త్వధ్యాపనం యాజనం ప్రతిగ్రహశ్చ జీవికా. యజనాధ్యాపనే విశుద్ధాచ్చ ప్రతిగ్రహః" ఇతి. అన్యస్య క్షత్రియస్య అప్రతిగ్రహ ఇతి ప్రతిగ్రహాతిరిక్తం యాజనమధ్యాపనం చాపద్యనుజానాతి. వక్ష్యతి చానన్తరమేవ - ఋతే రాజన్యమితి. శ్రూయతే చాశ్వపతికైకయ ప్రభృతీనాం క్షత్రియాణాముపదేష్టృత్వాది. ప్రజాపాలనేఽధికృతస్య క్షత్రియస్య వృత్త్యన్తరమాహ - రాజ్ఞ ఇతి. ఆదిశబ్దేన దండశుల్కాది. (14)

' వా ' అని చెప్పుటచే ఒక్కొక్కప్పుడూ విప్రునినుండియు కప్పము మొదలైనవి గ్రహించవచ్చునని చెప్పబడినది. అనగా క్షత్రియునకు అధ్యయన, అధ్యాపన, యజన, యాజన, దానములతోపాటు, కరాది గ్రహణము (పన్నులు) కర్మలుగా చెప్పబడినవి. సాధారణముగా యాజనము, అధ్యాపనములు అంగీకరించబడవు. ఆపదలందు మాత్రమే అంగీకరించబడును. కరాదిభిః అనుచోట ఆది పదముచే దండశుల్కాదులు గ్రహించనగును. (14)

టీ :- బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యముల వారికిని వృత్తి రూపములైన ధర్మములను చెప్పుచున్నాడు. ' విప్రస్య ' ఇత్యాది ఏడున్నర శ్లోకములచేత విప్రునకు షట్కర్మలు విధించబడినవి, అని స్వీకరించవలెను. అందు అధ్యాపనం, యాజనం, ప్రతిగ్రహమను జీవికములని మనువు ఇట్లు చెప్పెను. "షణ్ణాం తు కర్మాణ్యామస్య త్రీణి కర్మాణి జీవికా " ఆరు కర్మలలో ద్విజునకు మూడు కర్మలు జీవికయగుచున్నవి. అవి యాజనము, అధ్యాపనము, పవిత్రునినుండి ప్రతిగ్రహించుట, అనునవి అని. అన్యస్య = క్షత్రియునకు అప్రతి గ్రహము అనగా ప్రతిగ్రహాతిరిక్తం యాజనము ( యాగము చేయించుట) అధ్యాపనం ( వేదమును చెప్పుట ), అను రెండునూ ఆపద యందు అనుమతించుచున్నాడు. తర్వాతి శ్లోకమున ' ఋతే రాజన్యం ' అను దానియందు చెప్పగలడు. అశ్వపతి, కైకయులు మొదలైనవారు క్షత్రియులయ్యు బోధక్యమును పొందుట వినబడుచున్నది. ప్రజాపాలనమున అధికృతుడైన క్షత్రియునకు మఱొక వృత్తిని

శ్లో ॥ వైశ్యస్తు వార్తా వృత్తిశ్చ నిత్యం బ్రహ్మ కులానుగః ।
శూద్రస్య ద్విజ శుశ్రూషా వృత్తిశ్చ స్వామినో భవేత్ ॥15॥

టీ :- వార్తా కృషి వాణిజ్యాది లక్షణా వృత్తిర్యస్య. శూద్రస్య ద్విజానాం శుశ్రూషావిహితా. స్వామినో ద్విజస్య తు శుశ్రూషా వృత్తిశ్చ భవేత్. (15)

శ్లో ॥ వార్తా విచిత్రా శాలీన యాయావర శిలోంఛనమ్ ।
విప్రవృత్తిశ్చతుర్థేయం శ్రేయసీ చోత్తరోత్తరా ॥ 16

చెప్పెను. 'రాజ్ఞః ' అని. ఆది శబ్దముచే దండనమందు విధింపబడు శుల్కాదులును గ్రహింపనగును. ( 14 )

వైశ్యుడైతే కృషివాణిజ్యాది లక్షణమైన వృత్తిగలవాడై నిత్యము బ్రాహ్మణ కులానుగుడై యుండతగును. శూద్రునకు ద్విజ శుశ్రూష కర్మ విహితమైనది. స్వామియైన ద్విజునియొక్క శశ్రూషయే వృత్తిగ కూడా చెప్పబడినది. (15)

టీ :- వార్తా = కృషివాణిజ్యాది లక్షణమైన వృత్తి గలవాడు. శూద్రునకు ద్విజులయొక్క శుశ్రూష విహితమైనది. స్వామియైన ద్విజుని యొక్క శుశ్రూష విహితమైనది. స్వామియైన ద్విజునియొక్క శుశ్రూష వృత్తియు అగును గాక అని. ( 15 )

కృషి ( వ్యవసాయం ) మొదలైన వృత్తి. దారుధ్యము లేకుండగనే అయాచిత ప్రాప్తము, ప్రతినిత్యము ధాన్యమును యాచించుట, భూస్వాముల క్షేత్రములలో ( చేలలో ) యజమాని కొనిపోగా వదలబడిన దానిని సేకరించుట, అంగడి మొదలైన చోట్ల క్రిందపడిపోయిన గింజలను ఏఱుకొనుట, అను నీ నాలుగు విప్రుని వృత్తులు. ఇందు ఉత్తరోత్తరము శ్రేష్ఠము. ( 16 )

టీ :- విప్రస్య ముఖ్యానుకల్పభేదేన వృత్త్యన్తరాణ్యాహ - వార్తేతి. వార్తా ఇతి. వార్తా విచాత్రా = కృష్యాదిరూపా. శాలీనం = ధార్ష్ట్యం వినైవ ప్రాప్తమయాచితమ్. యాయావరం = ప్రత్యహంధాన్యయాఞ్చా. శిలం = శాలిక్షేత్రాదౌస్వామిత్యక్త కణిశోపాదానామ్. ఉఞ్ఛనం = ఆపణాది పతితకణోపాదానమ్. శిలోఞ్ఛనద్వయమేకీకృత్య చతుర్ధేత్యుక్తమ్. శ్రేయసీ = ఉత్తమా. (16)

టీ :- విప్రునకు అను కల్పముల భేదముచే ముఖ్యవృత్తులను మరికొన్నిటిని 'వార్తా' ఇత్యాది శ్లోకముచేత చెప్పెను. వార్తా విచిత్రా=కృషి (వ్యవసాయము) మొదలైనది. శాలీనం = దిట్టతనమును ప్రదర్శించక అయాచిత ప్రాప్తము. యాయావరం = ప్రతినిత్యము ధాన్యము యాచించుట. శిలం = పంటచేలలో యజమాని వదిలిన గింజలను ఏఱుకొనుట. ఉంఛనం = అంగడి మొదలైన చోట్ల క్రిందపడిన గింజలను సేకరించుట. శిలా - ఉంఛనము అను రెంటిని ఒకటిగా చేసి నాలుగుగా చెప్పబడినది. శ్రేయసీ = ఉత్తమమైనది.(16)

శ్లో ॥ జఘన్యో నోత్తమాం వృత్తి మనాపది భజేన్నరః ।
ఋతే రాజన్య మాపత్సు సర్వేషామపి సర్వశః ॥ 17 ॥

నీచుడు అనాపదలందు ఉత్తమమైన అధ్యాపనాది వృత్తిని చేపట్టరాదు. రాజులు మాత్రము చేపట్టవచ్చును. క్షత్రియుడు ప్రతిగ్రహమునకు భిన్నమైన వానిని వృత్తులుగా స్వీకరించవచ్చును. ఆపదలందు అందరికి అన్ని వృత్తులును గ్రాహ్యములు. ( 17 )

టీ :- వృత్తిష్వేవ వ్యవస్థాం దర్శయన్నాపద్వృత్తీరాహ - జఘన్యో నీచః. ఉత్తమామధ్యాపనాదిరూపామ్. ఋతేరాజన్యమ్. క్షత్రియస్తు ప్రతిగ్రహాదన్యం భజేత్. (17)

టీ :- వృత్తులందు వ్యవస్థను చూపుచు ఆపద్వృత్తులను ఇట్లు చెప్పెను. జఘన్యః = నీచుడు. ఉత్తమాం = అధ్యాపనము మొదలైన వానిని. రాజన్యము వినా. క్షత్రియుడైతే ప్రతిగ్రహమునకు భిన్నమైన వానిని భజించవలసినది.(17)

శ్లో ॥ ఋతా మృతాభ్యాం జీవేత మృతేన ప్రమృతేన వా ।
సత్యానృతాభ్యాం జీవేత న శ్వవృత్యా కథంచన ॥ 18 ॥

ఋత, అమృతములచే జీవించవలెను. లేదా మృత, ప్రమృతములచే, సత్య, అనృతములచే గాని జీవించవలెను. శ్వవృత్తిచే ఎట్టి పరిస్థితులయందును జీవించరాదు. ( 18 )

టీ :- చతుర్విధాం పూర్వోక్తాం విప్రవృత్తిమితరేషామపి దర్శయన్నాహ - ఋతామృతాభ్యామితి. (18)

శ్లో ॥ ఋతమున్చ శిలం ప్రోక్తం అమృతం య దయాచితమ్।
మృతం తు నిత్య యాంఛాస్యా త్ప్రమృతం కర్షణం స్మృతమ్॥ 19॥

శ్లో ॥ సత్యానృతం తు వాణిజ్యం శ్వవృత్తి ర్నీచసేవనమ్ ।
వర్జయేత్తం సదా విప్రో రాజన్యశ్చ జుప్సితామ్ ।
సర్వవేదమయో విప్రః సర్వదేవ మయోన్నృపః ॥ 20 ॥

టీ :- శ్లోకం వ్యాచష్టే - ఋతమితి. (19)

టీ - తయోస్తద్వర్జనే హేతుమాహ - 'సర్వవేదమయ' ఇతి. (20)

శ్లో ॥ శమో దమ స్తపః శౌచం సంతోషః క్షాంతిరార్జవమ్ ।
జ్ఞానం దయాచ్యుతాత్మత్వం సత్యం చ బ్రహ్మ లక్షణమ్ ॥21॥

టీ :- పూర్వోక్తమైన చతుర్విధ విప్రవృత్తిని ఇతరులకు తెలుపుచు ఇట్లు చెప్పెను. ' ఋతామృతాఖ్యాం ' అని. ( 18 )

ఋతము అనగా ఆపణము ( అంగడి ) యందు గానీ, చేలలో గానీ, రాలిన లేదా పడిన గింజలనేఱుకొని బ్రతుకుట, అమృతము అనగా అయాచితముగా చేకూరిన ధనముతో జీవించుట. మృతం అనగా నిత్యము యాచించుట. ప్రమృతం = కర్షణము= వ్యవసాయము, సత్యామృతం అనగా వాణిజ్యము, శ్వవృత్తి = నీచసేవనము, విప్రుడు, రాజన్యుడును జుగుప్సితమైన ఆవృత్తిని ఎప్పుడునూ వర్జింపతగినవే. ఎందులకనగా విప్రుడు సర్వవేదమయుడు. నృపుడు సర్వదేవ స్వరూపుడు.(19, 20 )

టీ :- ' ఋతం ' అని పై శ్లోకమును వివరించెను. ( 19 )

టీ :- ఆ ద్విజ క్షత్రియులకు శ్వవృత్తిని నిషేధించుటకు కారణమును సర్వవేదమయ ఇత్యాదిగ చెప్పెను. ( 20 )

శమము, దమము, తపము, శుచిత్వము, సంతోషము, ఓర్పు, ఋజుత్వము, జ్ఞానము, దయా, విష్ణు పరత్వము, సత్యము అనునవి బ్రాహ్మణుని లక్షణములు. ( 21 )

టీ:- వర్ణానామభివ్యఞ్జకరూపాన్ధర్మానాహ - శమ ఇతి చతుర్భిః. అచ్యుతాత్మత్వం శ్రీవిష్ణుపరత్వమ్. విష్ణుమనస్కత్వమితి సిద్ధాం. (21)

టీ :- వ్యర్ణములను వ్యక్తము గావించునట్టి ధర్మములను చెప్పుచున్నాడు. 'శమః' ఇత్యాది నాల్గు శ్లోకములలో. అచ్యుతాత్మత్వం = శ్రీ విష్ణు పరత్వము, విష్ణుమనస్కత్వమని సిద్ధాంతము. ( 21 )

శ్లో ॥ శౌర్యం వీర్యం ధృతిస్తేజ స్త్యాగ ఆత్మ జయః క్షమా ।
బ్రహ్మణ్యతా ప్రసాదశ్చ రక్షా చ క్షత్ర లక్షణమ్ ॥ 22 ॥

వేదాభ్యాసరతి, శౌర్యము, వీర్యము, ధైర్యము, తేజస్సు, దానము, ఆత్మజయము, క్షమాగుణము, ప్రసాదము, రక్షణ అనునవి క్షత్రియుని లక్షణములు. ( 22 )

శ్లో ॥ దేవ గుర్వచ్యుతే భక్తి స్త్రివర్గ పరిపోషణమ్ ।
ఆస్తిక ముద్యమో నిత్యం నైపుణ్యం వైశ్య లక్షణమ్ ॥23॥

దేవతలందు, గురువులందు, అచ్యుతునియందు భక్తి , ధర్మార్థకామముల పరిపోషణము, ఆస్తిక్యబుద్ధి, నిత్యము ఉద్యమము, నైపుణ్యము అనునవి వైశ్యుని లక్షణములు. ( 23 )

టీ :- శౌర్యం = యుద్ధోత్సాహః, వీర్యం = ప్రభావః, తేజః ప్రాగల్భ్యమ్. త్యాగోదానమ్. అత్మనో మనసోజయాః. (22,23)

టీ :- శౌర్యం = యుద్ధోత్సాహము, వీర్యం = ప్రభావము. తేజః = నేర్పు, త్యాగః = దానము, ఆత్మనః = మనస్సుయొక్క జయము. (22,23)

శ్లో॥ శూద్రస్య సం నతిః శౌచం సేవా స్వామిన్య మాయయా।
అమంత్ర యజ్ఞో హ్యస్తేయం సత్యం గో విప్ర రక్షణమ్ ॥24॥

నమ్రత, శౌచము, స్వామియెడ నిష్కపటమైన సేవ, అమంత్ర యజ్ఞము (నమస్కారము తోడనే పంచయజ్ఞానుష్ఠానము), దొంగతనము చేయకుండుట, సత్యము, గోవులను, విప్రులను రక్షించుట అనునవి శూద్రుని లక్షణములు. (24)

టీ:- అమన్త్రయజ్ఞో నమస్కారేణైవ పఞ్చయజ్ఞానుష్ఠానమ్. తథా చ యాజ్ఞ్యవల్క్యం - 'నమస్కారేణ మన్త్రేణ పఞ్చయజ్ఞాన్న హాపయేత్' ఇతి. (24)

టీ :- అంత్రయజ్ఞః = నమస్కారముచేతనే పంచయజ్ఞానుష్ఠానము. యాజ్ఞ్యవల్క్యుడిట్లు చెప్పెను. ' నమస్కారముచేతనే పంచయజ్ఞానుష్ఠానము గావింపవలెను. మంత్రముచే చేయకూడదు. ' అని. ( 24 )

శ్లో ॥ స్త్రీణాంచ పతిదేవానాం తచ్ఛుశ్రూషాను కూలతా ।
తద్బంధుష్వను వృత్తిశ్చ నిత్యం తద్వ్రత ధారణమ్ ॥25॥

పతియే దైవము. స్త్రీలకు ఆ పతియొక్క పాదసంవాహనాది శుశ్రూష, మరియు అతనికి అనుకూలముగా మెదలుట, అతని బంధువులయొక్క అనువర్తనము, నిత్యము అతని వ్రతమునే తానును ధరించుట. ( 25 )

టీ :- స్త్రీధర్మాణాహ - స్త్రీణామితి. పఞ్చభిః. పతిరేవదేవో యాసామ్. తస్య పత్యురేవ శుశ్రూషా పాదసంవాహనాదిభిః. తదనుకూలతాచ హితాచరణమ్. ఏతచ్చతుష్టయం పతివ్రతానాం లక్షణం ధర్మశ్చ. (25)

టీ :- స్త్రీధర్మముల నిట్లు చెప్పెను. ' స్త్రీణాం ' ఇత్యాదిగా ఐదు శ్లోకములలో. పతియే దైవము గలవారు. ఆ పతియొక్క పాదసంవాహ నాదులతో శుశ్రూషచేయుట. అతనికి అనుకూలముగా నుండి హితమగునట్లు మెలుగుట, అతనికి ఏ వ్రతం ,ఏనియమం గలదో దానిని ధరించుట, అనగా ఆచరించుట, ఈ నాలుగు పతివ్రత లక్షణములు, ధర్మములు గూడా. ( 25 )

శ్లో ॥ సంమార్జనోప లేపాభ్యాం గృహమండల వర్తనైః ।
స్వయంచ మండితా నిత్యం పరిమృష్ట పరిచ్ఛదా ॥26॥

ఊడ్చుటము, అలకటములచేత రంగవల్లులచే గృహమును అలంకరించుట, స్వయముగను అలంకరించుకొనినదై గృహోపకరణములను నిర్మలముగా ఉంచునదై యుండవలెను. (26)

శ్లో ॥ కామై రుచ్చావచైః సాధ్వీ ప్రశ్రయేణ దమేన చ ।
వాక్యైః సత్యైః ప్రియైః ప్రేమ్ణా కాలే కాలే భజేత్పతిమ్॥27॥

వివిధ కోరికలచే కూడినదై, సాధ్వియై వినయముతో, నిగ్రహముతో కూడినదై ప్రియమైన సత్యమైన మాటలచే ప్రేమతో పతిని దగు సమయమున పతిని సేవించవలెను. ( 27 )

టీ :- కించ 'సంమార్జనోపలేభ్యాం' ఇత్యాదేః పతింభజేదిత్యుత్తరేణాన్వయః. పరిమృష్టా ఉద్దర్తనాదినా నిర్మలీకృతాః పరిచ్ఛదా గృహోపకరణాని యయా. (26,27)

టీ :- ఇంతేకాక ( కసువూడ్చుట, అలుకుట ) సంమార్జనో ఏ లేపాభ్యాః ఇత్యాది శ్లోకమునకు, పతిని సేవించవలెను. అని . ఉత్తర శ్లోకముచే అన్వయము. పరిమృషాః = శుభ్రముచేయుట మొదలైన క్రియలచే నిర్మలముగా చేయబడిన పరిచ్ఛదాః = గృహ ఉపకరణములు గలదై.(26,27)

శ్లో ॥ సంతుష్టాలోలుపా దక్షా ధర్మజ్ఞా ప్రియ సత్య వాక్ ।
అప్రమత్తా శుచిః స్నిగ్ధా పతింత్వ పతితం భజేత్ ॥ 28 ॥

మఱియు నిత్యసంతుష్టయై, చాంచల్యము లేనిదై, గృహకర్మల యందును నేర్పుగలదై ధర్మమును ఎఱింగినదై ప్రియముగా సత్యముగా మాటలాడునదై అన్నింటి ధ్యాసగలదై శుచియై, అనురక్తయై పతి పతితుడు గాకుండునట్లు భజించవలెను. ( 28 )

టీ :- కించ సంతుష్టా యథా లాభేన. తావన్మాత్రభోగేఽపృలోలుపా దక్షా అనలసా ప్రియా, సత్యా చ వాగ్యస్యాః సర్వత్రాప్యప్రమత్తాః వహితా. అపతితం మహాపాతకశూన్యమ్. యథాహ యాజ్ఞ్యవల్క్యః – 'ఆధేద్ధేః సంప్రతీక్ష్యోహి మహాపాతక దూషితః' ఇతి. (28)

టీ :- ఇంతేకాక యథాలాభముచే సంతృప్తి గలదై, తనకు గల్గిన అంత మాత్ర భోగముచేతనే తృప్తిగలదై చాంచల్యము లేనిదై, దక్షా = అసత్యము లేనిదై , ప్రియమైన సత్యమైన వాక్కుగలదై అన్నిట అప్రమత్తా = శ్రద్ధ గలదై అపతితం = మహాపాతక శూన్యుడగునట్లు ' మహాపాతక దూషితుడైన శుద్ధియగువరకు ఎదురుచూడవలసినది ' యని.(28)

శ్లో ॥ యా పతిం హరి భావేన భజేచ్ఛ్రీరివ తత్పరా ।
హర్యాత్మనా హరేర్లోకే పత్యా శ్రీరివ మోదతే ॥ 29 ॥

లక్ష్మీదేవి విష్ణువును భజించునట్లు ఏ స్త్రీయైతే తన పతిని హరి భావముతో తత్పరయై భజించునో ఆ స్త్రీ హరి రూపుడైన తన పతితో హరి లోకమైన వైకుంఠమున లక్ష్మీదేవి వలె ఆనందించును. (29 )

టీ :- తత్పరాసతీ భజేత్. హర్యాత్మనాపత్యాసహ. (29)

టీ :- భగవత్పరమైనదై పతిని భజించవలసినది. హరి రూపుడైన పతితోకూడా. ( 29 )

శ్లో॥ వృత్తిః సంకర జాతీనాం తత్తత్కుల కృతా భవేత్ ।
ఆ చౌరాణా మపాపానా మంత్యజాంతే వ సాయినామ్ ॥30॥

సంకర జాతీయులకు ఆయా కులములకు వంశపారం పర్యముగా నున్న వృత్తియే వృత్తి యగును. చోరవృత్తి, సాహసవృత్తి గల పూర్వజుల వృత్తిమాత్రము తగదు. రజకులు, చర్మకారులు, నటులు మొదలైన అంత్యజులు, ఛండాల పుల్కస, మాతంగాది అంతేవసాయినులు, అపాపులు, అచోరులునైన వారి వంశపరం పరా ప్రాప్తమైన వృత్తి ననుసరించదగును. ( 30 )

టీ :- ప్రతిలోమజానులోమజానాం వృత్తిమాహ - వృత్తిరితి. తత్తత్కులకృతా కులపరంపరాప్రాప్తా. పరంపరాప్రాప్తమపి చౌర్యం హింసాదికం చ ప్రతిషేధతి - అచౌరాణామపాపానాం చేతి. తత్ప్రదర్శనార్థం కాంశ్చిత్ప్రతిలోమజ విశేషానాహ - అన్త్యజేతి. 'రజకశ్చరకారశ్చ నటోబురుడ ఏవచ, కైవర్తకమేదభిల్లాశ్చ సప్తైతే అన్త్యజాః స్మృతాః' ఇతి. అన్తేవసాయినస్తు చణ్డాల పులస్క మాతఙ్గాదయః తేషాం పరంపరాప్రాప్తైవ వస్త్ర నిర్ణేజనాది వృత్తిరిత్యర్థః. (30)

టీ :- ప్రతిలోమజ, అనులోమజుల వృత్తులను చెప్పెను. 'వృత్తి ' యని. ఆయా కులములచే చేయబడిన అనగా పరంపరాప్రాప్తమైనను, చౌర్యము, హింసా మొదలైనవియు నిషేధించుచున్నాడు. " అచౌరాణా మపాపానాచ " ఇత్యాది శ్లోకముతో. దానిని ప్రదర్శించుటకు కొన్ని ప్రతిలోమజుల విశేషములను చెప్పెను. 'అంత్యజ' ఇత్యాదిగా. రజకులు, చర్మకారులు, నటులు, బురుడులు, కైవర్త, మేద, భిల్లులు (చాకలి, చెప్పులు కుట్టెడు జాతి, నట, మేదరి, బెస్త లేదా గూళ్ళ, కైవర్త, మేద, భిల్ల) అను ఏడు జాతులు అంత్యజులని చెప్పబడుచున్నవి." అని. అంతే వసాయినులు ( మాలవారు ), ఛండాల, పుల్కస, మాతంగాదులు. వారికి పరంపరాప్రాప్తమైన వస్త్రక్షాళనాది వృత్తి యని అర్థము. ( 30 )

శ్లో ॥ ప్రాయః స్వభావ విహితో నృణాం ధర్మోయుగే యుగే ।
వేద దృగ్భిః స్మృతో రాజన్ ప్రేత్య చేహచ శర్మ కృత్॥31॥

టీ :- శ్రేష్ఠాదపి పరధర్మాన్యోచో஽ పి స్వధర్మఏవ శ్రేయానిత్యాహ – ప్రాయ ఇతి. స్వభావేన సత్త్వాది ప్రకృత్యా విహితో ధర్మః శర్మకృత్ సుఖహేతుః స్మృతః. కైః. వేద ఏవ దృక్ చక్షుర్యేషాం తైః. భగవతా చోక్తమ్. – 'శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్' ఇతి. (31)

మానవులకు యుగ యుగమునందును సాధారణముగ స్వభావ సిద్ధముగా విహితమైన ధర్మమే ఇహలోకమున, పరలోకమునందును సుఖహేతువగునని వేదవేత్తలు చెప్పెదరు. ( 31 )

టీ :- శ్రేష్ఠమైన పరధనమునకన్నను నీఛమైనను, స్వధర్మమే శ్రేయస్కరమని చెప్పెను. ' పాయః ' అని. స్వభావముగ = సత్వము మొదలైన స్వభావముతో విహితమైన ధర్మము శుభము గల్గించునది (శుభ హేతువుగా చెప్పబడినది). ఎవరిచేత ననగా వేదచక్షువులచేత. భగవంతుడైన శ్రీకృష్ణుని చేత ఇట్లు చెప్పబడినది. "పరధర్మమును అనుష్ఠించుట కంటే విగుణమైన స్వధర్మమే శుభకరము" అని. (31)

శ్లో ॥ వృత్త్యా స్వభావ కృతయా వర్తమానః స్వకర్మకృత్ ।
హిత్వా స్వభావజం కర్మ శనైర్నిర్గుణతా మియాత్ ॥32॥

టీ :- నను స్వాభావికస్యకర్మణో బంధహేతుత్వాత్కథం సుఖ హేతుత్వమ్. తత్రాహ – వృత్త్యేతి. (32)

స్వభావసిద్ధమైన వంశపరంపరాప్తమైన వృత్తిలో నున్నవాడై తన విద్యుక్త ధర్మము నాచరించుచు స్వభావజమైన కర్మను వీడి మెల్లగా నిర్గుణత్వమును పొందును. ( 32 )

టీ :- స్వాభావిక కర్మబంధహేతువగుచుండగ సుఖహేతువెట్లు అనిన ఇట్లు చెప్పెను. 'వృత్త్యా' యని. ( 32 )

శ్లో ॥ ఉప్యమానం ముహుః క్షేత్రం స్వయం నిర్వీర్యతా మియాత్।
న కల్పతే పునః సూత్యా ఉప్తం బీజంచ నశ్యతి ॥ 33 ॥

మాటి మాటికి విత్తబడు ( విత్తనము పెట్టబడు ) క్షేత్రము స్వయముగనే నిస్సారమగును. మఱల మఱల సస్యము మొలకెత్తుటకు అయోగ్యమగును. అందు నాటిన విత్తనము కూడా నశించును. (33 )

టీ :- నను కామ్యాని కర్మాణి కుర్వతస్తత్ఫలభోగపరస్య కథం నైర్గుణ్యం స్యాత్. తదుక్తం ప్రహ్లాదేన – "ఔపస్థ్యజైహ్వ్యం బహుమన్యమానః కథం విరజ్యేత దురన్త మోహః" ఇత్యాది. తత్రాధికారిభేదేన వ్యవస్థాం సదృష్టాంతమాహ – ఉప్యమానమితి ద్వాభ్యామ్. పునః సూత్యై సస్య ప్రభవాయ. (33)

టీ :- కామ్య కర్మలను చేయుచు వాని ఫలములను అనుభవించుట యందాసక్తుడైన వానికి ఎట్లు నిర్గుణత్వము కలుగును. ఆ విషయమును ప్రహ్లాదుడిట్లు అడిగెను. ' ఉపస్థ, జిహ్వల ద్వారా పొందెడు సుఖములనే గొప్పగా తలంచువాడు ఎట్లు విరక్తుడగును? మోహము దురంతము గదా ! " ఇత్యాది. అచ్చట అధికార బేధముచే వ్యవస్థను దృష్టాంతముతో సహా చెప్పెను. ' ఉప్యమానం ' అని రెండు శ్లోకములచే. మరల సూత్యైః = విత్తనము మొలకెత్తుటకు. (33 )

శ్లో ॥ ఏవం కామాశయం చిత్తం కామానామతి సేవయా ।
విరజ్యేత యథారాజ నాగ్నివత్కామ బిందుభిః ॥ 34 ॥

కామము వాసనా రూపమున నుండెడు చిత్తము కామములను అతిగా సేవించుట ద్వారా వైరాగ్యము నొందును. ఓ రాజా! ఆజ్య బిందువులచే అగ్ని చల్చారదు. అదియే అగ్ని అధికమైన ఆజ్యధారచే చల్లారును. అట్లే కామములను కొంచెము కొంచెముగా అనుభవించుటచే కామము చల్లారదు. తీరదు. అదే కామము అధికముగా అనుభవించుటచే కామము తీరి వైరాగ్యము కలుగును. ( 34 )

టీ :- కామా ఆశేరతే వాసనారూపేణ యస్మిం స్తత్. అయాభావః – ఉత్కట వాసనా విశిష్టస్య సహసైవ వామత్యాగా సంభవాత్ వేదోక్త నియమేన బహుశః కామాన్ భుఞ్జానసైవ నిత్య నైమిత్తికైర్విశుద్ధ చేతసః తద్దోశదర్శనేన యయాతి సౌభరి ప్రముఖానామివ శనైర్విరాగో భవతి. యథా స్వవీర్యం క్షేత్రం

టీ :- వాసనా రూపము కామములు ఉండెడు చిత్తము. భావమది – ఉత్కటమైన వాసనలతో నిండియున్న చిత్తము గలవానికి హఠాత్తుగ కామత్యాగము అసంభవమైనందున వేదోక్తనియమానుసారముగా పుష్కలముగ కామముల ననుభవించుచు నిత్యనైమిత్తిక క్రియలచే పరి శుద్ధమైన చిత్తము గలవానికి వానియందలి దోష దర్శనముచేత యయాతి, సౌభరి మొదలు గాగల వారికి

శనైర్నిర్వీర్యం భవతి, యథా చ ప్రజ్వలితోఽగ్ని ర్ఘృతబిన్దుభిః శామ్యతి, మహతా ఘృతపూరేణ శామ్యతేవ తద్వత్. ప్రహ్లాదకృత స్తుతౌ కౌమార ఏవ నివృత్త్యుపదేశో మన్దవాసనానా మధికారేణ. తదుక్తం తత్రైవ – 'బాలా న దూషితధియో ద్వన్ద్వారామే రితేహితైః' ఇతి. అతః సర్వమనవద్యమ్. (34)

వలె మెల్లగా వైరాగ్యము కలుగును. అటులైతే తన వీర్యమును క్షేత్రము మెల్లగ నిర్వీర్యమగునో, ఎట్లైతే మండుచున్న అగ్ని ఘృతబిందువులచే శమించదో, గొప్పనైన ఘృతపూరముచే శమించునో అట్లు. ప్రహ్లాదుడు గావించిన స్తుతియందు కౌమారమునందే నివృత్త్యుపదేశము, మందవాసనలుగల, వారి అధికారముతో, అది అచ్చటనే చెప్పబడినది. " బాలురకు కష్ట, సుఖములు మొదలైన ద్వంద్వారామములచే, ప్రేరితములైన కోరికలచే దూషితమైన బుద్ధిగలవారు కారు. " అని. కాన సర్వము అనవద్యము. ( 34 )

శ్లో ॥ యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభి వ్యంజకమ్ ।
యదస్యత్రాపి దృశ్యేత తత్తేనైవ వినిర్దిశేత్ ॥ 35 ॥

ఏ పురుషునకు వర్ణాభివ్యంజకముగా ఏ లక్షణము చెప్పబడినదో, ఏదైతే వేఱే వర్ణజులందును ఆ లక్షణము ఒకవేళ అగుపడినను ఆ వర్ణాంతరము ఆ వర్ణము యొక్క లక్షణ నిమిత్తముగానే నిర్దేశించవలసినది. ( 35 )

టీ :– శమాదిభిరేవ బ్రాహ్మణాది వ్యవహారో ముఖ్యోన జాతి మాత్రా దిత్యాహ – యస్యేతి. యద్యది అన్యత్ర వర్ణాన్తరేఽపి దృశ్యేత తద్వర్ణాన్తరం తేనైవ లక్షణ నిమిత్తేనైవ వర్ణేన వినిర్దిశేత్. న తజ్జాతి నిమిత్తేనేత్యర్థః. (35)

టీ:– శమాది గుణములచేతనే బ్రాహ్మణాది వ్యవహారము ముఖ్యము గాదు. జాతి మాత్రముననే యని చెప్పెను. ' యస్య ' అని. యత్=ఒకవేళ వేఱే వర్ణములందును మఱొక వర్ణమునకు చెప్పబడిన గుణములుండనోపు. అంతమాత్రమున ఆ లక్షణ నిమిత్తముగనే అచ్చట ఆ వర్ణమును నిర్దేశించరాదు. అది జాతినిమిత్తము గాదని యర్థము.(35)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే యుధిష్ఠిర నారదసంవాదే సదాచార నిర్ణయోనామ ఏకాదశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి సప్తమ స్కంధము నందలి యుధిష్ఠిర నారద సంవాదమున శ్రీధర భావార్థ దీపికా టీకా వ్యాఖ్యానమున పదునొకండవ అధ్యాయము.

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో॥ బ్రహ్మచారీ గురుకులే వసందాతో గురోర్హితమ్ ।
ఆయరందాసవన్నీచో గురౌ సదృఢ సౌహృదః ॥ 1 ॥

టీ:-ద్వాదశే వర్ణ్యతే బ్రహ్మచారి వనస్థయోః చతుర్ణామాశ్రమాణాం చ సాధారణ్యేన కశ్చన. వర్ణాదీనాం ధర్మా ఉక్తాః, ఇదానీమాశ్రమ ధర్మా ఉచ్యన్తే తత్రాస్మిన్ ద్వాదశే ఽ ధ్యాయే బ్రహ్మచారి వానప్రస్థయోరసా ధారణాశ్చతుర్ణాం సాధారణాశ్చోచ్యన్తే. త్రయోదశే యతేర్ధర్మా. చతుర్దశే గృహస్థస్య. పంచదశే సర్వధర్మసారసంగ్రహః. బ్రహ్మచారీ గురుకులే వసన్ గుర్వాదీనుపాసీతేత్యుత్తరేణాన్వయః. (1)

శ్లో ॥ సాయం పాతరుపాసీత గుర్వగ్న్యర్క సురోత్తమాన్ ।
ఉభే సంధ్యే చ యతవాగ్జపన్ బ్రహ్మ సమాహితః ॥ 2 ॥

**ద్వాదశాధ్యాయము**

**నారదుడిట్లు చెప్పుచున్నాడు :-**

బ్రహ్మచారి గురుకులమున నివసించుచున్నవాడై ఇంద్రియ నిగ్రహము కలవాడై, దాసునివలె గురువుగారికి హితము నాచరించువాడై, గురువుయందు దృఢమైన స్నేహముగలవాడై సేవించవలెను. ( 1 )

టీ :- ద్వాదశాధ్యాయమున బ్రహ్మచారి, వనస్థులయొక్క ( బ్రహ్మచర్య, వానప్రస్థములయొక్క ) ధర్మములు, మఱియు నాలుగు ఆశ్రమములయొక్క సాధారణ విధులు ప్రసంగించబడినవి. వర్ణాదులయొక్క ధర్మములు చెప్పబడినవి. ఇప్పుడు ఆశ్రమ ధర్మములు చెప్పబడుచున్నవి. వానిలో పన్నెండవ అధ్యాయమున బ్రహ్మచారి, వానప్రస్థుల అసాధారణ ధర్మములు, చతురాశ్రమముల సాధారణ ధర్మములు చెప్పబడుచున్నవి. పదమూడవ అధ్యాయమున యతి ధర్మములు, పదునాల్గవ అధ్యాయమున గృహస్థ ధర్మములు, పదునైదవ అధ్యాయమున సర్వధర్మ సార సంగ్రహమును చెప్పబడును. బ్రహ్మచారి గురుకులమున నివసించుచు గురువు మొదలైన వారిని సేవించవలెనని ఉత్తర శ్లోకముతో అన్వయము. (1)

ఉభయ సంధ్యలయందు మౌనమునవలంభించువాడై, త్రిసంధ్యలలో సమాహిత చిత్తుడై గాయత్రిని జపించవలెను. సాయంకాలమున,

ప్రాతఃకాలమునను గురువును, సూర్యుని, అగ్నిని, దేవోత్తములను సేవించవలెను. ( 2 )

టీ :- తానాహ - 'సాయం' ఇతి. బ్రహ్మ గాయత్రీం జపన్ సంధ్యాత్రయముపాసీత. ఉభే సంధ్యే తు యతవాక్ సాయం ప్రాతః సంధాకాలనిమిత్తం మౌనం కుర్యాదిత్యర్థః. (2)

టీ :- తాన్ = అట్టి ధర్మములను చెప్పుచున్నాడు. 'సాయం' ఇత్యాదిగా. బ్రహ్మ = గాయత్రిని జపించువాడై ప్రాతర్మాధ్యాహ్నిక సాయం సంధ్యలను మూడింటిని ఉపాసనగావించునది. ప్రాతః సాయం సంధ్యలరెండింటి యందు యత వాక్కుగలవాడై సాయం ప్రాతః సంధ్యాకాల నిమిత్తము మౌనమునాశ్రయించ వలిసినదని అర్థము. (2)

శ్లో ॥ ఛందాం స్యదీయత గురో రాహూతశ్చే త్సుయంత్రితః।
ఉపక్రమేవసానేచ చరణౌ శిరసా నమేత్ ॥3॥

గురువు పిలిచిన వెడలి మనస్సు నిలిపి ఏకాగ్రచిత్తముతో గురువునుండి వేదములను అభ్యసించవలెను. పఠనము యొక్క ఆరంభమున మరియు పఠనావసానమునందును గురువుగారి చరణములకు నమస్కరించ వలెను, ( 3 )

టీ :- ఉపక్రమే ఆదావవసానే అన్తే చ గురోశ్చరణౌనమేత్. (3)

టీ :- ఉపక్రమే = ఆరంభమున, అవసానే = అంతమునందును గురువుగారి చరణములకు నమస్కరించునది. ( 3 )

శ్లో ॥ మేఖలాజిన వాసాంసి జటాదండ కమండలూన్ ।
బిభృయా దుపవీతంచ దర్భపాణి ర్యథోదితమ్ ॥ 4 ॥

శాస్త్రమున చెప్పబడినట్లుగ ముంజ గడ్డితో చేయబడిన మొలత్రాడును, జింకచర్మమును ధరించి, జటలను దాల్చి , దండ కమండలువులను గ్రహించి, యజ్ఞోపవీతమును ధారణము గావించి దర్భపాణియై ( 4 )

శ్లో ॥ సాయం ప్రాతశ్చరే ద్భైక్షం గురవే తన్నివేదయేత్ ।
భుంజీత యద్యనుజ్ఞాతో నోచేదుపవసేత్ క్వచిత్ ॥ 5 ॥

ఉదయము, సాయంత్రము భిక్షాటన చేసి గురువుగారికి అర్పించవలసినది. ఆయన అనుమతించిన మేర భుజించవలసినది. ఒకవేళ గురువు ఎచ్చటకేని వెడలిన ఉపవసించునది. ( 5 )

టీ :- యథోదితమితి. పాలాశోదణ్డో బ్రహ్మణస్యేత్యాది నియమ మనతి క్రమ్య జటాధారణం తు కేశప్రసాధనాభావమాత్రమ్. (4,5)

టీ :- ' యథోదితం ' అని. పాలాశదండము ( మోదుగుకఱ్ఱ ) బ్రాహ్మణునకు అను నియమము నతిక్రమించక, జటాధారణమనునది కేశములను అలంకరించుకొనకుండుటకు మాత్రమే. ( 4, 5 )

శ్లో ॥ సుశీలోమిత భుగ్దక్షః శ్రద్ధదానో జితేంద్రియః ।
యావదర్థం వ్యవహరేత్ స్త్రీషు స్త్రీ నిర్జితేషుచ ॥ 6 ॥

మంచిశీలము గలవాడై, మితముగా భుజించువాడై, కార్యకుశలుడై, శ్రద్ధగలవాడై, ఇంద్రియ నిగ్రహమును గావించుకొన్నవాడై, స్త్రీలయెడ, స్త్రీలచే జయించబడిన వారియెడను అవసరమున్నంత మేరకే వ్యవహరించవలెను. ( 6 )

టీ :- యోవదర్థం యథోపయోగమేవ. (6)

టీ :- యావదర్థం = అవసరమున్నంతవరకే. ( 6 )

శ్లో ॥ వర్జయే త్ప్రమాదా గాథా మ గృహస్థో బృహద్వ్రతః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్త్యపి యతేర్మనః ॥ 7 ॥

శ్లో ॥ కేశ ప్రసాదనో న్మర్ద స్నాపనాభ్యంజ నాదికమ్ ।
గిరి స్త్రీభి ర్యువతిభిః కారయేన్నాత్మనో యువా ॥ 8 ॥

గృహస్థునకు భిన్నమైనవాడు, బ్రహ్మచర్యముగలవాడు, ప్రతివాడును స్త్రీవార్తను వదిలివేయవలెను. ఎందులకనిన ఇంద్రియములు ప్రమాద కరములు. యతియొక్క మనస్సునైనను హరించును. యవ్వనము లోనున్న గురుపత్నులతో, పరాంగనలతోను కేశముల నలంకరింప చేసుకొనుట, శరీరం పట్టించుకోవడం, స్నానము చేయించుకోవడం, తలంటు పోయించుకోవడం చేయరాదు. (7, 8)

టీ :- బృహద్వ్రతో బ్రహ్మచర్యవాన్ గృహస్థవ్యతిరిక్తః సర్వో ఽపి ప్రమదాగాథాం వర్జయేత్. తత్రహేతుః - ఇన్ద్రియాణి బలవన్తి సంయతస్యాపి మనోహరన్తీతి. (7,8)

టీ :- బృహద్వ్రతః = బ్రహ్మచర్యము గలవాడు. గృహస్థునికంటె భిన్నమైనవాడు. ప్రతివాడును స్త్రీలకు సంబంధించిన గాథలను వినరాదు. చూడరాదు. అందుకు కారణము ఇంద్రియములు మిక్కిలి బలము గలవి. నిగ్రహముతోనున్న వాని మనస్సునైనను హరించును యని. ( 7, 8 )

శ్లో ॥ నన్వగ్నిః ప్రమదానామ ఘృతకుంభ సమః పుమాన్ ।
సుతామపి రహో జహ్యా దన్యదా యావదర్థకృత్ ॥9॥

స్త్రీలు అనిన అగ్ని, అనగా అగ్నివంటివారు. పురుషుడు నేతికుండవంటి వాడు. పుత్రిక నైనను గృహస్థు ఏకాంతమున కలిసియుండరాదు. లేదా అవసరమైనచో అవసరము మేఱకే యుండవచ్చును. ( 9 )

టీ :- నకారయేదిత్యత్ర హేతుః- నన్వితి. రహః ఏకాన్తే అన్యదా కేశప్రసాదనాది వ్యతిరిక్తావసరే అనేకాన్తావసరే వా యావదర్థం తదుక్తం కుర్యాత్. (9)

టీ :- బ్రహ్మచారి గురుకాంతలచే, పరస్త్రీలచే కేశప్రసాదనాదికమును చేయించుకొనరాదనుటకు హేతువు ‘ నను ’ ఇత్యాదిగ. రహః= ఏకాంతమున. అన్యదా = కేశాలంకరణాది వ్యతిరిక్తావసరములందు అనేకాంత సమయములలోనైను అవసరము మేరకు వారు చెప్పినది చేయవలెను. (9)

శ్లో ॥ కల్పయిత్వాత్మనా యావదాభాస మిదమీశ్వరః ।
ద్వైతం తావన్నవిరమే త్తతో హ్యస్య విపర్యయః ॥ 10 ॥

శ్లో ॥ ఏతత్సర్వం గృహస్థస్య సమామ్నాతం యతేరపి ।
గురువృత్తి ర్వికల్పేన గృహస్థస్యర్తు గామినః ॥ 11 ॥

ఆత్మ సాక్షాత్కారమును బొంది బహిరింద్రియములకు గోచరించేదంతయు ఆభాసమాత్రమని గ్రహించి, తాను ఈశ్వరుడు ఒకటేనని గ్రహించునంతవరకు స్త్రీపురుష రూపమైన ద్వైత భావనను వీడరాదు. అట్లు కాకుండ ఈ ద్వైత భావనను వీడరాదు. అట్లు కాకుండ ఈ ద్వైత భావమును వీడిన మూర్ఖుడగును. గృహస్థునకు యతికి గూడా ఈ నియమములు

చెప్పబడినవి. గృహస్థుడు ఋతుకాలములందు భార్యనుపొందువాడై వికల్పముగా గురువుననుసరించువాడై యుండనోపు. ( 10,11 )

టీ :- నను మిథ్యాత్వాదతికశ్మలత్వాచ్చ స్వయం త్యక్త ప్రాయం స్త్ర్యాది జహ్యాదితి కోఽ యమతి నిర్బన్ధస్తత్రాహ - కల్పయిత్వేతి. ఆత్మనా స్వరూపసాక్షాత్కారణే ఇదం దేహేన్ద్రియాద్యాభాసమాత్రం కల్పయిత్వా నిశ్చిత్య యావదసౌజీవః ఈశ్వరః స్వతన్త్రో న భవేత్తావద్ద్వైతం అయం పుమానియం స్త్రీత్యాది భేదో న విరమేత్. తః కిమత ఆహ - తతోహి ద్వైతాత్ విపర్యయో గుణాధ్యాసేన భోగ్యతా బుద్ధిః అతో జహ్యాదేవేత్యర్థః. (10)

టీ :- మిథ్యాభూతము అతి కశ్మలమైనందున స్వయముగనే త్యక్త ప్రాయమైన స్త్రీ మొదలైన వానిని వదలవలెనను అతి నిర్బంధమిది యేలనోయి ? యనిన ఇట్లు చెప్పెను. ' కల్పయిత్వా ' యని. ( ఆత్మచే) తనచే స్వరూపసాక్షాత్కారము పొందుటద్వారా ' ఈ శరీరము దేహేంద్రియాద్యాభాస మాత్రము అని. కల్పయిత్వా = నిశ్చయించుకొని ఈ జీవుడే ఈశ్వరుడు. స్వతంత్రుడు. " అను జ్ఞానమును పొందువరకు ద్వైతమగు ఇతడు పురుషుడు, ఈమె స్త్రీయను భావమును, భేదబుద్ధిని వీడరాదు. వీడిన నేమగును? అనిన ఇట్లు చెప్పెను. తతః = అప్పుడు ద్వైత భావము వలన దుఃఖము కలుగును. గుణములు యునికిచే భోగ్యతాబుద్ధి కలుగును. కాన దానిని వీడవలెను. ( 10 )

టీ :- ఏతత్సర్వం సుశీల ఇత్యాద్యుక్తమ్. గృహస్థస్య విశేసమాహ - గురువృత్తిరితి. (11)

టీ :- ' సశీల ' ఇత్యాదిగా చెప్పబడినదంతయు గృహస్థునకు విశేష లక్షణములను చెప్పుచున్నాడు. ' గురువృత్తిః ' అని. ( 11 )

శ్లో ॥ అంజనాభ్యంజనోన్మర్ద స్త్ర్యవలేఖా మిషం మధు ।
స్రగ్గంధ లేపాలంకారాం స్త్యజేయు ర్యేధృత వ్రతాః॥12॥

శరీర లేపనము, శిరోలేపనము, శరీర మర్దనము, స్త్రీ చిత్ర లేఖనము, స్త్రీ చిత్ర దర్శనము, మాంసము, మధువు, మాలలు, గంధలేపనము, అలంకారములను వ్రతధారులు వదలవలసినది. 12

టీ :- అఞ్జనాదీనామామిషాన్తానాం ద్వన్ద్వైక్యమ్. అఞ్జనం శరీరస్య అభ్యఞ్జనం శిరసః. స్త్రియంచావలేఖాం చ చిత్రకర్మ స్త్రీణాం కుడ్యాదౌ లేఖనం వా తన్నిరీక్షణం వా. అత్రాభ్యఙ్గాది స్వరూపతో నిషిధ్యతే. పూర్వంతు కథం చిదపి ప్రాప్తమపి స్త్రీ కర్తృకం నిషిద్ధమితి భేదః. (12)

టీ :- ఆమిషము వరకు చెప్పబడిన అంజనాదులకు ద్వంద్వైక్యము. అంజనం = శరీర లేపనము, అభ్యంజనం = శిరస్సునకు సంబంధించిన లేపనము స్త్రీని, స్త్రీచిత్రమును కుడ్యాదులందు చిత్రించుట, చిత్రమును చూచుట. ఇచ్చట అభ్యంగనాదులను పూర్తిగా నిషేధించుచున్నాడు. పూర్వము కేవలము ఎటులో ఆపదయందు ప్రాప్తమైనను స్త్రీ కర్తృకమైన అభ్యంగాదులు నిషేధించబడినవి. అనునది భేదము. ( 12 )

శ్లో॥ ఉషత్వైవం గురుకులే ద్విజోధీత్యావ బుధ్య చ ।
త్రయీం సాంగోపనిషదం యావదర్థం యథాబలమ్ ॥13॥

ఈ విధముగ ద్విజుడు గురుకులమున నివసించువాడై శిక్షా, వ్యాకరణం, కల్పం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషం అను షడంగసహితమైన వేదత్రయమును ఉపనిషత్తులతోడ తన అధికారానుగుణముగ, యథాశక్తి చదివి అర్థమునెఱింగి, ( 13 )

టీ:- అఙ్గైః శిక్షాదిభిరుపనిషద్భిశ్చ సహితాం వేదత్రయీ మధీత్యావ బుధ్య చ తదర్థం చ విచార్య యావదర్థం స్వాధి కారానుసారేణ. (13)

టీ :- అంగైః = శిక్షాదులైన అంగములతో, ఉపనిషత్తులతోడను కూడిన ఋగ్యజుస్సామ వేద త్రయమును చదివి, అవబుధ్యచ = వాని అర్థమును గూడా విచారించి యావదర్థం = తన అధికారానుసారముగ. ( 13 )

శ్లో ॥ దత్త్వా వరమనుజ్ఞాతో గురోః కామం యదీశ్వరః ।
గృహం వనం వా ప్రవిశే త్ప్రవ్రజే త్తత్ర వా వసేత్ ॥14॥

శక్తి కలిగిన గురువు కోరిన వరమును గురుదక్షిణగ సమర్పించి గురువుగారి అనుమతి గైకొని గృహస్థాశ్రమమును గాని, వానప్రస్థమును గాని స్వీకరించవలెను. లేదా సన్యాసమును గానీ స్వీకరించనగును. లేదేని నైష్ఠికబ్రహ్మచారియై అచ్చటనేయైనను ఉండవచ్చును. ( 14 )

టీ :- యదీశ్వరః శక్తస్తర్హి గురోః కామమపేక్షితం వరం దత్వా యథాధికారం గృహస్థాద్యాశ్రమం స్వీకుర్యాత్ ప్రవ్రజేత్ వా తత్రైవ వా వసేత్ నైష్ఠికః స్యాదిత్యర్థః. (14)

టీ :- యదీశ్వరః = శక్తిగలవాడైన గురువుగారి, కామం = అపేక్షితమైన వరమును ఇచ్చి అధికారమునకు తగినట్లు గృహస్తాద్యాశ్రమమును స్వీకరించనగును. లేదా సన్యసించనగును. అదియునుగాక అచ్చటనే గురుకులమున నైష్ఠిక బ్రహ్మచారియై ఉండవచ్చును అని అర్థము. (14)

శ్లో ॥ అగ్నౌ గురా వాత్మని చ సర్వభూతే ష్వధోక్షజమ్ ।
భూతైః స్వధామభిః పశ్యేత్ అప్రవిష్టం ప్రవిష్టవత్ ॥15॥

అగ్నియందు, గురువుయందు, తనయందు సమస్త భూతములందును స్వాశ్రయభూతములైన జీవములతోడ తన్నియంతృ రూపముగ అప్రవిష్టుడైనను అధోక్షజుని ప్రవేశించిన వానిగ చూడనగును.(15)

టీ :- స్వధామభిః స్వాశ్రయైర్భూతేర్జీవైః సహ తన్నియన్తృతయా. (15)

టీ :- స్వధామభిః = స్వాశ్రయములగు, భూతైః = జీవములతో సహా వాని నియంతృరూపముగ ( 15 )

శ్లో ॥ ఏవం విధో బ్రహ్మచారీ వానప్రస్థో యతిర్గృహీ ।
చరన్విదిత విజ్ఞానః పరం బ్రహ్మాధి గచ్ఛతి ॥ 16 ॥

బ్రహ్మచారి, వానప్రస్థుడు, యతి, గృహస్థు ఈ విధముగ ప్రవర్తించువాడై విజ్ఞానమును ఎఱింగినవాడై పరబ్రహ్మను పొందును.(16)

టీ:-చరన్నేవ మా చరన్ విదితం విజ్ఞానం విజ్ఞేయం యేన సః. (16)

టీ:-చరన్ = ఇట్లా చరించువాడై, తెలుసుకొనదగినది తెలుసుకొన్నవాడై.(16)

శ్లో॥ వానప్రస్థస్య వక్ష్యామి నియమాన్ ముని సంమతాన్ ।
యానా తిష్ఠన్ మునిర్గచ్ఛే దృషిలోక మిహాంజసా ॥17॥

ముని సమ్మతములైన వానప్రస్థాశ్రమము యొక్క నియమములను చెప్పెదను. వానిని అనుష్ఠించిన ముని చక్కగా ఋషిలోకమును (మహర్లోకమును) వెళ్ళును. ( 17 )

టీ :- ఋషిలోకం మహర్లోకం. (17)

టీ :- ఋషిలోకమ్ = మహర్లోకమును ( 17 )

శ్లో ॥ న కృష్ట పచ్య మశ్నీయా దకృష్టం చాస్య కాలతః ।
అగ్ని పక్వ మథామం వా అర్క పక్వ ముతాహరేత్ ॥18॥

దున్ని పండించిన వానిని భుజించరాదు. అకృష్టమేయైనను అకాల పక్వములను భుజించరాదు. అగ్ని పక్వమును, ఆమద్రవ్యము (ఉడక బెట్టనిది) ను గానీ సూర్య కిరణములచే పక్వమగు ఫలములను గానీ, ఆహారముగా చేసుకొన దగును. ( 18 )

టీ :- అకృష్టమకృష్టపచ్యమ్. అకాలతః పాకకాలాత్పూర్వమేవ నిష్పన్నమిత్యర్థః. అర్క పక్వం ఫలాది. ఆహరేదశ్నీయాత్. (18)

టీ :- అకృష్టం = దున్నకుండగనే తమంత తాముగానే పండిన, అకాలతః= పంటకలమునకు ముందుగనే కలిగిన అని అర్థము. అర్కపక్వమ్ = ఫలాదికమును. ఆహరేత్ = భుజించవలసినది. (18 )

శ్లో ॥ వన్యైశ్చరు పురోడాగాన్నిర్వపేత్ కాలచోదితాన్ ।
లబ్ధే నవే నవేన్నాద్యే పురాణంతు పరిత్యజేత్ ॥ 19 ॥

వన్యములైన నీవారాది ధాన్యముతో చరు – పురోడాశములను గావించి హవనము చేయగును. అన్నాదులు నవనవము పొందబడిన కొలది పాతవి పరిత్యజించవలెను. ( 19 )

టీ :- వన్యైర్నీవారాదిభిః చరుపురోడాశాన్. కాలచోదితాన్నిత్యాన్. పురాణం పూర్వ సంచితమ్. (19)

టీ :- వన్యైః = దూసవరి మొదలైన దానిచే చేయబడిన చరు, పురోడాశములను. కాలచోదితాన్ = నిత్యమైనవానిని. పురాణం = పూర్వము సేకరించబడిన వానిని. ( 19 )

శ్లో॥ అగ్న్యర్థమేవ శరణ ముటజం వాద్రి కందరామ్ ।
శ్రయేత హిమవాయ్వగ్ని వర్షార్కాతప షాట్ స్వయమ్ ॥20॥

ఇల్లు గానీ, పర్ణశాల గానీ, గిరి గుహగానీ, అగ్ని కార్యమునకే గానీ, నివాసము కొఱకు ఆశ్రయించరాదు. హిమ, వాయు, అగ్ని, వర్ష, అర్క, ఆ తపములను స్వయముగా సహించదగును. ( 20 )

టీ :- హిమాదీన్ సహత ఇతి తథా. (20)

టీ :- హిమ, వాయు, అగ్ని, మొదలైన వానిని సహించు వాడై .(20)

శ్లో ॥ కేశ రోమ నఖ శ్మశ్ర మలాని జటిలో దధత్ ।
కమందల్వజినే దండవల్కలాగ్ని పరిచ్ఛదాన్ ॥ 21 ॥

తలవెంద్రుకలను, ఒంటిపైనుండెడు వెంద్రుకలను, గోళ్ళను, గడ్డము, మీసములను, దంతాదులను కడుగనందువల్ల వచ్చెడు మలమును జటిలుడై దాల్చుచు, కమండలువు, జింకచర్మము, దండము, నాఱవస్త్రము, దర్భ, సమిధలు మొదలైన వానిని ధరించినవాడై. (21)

టీ :- కేశాదీన్మలం చా ప్రక్షాలనేన ధారయన్. కమణ్డలాదీంశ్చ దధత్. (21)

టీ :- తలవెంద్రుకలు మొదలైన వానిని, మలం = దంతాదులను కడుగనందు వలన కలిగెడు మలమును ధరించువాడై, కమండలు మొదలైనవి దాల్చువాడై. (21)

శ్లో ॥ చరేద్వనే ద్వాదశాబ్దా నష్టౌ వా చతురోమునిః ।
ద్వావేకం వా యథా బుద్ధిర్నవిపద్యేత కృచ్ఛ్రతః ॥ 22 ॥

పదునొకండు సంవత్సరములు గానీ, ఎనిమిదిగానీ, నాలుగు సంవత్సరములు గానీ, రెండు లేదా ఒక సంవత్సరము గానీ లేదా ఇష్టము వచ్చినంతకాలము ముని వనమున సంచరించనగును. తపః క్లేశమున బుద్ధినశించకుండునట్లు వనమున చరించవలసినది. ( 22)

టీ :- కృచ్ఛ్రతస్తపః క్లేశాద్యధా బుద్ధిర్నశ్యేత్తథా చరేత్. (22)

టీ :- కృచ్ఛ్రతః = తపఃక్లేశాదులను సమించుచు కార్యమునుండి మనస్సు విరమించకుండగా నడుచుకొనవలసినది. ( 22 )

శ్లో ॥ యదాకల్పః స్వక్రియాయాం వ్యాధిభిర్జర యాథవా ।
ఆన్వీక్షిక్యాం వా విద్యాయాం కుర్యాదనశనాదికమ్ ॥ 23॥

వ్యాధులచే గానీ, ముసలితనముచే గానీ, తనపనులయందుగానీ ఆన్వీక్షికీ ( రాజవిద్యలు ఆన్వీక్షికీ, త్రయీ, వార్తా, దండనీతి యనునాల్గు, ఆన్వీక్షికీ యనిన వైశేషికాది తర్కవిద్య) విద్యయందు గానీ అశక్తుడైన అనశనమును ( నిరాహారము ) పాటించవలసినది. ( 23 )

టీ:- ద్వాదశాబ్దానన్తరమపి యది స్వధర్మానుష్ఠానే శక్తస్తర్హి వన ఏవ వసేత్. యదితు జ్ఞానాభ్యాసే యోగ్యస్తర్హి సంన్యసేదిత్యుత్త రాధ్యాయే వక్ష్యతి. తదుభయ రహితస్య తు యత్కృత్యం తదాహ యదా ఉ కల్పో ఉ సమర్థః. ఆన్వీక్షిక్యాం విద్యాయాం జ్ఞానాభ్యాసే. (23)

టీ :- పన్నెండు సంవత్సరములు వనమున నున్న తరువాతయు తన ధర్మమును నెఱవేర్చుకొనుటయందు ఒకవేళ శక్తిగలవాడై యుండిన అప్పుడును వనముననే నివసించవలసినది. ఒకవేళ జ్ఞానాభ్యాసమున యోగ్యతవలవాడైన అప్పుడు సన్యాసమును స్వీకరించవలసినదని రాబోవు అధ్యాయమున చెప్పగలడు. ఆ రెండింటికిని శక్తిలేని వాడు చేయవలసినదేదో దానిని చెప్పుచున్నాడు. ఎప్పుడైతే అశక్తుడగునో ఆన్వీక్షికీ విద్యాభ్యాసమున = జ్ఞానాభ్యాసమున ( 23 )

శ్లో ॥ ఆత్మన్యగ్నీ న్సమారోప్య సన్యస్యాహం మమాత్మతామ్ ।
కారణేషు న్యసేత్సమ్యక్ సంఘాతంతు యథార్హతః ॥24॥

ఆత్మయందగ్నులను ఆరోపించుకొని, అహంకారమును, మమతానురాగములను వదిలి, యథాయోగ్యముగ తన కారణములైన ఆకాశాదులందు దేహమును బాగుగా సంఘాతము గావించునది.(24)

టీ :- అనశనాది కరిష్యతః పూర్వకృత్యమాహ - ఆత్మనీత్యాది యావత్సమాప్తి. యథార్హత్తో యథాయోగ్యం స్వకారణేష్వాకాశాదిషు సంఘాతం దేహం న్యసేత్ప్రవిలాపయేత్. (24)

టీ :- నిరాహారాదికము గావించువానికి పూర్వకృత్యమును చెప్పెను. 'ఆత్మని' ఇత్యాదిగ. సమాప్తియగువఱకు యథార్హతః = యోగ్యత ననుసరించి తనకు కారణములైన ఆకాశాదులందు దేహమును సంఘాతము ( లీనము ) గావించవలెను. ( 24 )

శ్లో॥ ఖే ఖాని వాయౌ నిశ్వాసాం స్తేజస్యూష్మాణ మాత్మవాన్ ।
అప్స్వసృక్ శ్లేష్మ పూయాని క్షితౌ శేషం యథోద్భవమ్॥25॥

అది ఎట్లనగ, ధీమంతుడు దేహగతమైన ఛిద్రరూపములైన ఆకాశ భాగములను ఆకాశమునందు , వాయువునందు నిశ్వాసములను, శరీరమందలి వాడిని తేజస్సుయందు, రక్తమును జలమున, కఫము చీము క్షితియందు, మిగిలినవి దేనినుండి పుట్టినవో వానియందే లయము గావించ వలసినది. ( 25 )

టీ :- తదేవ విభజ్యదర్శయతి - ఖే ఆకాశే దేహగత ఛిద్రాణి. ఆత్మవాన్ ధీమాన్. శేషమస్థిమాంసాది కఠినాంశమ్. (25)

టీ :- దానినే విభజించి చూపెట్టుచున్నాడు. ఖే = ఆకాశమున, ఖాని = దేహమునందుండెడు ఛిద్రరూపమైన ఆకాశ రూపములను, ఆత్మవాన్ = ధీమంతుడు, శేషం = మిగిలిన అస్థులు. మాంసము మొదలైన కఠిన భాగమును ( 25 )

శ్లో ॥ వాచమగ్నౌ సవక్తవ్యా మింద్రేశిల్పం కరావపి ।
పదాని గత్యావయసి రత్యోపస్థం ప్రజాపతౌ ॥ 26 ॥

వహ్నియందు వక్తవ్యముతోడ వాక్కును, ఇంద్రునియందు శిల్పముతోబాటు కరములను, విష్ణువుయందు గతితో సహా పదములను, ప్రజాపతియందు రతితోడ ఉపస్థను, మృత్యువునందు విసర్గముతో సహా పాయువును, దిక్కులందు శబ్దంతోపాటు శ్రోత్ర ద్వయమును, స్పర్శతోడ

శ్లో ॥ మృత్యౌ పాయుం విసర్గం చ యథాస్థానం వినిర్దిశేత్ ।
దిక్షు శ్రోత్రం సనాదేన స్పర్శమధ్యాత్మని త్వచమ్ ॥27॥

చర్మమును వాయువునందు అనుసంధానము గావించవలెను. (26,27)

టీ :- ఏవం స్థూలశరీరస్యలయముక్త్వా లిఙ్గశరీరరూపస్య అధ్యాత్మాది త్రయస్య లయమాహ - వాచమిత్యాదినా. తత్ర యద్యపి యథోద్భవం లయస్య యుక్తత్వా దధ్యాత్మాదీనాం స్వస్వకారణేషు రాజసాహంకారాదిషు లయో వాచ్యస్తథాపీహ తేషాం లయభావేనేయ మద్వితీయాత్మ ప్రతిపత్తిరేతి యథా కథం చిల్లయే భావ్యే దేవతానాం ప్రవర్తకత్వేన ప్రాధాన్యాదింద్రియ తద్విషయయోర్దేవతాసు లయః కథత్యే. వక్తవ్యసహితాం వాచమగ్నౌన్యసేత్. ఏవం సర్వత్ర. పదాని పాదౌ. వయసి విష్ణౌ. (26)

టీ :- ఇట్లు స్థూలశరీరము యొక్క లయమును గూర్చి చెప్పి లింగశరీర రూపమైన అధ్యాత్మాది త్రయముయొక్క లయమును చెప్పెను. 'వాచం' ఇత్యాదిగా. అందు పుట్టుకననుసరించి లయము యుక్తమైనను అధ్యాత్మాదులకు తమ తమ కారణములైన రాజసాహంకారాదులందు లయము చెప్పదగి యున్నను, ఇందు వానికి లయభావముచే ఈ అద్వితీయ ఆత్మ ప్రతిపత్తి పరమని ఎట్లో ఒకట్లు లయము కాదగియుండగా దేవతలకు ప్రవర్తక రూపమున ప్రాధాన్యమున్నందున ఇంద్రియములకు, వాని విషయములకు దేవతలందు లయము చెప్పబడుచున్నది. వక్తవ్యముతోగూడా వాక్కును అగ్నిలో లయము గావించవలెను. ఇట్లే సర్వత్రలయమెఱుంగవలెను. పదాని = రెండు పాదములను. వయసి = విష్ణువునందు. ( 26 )

టీ :- సనాదేనవద్భేనసహ. అధ్యాత్మనివాయౌ. అధ్యాత్మవిదితి. పాఠే వయావితి జ్ఞాతవ్యమ్. (27)

టీ :- సనాదేన = శబ్దముతోడ , అధ్యాత్మని = వాయువునందు, 'అధ్యాత్మవిత్ ' అను పాఠమున వాయువునందని యెఱుంగనగును.(27)

శ్లో ॥ రూపాణి చక్షుషా రాజన్ జ్యోతిష్యభి నివేశయేత్ ।
అప్పు ప్రచేత సా జిహ్వాం ఘ్రేయైర్ఘ్రాణం క్షితౌత్యసేత్ ॥28॥

ఓ రాజా ! చక్షువులతోడ రూపమును సూర్యునియందు, వరుణుని యుక్తముగ జిహ్వను నీటియందు, గంధములతోడ ఘ్రాణమును, పృథ్వియందు చేర్చనగును. ( 28 )

టీ :- జ్యోతిష్యాదిత్యే. రసగంధయోస్త్విన్ద్రియాద్యాకర్షకత్వేన ప్రాధాన్య వివక్షయా దేవతా సహితస్యేన్ద్రియస్య విషయే అయమాహ - ప్రచేతసా సహ జిహ్వాం రసనమప్సు రసరూపాసు. ఘ్రాణశబ్దేనాశ్వినోరప్యుప లక్షణమ్. అశ్విభ్యాం సహ ఘ్రాణం ఘ్రేయైర్గంధైరుపలక్షితాయాం క్షితావిత్యర్థః. (28)

టీ :- జ్యోతిషి = ఆదిత్యునియందు , రస గంధములకు ఇంద్రియాద్యాకర్షకత్వము ప్రాధాన్య వివక్ష ననుసరించి దేవతతో గూడిన ఇంద్రియమునకు విషయమునందు లయమును చెప్పెను. వరుణునితో పాటు జిహ్వను ( రసనమును ) రసరూపమైన నీటియందు , ప్రాణ శబ్దముచే అశ్వినులకును ఉప లక్షణము. అశ్వముల తోడను ప్రాణమును , ఘ్రేయైః = గంధములతో, ఉపలక్షితమైన క్షితియందు అని అర్థము.(28)

శ్లో ॥ మనో మనో రథైశ్చంద్రే బుద్ధిం బోధ్యైః కవౌ పరే ।
కర్మాణ్యధ్యాత్మనా రుద్రే యదహం మమతా క్రియా ।
సత్వేన చిత్తం క్షేత్రజ్ఞే గుణైర్వైకారికం పరే ॥ 29 ॥

మనోరథములతోడ మనస్సును చంద్రునియందు, బోధ్య విషయములతో కూడా బుద్ధిని కవియైన బ్రహ్మయందు, అహంకారముతో సహా కర్మలను మమతా పూర్వక క్రియగల రుద్రునియందును, సత్వముతోడ చిత్తమును క్షేత్రజ్ఞుని యందును, వికారమును పొందిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మమునందూ విలీనం చేయవలెను. ( 29 )

టీ:- పరేకకాబ్రహ్మణి. అధ్యాత్మనాహంకారేణ. అధ్యాత్మతామితి పాఠే కర్మాణ్యహంకారంచేత్యర్థః. కథంభూతే రుద్రే. యద్య

టీ :- పరే = కవియైన బ్రహ్మయందు. అధ్యాత్మనా = అహంకారముతోడ, 'అధ్యాత్మతాం' అను పాఠమున కర్మలను అహంకారమును అని అర్థము.

స్మాదహం మమతా పూర్వికాక్రియా భవతి తస్మిన్. సత్త్వేన చేతనయా. గుణైర్గుణాకార్యైః ప్రాగవశిష్టైర్దేవైః సహ. యద్వా సత్త్వాదిభిర్గుణైర్హేతుభూతైః. వైకారికం భోక్తృత్వాది వికారవన్తం క్షేత్రజ్ఞం పరే నిర్వికారే బ్రహ్మణి. (29)

ఎట్టి రుద్రునియందు . యత్ = ఎందువలన నైతే అహము మమతా పూర్వకమైన క్రియ ఎచ్చట కలుగునో, అట్టి రుద్రునియందు. సత్త్వేన=చైతన్యము తోడ . గుణైః = గుణకార్యములైన ప్రాగవశిష్ట దేవతలతోడను, లేదా హేతువులైన సత్త్వాది గుణములతో. వైకారిక=భోక్తృత్వాది వికారములు గల క్షేత్రజ్ఞుని . పరే = నిర్వికారుడైన పరబ్రహ్మయందు . ( 29 )

శ్లో ॥ అప్సు క్షితి మపోజ్యోతిష్యదో వాయౌ నభస్య ముమ్ ।
కూటస్థే తచ్చ మహతి తదవ్యక్తేఽక్షరే చ తత్ ॥ 30 ॥

అనంతరము జలమునందు పృథివిని, జలమును తేజస్సులోను, వాయువులో తేజస్సును, వాయువును ఆకాశంలోను, ఆకాశమును అహంకార తత్వములోను, అహంకారమును మహత్తత్వములోను, మహత్తత్వమును ప్రకృతిలోను, ప్రకృతిని శాశ్వతుడైన పరమాత్మునిలోను విలీనం చేయవలెను. ( 30 )

టీ :- నను వికారవతః కథం పరేఽ వికారే లయం స్యాత్. వికారహేతూనాం సర్వోపాధీనాం లయద్వారేణేత్యాహ – అప్స్వితి. అదోజ్యోతిః. తచ్చనభః కూటస్థేఽహం తత్త్వే. తచ్చ కూటస్థం మహతి మహత్తత్త్వే. తదవ్యక్తేప్రధానే. తచ్చ అవ్యక్తమక్షరే పరమాత్మని. (30)

టీ :- అటులైన వికారములు గలవానికి అవికారుడైన పరమాత్మునియందు లయమెట్లు కలుగును అనిన సర్వులకు ఉపాధియైన వికారహేతువులకు లయ ద్వారా అని చెప్పెను. 'అప్సు' అని. అదః = ఈ జ్యోతి. తచ్చ =ఆ ఆకాశము. కూటస్థే అహంతత్వమున . ఆకూటస్థము, మహతి = మహత్తత్వమున . ఆ మహత్తత్వము అవ్యక్తమైన ప్రధానమైన ప్రకృతిలో ఆ ప్రకృతి, అక్షరే = పరమాత్మయందు . ( 30 )

శ్లో ॥ ఇత్యక్షర తయాత్మానం చిన్మాత్ర మవశేషితమ్ ।
జ్ఞాత్వాత్వయోథ విరమే ద్దగ్ధయోని రివానలః ॥ 31 ॥

ఇట్లు సర్వోపాధి లయమగుట వలన అక్షర రూపముగ చిన్మయుడుగా మిగిలిన పరమాత్మను తెలుసుకొని అద్వైతుడై కట్టెలను దహించిన అగ్నివలె పరమాత్మయైన నిర్వికార బ్రహ్మలో విలీనం కావలెను.(31)

టీ :- ఇతి సర్వోపాధి లయాద్ధేతోరవశేషితం చిన్మాత్రమాత్మానం క్షేత్రజ్ఞమక్షరతయాఽ జ్ఞాత్వా ద్వయః సన్ విరమేత్. దగ్ధకాష్ఠో యథానలః. (31)

టీ :- ఇట్లు సర్వోపాధి లయమగుట అను హేతువువలన మిగిలినట్టి చిన్మాత్రరూపమైన ఆత్మయగు క్షేత్రజ్ఞుని అక్షర రూపునిగా యెఱింగి అద్వైతుడై కాల్చబడిన కట్టెలుగల అగ్నివలె విరమించుకొనవలెను. (31)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే యుధిష్ఠిర నారదసంవాదే సదాచార నిర్ణయోనామ ద్వాదశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి సప్తమ స్కంధము నందలి యుధిష్ఠిర నారద సంవాదమున శ్రీధర భావార్థ దీపికా టీకా వ్యాఖ్యానమున పన్నెండవ అధ్యాయము.

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

**నారద ఉవాచ :-**

శ్లో ॥ కల్పస్త్వేవం పరివ్రజ్య దేమమాత్రావశేషితః ।
గ్రామైక రాత్రవిధినా నిరపేక్ష శ్చరేన్మహీమ్ ॥ 1 ॥

టీ :- త్రయోదశే యతేధర్మః సాధకస్యోచ్యతే మహాన్, అవధూతే తిహాసేన సిద్ధావస్థాచ వర్ణ్యతే. ఏవం ధ్యాత్వాఽ కల్పోఽ నశనాదికం కుర్యాత్. ఆన్వీక్షిక్యాం కల్పస్త్వం ధ్యాత్వా పరివ్రజ్యేతి సంబంధః. కియదత్ర త్యాజ్యమ్. దేహవ్యతిరిక్తం సర్వమిత్యాహ - దేహమాత్రేతి. తస్యధర్మానాహ - గ్రామైకరాత్రేతి నవభిః. (1)

శ్లో ॥ బిభృయా ద్యద్య సౌవాసః కౌపీనాచ్ఛాదనం పరమ్ ।
త్యక్తం న దండ లింగాదే రన్యత్కించి దనాపది ॥ 2 ॥

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**నారదుడిట్లుపలికెను.**

శక్తిగలవాడు ఇట్లు సన్యసించి దేహమాత్రావశేషితుడై ఒక్కొక్క గ్రామమున ఒక్కొక్క రాత్రి చొప్పున నివసించుచు నిరపేక్షుడై భూమిని సంచరించవలెను. ( 1 )

టీ :- త్రయోదశ అధ్యాయమున సాధకుడైన యతి యొక్క గొప్పనైన ధర్మము చెప్పబడుచున్నది. అక్కడ అవధూతయొక్క ఇతిహాసము ద్వారా సిద్ధావస్థయు వర్ణించబడుచున్నది. ఇట్లు ధ్యానించి ఆన్వీక్షికీ విద్యాభ్యాసమున జ్ఞానార్జన గావించ అశక్తుడైన వాడు. నిరాహారాదికము గావించవలెను. ఆన్వీక్షికీ విద్యాభ్యాసము ద్వారా జ్ఞానార్జన గావించ సమర్థుడైనవాడు ఇట్లు ధ్యానించి సన్యసించవలసినదని సంబంధము. ఇందు ఎంతవఱకు వదలతగిన దనిన 'దేహ' యని. అట్టి యతి ధర్మములను 'గ్రామైకరాత్ర' ఇత్యాది తొమ్మిది శ్లోకములచే చెప్పుచున్నాడు.(1)

ఒకవేళ అతడు వస్త్రమును ధరించదలచిన కౌపీన మాత్రమును ఆచ్ఛాదనము గావించుకొనుట శ్రేష్ఠము. దండము కమండలు మొదలైన

సన్యాస చిహ్నములను ధరించవలెను. వానికి భిన్నమైన త్యజించబడిన వానిని సాధారణ పరిస్థితులలో స్వీకరించరాదు. ఆపత్సమయములలో మాత్రము గ్రహించవచ్చును. ( 2 )

శ్లో ॥ ఏక ఏవ చరేద్భిక్షుః ఆత్మారామోన పాశ్రయః ।
సర్వభూత సుహృచ్ఛాంతో నారాయణ పరాయణః ॥3॥

భిక్షుకుడై నిరాశ్రయుడై ఆత్మారాముడగుచు సకల ప్రాణులయెడ సుహృద్భావము కలిగి శాంతచిత్తుడై నారాయణ పరాయణుండునై ఒంటరిగా సంచరించవలెను. ( 3 )

టీ :- కౌపీనం గుహ్యమాచ్ఛాద్యతే యావతా తావన్మాత్రమ్. పరం కేవలమన్యదితివా. త్యక్తం ప్రేషోచ్చారణాత్పూర్వమేవ. (2,3)

టీ :- కౌపీనం = ఎంతవస్త్రముతో గుహ్యము కప్పబడునో అంత మాత్రమైన వస్త్రము. పరం = కేవలము, లేదా అన్యము. త్యక్తం = వాడకముందే వదలబడినది. ( 2, 3 )

శ్లో ॥ పశ్యేదాత్మన్ యదో విశ్వం పరే సద సతోవ్యమే ।
ఆత్మానంచ పరంబ్రహ్మ సర్వత్ర సదసన్మయే ॥ 4 ॥

కార్య కారణ వ్యతిరిక్తమైన అవ్యయుడైన పరమాత్మయందు ఈ విశ్వమును దర్శించవలెను. సదసద్రూపమైన విశ్వమునందంతటను పరబ్రహ్మయైన ఆత్మను అవలోకించవలెను. ( 4 )

టీ :- సదసతః పరే కార్యకారణవ్యతిరిక్తే. (4)

టీ :- సదసతఃపరే = కార్యకారణవ్యతిరిక్తుడైన ( 4 )

శ్లో ॥ సుప్త ప్రబోధయోః సంధా వాత్మనో గతిమాత్మ దృక్ ।
పశ్యన్ బంధంచ మోక్షంచ మాయామాత్రం న వస్తుతః ॥5॥

టీ :- నన్వాత్మానం పరంబ్రహ్మేతి కథం సామానాధికరణ్య నిర్దేశః. న హి బద్ధముక్తయోరైక్యం సంభవతి. తత్రాహ - సుప్తేతి. సుషుప్తౌ హి తమసావృతమాత్మతత్త్వం జాగ్రత్ స్వప్నయోస్తు విక్షిప్తం ప్రకాశతే. సన్ధౌ తు న తమోనాపి విక్షేపః. అతస్తదా ఆత్మదృగాత్మనం లక్షీకృత్య స్థితః సన్నాత్మనోగతిం తత్త్వం పశ్యన్. అత ఏవ బంధమోక్షం చ మాయామాత్రం పశ్యన్ ఆత్మానం పరంబ్రహ్మ సర్వత్ర పశ్యేదిత్యన్వయః. తదుక్తం యోగగ్రంథే - "నిద్రాదౌ జాగరస్యాన్తే యోభావ ఉపజాయతే, తం భావం భావయన్నిత్యం ముచ్యతే నేతరోయతిః" ఇతి. (5)

శ్లో ॥ నాభినందే ధ్ధ్రువం మృత్య మధృవం వాస్య జీవితమ్ ।
కాలం పరం ప్రతీక్షేత భూతానాం ప్రభవాప్యయమ్ ॥6॥

సుప్త, జాగరణముల సంధికాలములందు ఆత్మ లక్ష్యము గావించు కొన్నవాడై ఆత్మ తత్త్వమును గాంచవలెను. ఆత్మకు బంధము మోక్షము అనునవి మాయామాత్రములని వస్తుప్రకారముగ లేవని గ్రహించవలెను . (5)

టీ :- ఆత్మను పరబ్రహ్మమని సామానాధికరణ్యముగా నిర్దేశించుట యెట్లు? బద్ధునకు ముక్తునకు ఐక్యము సంభవించదు కదా! యనిన అందిట్లు చెప్పెను. 'సుప్త' యని. సుషుప్తియందు ఆత్మత్వము తమస్సుచే ఆవరించబడియుండును. జాగ్రత్ స్వప్నములందు విక్షిప్తమై ప్రకాశించును గదా ! సంధికాలమందైతే తమస్సులేదు. విక్షే.మూ లేదు. అందువలన అప్పుడు ఆత్మదృక్ = ఆత్మను లక్ష్యము గావించుకొనిన వాడై ఉంటూ ఆత్మయొక్క గతిం = తత్త్వమును గాంచుచున్నవాడై, అందుకనే బంధము మోక్షమును మాయామాత్రముగ చూచుచు ఆత్మయైన పరబ్రహ్మను సర్వత్ర చూడవలెనని అన్వయము. ఆ విషయము యోగగ్రంథమున చెప్పబడినది. 'నిద్రయొక్క ఆరంభమున జాగృతియొక్క అంతమునందు ఏ భావము కలుగునో ఆ భావమును నిత్యము భావించుచు యతి ముక్తినొందును. ఇతరమును భావించిన ముక్తి కలుగదు' అని. (5)

ఈ దేహమునకు ధ్రువమైన ( నిశ్చితమైన ) మృత్యువును గానీ అధ్రువమైన జీవితమును గానీ అభినందించరాదు. భూతముల సంభవ నాశములకు మూలమైన పరమైన కాలమును ప్రతీక్షించవలసినది.(6)

టీ :- అస్యదేహస్య. ప్రభవోప్యయశ్చ యస్మాత్తం కాలమ్. (6)

టీ :- అస్య = ఈ దేహమునకు పుట్టుక, నాశము దేనివలన కలుగునో అట్టి కాలమును. ( 6 )

శ్లో॥ నా సచ్ఛాస్త్రేషు సంజేత నోప జీవేత జీవికామ్ ।
వాదవాదాం స్త్యజేత్తర్కాన్ పక్షం కంచ న సంశ్రయేత్ ॥7॥

ఆత్మ పరములుగాని శాస్త్రములందు ఆసక్తుడు కారాదు. తర్కింపరాదు. జ్యోతిః శాస్త్రాదులను వృత్తిగాగొని జీవింపరాదు. జల్ప వితండాది వాదములను, కుతర్కములను వీడవలెను. వాదములలో ఏదేని ఒక పక్షమును ఆశ్రయించ రాదు. ( 7 )

టీ :- అసచ్ఛాస్త్రేషు అనాత్మపరేషు. జీవికాం నక్షత్ర విద్యాది వృత్తిమ్. వాదవాదాన్ జల్పవితణ్డాది నిష్ఠాన్. కంచ కమపి పక్షం నిర్బంధేన న సంశ్రయేత్. (7)

టీ :- అసచ్ఛాస్త్రేషు = అనాత్మ పరములైన ( ఆత్మపరములు గాని ) జీవికాం = నక్షత్రవిద్య ( జ్యోతిః శాస్త్రము ) మొదలైన వృత్తిని. వాదవాదాన్=జల్పము, వితండము మొదలైన వాదములను. కంచ=ఏదేని ఒక పక్షమును నిర్బంధముగా ఆశ్రయించరాదు . (7 )

శ్లో ॥ న శిశ్యా నను బధ్నీత గ్రంధాన్నై వాభ్యసే ద్బహూన్ ।
న వ్యాఖ్యా ముపయుంజీత నా రంభా నా రభేత్ క్వచిత్ ॥8॥

శిష్యులను ప్రలోభాదులచే బలాత్కారముగా నిర్బంధించరాదు. బహుగ్రంథములను పఠించరాదు. వ్యాఖ్యానమును ఉపయోగించరాదు. ఎప్పుడైనను మఠాది వ్యాపారములను ఆరంభించరాదు. ( 8 )

టీ :- శిష్యాన్నానుబధ్నీత ప్రలోభాధినా బలాన్నాపాదయేత్. ఆరమ్భాన్ మఠాది వ్యాపారాన్. (8)

టీ :- శిష్యులను, నానుబధ్నీత = ప్రలోభపరిచి బలాత్కారముగ శివ్యులను గావించుకొన రాదు. ఆరంభాన్ = మఠాది వ్యాపారములను (8)

శ్లో ॥ న యతే రాశ్రమః ప్రాయో ధర్మహేతుర్మహాత్మనః ।
శాంతస్య సమచిత్తస్య బిభృయా దుతవా త్యజేత్ ॥ 9 ॥

అతి శుద్ధమైన ఆత్మ కలవానికి సాధారణముగా ఆశ్రమము ధర్మ హేతువు కాదు. అతి శుద్ధమైన ఆత్మకలవాడనిన శాంతచిత్తుడై జ్ఞానోత్పత్తి పర్యంతము బహూదకాది లింగము నాశ్రయించి సత్వ శుద్ధికై యమ నియమములను ఆచరించుచు జ్ఞానోత్పత్తికై యత్నించవలెను. జ్ఞానోత్పత్తి కలిగినంత నియమములచే పనిలేదు. యమములైతే స్వతహాగానే యుండును. అందువలన సమాహిత చిత్తునకు అప్పుడు అనగా జ్ఞానవంతుడైన పిదప లింగాదులచే ప్రయోజనము లేనందున లోకసంగ్రహము కొఱకు నియమములను దాల్చవచ్చును, లేదా వదలవచ్చును. ( 9 )

టీ :- పరమహంసస్య విశేషమాహ - న యతేరాశ్రమో ధర్మార్థః. కథం భూతస్య యతేః. మహాత్మనః. తస్య లక్షణమ్ - శాన్తస్యేత్యాది. ప్రాయ ఇత్యస్యాయం భావః - జ్ఞానోత్పత్తి పర్యన్తం బహూదకాది లిఙ్గమాశ్రిత్య సత్త్వ శుద్ధ్యర్థం యమాన్నియమాంశ్చా చరన్నేవ జ్ఞానోత్పత్తౌ యతేత. ఉత్పన్నేతు జ్ఞానే న నియమైః కృత్యమస్తి. యమాశ్చ స్వత ఏవ స్యుః. అతస్తదా లిఙ్గాదిభిః ప్రయోజనాభావాల్లోకసంగ్రహార్థం ధారయేద్వాత్యజేదేతి. (9)

టీ :- పరమహంసయొక్క విశేషమును ఇట్లు చెప్పెను. యతికి ఆశ్రమము ధర్మార్థము గాదు. ఎటువంటి యతికి అనిన మహాత్ముడైన యతికి. అతని లక్షణమును ఇట్లు చెప్పెను. " శాంతస్య " ఇత్యాదిగ. ప్రాయః అను దానికి భావమిది. జ్ఞానోత్పత్తి వఱకు బహూదకాది లింగమును ఆశ్రయించి సత్వశుద్ధికై యమ, నియమములను గూడా ఆచరించుచునే జ్ఞానోత్పత్తికై యత్నించవలసినది. జ్ఞానోత్పత్తి కలిగినంతనే నియమములచే పనిలేదు. యమములు స్వతః సిద్ధముగానే యుండును. అందువలన అప్పుడు లింగాదులతో (నామరూపాది బాహ్యచిహ్నములు) ప్రయోజనము లేనందువలన లోక సంగ్రహము కొఱకై వానిని ధరించవచ్చును. లేదా వదిలివేయ వచ్చును అని. (9)

శ్లో ॥ అవ్యక్త లింగో వ్యక్తార్థో మనీష్యున్మత్త బాలవత్ ।
కవిర్మూక వదాత్మానం స దృష్ట్యా దర్శయే న్నృణామ్ ॥ 10 ॥

టీ :- తస్యైవ జ్ఞానదార్ఢ్యాభావే యోగభ్రంశ పరిహారార్థమాహ – న బహిర్వ్యక్తం లిఙ్గం యస్య వ్యక్తోఽర్థః ప్రయోజనమాత్మానుసంధానం యస్య స మనీష్యున్మత్తవద్బాలవచ్చ కవిరపి మూకవదాత్మానం నృణాం దృష్ట్యా దర్శయేత్. తే యథోన్మత్తాది రూపం మన్యేరంస్తథావర్తేత. స్వదృష్ట్యేతి పాఠే బాహ్యాను సంధానాభావేనేత్యర్థః. (10)

అవ్యక్తలింగము కలవాడై ఆత్మానుసంధానము గలవాడై బుద్ధిమంతుడై, ఉన్మత్తుడైన బాలునివలె, కవియయ్యు మూగవానివలె తనను మానవుల దృష్టికి అగుపడునట్లు గావించుకొనవలెను. (10 )

టీ :- అతనికే జ్ఞాన దారుఢ్యము లేనియెడ యోగ భ్రంశమును పరిహరించుటకు ఇట్లు చెప్పెను. బయటకు వ్యక్తముగాని లింగము గలవాడై, వ్యక్తోర్థః = ప్రయోజనం = ఆత్మానుసంధానము గలవాడై మనీషియై ఉన్మత్తునివలె, బాలుని వలెను, కవియయ్యు మూగవానివలె తనను మానవులకు దర్శింపజేయనగును. అనగా ఇతరులు తనను ఎట్లైతే ఉన్నతుడని, బాలుని వంటివాడని తలంచెదరో అట్లుండవలెనని అర్థము. ‘ స్వదృష్ట్యా ’ అను పాఠమున బాహ్యానుసంధానము లేకుండగ యని భావము. ( 10 )

శ్లో ॥ అత్రాప్య దాహరంతీమ మితిహాసం పురాతనమ్ ।
ప్రహ్లాదస్య చ సంవాదం మునేర జగరస్య చ ॥ 11 ॥

ఈ అధ్యాయమున ఈ విషయమునందు పూర్వము ప్రహ్లాదునకు మునియైన అజగర వ్రతునకు జరిగిన సంవాదరూపమైన పురాతనమైన ఇతిహాసమును ఇట్లు చెప్పెదరు. (వానిలో పరమహంస ధర్మాలు, వాని మాహాత్మ్యము చక్కగా వివరింపబడినాయి).(11)

టీ :- పరమహంస ధర్మమేవ ఇతిహాసేన స్ఫుటయతి – అత్రాపీతి యావదధ్యాయ సమాప్తిః అజగరవ్రతస్యమునేశ్చ. (11)

టీ :- గతమున చెప్పబడిన పరమహంస యొక్క ధర్మమునే ఇతిహాస రూపముగ స్పష్టము చేయుచున్నాడు. “అత్రాపి” యని. అధ్యాయ సమాప్తి వఱకు. అజగర వ్రతుడను మునికిని ప్రహ్లాదునకు జరిగిన సంవాదమున.(11)

శ్లో ॥ తం శయానం ధరోపస్థే కావేర్యాం సహ్యసానుని ।
రజస్వలై స్తమాదేశై ర్నిగూఢామల తేజసమ్ ॥ 12 ॥

సహ్యతటమున కావేరియందు నేలపైన పడుకొన్నవాడును ధూళి ధూసరములైన అవయవములచే నిగూఢమైన స్వచ్ఛమగు తేజస్సుగలవాడునగు ఆ అజగరవ్రతుని ( 12 )

శ్లో ॥ దదర్శ లోకాన్విచరన్ లోక తత్త్వ వివిత్సయా ।
వృతోమాత్యైః కతిపయైః ప్రహ్లాదో భగవత్ప్రియః ॥ 13 ॥

లోక తత్త్వము నెఱుంగు కోరికచే కొద్దిమంది మంత్రులతో కూడుకొని లోకములను చరించునట్టి భగవత్ప్రియుడైన ప్రహ్లాదుడు చూచెను. ( 13 )

టీ :- ధర్మోపస్థేభూపృష్టే సహ్యద్రేస్తటే. రజోభిర్ధూసరైస్తనూదేశైః దేహావయవైః నిగూఢమమలం తేజః యస్య తం. (12,13)

టీ :- ధర్మోపస్థే = భూపృష్టమున సహ్య పర్వత తటమున, ధూళిచే ధూసరములైన, తనూదేశైః = కరచరణాది దేహావయవములచేనిగూఢమైయున్న స్వచ్ఛమైన తేజస్సుగలవాడగు (అజగరమునిని) (12,13)

శ్లో ॥ కర్మణాకృతిభిర్వాచా లింగైర్వర్ణాశ్రమాదిభిః ।
న విదన్తి జనా యం వై సోసావితి న వేత్తి చ ॥ 14 ॥

కర్మద్వారా గాని, ఆకృతివలన గాని, మాటలవలన గాని, లింగభేదము వలన గాని, వర్ణాశ్రమాదులచేత గాని ఎవనినైతే జనులు అతడు ఫలానా వ్యక్తి అని ఎఱుంగకున్నారో. ( 14)

శ్లో ॥ తం నత్వాభ్యర్చ్య విధివత్పాదయోః శిరసా స్పృశన్ ।
వివిత్సు రిద మప్రాక్షీ న్మహా భాగవతోసురః ॥ 15 ॥

మహాభాగవతుడైన అసురుడగు ప్రహ్లాదుడు అతని పాదములను శిరముతో స్పృశించుచు నమస్కరించినవాడై విధివిధానముగ అతనిని పూజించి తెలియగోరువాడై ఇట్లు ప్రశ్నించెను. ( 15 )

టీ :- కర్మాదిభిర్జనా యం న విదుస్తం పాదయోః శిరసా స్పృశన్నత్వా అప్రాక్షీదిత్యురేణాన్వయః. (14,15)

టీ :- కర్మాదులచే జనులు ఎవని ఎఱుంగకుండిరో వాని పాదముల శిరసా స్పృశించి నమస్కరించి ప్రశ్నించెనని ఉత్తరార్థముతో అన్వయము.(14, 15)

శ్లో ॥ భిభర్షి కాయం పీవానం సోద్యమో భోగవాన్యథా ।
విత్తం చైవోద్య మవతాం భోగోవిత్త మతామిహ ।
భోగినాం ఖలు దేహోయం పీవా భవతి నాన్యథా ॥16॥

ఉద్యమముతో కూడిన భోగపురుషునివలె బలిసిన శరీరమును కలిగియున్నావు. ఉద్యమవంతులకే విత్తము కలుగును. విత్తవంతులకు భోగము కలుగును. భోగవంతులకే ఈ బలిసిన శరీరముండును. అట్లు కాదేని ఇట్లు బలిసిన శరీరముండదు. ( 16 )

టీ :- ఉద్యమసహిత ఇవ భోగవానివ పీవానం స్థూలదేహం ధారయసి. తత్ర హేతుం వదేతి తృతీయేనాన్వయః. ఉద్యమం వినైవ మమ భోగోఽస్తీతి చేత్తత్రాహ - విత్తం చేతి. (16)

టీ :- ఉద్యమముతో కూడిన వానివలె, భోగవంతునివలె బలిసిన, దృఢమైన శరీరమును కలిగియున్నావు. అందుకు కారణమును చెప్పుము అని మూడవ శ్లోకముతో అన్వయము. ఉద్యమము లేకయే నాకు భోగము కలదనిన ఇట్లు చెప్పెను. ‘ విత్తంచ ’ అని. ( 16 )

శ్లో ॥ నతే శవయానస్య నిరుద్యమస్య
బ్రహ్మన్నుహార్థో యతేవ భోగః ।
అభోగినోయం తవ విప్రదేహః
పీవా యతస్తద్వద నః క్షమంచేత్ ॥ 17 ॥

ఓ బ్రహ్మా ! ఏపని చేయక ఉద్యమరహితుడవైన పడుకొనియున్న నీకు అర్థము లేకుండుట ప్రసిద్ధమేకదా ! దేనివలన నైతే (ఏ ధనము వలన నైతే) ఈ భోగము కలుగునో అట్టి ధనము నీకు లేదు కదా ! ఓవిప్రా ! ఎందువలన భోగములేకుండగనే నీకీ బలిసిన శరీరము కలిగినదో మాకు తెల్య జెప్పవలసినది. ( 17 )

టీ :- ను ఇతి నిశ్చయే. హ ఇతి ప్రసిద్ధౌ. తవార్థో నాస్తీతి ప్రసిద్ధమేవేత్యర్థః. యతోఽర్థాదేవ. యతోహేతోః పీవా. క్షమం యోగ్యమ్ చేత్. (17)

టీ :- 'ను ' అనునది నిశ్చయార్థమునందు, ' హ ' యని ప్రసిద్ధియందు, నీకు అర్థము లేదనుట ప్రసిద్ధమే కదా ! అని అర్థము. ఎందువల్లననగా అర్థము వలనే. ఏ కారణమువల్లనైతే బలిసియున్నానో, క్షమం = యోగ్యము ఐనచో . ( 17 )

శ్లో ॥ కవిః కల్పో నిపుణదృక్ చిత్ర ప్రియ కథః సమః ।
లోకస్య కుర్వతః కర్మ శేషే తద్వీక్షితాపి వా ॥ 18 ॥

తెలివిగలవాడవు, దక్షుడవు, చతురుడవు, చిత్రమైన లోకరంజక మైన కథలు గలవాడవు, సమదృష్టిగలవాడవు, ఐనను లోకముయొక్క పనిచేయుట లేదు. లేదా పర్యవేక్షించుట లేదు. (18)

టీ :- కించ విత్తార్జనాద్యసమర్థోఽప్యయంజనస్తదర్థముద్యమం కరోతి త్వం తు సమర్థోఽపి కిమితి నకరోషీత్యాహ – కవిర్విద్వాన్. కల్పోదక్షః, నిపుణదృక్ చతురః. చిత్రాః ప్రియా లోకరఞ్జనాః కథా యస్య. తతాఽపి లోకస్యకర్మ కుర్వతః సతః శేషే. తద్వీక్షితాపి తత్సర్వం పశ్యన్నపి. పాఠాన్తరే న ద్వేషి నైషివా న చ స్తౌషీత్యర్థః. (18)

టీ :- ఇంతే కాదు విత్తమును ఆర్జించుటయందు అశక్తులైనను ఈ జనము ఆ విత్తమునకై యత్నము చేయుచున్నారు. నీవేమో సమర్థుడవై యుండియు ఎందులకు యత్నమును చేయుటలేదు అని ఇట్లడిగెను. కవిః = తెలిసిన వాడవు, కల్పః = దక్షుడవు, నిపుణదృక్ = చతురుడవు. చిత్రమైన, ప్రియమైన, లోకరంజకములైన కథలు గలవాడవు. ఐనను లోకము యొక్క పనిచేయుచున్నవాడవై పరుండియున్నావు. తద్వీక్షతాపి=అది అంతయు చూచుచున్నవాడవయ్యు, పాఠాంతరమున చూచుటలేదు. యత్నించుటలేదు. స్తుతించుటలేదని అర్థము. (18 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ స ఇత్థం దైత్య పతినా పరిపృష్టో మహామునిః ।
స్మయి మాన స్తమభ్యాహ తద్వాగమృత యంత్రితః ॥19॥

టీ :- తస్యవాగేవ అమృతం తేన యన్త్రితో వశీకృతః సన్ ప్రాహ. (19)

**నారదుడిట్లు పలికెను :-**

దైత్యపతియైన ప్రహ్లాదునిచే ఇట్లు వివరముగ అడుగబడిన ఆ బ్రాహ్మణుడు చిరునగవులు చిందించుచు అతని వాక్కు అనెడు అమృతముచే వశపర్చుకొనువాడై ఇట్లు చెప్పెను. ( 19 )

టీ :- అతని వాక్కు అనెడు అమృతముచే, యంత్రితః = వశపర్చుకొనబడిన వాడై ఇట్లు చెప్పెను. ( 19 )

**బ్రాహ్మణ ఉవాచ :-**

శ్లో ॥ వేదేద మసుర శ్రేష్ఠ భవాన్నన్వార్య సమ్మతః ।
ఈహెూ పరమయోర్నృణాం పదాన్యధ్యాత్మ చక్షుషా ॥20॥

టీ :- అధ్యాత్మచక్షుషా అన్తదృష్ట్యా భవాన్ వేదైవ. ఆర్యాణాం జ్ఞానినాం సంమతో నను భవాన్. ఇదమితి యదుక్తం తదేవాహ - నృణామీహెూ పరమయోః ప్రవృత్తి నివృత్తోః పదాని స్థానాని ఫలానీత్యర్థః. (20)

**బ్రాహ్మణుడిట్లు చెప్పదొడంగెను :-**

ఓ అసురశ్రేష్ఠా ! నీవు జ్ఞానులకు సమ్మతమైవాడవు గదా ! దీనిని నీవు తెలుసుకొనియే యుందువు. మానవులయొక్క ప్రవృత్తి నివృత్తుల ఫలములను నీవు అంతర్ద్రృష్టిచే నెఱుగుదువు. ( 20 )

టీ :- అధ్యాత్మ చక్షుషా = అంతర్ద్రృష్టిచే నీవు తెలుసుకొనియే యుందువు. ఆర్యాణాం = జ్ఞానులకు నీవు ఇష్టుడవు కదా !. ‘ ఇదం ’ అని ఏది చెప్పబడినదో దానినే ఇట్లు చెప్పెను. మానవులయొక్క , ఈహెూపరమయోః = ప్రవృత్తి నివృత్తులకు, పదాని = స్థానములు, ఫలములని అర్థము . ( 20 )

శ్లో॥ యస్య నారాయణో దేవో భగవాన్ హృద్గతః సదా ।
భక్త్యా కేవలయాఽజ్ఞానం ధునోతి ధ్వాంత మర్కవత్॥21॥

దేవుడైన నారాయణుడు ఎల్లప్పుడు యెవని హృదయము నందుండునో, సూర్యుడు అంధకారమును తొలగించినట్లు వాని అజ్ఞానమును కేవలం భక్తిచేతనే తొలగింపజేయును. ( 21 )

టీ :- వేదేత్యత్రహేతుః - యస్యేతి. హృది ప్రవిష్టస్సన్నజ్ఞానం ధునోతి. అర్కో యథా బహిర్ధ్వాన్తమ్. (21)

టీ :- తెలుసుకొనియుందువనుటకు హేతువు - ' యస్య ' అని. హృదయమున ప్రవేశించినవాడై అజ్ఞానమును తొలగించును. సూర్యుడెట్లైతే బాహిరమైన చీకటిని తొలగించుచున్నాడో అట్లు. (21)

శ్లో ॥ అథాపి బ్రూమహే ప్రశ్నాం స్తవ రాజన్యథా శ్రుతమ్ ।
సంభావనీయోహి భవానాత్మనః శుద్ధిమిచ్ఛతామ్ ॥22॥

ఐనను ఓ రాజా ! నీవడిగిన ప్రశ్నలకు నేను వినిన విధముగా సమాధానమునొసంగెదను. ఆత్మశుద్ధిని కోరువారికి నీవు గౌరవింపదగిన వానివి గదా ! . ( 22 )

టీ :- యథాశ్రుతమిత్యౌద్ధత్య పరిహారాయ ఉక్తమ్. (22)

టీ :- 'యథాశృతం' నేను 'వినినట్లుగ' యనుట ఔద్ధత్యమును పరిహరించుటకు చెప్పబడినది. ( 22 )

శ్లో ॥ తృష్ణయా భవ వాహిన్యా యోగ్యైః కామై రపూరయా ।
కర్మాణి కార్యమాణోఽహం నానా యోనిషు యోజితః ॥23॥

యథోచితములైన విషయవాంఛలచే పూరించుటకు శక్యముగాని భవప్రవాహ హేతువైన తృష్ణచే నేను కర్మలను గావించువాడనై నానా జన్మల నెత్తితిని. ( 23 )

టీ :- లోకః కర్మసు ప్రవర్తతే త్వం తు నివృత్తః సన్శిశేషే ఇతి యదుక్తం తత్రాహ - తృష్ణమేతి చతుర్భిః భవ ప్రవాహకారిణ్యా యథోచితైరపి విషయైః పూరయితుమశక్యయా తృష్ణయా కర్మసు ప్రవర్తమనోఽహం పూర్వం నానాయోనిషు ప్రవేశితః. (23)

టీ :- లోకము కర్మలందు ప్రవర్తించుచున్నది. నీవేమో నివృత్తుడవై నిదురించుచున్నావు. అని ఏదైతే ప్రశ్నించబడినదో దానికిట్లు చెప్పెను. 'తృష్ణయా' అని నాలుగు శ్లోకములచే. భవప్రవాహకారిణియగు, యథోచితములైన విషయ వాంఛలచేతను పూరించుటకు శక్యముగాని తృష్ణచే

కర్మలందు నేను ప్రవర్తించువాడనై పూర్వము నానా యోనులయందు ప్రవేశించితిని. అనగా అనేక జన్మములెత్తితినని భావము. ( 23 )

శ్లో ॥ యదృచ్ఛయా లోక మిమం ప్రాపితః కర్మభిర్భ్రమన్ ।
సర్గాప వర్గయోర్ద్వారం తిరశ్చాం పునరస్య చ ॥ 24 ॥

అనుకోకుండా ఆతృష్ణచేతనే కర్మలచే భ్రమించుచూ మనుష్యదేహమును పొంది జంతువులకు మఱియు మానవులకును స్వర్గాపవర్గములను చేరుటకు ద్వారమైన ఈ లోకమును చేర్చబడితిని.(24)

టీ :- తయైవ తృష్ణయా ఇమం లోకం మనుష్యదేహం యదృచ్ఛయా ప్రాపితః. కథం భూతం లోకమ్. ధర్మేణ స్వర్గస్య ద్వారం సాధనమ్. అధర్మేణ తిరశ్చాం శ్వ సూకరాది యోనేర్ద్వారమ్. మిశ్రాభ్యాం తాభ్యాం పునరప్యస్య మనుష్యత్వస్య ద్వారమ్. సర్వతో నివృత్యాపవర్గస్య ద్వారమిత్యర్థః. (24)

టీ :- అదే తృష్ణచే, ఇమాం లోకం = ఈ మనుష్యదేహమును భావించకయే పొందించబడితిని. లోకమెటువంటిది. ధర్మముచే స్వర్గమునకు, ద్వారం = సాధనమైనది. అధర్మముచే, తిరశ్చాం = కుక్క, పంది మొదలైన జన్మలకు ద్వారము, ధర్మాధర్మములచే మఱలకూడా ఈ మానవదేహమును పొందుటకు ద్వారమైనది. ధర్మాధర్మములన్నింటినుండి నివర్తించుటచే మోక్షమునకు సాధనమైనది. అని యర్థము. ( 24 )

శ్లో ॥ అత్రాపి దంపతీనాం చ సుఖాయాన్యా పనుత్తయే ।
కర్మాణి కుర్వతాం దృష్ట్వా నివృత్తోఽస్మి విపర్యయమ్ ॥25॥

ఈ మనుష్యత్వమునందును దుఃఖనివృత్తికై, సుఖము కొఱకై కర్మలను చేయుచున్న దంపతుల విరుద్ధచర్యలను గాంచి వానినుండి విరమించుకుంటిని. ( 25 )

టీ :- అత్రాపి మనుష్యత్వేఽపి అన్యాపనుత్తమే దుఃఖనివృత్త్యై విపర్యయం దృష్ట్వా నివృత్తోఽస్మి. (25)

టీ :- ఇచ్చుటకు మానవత్వమునను, అన్యాపనుత్తయే = దుఃఖము యొక్క నివృత్తికై విపర్యయముగాంచి నివృత్తుడనైతిని. (25)

శ్లో ॥ సుఖమస్యాత్మనో రూపం సర్వేహెూ పరతిస్తనుః ।
మనః సంస్పర్శజాన్ దృష్ట్వా భోగాన్ స్వప్స్యామి సంవిశక్ ॥26॥

ఈ జీవునియొక్క స్వరూపమే సుఖము. అది విస్తరించునదై సకలక్రియా నివృత్తియందు స్వయముగనే ప్రకాశించును. మనోరథ జన్యములైన భోగములను అశాశ్వతములుగా యెఱింగి ఉద్యమరహితుడనై ప్రారబ్ధ భోగములను అనుభవించుచున్నాను.(26)

టీ :- నను ప్రవృత్త్యా కదాచిత్ సుఖంస్యాన్నివృత్త్యాతు కిం స్యాదితిచే తత్రాహ - సుఖమస్య జీవస్య స్వరూపమేవ. తర్హి కిం న ప్రకాశతే తత్రాహ - సర్వేతి. తనోతీతి తనుః. సర్వక్రియా నివృత్తౌ స్వత ఏవ ప్రకాశత ఇత్యర్థః. భోగాంశ్చ మనః సంస్పర్శజాన్ మనోరథమాత్ర జానశాశ్వతాన్ దృష్ట్వా స్వప్స్యామి. నిరుద్యమోఽస్మీత్యర్థః. తర్హి కదా చ త్కథం భుంక్షే తత్రాహ. సంవిశన్, ప్రారబ్ధభోగాన్భుఞ్జాన ఇత్యర్థః.(26)

టీ :- ప్రవృత్తిచే యెప్పుడో ఒకప్పుడు సుఖము కలుగును. నివృత్తిచేనైతే ఏమి కలుగుననిన ఇట్లు చెప్పెను. ఈ జీవుని స్వరూపమే సుఖము. అటులైన యేల అగుపడుటలేదు? (తెలియుటలేదు) అనిన ఇట్లనెను. 'సర్వ' యని. తనోతి = విస్తరించుచున్నది గాన తనువు. సర్వక్రియా నివృత్తియందు స్వయముగనే ప్రకాశించుచున్నదని అర్థము. మనః సంస్పర్శజాన్ = మనోరథమాత్రమున కలిగెడు అశాశ్వతములైన భోగములను చూచి పడుకొనుచున్నాను. ఉద్యమహీనుడనై యున్నానని అర్థము. అటులైన ఒకప్పుడెట్లు భుజింతువనిన ఇట్లు చెప్పెను. 'సంవిశన్' అని. ప్రారబ్ధ భోగములను అనుభవించువాడనై అని అర్థము. (26)

శ్లో ॥ ఇత్యేతదాత్మనః స్వార్థం సంతం విస్మృత్య వై పుమాన్ ।
విచిత్రామసతి ద్వైతే ఘోరామాప్నోతి సంసృతిమ్ ॥27॥

ఈ విధమైనట్టి తన సుఖాత్మకమైన రూపముగల స్వార్థమును తనయందేయుండు పురుషార్థమును విస్మరించి పురుషుడు అసత్యమైన ద్వైతమునందు జొచ్చి విచిత్రమైన, ఘోరమైన సంసృతిని బొందుచున్నాడు.(27)

టీ :- ఏవం చేత్కోఽపి సంసారం న ప్రాప్నుయాత్తత్రాహ - ఇతేతదాత్మనః సుఖాత్మకం రూపం స్వార్థం స్వస్మిన్నేవ సన్తం పురుషార్థం విస్మృత్య. అసత్యపిద్వైతే. (27)

టీ :- అట్లైన యెవరుకూడా సంసారమును పొందకుందురు గదా ! యనిన ఇట్లు చెప్పెను. ఈ విధమైన తనయొక్క సుఖాత్మకరూపమైన, స్వార్థం = తనలోనే ఉండెడు పురుషార్థమును మరచి, అసత్యపి ద్వైతే = అసత్యమైన ద్వైతభావమునందు. ( 27 )

శ్లో ॥ జలం తదుద్భవైశ్చన్నం హిత్వాఽజ్ఞో జలకామ్యయా ।
మృగతృష్ణాముపాధావేద్యథాన్యత్రార్థదృక్స్వతః ॥ 28 ॥

అజ్ఞుడైన మానవుడు జలమునందు పుట్టిన శైవలము ( నాచు) తృణము మొదలైన వానిచే కప్పబడిన నీటిని వదిలి నీటికొఱకు మృగతృష్ణలవెంట పరుగిడినట్లు ఆత్మ స్వరూపమునకంటే అన్యత్ర పురుషార్థమును గాంచుచు సాంసారిక సుఖములకై పరిగెత్తుచున్నాడు.(28)

టీ :- ఏతదేవ దృష్టాన్తేన స్పష్టయతి - జటమితి. తదుద్భవైస్తృణ శైవలాదిభిః. జలకామ్యయా జలేచ్ఛయా. స్వత ఆత్మస్వరూపాదన్యత్ర పురుషార్థం పశ్యన్. (28)

టీ :- దీనినే దృష్టాంతముచే స్పష్టము గావించుచున్నాడు. ‘ జలం ’ ఇత్యాదిగ. ఆ నీటియందు పుట్టిన తృణశైవాలాదులచే ( గడ్డి, నాచు మొదలైన వానిచే ). జలకామ్యయా = జలేచ్ఛచే, స్వతః = ఆత్మ రూపమునకంటే వేఱొకచోట పురుషార్థమును ఊహించుచు. ( 28 )

శ్లో॥ దేహాదిర్దేవతంత్రైరాత్మనః సుఖమీహతః ।
దుఃఖాత్యయం చానీశస్య క్రియామోఘాః కృతాః కృతాః ॥29॥

దేవతంత్రములైన దేహాదులచే తనకు సుఖమును కోరునట్టి నిర్దైవమైన పురుషునకు దుఃఖాతిశయమే కలుగును. వారిచే ఆరంభించబడిన, మఱల మఱల గావించబడిన క్రియలు వ్యర్థములే యగును. ( 29 )

టీ :- ఏవం స్వస్యనిరుద్యమత్వే కారణముక్త్వా విపర్యయం దృష్ట్వేతి యదుక్తం తద్వివృణోతి – దేహాదిభిరితి పఞ్చభిః. ఈహత ఇచ్ఛతః. అనీశస్య నిర్దైవస్య పునః పునః ప్రారబ్ధాః క్రియామోఘావిఫలా ఏవ భవన్తి. (29)

టీ :- ఇట్లు తనయొక్క నిరుద్యమత్వమునకు కారణమును చెప్పి, విపర్యయమును చూచి, అని చెప్పబడినదానికి వివరణనిచ్చుచున్నాడు. 'దేహాదిభిః ' ఇత్యాది ఐదు శ్లోకములలో. ఈహతః = కోరుచున్న, అనీశస్య= నిర్దైవుడైన మఱల మఱల ప్రారంభించబడిన క్రియలు, మోఘాః = విఫలములు అగుచునే యున్నవి. ( 29 )

శ్లో ॥ ఆధ్యాత్మికాదిర్దుఃఖైరవిముక్తస్య కర్హిచిత్ ।
మర్త్యస్య కృచ్ఛ్రోపనతైః అర్థైః కామైః క్రియేత కిమ్ ॥30॥

ఆధ్యాత్మిక, ఆధి దైవిక, ఆధి భౌతిక దుఃఖములనుండి ఏ విధముగనైనను ముక్తినొందని పురుషునకు అతికష్టముగ పొందబడిన అర్థ కామములచే ఏమి చేయనగును? . ( 30 )

టీ :- క్రియాణాం సఫలత్వేఽపి ఫలస్యానుపయోగమాహ – ఆధ్యాత్మికాది భిరితి. మర్త్యస్యమరిష్యతః కృచ్ఛ్రేణ దుఃఖేనోపనతైః ప్రాప్తైః. (30)

టీ :- క్రియలు సఫలములైనను ఫలము అనుపయోగమగుచున్నది. అని ఇట్లు చెప్పెను. ' ఆధ్యాత్మకాదిభిః ' ఇత్యాదిగ. మర్త్యస్య = మరణించు స్వభావముగల పురుషునకు దుఃఖముచే పొందబడినట్టి.(30

శ్లో ॥ పశ్యామి ధనినాం క్లేశం లుబ్ధానా మజిత్మాదనామ్ ।
భయాదలబ్ధ నిద్రాణాం సర్వతోఽభి విశంకినామ్ ॥31॥

లోభులు, అజితాత్ములు, భయమువలన నిద్ర లేనివారు, అన్నింటిని శంకించువారునైన ధనవంతుల క్లేశమును చూచుచున్నాను.(31 )

టీ :- కృచ్ఛ్రం వినైవ ప్రాప్తోప్యర్థే దుఃఖం తదవస్థమిత్యాహ – పశ్యామీతి. (31)

టీ :- కష్టము లేకుండగనే అర్థము లభించినను దుఃఖమే. ఆ అవస్థను ఇట్లు చెప్పెను. “ పశ్యామి ” అని. ( 31 )

శ్లో ॥ రాజతః చోరతః శత్రోః స్వజనాత్పశు పక్షితః ।
అర్థిభ్యః కాలతః స్వస్మాన్నిత్యం ప్రాణార్థవద్భయమ్ ॥32॥

రాజువలన, చోరులవలన, శత్రువులవలన, స్వజనులవలన, పక్షులవలన, యాచకులవలన, కాలమువలన, తనవలనను ప్రాణవంతులకు, అర్థవంతులకును నిత్యము భయముండును. (32 )

టీ :- భయం ప్రపఞ్చయతి - రాజత ఇతి. స్వస్మాన్మత్త ఏవ కథం చిత్త్యాగ - భోగ - విస్మరణాదినా నాశః స్యాదితి ప్రాణవతా మర్థవతాం చ భయం నిత్యమ్. (32)

టీ :- భయమును వివరించుచున్నాడు. ' రాజతః ' యని. స్వస్మాత్ = నావలననే యెట్లో త్యాగ, భోగ, విస్మరణాదులచే నాశము కలుగునని, ప్రాణవంతులకు, అర్థవంతులకును భయము నిత్యము. ( 32 )

శ్లో ॥ శోక మోహ భయ క్రోధ రాగక్లైబ్య శ్రమాదయః ।
యన్మూలాస్స్యుః నృణాం జహ్యాత్ స్పృహాం
ప్రాణార్థయోర్బుధః॥33॥

వేని మూలముగ మానవులకు శోక, మోహ, భయ, క్రోధ, రాగ, క్లైబ్య, శ్రమాదులు కలుగుచున్నవో బుధుడు అట్టి ప్రాణ, అర్థములందలి స్పృహను బుధుడు వీడవలెను. ( 33 )

టీ:- అతోఽనర్థహేతుత్వాత్ప్రాణేఽర్థే చ స్పృహా న కార్యేత్యాహ - శోకేతి. (33)

టీ :- అందువలన అనర్థకారణములైనందున ప్రాణమునందును, అర్థమునందును కోరిక పెట్టుకొనరాదు అని చెప్పెను. ' శోక ' ఇతి = యని. ( 33 )

శ్లో ॥ మధుకార మహాసర్పౌ లోకేఽస్మిన్నో గురూత్తమౌ ।
వైరాగ్యం పరితోషం చ ప్రాప్తాయచ్ఛిక్షయా వయమ్ ॥34॥

ఎవరి శిక్షణమువలన మేము వైరాగ్యమును, సంతోషమును కూడా పొందితిమో అట్టి మధుమక్షికము ( తేనెటీగ ) మహా మహా సర్పమును నాకీలోకమున ఉత్తమ గురువులు. ( 34 )

టీ :- నన్వేవమనర్థా ననుభవన్తోఽపి నకేచిద్విరజ్యన్తే, న చ యథా లాభేన తుష్యన్తి. త్వం తు కథం వైరాగ్యాదికం ప్రాప్తోసి తత్రాహ - మధుకరేతి. మధుమక్షికాఽజగరౌ. యయోః శిక్షయా వృత్త పర్యాలోచనయా. (34)

టీ :- ఇట్లు అనర్థములననుభవించుచును యెవ్వరునూ వానిపై విరక్తిని పొందుటలేదు. లేదా లభించినదానితోడనే సంతోషించుటలేదు కదా! మరి నీవు వైరాగ్యమును యెట్లు పొందితివి. అనిన అందుకిట్లనెను. 'మధుకర ' యని. తేనెటీగా, కొండచిలువలు వేని, శిక్షయా = జరిగిన విషయము పర్యాలోచన గావించుటద్వారా (34)

శ్లో ॥ విరాగః సర్వకామేభ్యః శిక్షతోమే మధువ్రతాత్ ।
కృచ్ఛ్రాప్తం మధువద్విత్తం హత్వాప్యన్యో హరేత్పతిమ్ ॥35॥

నాకు తేనెటీగవలన సర్వకామములనుండి వైరాగ్యము నేర్పబడితిని. కష్టపడి సంపాదించబడిన మధువును మధువ్రతమునుండి శ్రమించి ఆర్జించిన విత్తమును ఎవడో వేరొకడువచ్చి ఆ విత్తాధిపుని చంపి హరించును. ( 35 )

టీ :- మధుకరాచ్ఛిక్షితమాహ - విరాగ ఇతి. విత్తపతిం హత్వాఽన్యో విత్తం హరేదిదిత్యేవమ్. (35)

టీ :- మధుకరము ( తేనెటీగ ) నుండి నేర్చుకొబడినది చెప్పెను. 'విరాగ' యని. విత్తపతిని జంపి వేరొకడు విత్తమును హరించెను. అనుదానిని(35)

శ్లో ॥ అనీహః పరితుష్టాత్మా యదృచ్ఛో పనతాదహమ్ ।
నోచేచ్ఛయే బహ్వహాని మహాహిరివ సత్వవాన్ ॥ 36 ॥

ఏ కోరికలు లేనివాడనై సంతుష్టాంతరంగుడనై అప్రయత్నముగ లభించిన దానితోడ సంతోషించెదను. అట్లు అనేకదినములు ఏవిధమైన ఆహారము లభించలేదేని అప్పుడు శక్తిగల మహాసర్పమువలె పరుండెదను. (36)

టీ :- అజగరాచ్ఛిక్షితమాహ - అనీహ ఇతి. సత్త్వవాన్ ధైర్యవాన్. (36)

టీ :- అజగరము వలని నేర్చుకొనినది ఇట్లు చెప్పెను. ' అనీహ ' యని. సత్వవాన్ = ధైర్యవంతుడు. ( 36 )

శ్లో ॥ క్వచిదల్పం క్వచిద్భూరి భుంజేఽన్నం స్వాద్వస్వాదు వా।
క్వచిద్భూరి గుణోపేతం గుణహీన ముత క్వచిత్ ॥37॥

ఒకచోట అన్నమును కొంచెముగా, ఒకచోట యెక్కువగా భుజింతును. ఒకచో రుచికరమైనది, ఒకచో రుచిలేనిది, ఒక్కొకచోట మిక్కిలి గుణవంతమైన ఆహారమును, మరియొకచోట గుణహీనమైన ఆహారమును భుజింతును. (37)

శ్లో ॥ శ్రద్ధయోపాహృతం క్వాపి కదాచిన్మాన వర్జితమ్ ।
భుంజే భుక్త్వాథ కస్మింశ్చిత్ దివానక్తం యదృచ్ఛయా ॥38॥

ఒక్కొకచో శ్రద్ధగా తెచ్చిపెట్టబడిన ఆహారమును, వేరొకచోట గౌరవహీనముగా పెట్టబడిన అన్నమును భుజింతును. భుజించి రాత్రిం బవళ్ళు యెక్కడో స్వేచ్ఛగా చరింతును. ( 38 )

టీ :- పీనత్వే హేతుః వదన్ యదృచ్ఛయా ప్రాప్తాత్పరితోషం ప్రపఞ్చయతి - క్వచిదల్పమితి షడ్భిః. (37,38)

టీ :- బలిసియుండుటకు కారణమును చెప్పుచు యాచించకుండగ లభించిన దానివలన సంతోషమును వివరించుచున్నాడు. ' క్వచిదల్పం' అను ఆరు శ్లోకములచే. ( 37 - 38 )

శ్లో ॥ క్షామందుకూలమజినం చీరం వల్కలమేవ వా ।
వసేఽన్యదపి సంప్రాప్తం దిష్టభుక్ తుష్టధీరహమ్ ॥39॥

మిక్కిలి విలువగల పట్టువస్త్రమును గానీ, జింకచర్మమును గానీ, చిరిగిన నారచీరను గానీ, లేదా ఇంకేదేని లభించిన దానిని ధరించి ప్రారబ్ధ కర్మ భోగినై నేను తుష్టినొందెదను. ( 39 )

టీ :- చీరం జీర్ణవస్త్రఖణ్డమ్. వసేసందధే. దిష్టభుక్ ప్రారబ్ధకర్మఫల భోగీ. (39)

టీ :- చీరం = చిరిగిన వస్త్రఖండమును, వసే = ధరింతును. దిష్టభుక్= ప్రారబ్ధకర్మ ఫలముననుభవించువాడనై ( 39 )

శ్లో ॥ కవచిచ్ఛమే ధరోపస్థే తృణ పర్ణాశ్మ భస్మసు ।
క్వచిత్ప్రాసాద పర్యంకే కశిపౌ వా పరేచ్ఛయా ॥ 40 ॥

శ్లో ॥ క్వచిత్ స్నాతోను లిప్తాంగః సువాసాః స్రగ్వ్యలంకృతః ।
రథేభాశ్వైశ్చరే క్వాపి దిగ్వాసా గ్రహవద్విభో ॥ 41 ॥

ఒకప్పుడు కటికనేలపై పరుండెదను. మరొకప్పుడు గడ్డిపై, పర్ణములపై, రాళ్ళపై, భస్మరాశిపై పడుకొందును. ఒక్కొక్కప్పుడు మేడలందు పర్యంకము ( మంచము ) పైనగానీ, పరుపులందుగాని ఇతరుల కోరిక ప్రకారము పడుకొందును. ఒకప్పుడు స్నానముచేసి ఒంటికి సుగంధద్రవ్యముల నలదుకొని మంచి వస్త్రములను ధరించి, మాలికలచే అలంకరించుకొని రథములపై, గజములపై, అశ్వములపై అధిష్టించి చరింతును. ఓ విభూ ! మరొక్కప్పుడు దిగంబరుడనై గ్రహమువలె, దయ్యమువలె చరింతును. ( 40, 41 )

టీ :- ప్రాసాదమధ్యే పర్యఙ్కే. తత్రాపి కశిపౌ తూలికాయామ్. (40)

టీ :- మేడలో పర్యంకము ( మంచము ) నందు, అందును కశిపౌ = పరుపులందు. ( 40 )

టీ :- చరే విచరామి. క్వచిద్గ్రవద్దిగమ్బరో విచరామి. (41)

టీ :- చరే = సంచరింతును. ఒకప్పుడు గ్రహము ( దయ్యము ) వలె దిగంబరుడనై తిరిగెదను. ( 41 )

శ్లో ॥ నాహం నిందే న చ స్తౌమి స్వభావ విషమం జనమ్ ।
ఏతేషాం శ్రేయ ఆశాసే ఉతైకాత్మ్యం మహాత్మని ॥42॥

భిన్నమైన స్వభావముగల జనమును నేను నిందించను, స్తుతించను. వీరికి శ్రేయస్సునే ఆశించెదను. లేదా విష్ణువునందు ఐకాత్మ్యమును కాంక్షించెదను. ( 42 )

టీ :- న చ మానాపమానకర్తృషు మమవైషమ్యమిత్యాహ - నాహమితి. నాహం నిన్దామి న చ స్తౌమి, మహాత్మని విష్ణౌ.(42)

టీ :- నాకు మానావమానములను గావించిన వారియెడ యెట్టి భేదమును లేదని ఇట్లు పలికెను.'నాహం' అని. నేను అవమానము చేసినవారిని నిందించను. గౌరవించినవారిని స్తుతించను. మహాత్మని = విష్ణువునందు. ( 42 )

శ్లో ॥ వికల్పం జుహుయాచ్చిత్తౌ తాం మనస్యర్థ విభ్రమే ।
మనో వైకారికే హుత్వా తం మాయాయాం జుహోత్యను ॥43॥

వికల్పమును చిత్తమునందు = భేదగ్రాహక మనోవృత్తియందు, ఆ చిత్తమును అర్థరూపమైన విభ్రమముగల మనస్సునందు లీనము గావింపనగును. మరియు ఆ మనస్సును వికారరూపమైన అహంకారమునందు, ఆ అహంకారమును వెంటనే మాయయందు మహత్తత్వం ద్వారా లయము గావించవలసినది. ( 43 )

టీ :- ఏవంభూతత్వేన స్థితావుపాయమాహ - వికల్పమితి. ద్వాభ్యామ్. చిత్తౌ భేదగ్రాహక మనోవృత్తౌ. అర్థరూపో విభ్రమః యస్మిన్మనసి తన్మనోవైకారికేఽహంకారే తమహంకరామన్వనన్తరం మహతత్త్వ ద్వారేణేత్యర్థః. (43)

టీ :- ఈ విధముగ మారినవాడై యుండుటకు ఉపాయమును చెప్పెను. ' వికల్పం ' అని రెండు శ్లోకములలో. చిత్తౌ = భేదగ్రాహకమైన మనోవృత్తియందు. అర్థరూపమైన విభ్రమముగల మనస్సునందు, ఆ మనస్సును వికారరూపమైన అహంకారమునందు, ఆ అహంకారమును అను = అనంతరము మహత్తత్వంద్వారా యని అర్థము. ( 43 )

శ్లో॥ఆత్మానుభూతౌ తాం మాయాం జుహుయాత్సత్య దృఙ్మునిః।
తతో నిరీహో మేత్స్వానుభూత్యాత్మని స్థితః ॥ 44 ॥

సత్యదర్శియైనముని ఆ మాయను ఆత్మానుభూతియందు అంత మొందింపదగును. అనంతరము నిరీహుడై స్వానుభూతిచే ఆత్మయందు నిలిచినవాడై విరమించవలెను. ( 44 ).

టీ :- సత్యమేవ పశ్యతీతి తథా. (44)

టీ :- సత్యమునే గాంచుచున్నాడు గావున సత్యదృక్అగుచున్నాడు.(44)

శ్లో ॥ స్వాత్మ వృత్తం మమేత్థం తే సుగుప్తమపి వర్ణితమ్ ।
వ్యపేతం లోక శాస్త్రాభ్యాం భవాన్హి భగవత్పరః ॥ 45 ॥

మిక్కిలి రహస్యమైనను నా ఆత్మచరితమును నీకిట్లు వర్ణించి చెప్పితిని. ఆ నా చరిత్రము మందదృష్టికి లోకశాస్త్రములకు భిన్నమైనది. తత్వదృష్టికి వ్యపేతము గాదు. నీవు భగవత్పరుడవు గదా !. ( 45 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ ధర్మం పరమహంస్యం వై మునేః శ్రుత్వాఽసురేశ్వరః ।
పూజయిత్వా తతః ప్రీత ఆమంత్ర్య ప్రయయౌ గృహమ్ ॥46॥

**నారదుడు ఇట్లు పలికెను :-**

అని ఆ బ్రాహ్మణుడు వివరించెను. అసురేశుడైన ఆ ప్రహ్లాదుడు ఆ మునివలన పారమహంస్య ధర్మమును విని అనంతరము అతనిని పూజించి సంతోషించినవాడై సెలవు గైకొని గృహమునకేగెను. అని నారదుడు యుధిష్ఠిరునకు తెల్పెను. ( 46 )

టీ :- మన్దదృష్ట్యా లోకశాస్త్రాభ్యాం వ్యపేతమ్. న తు తత్త్వదృష్ట్యా. యతో భవాన్ భగవత్పరః. (45,46)

టీ :- మూర్ఖదృష్టిచే లోకశాస్త్రములకు భిన్నమైనది. తత్వదృష్టితో గాంచిన భిన్నము గాదు. యెందువలన అనగా నీవు భగవద్ధ్యాన పరాయణుడవు.(45, 46 )

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
యుధిష్ఠిర నారద సంవాదే యతిధర్మే
త్రయోదశోధ్యాయః.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి సప్తమస్కంధమున
శ్రీధరీయ భావార్థదీపికా టీకానువాదమున
పదమూడవ అధ్యాయము.







శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

**యుధిష్ఠిర ఉవాచ :-**

శ్లో ॥ గృహస్థ ఏషాం పదవీం విధినా యేన చాంజసా ।
యాతి దేవ ఋషే బ్రూహి మాదృశో గృహ మూఢధీః ॥1॥

**యుధిష్ఠిరుడు ఇట్లు పలికెను :-**

ఓ దేవమునీ ! మావంటి గృహకార్యములచే మూఢచేతస్కుడు గృహస్థుడుగా ఉన్నవాడు యే విధినాచరించుట ద్వారా జ్ఞానమును పొంది దానిచే ఆ మోక్షపదవిని పొందునో చెప్పుము. అని యుధిష్ఠిరుడు ప్రశ్నించెను. ( 1 )

టీ :- చతర్దశే గృహస్థస్య పరమోధర్మ ఈర్యతే, దేశకాలాది భేదేన పునః శ్రేయోవిశేషకృత్. గృహస్థముల్లంఘ్య మోక్షం ప్రత్యన్తరఙ్గత్వేన ప్రథమం వనస్థ యతిధర్మేష్వభి హితేషు, తర్హి గృహస్థ మోక్షోనస్యాదితి శఙ్కితచిత్తః పృచ్ఛతి – గృహస్థ ఇతి. (1)

టీ :- పదునాల్గవ అధ్యాయమున దేశకాలాది భేదమున ఇంకను శ్రేయో విశేషమును గావించెడు గృహస్థుని పరమధర్మము చెప్పబడుచున్నది. గృహస్థ ధర్మములను దాటవేసి మోక్షమును గూర్చి అంతరంగ రూపమైనందున ముందుగా వనస్థుడగు యతి ధర్మములు చెప్పబడినవగుచుండగ, అప్పుడు గృహస్థునకు మోక్షములేదేమోనని శంకించి అడుగుచున్నాడు, ‘ గృహస్థ ’ యని. ( 1 )

**నారద ఉవాచ :-**

శ్లో ॥ గృహేష్వవ స్థితో రాజన్ క్రియాః కుర్వన్ గృహోచితాః।
వాసుదేవార్పణం సాక్షాదుపాసీత మహామునీన్ ॥ 2 ॥

**నారదుడు ఇట్లు పలికెను :-**

ఓ రాజా! గృహములందు నివసించుచునే సాక్షాత్ వాసుదేవార్పణముగా గృహోచితములైన క్రియలనాచరించుచు మహామునులను సేవించవలెను.(2)





శ్లో ॥ శృణ్వన్ భగవతోఽభీక్ష్ణ మవతార కథామృతమ్ ।
శ్రద్ధదానో యథాకాల ముపశాంత జనావృతః ॥ 3 ॥

తగు సమయములందు శాంతచిత్తులైన జనులతో గూడినవాడై శ్రద్ధగలిగి భగవంతుని అవతారముల కథలనెడి అమృతమును మిక్కిలి సేవించువాడై యుండవలెను. ( 3 )

టీ:- తస్య మోక్షధర్మానాహ - గృహేష్విత్యాది యావదధ్యాయ సమాప్తి. సాక్షాద్వాసుదేవార్పణః యథా భవత్యేవం కుర్వన్నుపాసీత. (2,3)

టీ :- గృహస్థుని మోక్షధర్మమును చెప్పెను. ' గృహేషు ' ఇత్యాదిగ అధ్యాయ సమాప్తి వరకు. సాక్షాత్తుగ వాసుదేవార్పణమగునట్లు చేయుచు సేవించవలెను. ( 2, 3 )

శ్లో ॥ సత్సంగాచ్ఛనకైః సంగమాత్మ జాయాత్మజాదిషు ।
విముచ్యేన్ముచ్య మానేషు స్వయం స్వప్నవదిత్థితః ॥ 4 ॥

సత్సంగమువలన మెల్లగా తన భార్యా పిల్లలందు సంగమును (అనురక్తిని) వదలవలసినది. అట్లు స్వయముగనే వదలబడిన వారగుచుండగ స్వప్నమునుండి మేల్కొన్నవానివలె జాగరూకుడై యుండవలెను. ( 4 )

టీ :- స్వయమేవ ముచ్యమానేషు వియుజ్యమానేషు. యథా స్వప్నాదుత్థిః పుమాన్ స్వప్నదృష్టేషు పుత్రాదిషు సజ్గం విముఞ్చతి తద్వత్. (4)

టీ :- స్వయముగనే, ముచ్యమానేషు = యెడబాయబడిన వారగుచుండగా, ఎట్లైతే స్వప్నమునుండి మేల్కొన్న పురుషుడు స్వప్నమున చూడబడిన పుత్రులు మొదలైన వారియందు సంగమును వదిలిపెట్లుచున్నాడో అట్లు. ( 4 )

శ్లో ॥ యావదర్థముపాసీనో దేహే గేహే చ పండితః ।
విరక్తో రక్తవత్తత్ర నృలోకే నరతాం న్యసేత్ ॥ 5 ॥

పండితుడైనవాడు అవసరమైనమేరకు భోగ్యవస్తువులను సేవించువాడై దేహమునందును, గేహమునందును విరక్తుడై ఆసక్తునివలె జనులమధ్య మానవునిగా మెలగవలసినది. ( 5 )

టీ :- నన్వేవం భూతస్య దుర్జనైరభిభూయమానస్య కుతో గృహోచితాః క్రియాః స్యుక్తత్రాహ - యావదర్థమితి. అన్తస్త్వనాసక్తో బహిస్త్వాసక్త ఇవ నృలోకే జనమధ్యే నరతాం మనుష్యతాం న్యసేత్. పురుషాకార మావిష్కుర్యాదిత్యర్థః. (5)

టీ :- ఈ విధమైనట్టి, దుర్జనులచే పీడింపబడెడు గృహస్థునకు గృహోచితక్రియలేల కలుగును ? అనిన ఇట్లు చెప్పెను. ‘ యావదర్థం’ అని. లోన ఆసక్తి వీడినవాడై బయటకు ఆసక్తికలవానివలె జనం మధ్య నటించుచూ, నరతాం = మానవభావమును చూపవలసినది. పురుష ప్రయత్నమును ఆవిష్కరింపజేయతగునని అర్థము. ( 5 )

శ్లో ॥ జ్ఞాతయః పితరౌ పుత్రా భ్రాతరః సహృదోఽపరే ।
యద్వదంతి యదిచ్ఛంతి చానుమోదేత నిర్మమః ॥ 6 ॥

బంధువులు, తల్లిదండ్రులు, పుత్రులు, సోదరులు, మిత్రులు, ఇంక యితరులు యేమిచెప్పినా, యేమికోరినా మమకారమువీడి ఆమోదించవలసినది. ( 6 )

టీ :- ఆగ్రహంతు క్వాపి నకుర్యాదిత్యాహ- జ్ఞాతయ ఇతి. (6)

టీ :- ఎచ్చటను పట్టుదల చేయవలదని చెప్పెను. ‘ జ్ఞాతయః ’ అని.(6)

శ్లో ॥ దివ్యం భౌమం చాన్తరిక్షం విత్తమచ్యుత నిర్మితమ్ ।
తత్సర్వముప భుంజాన ఏతత్కుర్యాత్స్వతో బుధః ॥ 7 ॥

దైవత్తమైన వర్షాదులవలన కలిగిన ధాన్యాదికమును, భూమి యందు లబ్ధమైన నిధులు మొదలగునవి. అకస్మాత్తుగా లభించినది యునగు విత్తములను సర్వమును అనుభవించుచునే గృహోచితమైన కర్మలను స్వయముగనే అచ్యుతార్పణము చేయవలసినది. ( 7 )

టీ :- నన్వేవం సర్వానుమోదనే విత్తక్షయ ప్రజ్ఞాత్కుతో జీవనం కుతోవా కర్మకరణం తత్రాహ - దివ్యం = వృష్ట్యాదిభిర్జాతం

టీ :- అయ్యో ఇట్లు అందరుకోరినవి ఆమోదించి ఇచ్చిన విత్తక్షయమగునే యేల బ్రతుకుట? గృహోచిత కర్మలనాచరించుట యెట్లు ? అనిన ఇట్లు

ధాన్యాది భౌమం= నిధానాది అన్తరిక్షం= అకస్మాదేవ ప్రాప్తమ్. ఏవం స్వతఏవాచ్యుత నిర్మిత దైవలబ్ధం యత్ ఏతత్పూర్వోక్తం కర్మాది. (7)

చెప్పెను. దివ్యం = వర్షపాతాదులవలన లభించిన ధాన్యాదికమును, భౌమం = నిధులు మొదలైనవి. అంతరిక్షం = అకస్మాత్తుగ ప్రాప్తమైనది. ఇట్లు అచ్యుత నిర్మిత = దైవలబ్ధమైనదేదికలదో అది పూర్వోక్తమైన కర్మాదికము. ( 7 )

శ్లో ॥ యావద్భ్రియేత జఠరం తావత్స్వత్వం హి దేహినామ్ ।
అధికం యోఽభిమన్యేత సస్తేనో దండమర్హతి ॥ 8 ॥

కడుపునిండు వరకు అవసరమైన ఆహారము పైననే ప్రాణులకు స్వత్వము ( అధికారము ) కలదు. అంతకుమించి యెవడైతే అధికారమున్నట్లు తలంచిన అట్టివాడు చోరుడు, దండనార్హుడగుచున్నాడు. ( 8 )

టీ :- దైవాద్భూరిలాభే జాతేఽపి తత్రాభిమానో న కార్య ఇత్యాహ - యావదితి. భ్రియేత = పూర్యేత. (8)

టీ :- అదృష్టమువలన అధికలాభము కలిగినను అందు నాదియను అభిమానమును పొందరాదు అని చెప్పెను. ‘ యావత్ ’ అని. భ్రియేత= నింపబడునో ( 8 )

శ్లో ॥ మృగోష్ట్ర ఖర మర్కాఖు సరీసృప్ఖగ మక్షికాః ।
ఆత్మనః పుత్రవత్పశ్యేత్తైరేషా మంతరం కియత్ ॥ 9 ॥

మృగములను ఉష్ట్రములను ( ఒంటెలను ), గాడిదలను, కోతులను, యెలుకలను, సర్పములను, పక్షులను, ఈగలను కూడా తన పుత్రులనువలె చూడవలెను. వానితో ( ఆ పుత్రులతో వీనికి అంతరమెంతయున్నది ?) (9)

టీ :- అత ఏవ యం కమపి స్వగృహం క్షేత్రం వా ప్రవిశ్య భుఞ్జానం న నివారయే దిత్యాహ - ‘మృగే’తి. మర్కః = మర్కటః, సరీసృప్ = సర్పః మక్షికాశ్చ. తై పుత్రైరేషాం మృగాదీనాం కియదన్తరమ్. (9)

టీ :- అందువలననే యెవడినైనను, దేనినైనను తనయింటినిగాని, క్షేత్రమును గాని ప్రవేశించు భుజించువానిని వారించరాదని ఇట్లు చెప్పెను. ‘ మృగ ’ యని. మర్కః = మర్కటము, సరీసృప్ = సర్పము, ఈగలును, ఆ పుత్రులతో వీనికి భేదమేమి? ( 9 )

శ్లో ॥ త్రివర్గం నాతి కృచ్ఛ్రేణ భజేత గృహమేధ్యపి ।
యథాదేశం యథాకాలం యావద్దైవోపపాదితమ్ ॥10॥

టీ :- అతికృచ్ఛ్రేణాపాద్య న భజేత్కింతు యావద్దైవాత్ప్రాపితం తావదేవ భజేత్. (10)

శ్లో॥ ఆశ్వాఘాంతేఽవ సాయిన్యః కామాన్సం విభజేద్యథా ।
అప్యేకామాత్మనో దారాం నృణాం స్వత్వ గ్రహోయతః ॥11॥

టీ :- శ్వానశ్చ అఘాశ్చ పతితాః అన్తేవసాయినశ్చణ్డాలాదయ స్తానభివ్యాప్య యథార్హం కామాన్సవవిభజే త్స్వభోజ్యాద్విభజ్య దద్యాత్. యద్యప్యేకైవ ఆత్మనో దారా భార్యా తస్యామథితి శుశ్రూషణే నియుక్తాయాం స్వస్యశుశ్రూషా హీయేత. యస్యాం చ నృణాం సత్త్వగ్రహోమమవైవాయమిత్యాగహస్తామేకామపి సంవిభజేత్. అథితి శుశ్రూషణే నియుఙ్జీతేత్యర్థః. నత్వన్యథా మన్తవ్యమ్. యథార్హం విభజేదిత్యుక్తత్వాత్. (11)

గృహమేధియైనను త్రివర్గమును ( ధర్మార్థకామములను) అతికష్టముగ భజించతగదు. దేశకాలములననుసరించి దైవముచే యెంతకూర్చబడునో అంతమేఱకు అనుభవించనగును. ( 10 )

టీ :- అతిగా కష్టపడి సంపాదించరాదు. కాని యేదైతే దైవవశమున కల్గింపజేయబడినదో దానితోడనే సేవింపవలెను. ( 10 )

కుక్కలు, చండాలులు మొదలుకొని అందరకు తనకు కలిగినంతలో ఆహారపదార్థాది సంపదలను పంచియీయవలెను. భార్యపై తనకు సత్తువ యున్నందున అయ్యో నాయొక్క భార్య అతిథి శుశ్రూషకు వినియోగించినందున నాకు ఆమె శుశ్రూషహీనమగునని తలంచక ఆమెనుగూడా అతిథి శుశ్రూషయందు వినియోగించవలెను. (11)

టీ :- శునకములను, అఘాశ్చ = పతితులను, అంతేవసాయినః = చండాలాదులు మొదలుకొని యోగ్యమగురీతిని, కామాన్ సంవిభజేత్ = భోజ్యమునుండి విభజించి ఈయవలెను. తనకు ఒక్కతియే భార్యయైనను ఆమెను అతిథి శుశ్రూషయందు వినియోగించిన తనకు ఆమెసేవ తక్కువగును గాక. ఏ స్త్రీ ( భార్య ) యందైతే, సత్త్వగ్రహః = ఈమె నాదేయను పట్టింపు ఉండునో అట్టి తనయొక్క భార్యను కూడా పంచవలసినది. ( అతిథిసేవయందు వినియోగించవలసినదని అర్థము). అన్యథా తలంచరాదు సుమా. యథార్మముగా పంచవలసినదని చెప్పబడినందున. ( 11 )

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ జహ్యాద్యదర్థే స్వప్రాణాన్హన్యాద్వా పితరం గురుమ్ ।
తస్యా స్వత్వం స్త్రియాం జహ్యాద్యస్తేన హ్యజితో జితః ॥12॥

ఏ స్త్రీకొఱకై తనప్రాణములనైనను వదులుకొనునో, లేదా తన తండ్రిని గాని, గురువును గానీ చంపునో అట్టి భార్యయందు ఇది నాదియను అధికారమును వదులుకొనునో అట్టివానిచేత , అజితుడైన అనగా ఇతరులచే జయింపబడని ఈశ్వరుడు జయింపబడినట్లే. (12)

టీ :- ఏవం చేత్తేనేశ్వరో వశీకృతఃస్యాదిత్యాహ - జహ్యాదితి. యదర్థే యన్నిమిత్తం. అన్యైరజితోఽపీశ్వరః తేన జిత ఏవ. (12)

టీ :- ఇట్లైనచో అతనిచే ఈశ్వరుడు వశీకృతుడగునని చెప్పెను. 'జహ్యాత్' అని. యదర్థే = ఏ నిమిత్తముగ, ఇతరులచే జయించబడనివాడైనను ఈశ్వరుడు అతనిచే జయించబడినవాడే యగును. ( 12 )

శ్లో ॥ క్రిమివిడ్భస్మ నిష్ఠాంతం క్వేదం తుచ్ఛాం కలేవరమ్ ।
క్వ తదీయ రతిర్భార్యా క్వాయమాత్మా నభశ్ఛదిః ॥13॥

క్రిములపాలో, నీటిపాలో, భస్మముగానో కావలసిన తుచ్ఛమైన ఈ శరీరమెక్కడ? ఆ శరీర సంబంధమైన రతిగల భార్య యెక్కడ? తన మహిమచే ఆకాశమును గూడా కప్పివేయగల ఈ ఆత్మ యెక్కడ? 13

టీ :- నను కథమేవం తస్యాం సత్వాభిమానో హాతుం శక్యస్తత్త్వ విచారేణేత్యాహ - కృమివిడ్భస్మసునిష్ఠా పర్యవసానమన్తే యస్య. తదీయా దేహార్థారతిర్యస్యాం సా. స్వమహిమ్నా నభోఽపి ఛ్ఛాదయతీతి తథా. (13)

టీ :- ఈ విధముగ ఆ భార్యయందు నాదియను అభిమానము ఎట్లు వదల శక్యము? అనిన తత్వ విచారముచే చెప్పబడుచున్నాడు. కృమి రూపముననో, జలరూపముననో, భస్మముగానో చివరకు మారవలసిన ఆ దేహము కొఱకైన రతిగల. తన మహిమచే ఆకాశమును గూడా కప్పివేయుచున్నది కాన నభచ్ఛదిః (13)

శ్లో ॥ సిద్ధైర్యజ్ఞాన శిష్టార్థైః కల్పయేద్వృత్తి మాత్మనః ।
శేషే స్వత్వం త్యజన్ ప్రాజ్ఞః పదవీం మహతామియాత్॥14॥

దైవలబ్ధమైన పంచయజ్ఞావశిష్టమైన అన్నాదులచే తన జీవితమును నిలుపుకొనవలసినది. మిగిలిన వానియందు మమతా బుద్ధిని వీడినవాడై ప్రాజ్ఞుడు పరమహంసలయొక్క మార్గమును పొందగలడు. ( 14 )

టీ:- కించ సిద్ధైర్దైవలబ్ధైర్యజ్ఞావశిష్టార్థైః పఞ్చయజ్ఞశేషైరన్నాదిభిః. మహతాం నివృత్తానామ్. (14)

టీ :- ఇంతేకాక సిద్ధైః = దేవునివలన పొందబడిన యజ్ఞావశిష్టార్థములచే = పంచయజ్ఞ శేషాన్నాదులచే. మహతాం = పరమహంసలయొక్క. 14

శ్లో ॥ దేవాన్ ఋషీన్ నృభూతాని పితౄనాత్మానమన్వహమ్ ।
స్వవృత్త్యాగత విత్తేన యజేత పురుషం పృథక్ ॥ 15 ॥

తన వృత్తితో వచ్చిన విత్తముతో పంచయజ్ఞదేవతలను ( దేవతలకు, ఋషులకు, పితరులకు, మానవులకు, జీవజంతువులకు చేయు సంతర్పణలకే పంచమహాయజ్ఞాలని పేరు) దేవతలను, ఋషులను, మానవులను, భూతములను, పితృదేవతలను, ఆత్మనుగూడా నిత్యము భజించవలసినది. ఇట్లే అంతర్యామియైన ఈశ్వరుని వేరుగా సేవించవలసినది. ( 15 )

శ్లో ॥ యర్హ్యాత్మనోధికారాద్యాః సర్వాః స్యుర్యజ్ఞ సంపదః ।
వైతానికే విధినా అగ్నిహోత్రాదినా యజేత్ ॥ 16 ॥

ఒకవేళ అధికారాదులు, సర్వయజ్ఞసంపదలు, ఆత్మకు సంబంధించినవే యైన వైతానిక విధియగు అగ్నిహోత్రాదులచే భజించ వలసినది. ( 16 )

టీ :- ఏదద్వివృణ్వన్నాహ - దేవాదీన్ పఞ్చయజ్ఞదేవతాః. ఆత్మానంచ. ఏవం పృథక్ పురుషమన్తర్యామిణమేవ యజేత. (15,16)

టీ :- దీనిని వివరించుచు ఇట్లనెను. దేవాదీన్ = పంచయజ్ఞ దేవతలను తనను గూడా, ఇట్లే వీనికి భిన్నమైన , పురుషుని = అంతర్యామియైన ఈశ్వరుడినే భజించవలెను. (15,16 )

శ్లో ॥ నహ్యగ్ని ముఖతోఽయంవై భగవాన్ సర్వయజ్ఞ భుక్ ।
ఇజ్యేత హవిషా రాజన్ యథావిప్రముఖే హుతైః ॥ 17 ॥

ఓ రాజా ! సర్వయజ్ఞభోజియగు ఈ భగవంతుడు విప్రముఖమున హుతము గావించిన వానిచే యెట్లు తృప్తిజెందునో అట్లు అగ్నిముఖమున హుతము గావించుటవలన తృప్తిజెందడు.(17)

టీ :- న పునరతినిర్బన్ధో యజ్ఞార్థం కార్య ఇత్యాహ - న హీతి. విప్రముఖేహుతైరన్నాదిభిర్యథా ఇజ్యేత పూజ్యేత న తథా ఽ ముఖతో హవిషా ఇజ్యేత. (17)

టీ :- యజ్ఞము కొఱకు అతి నిర్బంధముచేయరాదని చెప్పెను. 'నహి' యని. విప్రముఖమున హవనముచేయబడిన అన్నాదికముచే ఆ పరమాత్మ ఎట్లైతే ఇజ్యేత = పూజింపబడునో అగ్ని ముఖమున ఒసగబడిన హవిస్సుతో గూడా పూజింపబడడు. (17)

(విప్రుని తృప్తిపరిచేవిధంగా ప్రవర్తించాలి)

శ్లో ॥ తస్మాద్బ్రాహ్మణ దేవేషు మర్త్యాదిషు యథార్హతః ।
తైస్తైః కామైః భజస్వైనం క్షేత్రజ్ఞం బ్రాహ్మణానను ॥18॥

అందువలన బ్రాహ్మణులందు, పంచయజ్ఞదేవతలందు, నరులందు, పశుపక్షులందు యోగ్యతననుసరించి ఆయా భోజ్యములచే క్షేత్రజ్ఞుడైన ఈశ్వరుని పూజింపుము. మర్త్యాది పూజనమునందు ముందుగా బ్రాహ్మణులను పూజించి అనంతరము అన్యులను పూజించవలెన. ( 18 )

టీ :- బ్రాహ్మణేషు చ దేవేషు పఞ్చయజ్ఞదేవతాసు చ మర్త్యాదిష్వన్యే ష్వపి నరేషు పశ్వాదిషుచ. క్షేత్రజ్ఞమన్తర్యామిణమ్. బ్రాహ్మణానను మర్త్యాది యజనే బ్రాహ్మణ యజనానన్తర మర్త్యేషు యజస్వ. పాఠాంతరే బ్రాహ్మణా ఆననం యస్య తం. (18)

టీ :- బ్రాహ్మణులందు, దేవతలందు = పంచయజ్ఞ దేవతలందును, మర్త్యాదులైన ఇతర నరులయందు, పశువులు మొదలగువానియందును క్షేత్రజ్ఞం = అంతర్యామియైన పరమాత్మను, బ్రాహ్మణానను = మర్త్యాదులను పూజింపునప్పుడు బ్రాహ్మణ పూజానంతరమే ఇతరుల పూజగావింపదగును. పాఠాంతరమున బ్రాహ్మణులు ఆననము గలవానిని. ( 18 )

శ్లో ॥ కుర్యాదా పరపక్షీయా మాసిప్రౌష్ఠ పదే ద్విజః ।
శ్రాద్ధం పిత్రోర్యథా విత్తం తద్బంధూనాంచ విత్తవాన్ ॥19॥

ద్విజుడు భాద్రపదమాసమునందు తన శక్తిమేఱకు తల్లి దండ్రులకు అపర పక్షీయ శ్రాద్ధమును గావించవలెను. ధనవంతుడు తన తల్లి దండ్రులకే గాక అతని బంధువులకును ఆ శ్రాద్ధము గావించవలెను. ( 19 )

శ్లో ॥ ఆయనే విషువే కుర్యాత్ వ్యతీపాతే దినక్షయే ।
చంద్రాదిత్యో పరాగేచ ద్వాదశీ శ్రవణేషు చ ॥ 20 ॥

శ్లో ॥ తృతీయాయాం శుక్లపక్షే నవమ్యామథకార్తికే ।
చతసృష్వప్యష్టకాసు హేమంతే శిశిరే తథా ॥ 21 ॥

రవియొక్క ఉత్తరాయన - దక్షిణాయనప్రవేశములందు, మేషతులా ప్రవేశములందు, వ్యతీపాతమునందు, క్షయతిథియందు, సూర్యచంద్రుల ఉపరాగ ( గ్రహణ ) సమయములందు, శ్రవణయుక్త ద్వాదశియందు, శుక్లపక్ష తృతీయ ( అక్షయతృతీయ ) యందు, కార్తీక శుక్ల నవమియందును, మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణమాసములు నాల్గింటియందలి అష్టమీ తిథులందును, ( 20, 21 )

టీ :- ప్రౌష్టపదే భాద్రపదే. (19,20)

టీ :- ప్రౌష్టపదే = భాద్రపదమాసమందు, ( 19, 20 )

టీ :- శుక్లపక్షే. అక్షయ్య తృతీయాయామిత్యర్థః. హేమన్తే శిశిరేచ మార్గశీర్షాది మాస చతుష్టయేఽపి యాశ్చతస్రోఽష్టకాః తాసు. (21)

టీ :- శుక్లపక్షమునందు ( అక్షయ్య తృతీయ యందని అర్థము ). హేమంత శిశిర ఋతువులందలి = మార్గశీర్షాది నాలుగు మాసములందలియు యే నాలుగు శుక్లపక్ష అష్టమీ తిథులు కలవో వానియందు. ( 21 )

శ్లో ॥ మాఘే చ సిత సప్తమ్యాం మఘారాకా సమాగమే ।
రాకయాచాను మత్యావా మాసర్‌క్షాణి యుతాన్యపి ॥22॥

మాఘశుక్ల సప్తమియందును, మఖా నక్షత్రముతో గూడిన పౌర్ణిమ యందును, పౌర్ణిమ లేదా అమావాస్యలతో మాసనక్షత్రములు కూడుకున్న రోజులందు, ( 22 )

టీ :- సంపూర్ణచంద్రా పౌర్ణమాసీరాకా. న్యూనచంద్రాసైవాను మతిః. తథా మాసర్క్షాణి తత్తన్మాసనామ ప్రవృత్తి నిమిత్తాని నక్షత్రాణి యుతాని యదా స్యుః తదా. తదుక్తం త్రికాణ్డ్యమ్ – 'పుష్యయుక్తా పౌర్ణమాసీ పౌషీ మాసేతు యత్ర సా, నామ్నా స పౌషో మాఘాద్యాశ్చైవ మేకాదశాపరే' ఇతి. (22)

టీ :- సంపూర్ణా చంద్రా = పౌర్ణిమా = రాకా. న్యూనచంద్రా = అదియే అమావాస్య. అట్లే మాసర్క్షాణి ఆయా మాసనామ ప్రవృత్తికి కారణములైన నక్షత్రములతో కూడిన దినములు. త్రికాండామరములో అది యిట్లు చెప్పబడినది. ' పుష్యమితో కూడిన పౌర్ణిమ = పౌషీ. ఏ మాసమున అది యుండునో ఆ నెలపేరు పౌషమాసము. మాఘాది పదకొండు మాసములును ఇట్లే యెఱుంగదగును. ' అని . ( 22 )

శ్లో ॥ ద్వాదశ్యామను రాధాస్యాత్ శ్రవణస్త్రిస్ర ఉత్తరాః ।
తిసృష్వేకాదశేవాసు జన్మర్క్ష శ్రోణయోగ యుక్ ॥ 23 ॥

అనూరాధా, శ్రవణ, ఉత్తరఫల్గుణీ, ఉత్తరాషాఢ, లేదా ఉత్తరాషాఢ లేదా ఉత్తరాభాద్రతో కూడిన ఏకాదశియందును, జన్మనక్షత్రమైన శ్రవణానక్షత్ర యోగమునందును, ( 23 )

టీ :- అనూరాధా. శ్రవణ. ఉత్తరాఫల్గుణీ, ఉత్తరాషాఢా, ఉత్తరాభాద్రా వా ద్వాదశ్యాం యదాస్యాత్. ఆసు ఉత్తరాసు ఏకాదశీవా యదాస్యాత్తదాచ. జన్మర్క్షశ్రోణయోగయుక్ జన్మనక్షత్రస్య శ్రవణస్యవా యోగేన యుక్తం దినం యదా తదా. యోగ గ్రహణం సంబంధ బాహుల్యార్థమ్. (23)

టీ :- అనూరాధా, శ్రవణ, ఉత్తరాఫల్గుణీ, ఉత్తరాషాఢా లేదా ఉత్తరాభాద్ర ద్వాదశియందు కలిగిన రోజుయందు ఉత్తరా త్రయముతో ఏకాదశీ కూడియున్న రోజు, జన్మనక్షత్రముతోడగానీ, శ్రవణా నక్షత్రముతోడగానీ నున్న రోజు ఇచ్చుట యోగశబ్ద గ్రహణము సంబంధ బాహుళ్యమును తెలియజేయుట కొఱకు. (23)

శ్లో ॥ త ఏతే శ్రేయసః కాలా నృణాం శ్రేయో వివర్ధనాః ।
కుర్యాత్సర్వాత్మనైతేషు శ్రేయోఽమోఘం తదాయుషః ॥24॥

శుభకాలములుగా యెఱుంగనగును. మానవునకు శుభములను వృద్ధిగావించు కాలములు. ఈ రోజులందు గావించు ధర్మకార్యములు ఆయుష్షును వృద్ధిగావించును. శుభపరంపరను కలుగజేయును. ( 24 )

శ్లో ॥ ఏషు స్నానం జపో హోమో వ్రతం దేవ ద్విజార్చనమ్।
పితృదేవ నృభూతేభ్యో యద్దత్తం తద్ధ్యనశ్వరమ్ ॥ 25 ॥

కావున ఈ రోజులలో తీర్థస్నానము, జపము, హోమము, వ్రతము, దేవతార్చనము, ద్విజార్చనము చేయవలయును. పితృదేవతలకు, దేవతలకు, భూతములకు చేయబడిన దానము అక్షయమగును . ( 25 )

టీ :- న కేవలం శ్రాద్ధస్యైవైతే కాలాః కింతు ధర్మమాత్రస్యేత్యాహ – త ఏత ఇతిద్వాభ్యామ్. తదేవాయుషః అమోఘం సాఫల్యమిత్యర్థః. (24,25)

టీ :- ఈ కాలములు కేవలము శ్రాద్ధమునకే గాదు ధర్మ మాత్రమునకని చెప్పెను. ' త ఏత ' అని రెండు శ్లోకములతో. తదేవ = ఆశ్రేయ ఆచరణమే ఆయుష్షునకు, అమోఘం = సాఫల్యమని అర్థము. లేదా అక్షయఫలసాధనమని భావము. ( 24, 25 )

శ్లో ॥ సంస్కారకాలో జాయాయా అపత్యస్యాత్మనస్తథా ।
ప్రేతసంస్థా మతాహశ్చ కర్మణ్యభ్యుదయే నృప ॥ 26 ॥

భార్యయొక్క పుంసవనాది సంస్కారమునకు, అపత్యముయొక్క జాతక కర్మాదులకు, యజ్ఞదీక్షాదులకు, అట్లే ప్రేత దహనాదులకు, సంవత్సరీకాదులకు, ఇతర అభ్యుదయ కర్మల విషయమునందును ఈ కాలము శ్రేయస్కరము. (26)

టీ :- సంస్కారకాల ఇతి. జాయాయాః పుంసవనాది. అపత్యస్య జాతకర్మాది. ఆత్మనో యజ్ఞదీక్షాది. ప్రేతస్య సంస్థా దహనాది. మృతాహశ్చ సాంవత్సరీకం యదా. అన్యస్మిన్నపి అభ్యుదయార్థే కర్మణి శ్రేయః కుర్యాదిత్యనుషఙ్గః. (26)

టీ :- ' సంస్కారాకాలః ' యని. భార్యయొక్క పుంసవనాది సంతానముయొక్క జాతకర్మాది, తన యజ్ఞ దీక్షాది, ప్రతేయొక్క , సంస్థా= దహనాది, మృతాహశ్చ = యెప్పుడు సంవత్సరీకము కలుగునో అది, ఇవికాక అభ్యుదయము కొఱకై చేయబడు కర్మల శ్రేయస్సును కలుగజేయును. ( 26 )

శ్లో ॥ అథ దేశాన్ ప్రవక్ష్యామి ధర్మాదిశ్రేయ ఆవహాన్ ।
స వై పుణ్యతమోదేశః సత్పాత్రం యత్ర లభ్యతే ॥ 27 ॥

అనంతరము ధర్మాచారాదులకు శ్రేయస్కరములైన దేశములను చెప్పెదను. ఎచ్చటనైతే మంచి యోగ్యతగలవ్యక్తి లభించునో అదే పుణ్యతమమైన దేశము. ( 27 )

శ్లో ॥ బింబం భగవతో యత్ర సర్వమేతచ్చరాచరమ్ ।
యత్ర హ బ్రాహ్మణకులమ్ తపోవిద్యా దయాన్వితమ్ ॥28॥

ఎవనియందైతే ఈ చరాచరవిశ్వమిమిడియున్నదో అట్టి భగవంతుని బింబమెచ్చటనుండునో, తపము, విద్యాదులతో కూడిన బ్రాహ్మణకులమెచట నుండునో అది పుణ్యవంతమైన దేశము. (28)

శ్లో ॥ యత్ర యత్ర హరేరర్చా స దేశః శ్రేయ సాంపదమ్ ।
యత్ర గంగాదయోనద్యః పురాణేశేచ విశ్రుతాః ॥ 29 ॥

పురాణ ప్రసిద్ధిగాంచిన నదులెచ్చటనుండునో, ఎచ్చటెచ్చట హరిపూజ జరుగుచుండునో ఆ దేశము శ్రేయస్సులకు స్థానము.(29)

టీ :- యత్ర యస్మిన్నేతచ్చరాచరమస్తి తస్య భగవతో బిమ్బం రూపం సత్పాత్రం యత్ర లభ్యతే స వై పుణ్యతమోదేశః. (27,28,29)

టీ :- యత్ర = యెవనియందైతే ఈ చరాచరప్రపంచమున్నదో అట్టి భగవంతుని బింబం = రూపము, యోగ్యమైన పురుషుడు యెచ్చట లభించునో అదియే పుణ్యతమమైన దేశము. ( 27, 28,29)

శ్లో ॥ సరాంసి పుష్కరాదీని క్షత్రాణ్యర్హాశ్రితాన్యుత ।
కురుక్షత్రం గయాశిరః ప్రయాగః పులహాశ్రమః ॥ 30 ॥

పుష్కరాది సరస్సులు లేదా ఉత్తమమైన క్షేత్రములు విలసిల్లుచున్నవో, అట్టి కురుక్షేతము, గయాశిరము, ప్రయాగ, పులహాశ్రమము మొదలైన క్షేత్రములు అతి పుణ్యస్థలములు. (30 )

శ్లో ॥ నైమిషం ఫల్గుణం సేతుః ప్రబాసోఽథకువస్థలీ ।
వారాణసీ మధుపురీ పంపాబిందు సరస్తథా ॥ 31 ॥

నైమిషము, హరపురము లేదా కన్యాపురము, సేతువు, ప్రభాతము, కుశస్థలీ, వారాణసీ, మధురానగరము, పంపాసరోవరము, బిందుసరస్సు అనునవి పుణ్యప్రదములైన దేశములు . ( 31 )

టీ :- అర్హైరుత్తమైరాశ్రితాని. (30,31)

టీ :- అర్హైః = ఉత్తములచే ఆశ్రయింపబడిన ( 30, 31 )

శ్లో ॥ నారాయణాశ్రమో నందా సీతారామాశ్రమాదయః ।
సర్వేకులాచలా రాజన్ మహేంద్ర మలయాదయః ॥32॥

నారాయణాశ్రమము, నందా, సీతాశ్రమము, రామాశ్రమము మొదలైనవి. మఱియు ఓ రాజా ! మహేంద్ర, మలయాది సమస్త కులపర్వతములు. (32)

టీ :- సీతాయా రామస్యచ ఆశ్రమే ఆదిర్యేషామ్. ద్వయోః పృథక్ గ్రహణం వియోగకాభిప్రాయేణ. (32)

టీ :- సీతాశ్రమము, రామాశ్రమము మొదలగునవి. రెండింటికి పృథగ్రహణము వియోగకాలాభిప్రాయముతో ( 32 )

శ్లో ॥ ఏతే పున్యతమాదేశా హరేరశ్చాశ్రితాశ్చయే ।
ఏతాందేశాన్నిషేవేత శ్రేయస్కామోహ్యాభీక్ష్ణశః ।
ధర్మోహ్యాతే హితః పుంసాం సహస్రాధి ఫలోదయః ॥33॥

హరియొక్క అర్చనతో స్థిరప్రతిమాశ్రితమగు ఈ దేశములన్నియు మిక్కిలి పుణ్యప్రదములు. శ్రేయస్కాముడు ఈ దేశములను మిక్కిలి సేవించదగును. ఈ దేశములందు చేయబడిన ధర్మము సహస్రగుణమధికమైన ఫలము నొసగును. ( 33 )

టీ :- అర్చాశ్రితాశ్చ స్థిర ప్రతిమాశ్రితాః. పూర్వంతు శాలగ్రామ శిలాద్యర్చన దేశ ఉక్త ఇత్యపౌనరుక్త్యమ్. అత్ర ఏషు దేశేషు ఈహితః కృతః. సహస్రగుణమధికస్య ఫలస్యోదయో యస్మాత్స తథా. (33)

టీ :- అర్చాశ్రితాశ్చ = స్థిరమైన ప్రతిమలచే ఆశ్రయించబడినవి. పూర్వమేమో శాలిగ్రామ శిలాది అర్చన దేశమని చెప్పబడినది. కావున పునరుక్తిలేదు. అత్ర = ఈ దేశములందు, ఈహితః = చేయబడిన ధర్మము సహస్రగుణాధిక ధర్మయుక్తమగుచున్నది. ( 33 )

శ్లో ॥ పాత్రంత్వత్ర నిరుక్తం వై కవిభిః పాత్రవిత్తమైః ।
హరిరేవైక ఉర్వీశ యన్మయం వై చరాచరమ్ ॥ 34 ॥

ఓ ఉర్వీశా ! ఉత్తములైన పాత్రవేత్తలగు కవులచే ఈ విషయమునందు చరాచర ప్రపంచమెవ్వని రూపమో అట్టి హరి ఒక్కడే పాత్రుడుగా నిర్ణయించబడినాడు. ( 34 )

టీ :- అథ పాత్రమాహ – హరిరేవపాత్రం నిరుక్తం నిర్ణీతమ్. (34)

టీ :- అనంతరము పాత్రత్వమును చెప్పుచున్నాడు. హరియే పాత్రుడుగా నిరుక్తం = నిర్ణయించబడినది. ( 34 )

శ్లో ॥ దేవర్ష్యర్హత్సు వై సత్సుతత్ర బ్రహ్మాత్మజాదిషు ।
రాజన్యదగ్ర పూజాయాం మతః పాత్రతయాచ్యుతః ॥35॥

దేవతలు, ఋషులు మఱియు అర్హులైన తపోయోగ సిద్ధులు, బ్రహ్మపుత్రులైన సనకాదులును ఉండగా నీవు గావించిన ఆ రాజసూయమున యెందువలననైతే అగ్రపూజకు అర్హునిగా యెంచితివో అందులకే పాత్రుడు అచ్యుతుడే యగుచున్నాడు. ( 35 )

టీ :- తదేవాహ – దేవషు చ ఋషిచ అర్హత్సు చ తపోయోగాది సిద్ధేషు బ్రహ్మాత్మజాదిషు సనకాదిష్వపి సత్సు తత్ర త్వదీయే రాజసూయే యస్మాదచ్యుత ఏవ పాత్రతయా సమ్మతః. (35)

టీ :- అదియే చెప్పుచున్నాడు. దేవతలు, ఋషులును అర్హత్సు చ = తపయోగాది సిద్ధులు. బ్రహ్మాత్మ సంభవులైన సనకాదులును ఉండగా తత్ర = నీ రాజసూయమున యెందువలననైతే అచ్యుతుడే పాత్రుడుగా సమ్మతించ బడినాడో , ( 35 )

శ్లో ॥ జీవరాశిభిరాకీర్ణ అండకోశాంఘ్రిపో మహాన్ ।
తన్మూలత్వాదచ్యుతేజ్యా సర్వజీవాత్మ తర్పణమ్ ॥ 36 ॥

జీవరాశులతో అభివ్యాప్తమైన బ్రహ్మాండకోశమనెడి ఒక మహావృక్షము. దానికి మూలమైనవాడు అచ్యుతుడు. అందువలన ఆ అచ్యుతునిపూజ సర్వజీవుల ఆత్మలకు సంతృప్తిదాయకమైనది. ( 36 )

టీ:- సంమతత్వే హేతుమాహ - జీవరాశిభిర్వ్యాప్తో బ్రహ్మాణ్డకోశ ఏవ యోఽఘ్రిపః సర్వజీవానామాత్మనశ్చ తర్పణమ్. (36)

టీ:- సమ్మతుడగుటకు హేతువును చెప్పెను. జీవరాసులచే వ్యాప్తమైన బ్రహ్మాండ కోశమనెడు యే వృక్షముకలదో. సర్వజీవులకు, ఆత్మకును తర్పణరూపమగు చున్నది. ( 36 )

శ్లో॥ పురాణ్యనేన సృష్టాని నృతిర్యగృషి దేవతాః ।
శేతే జీవేన రూపేణ పురేణ పురుషోహ్యసౌ ॥ 37 ॥

ఈ అచ్యుతునిచే నృ, తిర్యక్, ఋషి, దేవతా రూపములైన శరీరములు సృష్టించబడినవి. ఆ పురములందు ( శరీరములందు ) ఈ పురుషుడు జీవాంతర్యామి రూపముగా నివసించుచున్నాడు. (37)

టీ :- ఏతదేవ పురుషనామనిరుక్త్యా ద్రఢయతి - పురాణీతి. నృతిర్యగాది రూపాణి పురాణి శరీరాణి తేష్వన్తర్యామి రూపేణ ప్రత్యగంశేన చ యతః శేతేఽతః పురుష ఇతి. ప్రసిద్ధః. (37)

టీ :- దీనినే పురుషుడనగా నెవ్వడో నిర్ణయము ద్వారా దృఢపరచుచున్నాడు. ' పురాణి ' యని. నృతిర్యగాది రూపములైన పురములు ( శరీరములు ), వానియందు అంతర్యామి రూపముగా ప్రత్యగంశతోను, యెందువల్లనైతే ఉండునో అందువలన పురుషుడని ప్రసిద్ధుడైనాడు. ( 37 )

శ్లో ॥ తేష్వేషు భగవాన్ రాజన్ తారతమ్యేన వర్తతే ।
తస్మాత్పాత్రం హి పురుషో యావానాత్మా యథేయతే ॥38॥

ఓ యుధిష్ఠిర మహారాజా ! భగవంతుడు ఆ శరీరములందు తారతమ్య రూపముగా ఉంటున్నాడు కావున యెందెందు తప ఆది యోగమున గోచరించుచున్నాడో ఆ పురుషుడు పాత్రుడు. ( 38 )

టీ :- తారతమ్యేన తిర్యగాదిభ్యః పురుషే యస్మాదాధిక్యేన వర్తతే తస్మాత్పురుషః పాత్రమ్. తత్రాపి యావానాత్మాజ్ఞానాంశో యథా యథా ఈయతే తప ఆదియోగేన యత్ర యత్ర ప్రతీయతే తథా తథాఽసౌ పాత్రమిత్యర్థః. తథా చ శ్రుతిః. - పురుష్వేచావిస్తరా మాత్మా' ఇత్యాది. (38)

టీ :- తారతమ్యముచే తిర్యగాదులకంటే పురుషునియందు యెందువల్లనైతే ఆధిక్యముగా నుండునో అందువలన పురుషుడు పాత్రము. అందుకు యావానాత్మా = జ్ఞానాంశము ఎట్లెట్లు గోచరించునో, తప ఆది యోగముచే యెచ్చటెచ్చట గోచరించునో అట్లట్లు అతడు పాత్రమని యర్థము. శ్రుతియు యిట్లు చెప్పుచున్నది. 'పురుషత్వే యా విస్తరామాత్మా ' యని మొదలుగా. (38)

శ్లో ॥ దృష్ట్వా తేషాం మిథోనృణామవజ్ఞానాత్మతా నృప ।
త్రేతాదిషు హరేరర్చా క్రియాయైః కవిభిః కృతా ॥ 39 ॥

త్రేతాది యుగములందు ఆ మానవులలో ఒకరిపైనొకరికి అగౌరవబుద్ధిని చూచి ఓ రాజా ! పూజాదులకొఱకు కవులచే హరియొక్క పూజగావించబడినది. ( 39 )

టీ :- తర్హి ప్రతిమాదౌ హరేః కిమితి పూజాం కుర్వన్తి తత్రాహ - దృష్ట్వా ఇతి ద్వాభ్యామ్. మిథోఽవజ్ఞాన మస్మానస్తస్మిన్నాత్మా బుద్ధిర్యేషాం తేషాం భావం దృష్ట్వా. క్రియాయై పూజాద్యర్థమ్. (39)

టీ :- ఐనచో ప్రతిమాదులందు యెందులకు హరిపూజను చేయుచున్నారు? అనిన యిట్లు చెప్పెను. ' దృష్ట్వా ' ఇత్యాది రెండు శ్లోకములచే. పరస్పరముగా, అవజ్ఞానం = అగౌరవమునందు బుద్ధికలవారు. వారి భావమును చూచి క్రియాయై పూజాదుల కొఱకు.(39 )

శ్లో ॥ తతోర్చాయాం హరిం కేచిత్సంశ్రద్ధాయ సపర్యయా ।
ఉపాసత ఉపాస్తాపి నార్థదా పురుష ద్విషామ్ ॥ 40 ॥

అనంతరము పూజయందు సపర్యలద్వారా కొందఱు శ్రద్ధచే హరిని కొలిచిరి. పురుషద్వేషలకు కొలిచినప్పటికిని సఫలముగాదు.(40)

టీ :- హరిముపాసతే. ఉపాసితాప్యర్చా పురుషద్వేషిణామర్థదాన భవతి. పురుషేషుద్వేషం హిత్వా ఉర్చితా సతీ సాపి మన్దాధికారిణాం పురుషార్థప్రదా భవత్యేవేత్యర్థః. (40)

టీ :- హరిని కొలిచెదరు. పూజచేసి కొలిచినను పురుషద్వేషులకు ప్రయోజనకారి కాదు. పురుషులందు (జీవులందు) ద్వేషమును వీడి కొలువబడినదైయగుచుండగ ఆ ప్రతిమయే మందమైన అధికారము కలవారికిని పురుషార్థప్రదము అగునుగాక యని అర్థము. ( 40 )

శ్లో ॥ పురుషేష్వపి రాజేంద్రా సుపాత్రం బ్రాహ్మణం విదుః ।
తపసా విద్యయా తుష్ట్యా ధత్తేవేదం హరేస్తనుమ్ ॥ 41 ॥

ఓ రాజేంద్రా! పురుషులలోను బ్రాహ్మణుని సుపాత్రునిగా యెఱింగెదరు. అతడు తపస్సుచేతను, విద్యచేతను, తుష్టిచేతనూ హరి తనువైన వేదమును ధరించుచున్నాడు. ( 41 )

టీ :- పురుషేష్వేవ జాత్యా తప ఆదిభిశ్చ పునర్విశేషాన్తరమాహ - పురుషేష్వపీతి. యోధత్తే తం సుపాత్రం విదుః. (41)

టీ:- పురుషులయందే జాతిచే, తప ఆదులచేతను ఇంకను విశేషాంతరమును చెప్పెను. ' పురుషేష్వపి ' యని. ఎవడైతే వేదమును ధరించునో (చదువునో) అతడు సుపాత్రుడుగా యెఱింగిరి. (41 )

శ్లో ॥ నన్వస్య బ్రాహ్మణా రాజన్ కృష్ణస్య జగదాత్మనః ।
పునంతః పాదరజసా త్రైలోకీ దైవతం మహత్ ॥ 42 ॥

ఓ రాజా! బ్రాహ్మణులు జగదాత్మయైన ఈ శ్రీకృష్ణునియొక్క పాదధూళిచే పవిత్రము చేయబడినవారై త్రిలోకసంబంధమైన గొప్ప దైవతమగుచున్నారు గదా ! ( 42 )

టీ :- ఏతదేవకైముత్యన్యాయేన ద్రఢయతి - నన్వస్యేతి. (42)

దీనినే కైముత్య న్యాయమున దృఢపరచుచున్నాడు. 'నన్వస్య యని.'(42)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
సదాచారనిర్ణయే చతుర్దశోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమున సప్తమస్కంధమున
శ్రీధరీయభావార్థ టీకానువాదమున పదునాల్గవ అధ్యాయము.





## పంచదశోధ్యాయః.

**నారద ఉవాచ :-**

శ్లో ॥ కర్మనిష్ఠా ద్విజాః కేచిత్తపోనిష్ఠా నృపాపరే ।
స్వాధ్యాయేఽన్యే ప్రవచనే యే కేచిజ్ఞాన యోగయోః ॥1॥

టీ :- తతః పఞ్చదశే సర్వ వర్ణాశ్రమనిబన్ధనమ్, సారతః సంగ్రహేణాథ వర్ణ్యతే మోక్ష లక్షణమ్. సర్వేషామపి మోక్షధర్మాణాం సారసంగ్రహార్థమధ్యాయప్రారంభః. తత్ర శ్రాద్ధగతాన్విశేషానాహ - కర్మనిష్ఠా ఇతి. స్వాధ్యాయాదిషు పరినిష్ఠితా ఇతి శేషః. (1)

శ్లో ॥ జ్ఞాన నిష్ఠాయ దేయాని కవ్యాన్యానంత్య మిచ్ఛతా ।
దైవే చ తదభావేస్యా దితరేభ్యో యథార్హతః ॥ 2 ॥

## పంచదశాధ్యాయము.

**నారదుడు ఇట్లు పలికెను :-**

ఓ నృపా ! కొందరు ద్విజులు కర్మనిష్ఠులు గాగ మఱికొందరు తపోనిష్ఠులై యుందురు. ఇంకను కొందరు స్వాధ్యాయ నిష్ఠులైయుండ వేరింకొందరు ప్రవచన పరాయణులై యుందురు. వీరికి భిన్నముగా కొందరు జ్ఞానయోగ సాధకులునై యుందురు. ( 1 )

టీ :- అటు తర్వాత పదునైదవ అధ్యాయమున సర్వవర్ణములకు సర్వాశ్రమములకు నిశ్చితమై మోక్ష ధర్మము సారరూపముగా సంగ్రహముగా వర్ణించ బడుచున్నది. సమస్త మోక్ష ధర్మముల యొక్క సారమును సంగ్రహించి చెప్పుటకు ఈ అధ్యాయము ప్రారంభించబడుచున్నది. ముందుగా శ్రాద్ధ గతములైన విశేషములను చెప్పెను. ‘ కర్మనిష్ఠా ’ యని. (అపరే స్వాధ్యాయే అన్యే ప్రవచనే అనువానికి) స్వాధ్యాయము మొదలగువాని యందు నిష్ఠతో ఆసక్తిగల వారని శేషము.( 1 )

అనంత ఫలమును గోరువారు పితృదేవతలనుద్దేశించి ఒసంగెడు కవ్యములను జ్ఞాననిష్ఠునకు ఈయవలసినది. దైవమునుద్దేశించి ఒసంగబడు హవ్యములను కూడా అట్టి వానికే (జ్ఞాననిష్ఠునకే) అర్పించవలసినది. అట్టి






జ్ఞాననిష్ఠులు లభించని పక్షమున అర్హతననుసరించి ఇతర స్వాధ్యాయ ప్రవచనాది నిష్ఠులకు నీయవలెను.(2 )

శ్లో ॥ ద్వౌ దేవే పితృకార్యేతి నేకైక ముభయత్ర వా ।
భోజయేత్సు సమృద్ధోపి శ్రాద్ధే కుర్యాన్న విస్తరమ్ ॥ 3 ॥

శ్రాద్ధమున దైవ స్థానమున ఇరువురిని, పితృస్థానమున ముగ్గురిని లేదా ఉభయత్రా ఒక్కొక్కరిని భుజింపజేయవలసినది. సంపన్నుడైనను విస్తరము గావించరాదు. ( 3 )

టీ :- కవ్యాని పితౄనుద్దిశ్యదేయాని. దైవేచ హవ్యాన్యపి తస్మైదేయాని యథార్హత ఇతి సర్వత్ర జ్ఞానాది తారతమ్యేన. (2,3)

టీ :- కవ్యాని = పితరులను ఉద్దేశించి ఇవ్వదగినవి. దైవే = దైవార్థమై హవ్యములనుగూడా ఆ జ్ఞాననిష్ఠునకే ఇవ్వదగినవి. యథార్హముగా అని అన్నిచోట్ల జ్ఞానాది తారతమ్యముచే, ( 2, 3 )

శ్లో ॥ దేశకాలోచిత శ్రద్ధా ద్రవ్యపాత్రార్హణాని చ ।
సమ్యగ్భవంతి నైతాని విస్తరాత్స్వజనార్పణాత్ ॥ 4 ॥

విస్తరము గావించుటవలన, స్వజనులకు అర్పించుటవలన, దేవకాలోచితమైన శ్రద్ధ, ద్రవ్యము, పాత్రత, అర్హణములు అనునవి బాగుగ కలుగవు. ( 4 )

టీ :- నను విస్తరః కుతః ప్రాప్తో యేన నిషిధ్యతే తత్రాహ - స్వజనానామర్పణాత్. జామాతా చేన్నిమన్త్ర్యతే తత్పిత్రాదయః కథం వర్జ్యా ఇత్యేవం ప్రాప్తాద్విస్తరాదిత్యర్థః. (4)

టీ :- విస్తరము యెందుకు కలుగునపు? నిషేధించుట యేల ? అచ్చట యిట్లు చెప్పెను. స్వజనులకు అర్పించుట వలన. అల్లుడు నిమంత్రణముగ చేయబగడగ అతని తండ్రి మొదలైన వారేల వదలదగును ? ఇట్లు కలిగెడు విస్తారమునుండి యని అర్థము. (4)

శ్లో ॥ దేశే కాలే చ సంప్రాప్తే మున్యన్నం హరి దైవతమ్ ।
శ్రద్ధయా విధివత్పాత్రే న్యస్తం కామదుఘక్షయమ్ ॥ 5 ॥

అన్యదేశమున లేదా యోగ్యమైన దేశకాలములు ప్రాప్తించిన మున్యన్నము అనగా నీవారాది ధాన్యము, కందమూల ఫలములును, హరిదైవతమును ఉద్దేశించి అర్పించవలసినది. శ్రద్ధతో విధివిధానముగ యోగ్యునకు అర్పించబడినదై తరగని కామములను స్వయముగనే ప్రసాదించును. ( 5 )

టీ :- మున్యన్నమారణ్యం వ్రీహ్యాది. హరిదైవతం హరయే నివేదితం సత్. (5)

మున్యన్నం = అరణ్యమున లభించెడు నీవారాది ధాన్యము మొదలైనవి. హరిదైవతం = హరికి నివేదించబడినదై, ( 5 )

శ్లో ॥ దేవర్షి పితృభూతేభ్య ఆత్మనే స్వజనాయ చ ।
అన్నం సంవిభజన్ పశ్యేత్సర్వం తత్పురుషాత్మకమ్ ॥6॥

దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, ఇతరప్రాణులకు, తనకును తనవారికిని అన్నమును విభాగము గావించుచు సర్వమును ఈశ్వర స్వరూపమునుగా చూడనగును. ( 6 )

శ్లో॥ నదద్యాదామిషం శ్రాద్ధే న చాద్యాద్ధర్మ తత్త్వవిత్ ।
మన్యన్నైస్యాత్పరాప్రీతిర్యథా న పశుహింసయా ॥ 7 ॥

తత్త్వమునెఱింగినవాడు శ్రాద్ధమున ఆమిషమును (మాంసమును) పెట్టవద్దు. తానును ఆమిషమును భుజించరాదు. ముని సేవ్యమైన ధాన్యాది ఆహారముచే ఉత్కృష్టమైన ఏ ప్రీతి కలుగునో అట్టి ప్రీతి పశుహింసచే కలిగిన ఆహారముచే కలుగదు. ( 7 )

టీ :- పురుషాత్మకమీశ్వర స్వరూపమ్. (6,7)

టీ :- పురుషాత్మకం = ఈశ్వరస్వరూపముగా ( 6, 7 )

శ్లో ॥ నైతాదృశః పరోధర్మో నృణాం సద్ధర్మ మిచ్ఛతామ్ ।
న్యాసో దండస్య భూతేషు మనోవాక్కాయజస్యయః ॥8॥

ప్రాణులయెడ మనోవాక్కాయజమైన హింసను వీడుట యనునదేది కలదో, సద్ధర్మమును కోరు జనులకు ఇంతటి పరమధర్మము మఱి యొకటి లేదు. ( 8 )

టీ :- దణ్డస్యన్యాసః హింసాయాస్త్యాగో య ఏతాదృశోఽ న్యో ధర్మః నాస్తి. (8)

టీ :- దండన్యాసః = హింసయొక్క త్యాగము అనునదేదికలదో అటువంటి మఱియొక ధర్మము లేదు, ( 8 )

శ్లో ॥ ఏకే కర్మమయాన్ యజ్ఞాన్ జ్ఞానినో యజ్ఞవిత్తమాః ।
ఆత్మసంయమనేఽనీహా జుహ్వతి జ్ఞానదీపితే ॥ 9 ॥

యజ్ఞవేత్తలైన కొందరు జ్ఞానవంతులు నిష్కర్ములై ఆత్మస్ఫూర్తి గలిగిన ఆత్మసంయమనమునందు కర్మమయమైన యజ్ఞములను హవనము చేయుచున్నారు. అనగా త్యజించుచున్నరని అర్థము. (9)

టీ :- అత ఏవోత్తమాధికారిణో బాహ్యాని కర్మాణిత్యజన్తీత్యాహ - ఏక ఇతి. ఆనీహాః = నిష్కర్మాః. జ్ఞానదీపితే = ఆత్మస్ఫూర్తిమత్యాత్మ సంయమనే జుహ్వతి. మనోనియమ్య తదన్తరాయతయా త్యజన్తీత్యర్థః. తదుక్తం సర్వజ్ఞ సూక్తైః :- "ప్రత్యక్ స్ఫూర్తిరసత్ స్ఫూర్తిస్తనునిష్ఠా విఘాతకమ్. సంల్లక్ష్య సంత్యజేత్కర్మ త్యజన్ విఘ్నహతో యథా" ఇతి.(9)

టీ :- కనుకనే ఉత్తమాధికారులు బాహ్యములైన కర్మలను వదులు చున్నారని ఇట్లు చెప్పెను. ' ఏకే ' యని. అనీహాః = నిష్కర్ములై, జ్ఞానదీపితే= ఆత్మస్ఫూర్తిగల ఆత్మసంయమనమునందు వ్రేల్చుచున్నారు. మనస్సును నిగ్రహించుకుని ఆ నిగ్రహమునకంతరాయమైనందున వదిలి వేయుచున్నారని అర్థము. ఆ విషయమే సర్వజ్ఞసూక్తములచే చెప్పబడినది. " అసత్యస్ఫూర్తిగానీ, వ్యతిరేకస్ఫూర్తిగానీ ( తనువందు ) వ్యక్తియందు కలిగిన విఘాతకమగును. ఇది గ్రహించి విఘ్నములచే కొట్టబడినట్లు కర్మలను వీడవలెను. " అని. (9)

శ్లో ॥ ద్రవ్యయజ్ఞైర్యక్ష్యమాణం దృష్ట్వా భూతాని బిభ్యతి ।
ఏషమాఽకరుణో హన్యాదతత్వజ్ఞో హ్యసు తృప్ ధ్రువమ్ ॥10॥

ఇతడు దయలేనివాడు, ఆత్మతత్త్వము నఱుంగనివాడు, ప్రాణహరుడు నన్ను తప్పకచంపునని ద్రవ్య యజ్ఞములచే యాగము చేయువానిని చూచి భూతములు ( ప్రాణులు ) భయపడును. (10 )

టీ:- మా మామేష ధ్రువం హర్యాత్ ఇతి. కుతః, అకరుణః. తత్కుతః, అసృతృప్ ప్రానతర్పకః. తత్కిమ్, అతజ్ఞః ఆత్మ తత్త్వానభిజ్ఞః. తథా చ శ్రుతిః. "న తం విదాథ య ఇమా జజానాన్యద్యుష్మాకమన్తరం బభూవ, నీహారేణ ప్రావృతా జల్పా చాసృప ఉక్థశాసశ్చరన్తి" ఇతి. (10)

టీ :- మా = నను ఇతడు నిశ్చయముగా సంహరించును. అని. యెందుకనగా దయలేనివాడు. అది యెందులకు, అసృతృప్ = ప్రాణతర్పకుడు. అదేమిటి ? అతజ్ఞః = ఆత్మత్వము నెఱుంగనివాడు. శ్రుతియు యిట్లు చెప్పుచున్నది. ' నతం విదాథయ ఇమా ' ఇత్యాది. (10)

శ్లో ॥ తస్మాద్దైవోపపన్నేన మున్యన్నేనాపి ధర్మవిత్ ।
సంతుష్టోఽహరహః కుర్యాన్నిత్య నైమిత్తికీః క్రియాః ॥11॥

కావున దైవవశమున చేకూరిన ఆరణ్యకమైన యవాది ధాన్యకము చేతగానీ, ధర్మవేత్తయైనవాడు సంతృప్తిచెంది రేయిబవళ్ళ నిత్యనైమిత్తిక క్రియలను చేయనగును. ( 11 )

టీ :- ప్రస్తుత మనువర్తయతి - తస్మాదితి. (11)

టీ:- ప్రస్తుత విషయమును ' తస్మాత్ ' ఇత్యాదిగా అనుసరించు చున్నాడు. ( 11 )

శ్లో ॥ విధర్మః పరధర్మశ్చ ఆభాస ఉపమాఛలః ।
అధర్మ శాఖాః పంచేమా ధర్మజ్ఞోఽధర్మవత్త్యజేత్ ॥12॥

విధర్మము, పరధర్మము, ఆభాసము, ఉపమా, ఛలము అను నీయైదు అధర్మ శాఖలు. ధర్మమునెఱిగినవాడు వీనిని అధర్మము వలెనే వదలదగినది.(12)

టీ :- అధర్మవత్సాక్షాన్నిషిద్ధవత్. (12)

టీ :- అధర్మవత్ = సాక్షాత్తు నిషేధింపబడినట్లు ( 12 )

శ్లో ॥ ధర్మబాధో విధర్మః స్యాత్పరధర్మోఽన్య చోదితః ।
ఉపదర్మస్తు పాఖండో దంభోవా శబ్దభిచ్ఛలః ॥ 13 ॥

ధర్మమును బుద్ధితో చేయబడినను స్వధర్మమునకు బాధకలిగిన విధర్మమనబడును, ఇతరుల ప్రేరేపణచే ఇతరుల ధర్మము నాచరించుట పరధర్మము, పాఖండులచే ( నాస్తికులచే ) ఆచరించబడు ధర్మమ ఉపమా ( ఉపధర్మము ) ,శబ్దమునకు అన్యథా వ్యాఖ్యానముచేసి చెప్పబడిన ధర్మము చలము. ( 13 )

టీ :- క్రమమనాదృత్య పఞ్చాపి వ్యాచష్టే ధర్మబాధో ధర్మబుద్ధ్యాపి యస్మిన్ క్రియమాణే స్వధర్మబాధః అన్యస్య చోదితోఽన్యస్య పరధర్మః. ఉపమేతి వ్యాచష్టే – ఉపధర్మస్త్వితి. శబ్దస్యభిత్ భేదోఽన్యథా వ్యాఖ్యానమ్ యస్మిన్. యథా దశావరాన్ భోజయేదిత్యుక్తే దశఽభ్యో వరానితి. శబ్దభృదితిపాఠే ధర్మశబ్దమాత్రమ్ బిభర్తీతి తథా. యథా గాం దద్యాదిత్యుక్తే మరిష్యన్త్యాగోర్దానమ్. (13)

టీ :- క్రమమును ఆదరించక అధర్మ శాఖల నైదింటినీ వివరించెను. 'ఉపధర్మస్తు ' అని. శబ్దముయొక్క భిత్ = భేదము = అన్యథా వ్యాఖ్యానము గలది. ఎట్లనగా " దశావరాన్ భోజయేత్ " (పదిమంది పిల్లలను భుజింపజేయవలసినది) అనుచోట ' దశేభ్య అవరాన్ ' (పదిమందికంటె చిన్నవారిని) అని. ' శబ్దభృద్ ' యన అనుపాఠమున ధర్మశబ్ద మాత్రమును భరించుచున్నాడని అట్లు ఎట్లనగా ' గాం దద్యాత్ ' అని చెప్పబడగా చావబోయెడు దానిచే గోవుయొక్క దానమును (13)

శ్లో ॥ యస్త్విచ్ఛయాకృతః పుంభిరాభాసో హ్యాశ్రమాత్ పృథక్।
స్వభావ విహితో దర్మః కస్య నేష్టః ప్రశాంతయే ॥ 14 ॥

తన ఆశ్రమ ధర్మమునకన్న భిన్న ధర్మము ఏదికలదో అది పురుషులచే ఇష్టప్రకారము చేయబడిన ఆభాసమందురు. స్వభావ సిద్ధముగా విధించబడిన ధర్మము ప్రశాంతత కొఱకు ఎవరికిష్టము గాదు.(14)

టీ :- సర్వధర్మానుష్ఠానానన్తరం ధర్మభూయస్త్వార్థమపి పరధర్మో నానుష్ఠేయోఽనుపయోగాదిత్యాహ - స్వభావవిహిత ఇతి. (14)

టీ :- స్వధర్మానుష్ఠానానంతరము ఎక్కువ ధర్మము కలుగవలెనని పరధర్మమువ అనుష్ఠించరాదు. అనుపయోగమైనందున అని ఇట్లు చెప్పెను. ‘ స్వభావ విహిత ’ యని . (14)

శ్లో ॥ ధర్మార్థమపి నేహేత యాత్రార్థం వాఽధనోధనమ్ ।
అనీహానీహ మానస్య మహాహేరివ వృత్తిదా ॥ 15 ॥

ధర్మమును గావించుటకై నిర్ధనుడు యాత్రలకు వెడలగోరియైనను ధనమును గోరరాదు. నిష్కామవృత్తిని గోరు మహాసర్పమునకు వలె జీవనోపాయమునిచ్చును. (15)

శ్లో ॥ సంతుష్టస్య నిరీహస్య స్వాత్మారామస్య యత్సుఖమ్ ।
కుతస్తత్కామలోభేన ధావతోఽర్థేహయా దిశః ॥ 16 ॥

సంతుష్టుడు, నిష్కాముడు, స్వాత్మారాముడునునైన వానికి ఏ సుఖము గలుగునో ఆ సుఖము కామలోభముచే, ధనాశచే దశదిశల పరిధావనము చేయువానికెట్లు లభించును ? ( 16 )

టీ :- కించ అధనో ధర్మార్థం ధనంనేహేత నాపేక్షత. ధనార్థం న వ్యాప్రియే తేతి వా. దైవోపపన్నేనైవ స్వధర్మసిద్ధేరుక్తత్వాత్. యాత్రార్థమపి నేహేతేత్యేతత్ప్రపఞ్చయతి - అనీహేతి సార్ధైః షడ్భిః. (15,16)

టీ :- ఇంతేకాక నిర్ధనుడు ధర్మము కొఱకై ధనమును నేహేత= అపేక్షింపరాదు. లేదా ధనమునకై తెంపర్లాడరాదనియు అర్థము. దైవలబ్ధమైన ధనాదులతో స్వధర్మసిద్ధి చెప్పబడినందున యాత్రకైకూడా అపేక్షింపరాదని వివరించుచున్నాడు. అనీ ‘ అనీహా ’ అని ఆరున్నర శ్లోకములచేత. ( 15,16)

శ్లో ॥ సదా సంతుష్ట మనసః సర్వాసుఖమయా దిశః ।
శర్కరా కంటకాదిభ్యో యథోపానత్పదః శివమ్ ॥ 17 ॥

ఎట్లైతే పాదరక్షలు ధరించినవానికి మొఱపురాళ్ళు, ముళ్ళు మొదలగువాని వలన బాధకలుగదో, శుభమే కలుగునో అట్లే సదా సంతుష్టమైన మనస్సుగలవానికి దశదిక్కులును సుఖమయములే యగును. (17)

టీ :- ఉపానహౌ పాదయోర్యస్యస ఉపానత్వాత్తస్య. (17)

టీ :- పాదత్రాణములు ( చెప్పులు లేదా జోళ్ళు ) పాదములకు గలవాడు ఉపానత్వాదుడు. వానికి ( 17 )

శ్లో ॥ సంతుష్టః కేన వారాజన్ నవర్తే తాపి వారిణా ।
ఔపస్థ జైహ్వ్య కార్పణ్యాద్ గృహపాలయతే జనః ॥18॥

సంతుష్టుడు ఏ నీరుద్రావియైనను మనలేడా? ఉపస్థ, జిహ్వాది లౌల్యములచే మానవుడు దైన్యమునొందినవాడై పెంపుడు కుక్కవలె సంతుష్టిలేక తిరుగుచెడును. ( 18 )

శ్లో ॥ అసంతుష్టస్య విప్రస్య తేజో విద్యా తపో యవః ।
స్రవంతీంద్రియ లౌల్యేన జ్ఞానంచైవా వ కీర్యతే ॥ 19 ॥

అసంతుష్టుడైన విప్రునియొక్క ఇంద్రియ లౌల్యములచే అతని తేజస్సు, విద్యా, తపస్సు, కీర్తి భ్రష్టమగును. జ్ఞానముకూడా ఛిన్నాభిన్నమగును. ( 19)

టీ :- గృహపాలః శ్వాతద్యదాచరతి. (18,19)

టీ :- గృహపాలః = పెంపుడు శునకము, దానివలె ఆచరించును.(18,19)

శ్లో ॥ కామస్యాస్తూశు క్షతృడ్భ్యా య్ క్రోధస్యై తత్ఫలోదయాత్ ।
జనోయాతి నలోభస్య జిత్వా భుక్త్వా దిశో భువః ॥20॥

ఓ రాజా ! ఆకలి దప్పికలచే అనగా అవి తీరుట ద్వారా జనము కోరికలీడేరిన వారగుదురు. క్రోధమునకు ఫలము హింస అది కలుగుటవలన క్రోధముయొక్క అంతమును గూడా పొందవచ్చును. గాని దిక్కులను జయించిగాని, భూమిని అనుభవించినను గానీ లోభముయొక్క పారమును పొందలేరు. 20

శ్లో ॥ పండితా బహవో రాజన్ బహుజ్ఞాః సంచయచ్ఛిదః ।
సదసత్పతయోఽ పేృకే అసంతోషాత్పతత్యధః ॥ 21 ॥

పండితులు, చాలాతెలిసినవారు, సంశయములను తీర్చగలవారు, అనేకులు సదసస్పతులును అసంతోషమువలన అధోగతి పాలగుచున్నారు. (21)

టీ :- క్షుధాతృషా చ జనః కామస్య అన్తం యాతి, అన్నోదకాతిరిక్త కామాన్తరాభావాత్. క్రోధస్యవాన్తం యాతి. ఏతస్య క్రోధస్య యత్ఫలం హింసా తసోదయాన్నిష్పత్తేః. దిశోజిత్వాపి భువో భుక్త్వాపి లోభస్య నైవాన్తం యతీత్యర్థః. (20,21)

టీ:- ఆకలిచే. దప్పిక చేతను జనము కామముయొక్క అంతమును అనగా ఇష్టప్రాప్తిని పొందుచున్నది. అన్నోదకాతిరిక్తమైన వేరొక కోరిక లేనందువలన, క్రోధముయొక్క అంతమును పొందవచ్చును. అనగా క్రోధముగూడా ఉపశమింప బడవచ్చును అని అర్థము. ఈ క్రోధమునకు యే హింసరూపమైన ఫలముగలదో, అది నెఱవేరుటవలనగాని, దిక్కులను జయించినను, భూమిననుభవించినను, లోభమునకు మాత్రము అంతము కలేగదని యర్థము. (20, 21)

శ్లో ॥ అసంకల్పాజ్జయేత్కామం క్రోధం కామ వివర్జనాత్ ।<br>
అర్థానర్థేక్షయా లోభం భయం తత్త్వావమర్శనాత్ ॥22॥

అసంకల్పమువలన కామమును జయించవచ్చును. కామమును వీడుటద్వారా క్రోధమును తొలగించుకొనవచ్చును. అర్థము గతిని పరీక్షించుట ద్వారా అర్థములను, లోభమును వీడవచ్చును. తత్వవిమర్శ ద్వారా భయమును వీడవచ్చును. ( 22 )

టీ :- ఇదానీం కామాదిజయోపాయోనాహ - అసంకల్పాదితి చతుర్భిః. జయేదితి యథాపేక్షమన్వేతి. అర్థేఽనర్థదర్శనేన. తత్త్వావమర్శనా ద్వైతానుసంధానేన. (22)

టీ :- ఇప్పుడు కామాదుల జయించు ఉపాయమును చెప్పెను. 'అసంకల్పాత్ ' అను నాలుగు శ్లోకములచే. ' జయేత్ ' అనునది అపేక్షనుబట్టి అన్వయించును. అర్థమునందు అనర్థమును గాంచుట వలన, తత్త్వావమర్శనాత్ = దైత్యాను సంధానముచేత. ( 22 )

శ్లో ॥ ఆన్వీక్షిక్యాశోకమోహౌ దంభం మహదుపాసయా ।<br>
యోగాంతరాయాన్మౌనేన హింసాం కాయాద్యనీహయా ॥23॥

ఆత్మానాత్మ వివేకముచే శోకమోహములను వదలనగును. సాత్వికులైన మహాత్ములను సేవించుటద్వారా దంభము వీడనగును. యోగమునకు కలిగెడు లోకవార్తాదికమును మౌనము నాశ్రయించుటచే త్యజించదగును. శరీరాదు లందు మమతాదులను వీడుటద్వారా హింస పరిత్యజింపదగును. ( 23 )

టీ :- ఆన్వీక్షిక్యా = ఆత్మానాత్మవివేకేన. మహతాం సాత్త్వికానాం సేవయా. యోగస్యాన్తరాయాన్ లోకవార్తాదీన్. (23)

టీ :- ఆన్వీక్షిక్యా = ఆత్మానాత్మలయొక్క జ్ఞానముచేత. మహతాం= సాత్త్విక స్వభావముగల మహానుభావుల సేవచేత. యోగమునకు కలిగెడు ఆటంకములైన లోకవార్తాదికమును. ( 23 )

శ్లో ॥ కృపయా భూతజం దుఃఖం దైవం జహ్యాత్సమాధినా ।
ఆత్మజం యోగ వీర్యేణ నిద్రాం సత్త్వ నిషేవయా ॥24॥

క్రూరజంతువులవలన విషకీటకాదుల వలన కలుగు భయము అట్టి భూతములయెడ కృపగలిగి హితాచరణాదులవలన వీడదగును. దైవకృతమైన మనః పీడాదులను సమాధిచే తొలగించుకొనదగును. శారీరకమైన దుఃఖములను ప్రాణాయామాది యోగబలమున నివారింపజేసేకొనవచ్చును. సాత్త్వికాహారాదులచే నిద్రను బాపుకొనవచ్చును. ( 24 )

శ్లో ॥ రజస్తమశ్చ సత్త్వేన సత్త్వం చోపశమేన చ ।
ఏతత్సర్వం గురౌ భక్త్యా పురుషోహ్యఞ్జసా జయేత్ ॥25॥

సత్త్వ గుణాశ్రయమువలన రజస్తమోగుణములను దూరము గావించనగును. శమముచే సత్త్వమును త్యజించదగును. దీనినంతటినీ పురుషుడు గురువునందలి భక్తిచే జ్ఞానముచేతను జయించదగును.(25)

టీ :- యేభ్యో భూతేభ్యో భయం జాయేత తేష్వేవకృపయా హితాచరేణేన. దైవం దైవోపసర్గనిమిత్తం వృథా మనః పీడాది. తదుక్తం యాజ్ఞవల్క్యేన "విమనావిఫలారంభః సంసీదత్యనిమిత్తతః" ఇతి. ఆత్మజం దేహజం. యోగవీర్యేణ ప్రాణాయామాది బలేన. సత్త్వనిషేవయా సాత్త్వికాహారాదినా. (24,25)

టీ :- ఏ భూతములవలన భయము కలుగునో వానియందే కృపచేత హితమునాచరించుటచే. దైవం= దైవముయొక్క, ఉపసర్గ = విలాసాదులవలన కలిగెడు వ్యర్థముగా మనోబాధాదులు. యాజ్ఞ్యవల్కునిచే ఇట్లు చెప్పబడినది. 'విమనస్కులు విఫలారంభము అకారణముగా బాధలనొందుచున్నాడు ' అని. ఆత్మజం = శరీరమందు కలిగెడు. యోగవీర్యేణ = ప్రాణాయామాది బలముచే. సత్త్వనిషేవయా= సాత్త్వికాహారాది సేవనముచే (24, 25 )

శ్లో ॥ యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీప ప్రదేగురౌ ।
మర్త్యా సద్ధీః శ్రుతం తస్య సర్వం కుంజర శౌచవత్ ॥26॥

ఎవనికైతే జ్ఞానదీపమును ప్రసాదించెడు సాక్షాత్ భగవంతుడైన గురువుయందు ' మానవుడనెడు ' దుర్బుద్ధి యుండునో అతని శాస్త్రజ్ఞానమంతయు గజస్నానమువలె నిష్ఫలమగును. ( 26 )

టీ :- నను కథం గురౌ భక్త్యా సర్వస్యజయఃస్యాత్తత్రాపి మనుష్యత్వేన తదవస్థత్వాత్తత్రాహ - యస్యేతి. మర్త్యాసద్ధీర్మనుష్య ఇతి దుర్బుద్ధిః. తస్య శాస్త్రశ్రవణం కుఞ్జరస్నానవద్వ్యర్థమ్. (26)

టీ :- గురువుయందలి భక్తిచే సర్వ విజయమెట్లు కలుగును? అతని యందును మనుష్యత్వముండుటచేత మానవావస్థయే కలిగి యుండుట వలన అని ఇట్లు చెప్పెను. ' యస్య ' అని. మర్త్యాసద్ధీః = 'మనుష్యుడు' అనెడు దుర్బుద్ధి. అతని శాస్త్ర శ్రవణము గజస్నానమువలె వ్యర్థమగును. (26)

శ్లో ॥ ఏషవై భగవాన్ సాక్షాత్ ప్రధాన పురుషేశ్వరః ।
యోగేశ్వరైర్విమృగ్యాంఘ్రిః లోకో వై మన్యతే నరమ్ ॥27॥

ఈ గురువు యోగీంద్రులచే వెతుకబడు పాదపంకజములుగల ప్రధాన పురుషేశ్వరుడైనట్టి సాక్షత్తు భగవంతుడే లోకులు నరుడని నమ్ముచున్నారు గదా ! ( 27 )

టీ :- నను గురోరపి పుత్రాదయస్తం నరమేవ మన్యన్తేఽత ఆహ - ఏష గురుః సాక్షాద్భగవానేవ భవేత్. లోకస్య నరోఽసావితి బుద్ధిర్భ్రాన్తి రిత్యర్థః. యద్వా న హి తత్పుత్రాదేర్మనుష్య బుద్ధ్యా ప్రతీయమానోఽపి గురుర్భగవాన్నభవేత్. యథైష శ్రీకృష్ణ ఇత్యర్థః. (27)

టీ :- గురువుగారి పుత్రులు మొదలైన వారును అతనిని నరునిగనే తలచుచున్నారు గదా ! యనిన ఇట్లు చెప్పెను. ఈ గురువు సాక్షాత్తుగా భగవంతుడే యగును. లోకమునకుండెడు ' ఇతడు నరుడే ' యనెడు బుద్ధి భ్రాంతియని అర్థము. లేదా అతని పుత్రాదులకు మనుష్య బుద్ధితో గోచరించువాడైనను గురువు భగవంతుడు కాదనేది లేదు. భగవంతుడే. యెట్లైతే ఈ శ్రీకృష్ణుడు నరుడివలె గోచరించువాడైనను భగవంతుడో అట్లే. ( 27 )

శ్లో ॥ షడ్వర్గ సంయమైకాంతాః సర్వా నియమ చోదనాః ।
తదంతా యది నో యోగా నావహేయుః శ్రమావహాః ॥28॥

అన్ని నియమ చోదనములు గలవారు అనగా ఇష్టాపూర్తాది విధులు గలవారు. ఇంద్రియముల షడ్వర్గములయొక్క నిగ్రహమునందే ఆసక్తులైనవారు అంతవరకే ఆచరించినచో ధారణా, ధ్యాన, సమాధి యోగములను సాధించకున్నచో కేవలము శ్రమాన్వితులే కాని ఫలభాక్కులు కాలేరు. (28)

టీ :- ఏవం సర్వైరుపాయై కామాది వేగం జిత్వా నియతేన్ద్రియో భూత్వా ధ్యానపరోభవేత్. అన్యథా తం ప్రతి సర్వశాస్త్రవైఫల్యం స్యాదిత్యాహ – షడ్వర్గేతి. సర్వాపి నియమచోదనా ఇష్టాపూర్తాది విధయః షడింద్రియవర్గస్య యః సంయమః తస్మిన్నేకస్మిన్నన్తో యాసాం. తదేకపరా ఇత్యర్థః. న చ తావతాపి చరితార్థా ఇత్యాహ – తదన్తాః సత్యోఽపి యదియోగాన్ధారణా ధ్యాన సమాధీన్నో ఆవహేయుర్న సాధయేయుస్తర్హి కేవలం శ్రమావహా ఏవేత్యర్థః. (28)

టీ :- ఇట్లు అని ఉపాయములచే కామాది షడ్వర్గముయొక్క వేగమును జయించి నియతేంద్రియుడై ధ్యానాసక్తుడై యుండ వలసినది. లేదేని అతని గూర్చి సర్వశాస్త్ర వైఫల్యము గలుగునని ఇట్లు చెప్పెను. ‘ షడ్వర్గ ’ ఇత్యాదిగా. సమస్తమైన నియమచోదనాః = ఇష్టములను పూరించెడు విధులు గలవారు. షడింద్రియ వర్గముయొక్క సంయమమునందే ఆసక్తులైనవారు. తదేక పరాయణులని యర్థము. అంతటితోడనే చరితార్థులు కారని ఇట్లు చెప్పెను. షడింద్రియ నిగ్రహ పరాయణులైనప్పటికినీ ధారణా, ధ్యాన, సమాధి యోగములను నో ఆవహేయుః = ఒకవేళ సాధించలేకున్నచో గావించిన నిగ్రహాదులు శ్రమహేతేవులు మాత్రమే యగునని యర్థము (28)

శ్లో ॥ యథా వార్తాదయోహ్యర్థా యోగస్యార్థం న బిభ్రతి ।
అనర్థాయ భవేయుస్తే పూర్తమిష్టం తథాఽసతః ॥ 29 ॥

ఎటులైతే కృషి మొదలైనవి వాని ఫలములును యోగముయొక్క ప్రయోజనమైన మోక్షఫలము నొసంగజాలునో పైగా సంసారమున తగుల్కొనుటకు కారణములగుచున్నవో అటులనే ధారణాది యోగముల సాధించలేని వానికి నియమచోదితములైన ఇష్టాపూర్తాది విధులు గలిగినను నిష్ఫలమే యగును. ( 29 )

టీ :- ఏతదేవ దృష్టాన్తేనాహ - యథా వార్తాదయః కృష్యాదయోఽర్థా స్తత్ ఫలాని చ యోగస్యార్థం మోక్షం న సాధయన్తి ప్రత్యుత సంసారాయైవ. అసతో బహిర్ముఖస్య ఇష్టాపూర్తాద్యపి తథా. (29)

టీ :- దీనినే దృష్టాంతముచే చెప్పెను. ఎట్లైతే వార్తాదయః = కృష్యాదయోఽర్థాః = కృషి మొదలైనవి వాని ఫలములను యోగము యొక్క , అర్థం = ప్రయోజనమైన మోక్షమును సాధించవు. పైగా సంసార హేతువలే యగును. అసతో = బహిర్ముఖునకు (యోగ సాధనకు విముఖుడగువానికి ) ఇష్టాపూర్తాదులను అట్లే. ( 29 )

శ్లో ॥ యశ్చిత్త విజయే యత్తః స్యాన్నిస్సంగోఽపరిగ్రహః ।
ఏకో వివిక్త శరణో భిక్షుర్భిక్షా మితాశనః ॥ 30 ॥

ఎవడైతే మనస్సును జయించుటకు ఉద్యుక్తుడగునో అతడు నిస్సంగుడు, పరిగ్రహముగావించనివాడు, ఒంటరిగ ఏకాంత జీవనము సాగించువాడు, భిక్షచే లభించిన మితమైన ఆహారమును స్వీకరించువాడునగు సన్యాసి గావలెను. ( 30 )

టీ :- ఏవం యోగం యుఞ్జతోఽపి యస్యకుటుమ్బాది సఙ్గేన చిత్తం విక్షిప్యేత తస్య కృత్యమాహ - యశ్చిత్తస్య విజయే యత్త ఉద్యుక్తః స భిక్షుః స్యాత్ సన్యసేత్. తథా చ స్మృతిః -"ద్వంద్వాహతస్య గార్హస్థ్యం ధ్యానభఙ్గాది కారణమ్. లక్షయిత్వా గృహీ స్పష్టం సన్యసేదవిచారయన్" ఇతి. భిక్షయాప్రాప్తం మితమశనం యస్య సః. (30)

టీ :- ఇట్లు యోగమును సాధించినను యెవనికి కుటుంబాది సంగముచే చిత్తము భ్రమించునో అట్టివాని కృత్యమును ఇట్లు చెప్పెను. ఎవడైతే మనస్సుయొక్క జయమునందు యత్తః = ఉద్యుక్తుడో అతడు భిక్షుః స్యాత్ = సన్యసించవలసినది. స్మృతియిట్లు చెప్పుచున్నది. " ద్వంద్వముచే కొట్టబడు వానికి గార్హస్థ్యము ధ్యాన భంగాదులకు కారణమగును. గృహస్థు దీనిని గ్రహించి విచారించక సన్యసించవలసినది " యని. భిక్షచే ప్రాప్తమైన మిత ఆహారము గలవాడై.(30)

శ్లో ॥ దేశే శుచౌ సమే రాజన్ సంస్థాప్యాసనమాత్మనః ।
స్థిరం సమం సుఖం తస్మిన్నాసీతర్ జ్వంగ ఓమితి ॥31॥

ఓ రాజా ! సమతలమున శుచి ప్రదేశమున తన ఆసనమును వేసుకుని స్థిరముగ సమముగ సుఖముగ నిటారైన శరీరము గలవాడై దానిపై కూర్చుండవలెను. ( 31 )

శ్లో ॥ ప్రాణాపానౌ సంనిరుంధ్యాత్పూర కుంభక రేచకైః ।
యావన్మనస్త్యజేత్కామాన్ స్వనాసాగ్ర నిరీక్షణః ॥ 32 ॥

పూరక, కుంభక, రేచకములచే ప్రాణాపానములను నిరోధించ వలసినది. మనస్సు కామములను వీడు వరకు తన నాసాగ్రమున నిలిపినవాడై. (32)

శ్లో ॥ యతో యతో నిఃసరతి మనఃకామ హతం భ్రమత్ ।
తతస్తత ఉపాహృత్య హృదిరుంధ్యా చ్ఛైనైర్బుధః ॥ 33 ॥

కామపీడితమైన మనస్సు చలించుచు ఎటు ఎటు వెడలిన అక్కడినుండి పట్టి తెచ్చి తెలివిగలవాడు మెల్లగా హృదయమున బంధించవలెను. ( 33 )

టీ :- ఋజు సమమఙ్గం యస్య సః సుఖం యథా భవత్యేవమాసీత ఓమిత్యుచ్చారయన్నితిశేషః. (31,32,33)

టీ :- ఋజువుగా ( నిటారుగా ) సమముగా శరీరము గలవాడై సుఖముగా ఉండునట్లు కూర్చునవలెను. ‘ ఓం ’ అని, ‘ఉచ్చారయన్’ అను పద మధ్యాహారము . ( 31, 32, 33 )

శ్లో ॥ ఏవమభ్య సతశ్చిత్తం కాలేనాల్పీయసా యతేః ।
అనిశం తస్య నిర్వాణం యాత్యనిధన వహ్నివత్ ॥ 34 ॥

ఇట్లు అనిశము అభ్యసించుచుండగ కొద్దికాలమునకే యతి చిత్తము ఇంధనము (కట్టెలు, నూనె) లేని అగ్నివలె దాని నిర్వాణము కలుగును.(34)

టీ :- ఏవమనిశమభ్యస్యతః తస్య యతేశ్చిత్తం నిర్వాణం శాన్తిం యాతి. (34)

టీ :- ఇట్లు యెల్లప్పుడు అభ్యసించెడు యతియొక్క మనస్సు నిర్వాణం= శాంతిని పొందుచున్నది. ( 34 )

శ్లో ॥ కామాదిభిరనా విద్ధం ప్రశాంతాఖిల వృత్తియత్ ।
చిత్తం బ్రహ్మ సుఖ స్పృష్టం నైవోత్తిష్ఠేత కర్హిచిత్ ॥ 35 ॥

ఏదైతే కామాదులచేత పీడింపబడనిదై ప్రశాంతమైన సమస్త వృత్తులు గలదైన చిత్తము బ్రహ్మ సుఖముచే స్పృశించబడినదై ఇక మఱల యెప్పటికిని లేవనే లేవదు. ( 35 )

టీ :- న చ పునర్విక్షిప్యేతేత్యాహ - కామాదిభిరక్షుభితం యచిత్తం తన్నోతిష్ఠేత్. యతః ప్రశాన్తా అఖిలా వృత్తయో యస్య. కుతః? బ్రహ్మసుఖేన స్పృష్టమ్. (35)

టీ :- మఱల చిత్తము చలించకుండుగాక యని ఇట్లు చెప్పెను. కోరికలు మొదలగు వానిచే క్షోభింపబడకుండ మనస్సు నిలవదు. కాన మఱల క్షోభించకుండ ఉండవలెను. ఎట్లనగ ప్రశాంతమైన అఖిల వృత్తులు గలవాడై. యెందులకు ? బ్రహ్మ సుఖముచే స్పృశించబడినచో ( అది మరల విక్షిప్తము గాదు ) . ( 35 )

శ్లో ॥ యః ప్రవ్రజ్య గృహాత్పూర్వం త్రివర్గావపనాత్పునః ।
యది సేవేత తాన్ భిక్షుః స వై వాన్తాశ్య పత్రపః ॥36॥

ఎవడైతే ధర్మార్థ కామములను పొందకయే ముందుగా గృహమునుండి వెడలి సన్యసించి భిక్షుకుడై మఱల ఆ ధర్మార్థ కామములను సేవించిన అతడు వాన్తాశియై (కక్కిన కూడు భుజించిన వాడై) నిర్లజ్జగలవాడగుచున్నాడు. (36)

టీ :- యస్తు ప్రవ్రజ్యాం కృత్యాపి భోగమపి భోగమభిలిప్సుః స్యాత్తం నిన్దతి - య ఇతి త్రయాణాం ధర్మాదీనాం వర్గ ఆ సమన్తా దుప్యతే యస్మింస్తస్మాద్గృహాత్ తాన్ ధర్మాదీన్. వాన్తాశీ ఛర్దితబోజీ నిర్లజ్జశ్చ. (36)

టీ:- ఎవడైతే సన్యాసమును గ్రహించియు భోగములను పొంద గోరు వాడగునో అతనిని నిందించుచున్నాడు. ‘ యః ’ అని. ధర్మార్థ కామముల మూడింటి వర్గమునకు పాత్రమైన గృహమునుండి వెడలి, ఆ ధర్మాదులను. వాంతాశీ = వాంతిగావించిన దానిని తిన్నవాడై లజ్జా విహీనుడగుచున్నాడు. (36)

శ్లో ॥ యైః స్వదేహః స్మృతోనాత్మా మర్త్యో విట్ కృమి భస్మసాత్।
త ఏవమాత్మనాత్ కృత్వా శ్లాఘయంతి హ్యసత్తమాః ॥37॥

ఎవరిచేతనైతే అనాత్మాది రూపమైన స్వదేహమే చింతించబడినదో ఆత్మ గుఱించి ఆలోచించబడలేదో అట్టి వారిచే ఈ శరీరమే ఆత్మయని తలంచి స్తుతించబడినది. ( 37 )

టీ :- నచేదమఘటితం దృష్టత్వాదిత్యాహ - యైః పూర్వం స్వదేహోఽనా త్మాదిరూపం స్మృతశ్చిన్తితస్త ఏవ పునేరేవ మాత్మేతియత్వా శ్లాఘయన్తి స్తావయన్తి హి. (37)

టీ :- ఇది ఘటించినది కాదు. దృష్టమైనందున అని చెప్పెను. యెవరిచేతనైతే అనాత్మాది రూపమైన స్వదేహము, స్మృతః= చింతించ బడినదో ( ఆత్మ ఆలోచింపబడలేదో ) వారే, పునః = మఱల ఈ శరీరమునే ఆత్మయని తలంచి శ్లాఘింపజేయుచున్నారు గదా ! (37)

శ్లో ॥ గృహస్థస్య క్రియాత్యాగో వ్రతత్యాగో వటోరపి ।
తపస్వినో గ్రామసేవా భిక్షోరింద్రియ లౌల్యతా ॥ 38 ॥
శ్లో ॥ ఆశ్రమాప సదాహ్యేతే ఖల్వాశ్రమ విడంబకాః ।
దేవమాయా విమూఢాం స్తానుపేక్షేతాను కంపయా ॥39॥

గృహస్థునకు క్రియాత్యాగము, వటువునకు వ్రతత్యాగము, తపస్వికి గ్రామసేవ, భిక్షుకునకు ఇంద్రియలౌల్యము అనునవి ఆశ్రమ విఘాతకములైన విడంబములు గదా ! అట్టి దేవమాయామోహితులైన వారిని జాలితో ఉపేక్షింపదగును. (38,39 )

టీ :- యతిముపలక్షీకృత్య అన్యానపి స్వధర్మత్యాగినో నిన్దతి - గృహస్థస్యేతి ద్వాభ్యామ్. (38,39)

టీ :- యతిని ఉపలక్షణము గావించుకొని స్వధర్మమును వీడిన ఇతరులనుకూడా నిందించుచున్నాడు. ' గృహస్థస్య ' అని రెంటిచే.(38,39)

శ్లో ॥ ఆత్మానం చే ద్విజానీయాత్పరం జ్ఞాన ధుతాశయః ।
కిమిచ్ఛన్ కస్య వా హేతోః దేహం పుష్ణాతి లంపటః॥40॥

తనను పరబ్రహ్మగా యెఱిగినట్లైన జ్ఞానముచే నిరస్తమైన వాసనగల అతడు యేమి కోరినవాడై, ఏ కారణమున లంపటుడై దేహమును పోషించుచున్నాడు ? ( 40 )

టీ :- నన్వాత్మతత్త్వజ్ఞస్య భిక్షో రింద్రియలౌల్యేఽపి కోదోషస్తత్రాహ - ఆత్మానం పరంబ్రహ్మ చేజ్ఞానీయాత్. జ్ఞానేన ధుతా నిరస్తా ఆశయా వాసనా యస్య, తస్య జ్ఞానినో లౌల్యమేవ న సంభవతీర్యర్థః తథా చ శ్రుతిః. "ఆత్మానం చే ద్విజానీయా దయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమను సంజ్వరేత్" ఇతి. (40)

టీ :- ఆత్మ తత్త్వమునెఱిగిన భిక్షుకునకు ఇంద్రియలౌల్యము కలిగినప్పటికి దోషమేమి యనిన ఇట్లు చెప్పెను. తనను పరబ్రహ్మగా నెఱిగినట్లైన జ్ఞానముచే ధుతాః = నిరస్తములైన, ఆశయాః = వాసనలు గల అట్టి జ్ఞానికి లౌల్యమే సంభవించదు అని అర్థము. శృతియునిట్లు జెప్పుచున్నది. ఈ నేను పరబ్రహ్మ రూపమైన పురుషుడను అని తనను తెలుసుకొన్నచో యేమి కోరుచు యెవనియొక్క కోరికకొఱకు శరీరమును బాధించును " అని. ( 40 )

శ్లో ॥ ఆహుః శరీరం రథమింద్రియాణి
హయాన భీషూన్మన ఇంద్రియేశమ్ ।
వర్త్మాని మాత్రా ధిషణాంచ సూతం
సత్త్వం బృహద్బంధుర మీశసృష్టమ్ ॥ 41 ॥

శరీరమును రథమని చెప్పుదురు. మఱియు ఇంద్రియములను గుఱ్ఱములుగా, ఇంద్రియములకు పతియైన మనస్సును ప్రగ్గములను (రశ్మలకు) గా, శబ్దాది విషయములను మార్గములుగా, బుద్ధుని హూతునిగా, ఈశునిచే సృష్టించబడిన చిత్తమును బృహత్ బంధురమునుగా ( కానితాడుగా ) చెప్పుచున్నారు. ( 41 )

టీ :- అజ్ఞస్య తు లౌల్యేన నరకపాతాపత్తేరప్రమత్తేన సదా తత్త్వజ్ఞానే యతితవ్యమితీమమర్థం "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ" ఇత్యాది శ్రుత్యుక్త రథరూపకద్వారేణాహ - ఆహురితిషడ్భిః - ఇంద్రియమేశం మనోఽభీషూన్రశ్మీనాహుః - మాత్రాః శబ్దాదీన్వర్త్మాని గన్తవ్య దేశానాహుః సత్త్వం చిత్తం బృహద్దేహవ్యాపి బంధురం బంధనమ్. చిత్తం వినాహ్యానిబద్ధమివ

టీ :- అజ్ఞునకైతే నరకపాతము సంభవించు అవకాశమున్నందున అప్రమత్తుడుగా యెల్లప్పుడు తత్త్వ జ్ఞానమునెఱుంగ యత్నింపవలయునను ఈ విషయమును " తనను రథమునుగా యెఱుంగుము. శరీరమును రథమునుగా తెలుసుకొనుము. " ఇత్యాది శృతియందు చెప్పబడిన రథరూపకముద్వారా చెప్పెను. ' ఆహో ' యని. ఆరుశ్లోకములచే. ఇంద్రియేశుడైన మనస్సును పగ్గములను (కళ్ళెములను ) గా , చెప్పిరి. మాత్రాః =

శరీరం భవతి. ఈశసృష్టమితి, బంధనకర్తాత్వీశ ఏవేత్యర్థః. (41)

శ్లో ॥ అక్షం దశప్రాణ మధర్మ ధర్మౌ
చక్రేఽభిమానం రథినంచ జీవమ్ ।
ధనుర్హితస్య ప్రణవం పఠంతి
శరంతు జీవం పరమేవ లక్ష్యమ్ ॥ 42 ॥

టీ :- ప్రాణాదయః పఞ్చ 'నాగః కూర్మశ్చ కృకలో దేవదత్తో ధనఞ్జయం' ఇత్యేవం దశవిధం ప్రాణమక్షమ్. అభిమానం సాహంకారం జీవం రథినమ్. శుద్ధం జీవం శరమ్. పరంబ్రహ్మ లక్ష్యమ్. యథా ధనుషా శరో లక్ష్యే నిపాత్యతే తథా ప్రణవేన జీవో బ్రహ్మణి నిపాత్యత ఇత్యర్థః.(42)

శబ్దాదులనెడి వానిని మార్గములనుగా, గంతవ్య దేశములనుగా చెప్పిరి. సత్వం = చిత్తమును బృహద్దేహవ్యాపియైన బంధురం = బంధనమునుగా పలికిరి. చిత్తము లేకుండగ శరీరము నిబద్ధత లేనిదివలె నుండును కదా ! ' ఈశసృష్టం ' అని. బంధనకర్త ఈశ్వరుడే అని అర్థము. ( 41 )

మఱియు పంచమహాప్రాణములు పంచ ఉపప్రాణములు కలిపి దశ ప్రాణములను అక్షము ( ఇఱుసు ) గా, ధర్మాధర్మములను ఉభయచక్రములుకాగా, అహంకారముతో గూడిన జీవుని రథికునిగా, ప్రణవమును ( ఓంకారమును ) ఆ రథికునకు ధనువుగా, శుద్ధమైన జీవుని శరముగాను, పరబ్రహ్మను లక్ష్యమును గాను తెలిసెదరు. (42)

టీ :- ప్రాణాదయః = ప్రాణ- అపాన- వ్యాన- ఉదాన- సమానములనెడి ఐదు, నాగము- కూర్మము- కృకలము- దేవదత్తము- ధనుంజయమునను ఐదును కలిసి మొత్తము పది విధములైన ప్రాణము అక్షము ( ఇఱుసు ). అభిమానం = అహంకారముతో గూడిన జీవుని రథికునిగా, శుద్ధమైన జీవుని శరము ( బాణము )నుగా పరం బ్రహ్మమును లక్ష్యమునుగా గ్రహించుము. ఎటులైతే ధనుస్సుచేత శరము లక్ష్యమునందు వేయబడుచున్నదో అట్లే ప్రణవముచే జీవుడు పరబ్రహ్మమున పడవేయబడుచున్నాడని అర్థము. (42)

శ్లో ॥ రాగో ద్వేషశ్చ లోభశ్చ శోక మోహౌ భయం మదః ।
మానోవమానోసూయాచ మాయా హింసా చ మత్సరః ॥43॥

శ్లో ॥ రజః ప్రమాదః క్షున్నిద్రా శత్రవస్త్వేవ మాదయః ।
రజః తమః ప్రకృతయః సత్త్వ ప్రకృతయః క్వచిత్ ॥44॥

రాగము, ద్వేషము, లోభము, శోకము, మోహము, భయము, మదము, మానము, అవమానము, అసూయా, మాయా, హింస, మత్సరము, రజస్సు, ప్రమాదము, ఆకలి, నిద్రా మొదలైనవి శత్రువులు. ఓకానొకప్పుడు సత్వ ప్రకృతులు గూడా రజస్తమః ప్రవృత్తులు గలవారుగా మారెదరు. ( 43, 44)

టీ :- రాగాదయో జేతవ్యాః శత్రవః. (43)

టీ :- తత్ర రజోఽభినివేశః క్వచిదారూఢ సమాధేః స్వత్త్వ ప్రకృతయోఽపి పరోపకారాది ప్రవృత్తయః శత్రవః. (44)

టీ :- రాగాది శత్రువులు జయించదగినవి. అందు రజోఽభినివేశము ఒక్కొకచో సమాధినధిష్ఠించిన వానిది సత్త్వ ప్రకృతియే యైనను పరోపకారాది ప్రవృత్తులు శత్రువులగుచున్నవి. ( 43, 44 )

శ్లో ॥ యావన్నృకాయరథ మాత్మ వశోపకల్పితం
ధత్తే గరిష్ఠ చరణార్చన యా నిశాతమ్ ।
జ్ఞానాసిమచ్యుత బలో దధదస్త శత్రుః
స్వారాజ్య తుష్ట ఉపశాంత ఇదం విజహ్యాత్ ॥45॥

ఆత్మవశమైనదిగా కల్పించబడిన మానవశరీర రూపమైన ఈ రథమును యెంతవరకు ధరించునో అంతవరకు గురువుల చరణార్చనచే వాడియైన జ్ఞానఖడ్గమును దాల్చినవాడై అచ్యుతాశ్రయుడై ఉపశమింపజేయబడిన కామక్రోధాది శత్రువులు గలవాడై, శాంతచిత్తుడై స్వానందముచే తుష్టుడై ఈ రథాదికమును ఉపేక్ష గావించ వలసినది.(45)

టీ :- నృకాయరూపం రథమాత్మవశః ఉపకల్ప ఇంద్రియాది పరికరో యస్మిం స్తథా భూతం యావద్ధత్తే తావదేవ గరిష్ఠానాం గురుణాం చరణసేవయా నిశితం జ్ఞానఖడ్గం బిభ్రదచ్యుతాశ్రయః

టీ :- మానవ శరీర రూపమైన రథమునపు ఆత్మవశమైన, ఉపకల్పః= ఇంద్రియాది పరికరముగలదానిని యెంతవరకు ధరించునో అంతవరకే గరిష్ఠానాం = గురువులయొక్క చరణ సేవచే వాడియైన జ్ఞానమనెడి

సన్నిరస్త శత్రురుపశాతః స్వానన్దేన తుష్టో భూత్వేదం రథాదికముపేక్షేతేత్యర్థః. (45)

ఖడ్గమును ధరించినవాడై అచ్యుతాశ్రయుడగుచు అస్తమింప జేయబడిన శత్రువులుగలవాడై, ఉపశాంతుడై స్వానందముతో తుష్టుడై ఈ రథాదికమును ఉపేక్షచేయవలసినదని అర్థము. ( 45 )

శ్లో ॥ నోచేత్ప్రమత్త మసదింద్రియ వాజిసూతా
నీత్వోత్పథం విషయ దస్యుషు నిక్షిపంతి ।
తే దస్యవః సహాయసూత మముం తమోఽంధే
సంసార కూప ఉరుమృత్యు భయే క్షిపంతి ॥46॥

లేనిచో ప్రమత్తుడై విషయాభిలాషా పరవశుడైన మానవుని బహిర్ముఖములైన ఇంద్రియములనెడు అశ్వములు. సూతుడు ప్రవృత్తి. మారగములను చేర్చి విషయములనెడు దొంగలలోనికి పడవేయుచున్నవి. ఆ దొంగలు హయసూతముతో గూడిన అతనిని అజ్ఞానాంధకారముచే అవృతమై యుండెడు భయంకరమైన మృత్యు భయముగల సంసారమనెడు కూపమున ( నూతిలో ) పడవేయుచున్నారు. ( 46 )

టీ :- అచ్యుతాశ్రయాభావే బాధకమాహ - నోచేదితి. అస్తనో బహుర్ముఖాః యే ఇన్ద్రియ వాజినః సూతశ్చతే ఉత్పథం ప్రవృత్తిమార్గం నీత్వా విషయాఖ్యేషు దస్యుషు నిక్షిపన్తి. హయైః సూతేన చ సహ వర్తమానమ్. తమోఽన్ధే తమసా వ్యాప్తే ఉరుమృత్యుభయం యస్మిన్. (46)

టీ :- అచ్యుతుని ఆశ్రయించనందున బాధకమును ఇట్లు చెప్పెను. 'నోచేత్' ఇత్యాదికముచే. అసంతః = బహిర్ముఖములైన యే ఇంద్రియాశ్వములు, సూతుడునూ కలరో అని. ఉత్పథం= ప్రవృత్తి మార్గమునుచేర్చి విషయములనెడు దొంగలందు పడవేయుచున్నది. హయములతో, సూతునితోను ఉండెడువానిని తమస్సుచే అంధకారముగానున్న అనగా అజ్ఞానాంధకారముచే వ్యాప్తమైన సంసార కూపమున మిక్కిలి మృత్యుభయముగల దానిలో పడవేయుచున్నవి.(46)

శ్లో ॥ ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికమ్ ।
ఆవర్తేత ప్రవృత్తేన నివృత్తేనా శ్నుతేఽమృతమ్ ॥ 47 ॥

వైదికమైన కర్మ ప్రవృత్తము, నివృత్తమును అని ద్వివిధముగా చెప్పబడినది. ప్రవృత్తకర్మచే పునర్జన్మను, నివృత్తకర్మచే మోక్షమును పొంది అమృతమును భజించును. (47 )

టీ :- నను వేదవిహితేష్టాపూర్తాది కారిణః పుంసః కథమేవ మనర్థప్రాప్తిః స్యాదిత్యాశ్జ్క్య వేదోక్త కర్మణాం ద్వైవిధ్యం దర్శయన్ఫల భేదమాహ - ప్రవృత్తం చేతి దశభిః. (47)

టీ :- వేదవిహితములైన ఇష్టాపూర్తాది కర్మలనాచరించిన వానికి ఈ విధమైన అనర్థప్రాప్తి ఎట్లు కలుగునని శంకించి వేదోక్తకర్మల యొక్క ద్వైవిధ్యమును ప్రదర్శించుచు ఫలభేదమును చెప్పెను. - 'ప్రవృత్తంచ' అని పది శ్లోకములచే. (47)

శ్లో ॥ హింసం ద్రవ్యమయం కామ్యమగ్నిహోత్రాద్యశాంతిదమ్।
దర్శశ్చ పూర్ణమాసశ్చ చాతుర్మాస్యం పశుః సుతః ॥48॥

శ్లో ॥ ఏతదిష్టం ప్రవృత్తాఖ్యం హుతం ప్రహుతమేవ చ ।
పూర్తం సురాలయారామ కూపాజీవ్యాది లక్షణమ్ ॥49॥

హింసతో గూడిన శ్యేన యాగాదికము, ద్రవ్యమయము, కామ్యమునైన అగ్నిహోత్రాదులు అశాంతికరమైనవి. దర్శము, పూర్ణమాసము, చాతుర్మాస్యము, పశుయాగము, సోమయాగము, వైశ్వదేవము, బలిహరణము, అనునవి ప్రవృత్తకర్మయందు ఇష్టములనబడును. దేవతామందిర నిర్మాణము, ఉద్యానవన, కూప, తటాక, ఆజీవ్యాది లక్షణమైనది పూర్తమనెడు ప్రవృత్త కర్మభేదము నగును. (48, 49)

టీ :- హింస్రం శ్యేనాది కర్మ. అశాన్తిదం అత్యాసక్తియుక్తమ్. ఆదిశబ్దార్థ వివరణం దర్శశ్చేతి. పశుః పశుయాగః. సుతః సోమయాగః. (48)

టీ :- హింస్రం = శ్యేనయాగాది కర్మ. అశాన్తిదం = అత్యాసక్తితో కూడినది. ఆది శబ్దము యొక్క వివరణము 'దర్శశ్చ' యని గావించబడినది. పశుః = పశుయాగము. సుతః = సోమయాగము.(48)

టీ :- హుతం వైశ్వదేవం. ప్రహుతం బలిహరణమ్. ఏతత్సర్వమిష్ట ముచ్యతే - ఏతదేవ యదికామ్యమశాన్తిదం చ తర్హి ప్రవృత్తాఖ్యమపీత్యర్థః. ఆ జీవ్యం ప్రసాది. (49)

టీ :- హుతం=వైశ్వదేవము. ప్రహుతం = బలిహరణము. ఇది యంతయు ఇష్టమనిచెప్పబడుచున్నది. ఇదియే ఒకవేళ కామ్యం = అశాన్తి నిచ్చునదియైన ప్రవృత్తమను పేరుగలదిననును అని అర్థము. ఆ జీవ్యం = చలివేంద్రము ( బాటసారులు నీరుద్రావుచోటు) మొదలైన. (49)

శ్లో ॥ ద్రవ్య సూక్ష్మ విపాకశ్చ ధూమో రాత్రి రపక్షయః ।
అయనం దక్షిణం సోమో దర్శ ఓషధి వీరుధః ॥ 50 ॥

చరు, పురోడాశాది ద్రవ్యముయొక్క సూక్ష్మమైన విపాకము, ధూమము, కృష్ణపక్షరాత్రి, దక్షిణాయనము, అమావాస్య, సోమలోకము, ఓషధీలతలు. ( ప్రవృత్తకర్మలో రెండు మార్గాలున్నవి. ఒకటి ఇష్టము, రెండు ఇష్టాపూర్తము. హింసా ద్రవ్యమయములైన కామ్యరూపములగు దర్శపూర్ణమాసాదికము ఇష్టములని, దేవాలయ, ఆరామ, కూపా జీవ్యాదులు పూర్తాలని చెప్పబడినవి. ప్రవృత్తములైన కర్మలద్వారా దేహి తనదేహమును విడిచి దేహాంతర ప్రాప్తి యందు హృదయాగ్రమున ప్రకాశిస్తూ ఇంద్రియాలలో గూడా సూక్ష్మదేహమును దాల్చి ధూమము, దక్షిణాయనము, రాత్రి, కృష్ణపక్షము, అమావాస్యలద్వారా సోమలోకం చేరి పుణ్యఫలమును భుజించి , పుణ్యఫలము పూర్తికాగానే ' క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి ' యన్నట్లు , మఱల భోగావసానమున దేహము విలీనం కాగా వర్షము ద్వారా క్రమముగా ఓషధీలతలు, అన్నము, రేతస్సుల రూపాలను పొంది భూమిపై మరో జన్మను పొందును. ఇది పునర్జన్మరూపమైన పితృమార్గము. దీనినే ప్రవృత్తి మార్గమందురు). (50)

టీ :– ప్రవృత్తేన కర్మణా ఆరోహావరోహణాభ్యాం ఆవృత్తి ప్రకారమాహ – ద్రవ్యస్య పురోడాశాదేః సూక్ష్మవిపాకః. పరిణామో దేహానరారమ్భకో యేన సంపరిష్వక్తో గచ్ఛతి య ఏవ శ్రుతౌ అపీ శబ్దేనోక్తః. 'ఇతి తు పఞ్చాభ్యామాహుతావాసః పురుష వచసో భవన్తి' ఇతి. పాఠాన్తరే ద్రవ్యశబ్దేన తేజోమాత్రా శబ్దోక్తానీంద్రియాణి. ఊష్మవిపాక శబ్దేన హృదయాగ్రప్రద్యోతః తథా చ శ్రుతిః. ' స ఇమాస్తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయమేవాన్వక్రామత్' ఇతి. తథా – 'తస్యహైతస్య హృదయాగ్రం ప్రద్యోదతే తేనైష ఆత్మా నిష్క్రామతి' ఇతి. ధూమాదిశబ్దైస్తత్తదభిమానిన్యో దేవతాః తత్రాపక్షయః కృష్ణపక్షః. సోమః సోమలోకః. తత్ర భుక్త భోగస్య అవరోహణ ప్రకారమాహ – దర్శఇత్యాది. విపరీత లక్షణయా విశిష్టభోగక్షయ శోకాగ్నినా దేహాలయేనా దర్శన ముచ్యతే. ఏతదుక్తం భవతి – భూతసూక్ష్మయుక్తో ధూమాద్యాతివాహిక దేవతాభిః సోమలోకం ప్రాపితస్తద్భోగావసానే విలీన దేహో వృష్టిద్వారేణౌషధివీరుధాది సామ్యాపత్తి క్రమేణ జాయతే. ఏవం పునర్భవహేతుః – పితృయానం ప్రవృత్త కర్మమార్గ ఇతి. (50)

టీ :– ప్రవృత్తమనేడు కర్మచే ఆరోహణావరోహములతో గల్గిడు ఆవృత్తి ప్రకారమును చెప్పెను. – ద్రవ్యస్య = పురోడాశాదులయొక్క సూక్ష్మమైనవి పాకము. దేహాన్తరారమ్భకమైన పరిణామము దేనిచే బాగుగా సమ్మిళితమై నడచునో, ఏది శ్రుతియందును 'అప్' శబ్దముతో చెప్పబడినదో. 'అనియు ఐదింటితో ఆహుతియందు జలములు, పురుషుని వాక్కవలన కలుగుచున్నవి' అని. 'ద్రవ్యమూష్మవిపాకశ్చ' అను పాఠాంతరమునందు ద్రవ్యశబ్దముచే తేజోమాత్రా శబ్దమున చెప్పబడిన ఇంద్రియములు. ఊశ్మవిపాక శబ్దముచే హృదయాగ్ర ప్రద్యోతము చెప్పబడినది. శ్రుతియు ఇట్లు చెప్పుచున్నది. ' అతడు ఈ తేజోమాత్రలను సంపూర్ణముగా గ్రహించినవాడై హృదయమునే ఆక్రమించుకొనెను' అని. 'అప్పుడు అట్టి వీనియొక్క హృదయాగ్రము ప్రకాశించును. దానిద్వారా ఈ ఆత్మ అందునుండి నిష్క్రమించును' అని. ధూమాదిశబ్దములచే వానివాని అభిమానులగు దేవతలు అందు భుక్త భోగుని ( భోగములను అనుభవించినవాని) అవరోహణప్రకారము (పతన ప్రకారము) ను ఇట్లు చెప్పెను. – 'దర్శ' ఇత్యాదిగా. విపరీత లక్షచే విశిష్ట భోగముల క్షయముచే కల్గిన శోకమనెడు అగ్నిచే దేహము లయమగుటచే అదర్శనము చెప్పబడుచున్నది. ఇది ఇట్లు చెప్పబడినది. – భూతసూక్ష్మములతో కూడుకొనినవాడై ధూమము మొదలైన ఆతివాహికదేవతలచే సోమలోకమునకు చేర్చబడినవాడై అచ్చట సుఖభోగములననుభవించి, భోగముల అంతమున విలీనమైన దేహముగలవాడై వర్షము ద్వారా ఓషధీలతాది సామ్యాపత్తి క్రమమున

పుట్టుచున్నాడు. ఇట్లు మరల పుట్టుటకు హేతువు – పితృయానము = ప్రవృత్త కర్మమార్గము అని. (50)

శ్లో ॥ అన్నం రేత ఇతిక్ష్మేశ పితృయానం పునర్భవః ।
ఏకైకశ్యేనాను పూర్వం భూత్వా భూత్వేహ జాయతే ॥51॥

ఓ భూపతీ ! అన్నము, రేతస్సు అను రూపములను క్రమముగా పొంది పితృయానమున అనగా ప్రవృత్త కర్మమార్గమున పునర్భవము కలుగును. ఇది పునర్జన్మరూపమైన పితృమార్గము ఇదియే ప్రవృత్తి మార్గము. (51)

టీ :– క్ష్మేశ హే భూపతే. పునర్భవమేవాహ – ఏకైకశ్యేన ప్రత్యేకం క్రమేణ భూత్వాతత్తత్సాన్నిధ్యం ప్రాప్తేహ భూమౌ జాయతే. (51)

టీ :– క్ష్మేశ = ఓ భూపతీ ! పునర్భవమునే ఇట్లు చెప్పెను. – ఏకైకశ్యేన = ఒక్కొక్కటి క్రమముగా అయ్యి అపగా వానివాని సాన్నిధ్యమును పొంది ఇహ = ఈ భూమియందు పుట్టుచున్నాడు. (51)

శ్లో ॥ నిషేకాది శ్మశానింతైః సంస్కారైః సంస్కృతో ద్విజః ।
ఇంద్రియేషు క్రియా యజ్ఞాన్ జ్ఞానదీపేషు జుహ్వతి ॥52॥

నిషేకము మొదలకొని శ్మశాన ప్రాప్తి వఱకు గల సంస్కారములతో సంస్కరించబడిన ద్విజుడు జ్ఞానముచే ప్రకాశించెడు ఇంద్రియములందు క్రియా యజ్ఞములను అంతము చేయును. (52)

టీ :– తత్రాధికారిణమాహ – నిషేకాదితి. అన్యస్త్విష్టాది కార్యప్యేవం జన్మనలభత ఇత్యర్థః. నివృత్తికర్మనిష్ఠస్యోపాసనాది విశేషముపదిశ న్నర్చిరాది మార్గేణ బ్రహ్మలోకప్రాప్తిమాహ – ఇంద్రియేష్విత్యాదినా. యద్వా ద్రవ్య యజ్ఞేషు హింసాయా

టీ :– అచ్చటి అధికారిని చెప్పుచున్నాడు. 'నిషేకాది' యని. ఇతరుడైతే ఇష్టాదులను చసినవాడైయు ఇట్లు జన్మను పొందదని యర్థము. నివృత్త కర్మనిష్ఠునకు ఉపాసనాది ఉపదేశమును గావించుచు అర్చిరాది మార్గమున బ్రహ్మలోక ప్రాప్తిని చెప్పెను. – 'ఇంద్రియేషు' ఇత్యాదిగా. లేదా

దుర్నివారత్వాదతిముఖ్యం నివృత్తం కర్మైవ దర్శయన్నాహ - జ్ఞానేన దీప్యన్త ఇతి తథా తేషు. ఇంద్రియవ్యాపారాణాం ఇష్టాపూర్తాదీనాం ఇంద్రియతావన్మాత్రతాం భావయన్తీత్యర్థః. ఏవ ముత్తరత్రాపి. (52)

ద్రవ్యయజ్ఞములందు హింస దుర్నివారమైనందున అతిముఖ్యమైన నివృత్తరూప కర్మమునే చూపెట్టుచూ చెప్పెను. జ్ఞానముచే ప్రకాశించునవికాన జ్ఞానదీపములు. వానియందు ఇంద్రియవ్యాపారములైన ఇష్టాపూర్తాదులకు ఇంద్రియతావన్మా త్రత్వమును భావించుచున్నారని యర్థము. ఇట్లే ముందు కూడా. (52)

శ్లో ॥ ఇంద్రియాణి మనస్యూర్మౌ వాచివారికం మనః ।
వాచం వర్ణ సమామ్నాయే తమోంకారే స్వరేన్యసేత్ ।
ఓంకారం బిందౌ నాదే తం తం తుప్రాణే మహత్యముమ్ ॥53॥

దర్శనాది సంకల్పరూపమైన మనస్సునందు ఇంద్రియములను, వికారయుక్తమైన మనస్సును వాక్కుయందు, ఆ వాక్కును వర్ణసమామ్నాయ మందు, అట్టి వర్ణసమామ్నాయమును స్వరమైన ఓఙ్కారమునందు ఇముడ్చవలసినది. ఓఙ్కారమును నాదరూపమైన బిందువునందు, ఆ బిందువును మహద్రూపమైన ప్రాణవాయువునందు అర్పించవలసినది. (53)

టీ :- ఊర్మౌ దర్శనాది సంకల్పరూపే మనసి వైకారికం వికారయుక్తం మనోవాచి. విధ్యాదిలక్షణయా వాచా హి మనః కర్తృత్వాది వికారం భజతి. వర్ణానాం సమామ్నాయే సముదాయే. తద్విశేషత్వాద్వాచః సర్వే అకారాది స్వరత్రయాత్మకే. ఓంకారం బిన్దౌ, తం చ నాదే. ప్రాణే సూత్రాత్మని మహతి బ్రహ్మణి. (53)

టీ :- ఊర్మౌ = దర్శనము మొదలగువాని సంకల్పరూపమైన మనస్సునందు - వైకారికం = వికారయుక్తమైన మనస్సును వాక్కుయందు. విధ్యాది లక్షణమైన వాక్కుతోడ మనః కర్తృత్వాది వికారమును భజించుచున్నాడుకదా. వర్ణముల యొక్క . సమామ్నాయే = సముదాయమందు. వాని విశేషత్వము వలన వాక్కులను. సర్వే = అకారాది స్వర త్రయాత్మకమైన స్వరమునందు. ఓంకారమును బిందువునందు. దానిని నాదమునందు, ప్రాణమునందు - సూత్రాత్మయగు మహత్తునందు - బ్రహ్మమునందు. (53)

శ్లో ॥ అగ్నిః సూర్యో దివా ప్రాహ్ణః శుక్లో రాకోత్తరం స్వరాట్ ।
విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞస్తుర్య ఆత్మాసమన్వయాత్ ॥ 54 ॥

అగ్ని , సూర్యుడు, పగలు, ప్రాతఃకాలము, శుక్లపక్షము పాఠాంతరమున ' దివా వాయుః శుక్లో ' యని. దాని ప్రకారము పగలు, వాయువు, శుక్ల పక్షము, అని. పౌర్ణిమా, ఉత్తరాయణము, బ్రహ్మల రూపమును పొంది ప్రాజ్ఞుడు అనన్తరము స్థూలోపాధియైన విశ్వముయొక్క రూపమంది ఆ స్థూలరూపమును సూక్ష్మమునందు లయముగావించి తైజసమైన సూక్ష్మోపాధియగును. ఆ సూక్ష్మమును కారణమున విలయముగావించి కారణోపాధియై ప్రాజ్ఞుడగును. కారణము సర్వసాక్షిరూపమున అన్వయించుట వలన సాక్షి స్వరూపమున విలయము చేసి తుర్యుడగును. ఆ వ్యభిచారులైన సాక్ష్యముల లయమున శుద్ధమైన ఆత్మయగును. అనగా మోక్షమును పొందునని అర్థము. (54)

టీ :– అగ్నిరితి. తత్తదభిమానిన్యో దేవతాస్తాః. ప్రాప్నోతీతి పూర్వవత్. దివాఽహః. ప్రాహ్ణస్తస్యైవాన్తః. రాకా శుక్లపక్షస్యాన్తః. యద్వా ప్రాహ్ణోరాకా ఇతి చ పురాణ సంమతమ్. ఉత్తరం త్వయనమ్. స్వరాట్ బ్రహ్మా. ఏవం బ్రహ్మలోకం గలస్య భోగావసానే మోక్షప్రకారమాహ – విశ్వ ఇతి. విశ్వః. స్థూలోపాధిః స స్థూలం సూక్ష్మే విలాప్య సూక్ష్మోపాధిస్తైజసో భవతి. కారణం చ సర్వసాక్షిత్వే నాన్వయాత్సాక్షిస్వరూపే విలాప్య తుర్యో భవతి. తేషాంచ వ్యభిచారిణాం సాక్ష్యాణాం లయే శుద్ధ ఆత్మా భవతి. ముచ్యత ఇత్యర్థః. (54)

టీ :– ' అగ్నిః ' యని. వానివాని అభిమానినులైన ఆ దేవతలను ' ప్రాప్నోతి' యని పూర్వమవలె. దివా = పగలు. ప్రాహ్ణః = దానియన్తము. రాకా = శుక్లపక్షాన్తము. లేదా ' ప్రాహ్ణోరాకా ' అనియు పురాణ సమ్మతము. ఉత్తరం అనునది అయనము = ఉత్తరాయణము. స్వరాట్ = బ్రహ్మ. ఇట్లు బ్రహ్మలోకమునకు వెళ్ళిన వాని యొక్క భోగావసానమున మోక్షప్రకారము చెప్పెను – ' విశ్వ ' యని. విశ్వః = స్థూలోపాధి. ఆ స్థూలమును సూక్ష్మమునందు లయముచేసి సూక్ష్మోపాధి తైజసమగును. ఆ సూక్ష్మమును కారణమున విలయముగావించి కారణోపాధి ప్రాజ్ఞుడగును. కారణము కూడా సర్వసాక్షిరూపముగా అన్వయించుట వలన సాక్షి స్వరూపమున విలయమై

తుర్యమగును. ఆ వ్యభిచారిణులగు (విశేషముగా ఉత్తరోత్తరములుగా ఆరోహణదిశలో చలించునవి) సాక్ష్యముల లయమున శుద్ధమైన ఆత్మ కలుగును. అనగా మోక్షమును పొందునని అర్థము. (54)

శ్లో ॥ దేవయానమిదం ప్రాహుః భూత్వా భూత్వాను పూర్వశః।
ఆత్మయాజ్యుపశాంతాత్మా హ్యాత్మస్థో న నివర్తతే ॥ 55 ॥

క్రమముగా ఒకదానియనన్తరము మరొకరూపయును పొంది ఆత్మయాజియై ఉపశాన్తమైన ఆత్మగల వాడగుచు ఆత్మస్థుడు అనగా మోక్షమును పొందినవాడగును. ఇతరులవలె మరల తిరిగి జన్మించడు. దీనిని దేవయానమని చెప్పెదరు. (55)

టీ :– యథా ఇతరో భూత్వా నివర్తతే తథా న నివర్తత ఇత్యర్థః. (55)

టీ :– ఇతరుడెటులైతే ఆయా రూపములై తిరిగి జన్మించునో అట్లు తిరిగి జన్మించడని యర్థము. (55)

శ్లో ॥ య ఏతే పితృదేవానామయనే వేద నిర్మితే ।
శాస్త్రేణ చక్షుషా వేద జనస్థోఽపి న మేహ్యతి ॥ 56 ॥

ఏ పురుషుడైతే శాస్త్ర చక్షువుచేత వేదనిర్మితములైన ఈ పిత్రాయనమును, దేవాయనమును ఎరుంగునో అతడు దేహస్థుడైయు మోహమునొందడు. (56)

టీ :– వేదేన నిర్మితే "తే ధూమమభి సంభవన్తి" ఇత్యాదినా, "తే అర్చిరభి సంభవన్తి" ఇత్యాదినా చ నిశ్చయేన వివిచ్య జ్ఞాపితే ఇత్యర్థః. జనస్థోఽపి న ముహ్యతి. (56)

టీ :– వేద నిర్మితములైన అనగా 'తే ధూమమభిసంభవన్తి' ఇత్యాదిగ మరియు 'తే అర్చిరభిసంభవన్తి' ఇత్యాదిగ వేదములచే నిశ్చయముగ వివరించి తెల్పబడిన దక్షిణాయన – ఉత్తరాయణములను ఎవడైతే శాస్త్ర దృష్టితో తెలుసుకొనునో అతడు జనస్థోఽపి = దేహస్థుడైనను మోహమును పొందడు. (56)

శ్లో ॥ ఆదావంతే జనానాం సద్బహిరంతః పరావరమ్ ।
జ్ఞానం జ్ఞేయం వచో వాచ్యం తమోజ్యోతిస్త్వయా స్వయమ్ ॥57॥

మరియు శరీరముల యొక్క ఆదియందు కారణరూపముగా, అన్తమందు అవధి రూపముగా ఏది కలదో అట్లే బయట భోగ్య రూపము - లోన భోక్తృ రూపము, ఉచ్చనీచ తారతమ్యము, జ్ఞానము - జ్ఞేయము, వాక్కు - వాచ్యము, చీకటి - వెలుతురు, అన్నియు స్వయముగ ఈ జ్ఞానియే యగుచున్నాడు. (57)

టీ :- తత్ర హేతుమాహ - ఆదావితి. జనానాం దేహానామాదౌ కారణత్వేనాన్తే చాఽవధిత్వేన యత్సత్తథా బహిర్భోగ్యమన్తర్భోక్తృ పరమవరం చోచ్చనీచమ్. తమోఽప్రకాశః జ్యోతిః = ప్రకాశః. తత్తు సర్వమయంజ్ఞానీ స్వయమేవ న తస్మాద్వ్యతిరిక్తం వస్తు కించిదస్తి యేన ముహ్యేదిత్యర్థః. (57)

టీ :- అందుకు కారణమునిట్లనెను. - ' ఆదౌ ' అని. జనానాం = దేహములయొక్క . ఆదౌ = ఆదియందు. కారణరూపముగ చివరను అవధిరూపముగ ఏది గలదో, అట్లే బహిర్భోగ్యము అన్తర్భోక్తృత్వము పరమవరం చ = ఉచ్చ నీచమును. తమః = అన్ధకారము. జ్యోతిః = ప్రకాశము. అదియంతయు జ్ఞానమే స్వయముగనైయున్నాడు. అతని కంటె వ్యతిరిక్త వస్తువేదియు కొంచము కూడా లేదు. ఉండిన దానిచే మోహమునొందునని అర్థము. (57)

శ్లో ॥ ఆ బాధితోఽపి హ్యాభాసో యథా వస్తుతయా స్మృతః।
దుర్ఘట త్వాదైన్ద్రియకం తద్వదర్థ వికల్పితమ్ ॥58॥

తర్క విరుద్ధముగా అన్నివిధముల బాధింపబడినవాడైనను వాస్తవ జ్ఞానము స్మరించబడినప్పుడు అది ఆభాసమాత్రమే యగును. అట్లే ఇంద్రియసంబంధమైన సర్వమునూ అర్థరూపముగా వైకల్పితమే. పరమార్థముగా అసత్యమే ఎందుకనగా అసత్యమైన ఇంద్రియములకు సత్యమైన విషయవాసనలుండుట దుర్ఘటము గదా. (58)

టీ :- నను తర్హి కథం పృథగర్థస్తస్యాపి ప్రతీయతే తత్రాహ - ఆబాధిత స్తర్కవిరోధేన సర్వతో బాధితోఽప్యాభానః ప్రతిబిమ్బాదిర్వస్తుతయా యథా స్మృతస్తద్వదైన్ద్రియకం సర్వమర్థత్వేన వికల్పితం న తు పరమార్థతః, దుర్ఘటత్వాత్. (58)

శ్లో ॥ క్షిత్యాదీనామిహార్థానాం ఛాయాన కతమాపి హి ।
న సంఘాతో వికారోఽపి న పృథఙ్నాన్వితో మృషా ॥59॥

టీ :- తదేవాహ - క్షిత్యాదీనాం పఞ్చభూతానాం ఛాయా ఐక్యబుద్ధ్యా లమ్బన రూపం దేహాది సఙ్ఘాతారమ్భ పరిణామానాం మధ్యే కతమాప్యన్యతమాపి న భవతి. న తావత్తేషాం సఙ్ఘాతో వృక్షాణామివ వనమ్. ఏకదేశాకర్షణే సర్వాకర్షణాననుపపత్తేః. న హ్యేకస్మిన్వృక్ష ఆకృష్టే సర్వం వనం ఆకృష్యతే. న చ వికార ఆరబ్ధోఽవయవీ. అపి శబ్దాన్నపరిణామోఽపి కుతః. స కిం స్వావయవేభ్యః పరిణతేభ్యో వా పృథక్ తదన్వితో వా. న తావదత్యన్తం పృథక్. తథా ప్రతీతేః న చాన్వితః. స కిం ప్రత్యవయవం సర్వోఽప్యన్వే త్యంశేన వా. ఆద్యే అఙ్గులి మాత్రేఽపి దేహబుద్ధిస్యాత్. ద్వితీయే తస్యాప్యంశాఙ్గీకారే

టీ :- అటులైన దానికి భిన్నార్థము ఎట్లు గోచరించును ? అనిన ఇట్లు చెప్పెను - ఆబాధితః = తర్కవిరోధముచే సర్వతః బాధించబడినవాడైనను - ఆభాసః = ప్రతిబిమ్బాది ఆభాసమే. వాస్తవముగా ఎట్లైతే స్మరించబడినదో అట్లే ఇంద్రియసంబంధమైన సర్వము అర్థరూపమున భిన్నముగా నున్నది. పరమార్థముగా అదివేరుగాదు. దుర్ఘటమైనందున. (58)

పృథివ్యాది పఞ్చభూతముల ఆలమ్బన రూపమైన ఐక్యబుద్ధి. సంఘాత - ఆరమ్భ - పరిణామములతో ఏ ఒక్కటియుకాదు మృషయే. (59)

టీ :- దానినే ఇట్లు చెప్పెను - క్షితిమొదలైన పఞ్చభూతముల యొక్క ఛాయా - ఐక్యబుద్ధితో ఆలంబనరూపమైన దేహాదుల సంఘాత - ఆరమ్భ - పరిణామములయొక్క మధ్య ఏ ఒక్కటియైనను కాదు. వాని సమూహము "వనము వృక్షముల సంఘాతమైనట్లు" కాదు ఒక చోట లాగిన సర్వాకర్షణము కలుగనందున. ఒక వృక్షములాగబడగా వనమంతయు లాగబడదుకదా పంచభూత నిర్మితమైనందున అవయవియుగాదు. అపి శబ్దము వలన పరిణామముకూడా కాదు. ఎందువలన అనగా ఆ అవయవి తన అవయవములకంటే భిన్నమైనదా, లేదా దానియందన్వితమైనదా? మిక్కిలి వేరైనదిగాదు. అట్లు గోచరించుటవలన అన్వితమైనదిగాదు. ఆ అవయవి ప్రతి అవయవముతోడ సర్వమును అన్వయించుచున్నదా? లేక అంశముతోడ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ

సత్యనవస్థాస్యాదతో మృషైవేత్యర్థః. (59)

నన్వయించుచున్నదా ? మొదటి పక్షమున అంగులి మాత్రమునందును దేహబుద్ధి కలుగును. రెండవ పక్షమున దానికిని అంశముగా అంగీకారమును తెల్పిన అనవస్థ కలుగును. కాన అసత్యమే. (59)

శ్లో ॥ ధాతవోఽవయవిత్వాచ్చ తన్మాత్రావయవైర్వినా ।
న స్యుర్హ్యసత్యవయవి న్యసన్నవయవోఽన్తతః ॥ ॥60॥

ధాతువులు అనగా పంచమహాభూతములు తన్మాత్రా వయవములు లేకుండ ఉండవు. ఎందువలన అనగా అవయవిగా ఉన్నందున. అవయవి లేనప్పుడు అనగా అసత్యమైనప్పుడు అవయవములును అసత్తులే కదా. (60)

టీ :- ఏవం దేహాదేర్మిథ్యాత్వముక్త్వా తద్ధేతూనాం క్షిత్యాదీనాపి మిథ్యాత్వమాహ - ధారయన్తీతి ధాతవో మహాభూతాని తన్మాత్రైః సూక్ష్మైరవయవైర్వినా న స్యుః. అవయవిత్వాత్తేషామపి. తర్హ్యవయవః సత్య ఇతి చేత్తత్రాహ - ఉక్త ప్రకారేణావయవి న్యసత్యవయవోఽప్యన్తతోఽసన్నేవస్యాత్. అవయవి ప్రతీత్యన్యథానుపపత్తిః వినా తత్సద్భావే ప్రమాణాభావాదిత్యర్థః. తదుక్తం పఞ్చమస్కంధే -"ఏవం నిరుక్తం క్షితి శబ్దవృత్తమ్" ఇత్యాది. (60)

టీ :- ఇట్లు దేహాదులకు మిథ్యాత్వమును చెప్పి దానికి కారణములైన పృథివ్యాదులకును మిథ్యాత్వమునే చెప్పుచున్నాడు - ధరించనివి ధాతువులు = మహాభూతములు. తన్మాత్రైః = సూక్ష్మములైన అవయవములు లేకుండగ కలుగవు. అవయవియైనందున వానికిని అవయవములుండును. అట్లైన అవయవము సత్యమనిన ఇట్లు చెప్పెను - చెప్పబడిన ప్రకారము అవయవి అసత్యముకాగ చివరకు అవయవముకూడ అసత్యమేయగును. అవయవి ప్రతీతి వేరు విధముగా సాధ్యముకానందున దాని ఉనికి విషయమై ప్రమాణము లేనందువలన అని యర్థము. అది పఞ్చమస్కంధమున - "ఏవం నిరుక్తం క్షితిశబ్దవృత్తం" ఇత్యాదిగ చెప్పబడినది. (60)

శ్లో ॥ స్యాత్సాదృశ్య భ్రమస్తావ ద్వికల్పే సతి వస్తునః ।
జాగ్రత్స్వాపౌ యథా స్వప్నే తథా విధి నిషేధతా ॥ ॥61॥

వాస్తవముగ పరమాత్మకు (కంటె) భేదము (వికల్పము) లేనప్పుడు లేదా వస్తువునకు అజ్ఞానముచే భేదముకల్గుచుండగా అవిద్య (అజ్ఞానము) నివృత్తియగు వఱకే ఆ భేదము. సర్వము మిథ్యాయనిన శాస్త్రముయందలి విధినిషేధకత్వము ఎట్లు పొసగును? అనిన స్వప్న మధ్యమునందు మేల్కొనియుండుట నిదురించుట మొదలైన వ్యవస్థ వంటిదని అర్థము. (61)

టీ :- నన్వవయవినోఽభావే ఆగమాపాయిషు బాల్యాదిషు సోఽయం దేవదత్త ఇతి ప్రత్యభిజ్ఞానం న స్యాత్. తదుక్తం భట్టైః – ‘ ఆవిర్భావ తిరోభావ ధర్మకేష్వనపాయి యత్. తద్ధర్మే’ ఇతి తత్రాహ – స్యాదితి. వస్తుతః పరమాత్మనో వికల్పే భేదేఽసతి. యద్వా వస్తునోఽవిద్యయా వికల్పే సతి పూర్వపూర్వారోప సాదృశ్యాత్స ఏవేతి భ్రమః స్యాత్. స చ తావదేవ యావదవిద్యా నివృత్తిః. నను సర్వమిథ్యాత్వే శాస్త్రస్య విధినిషేకతా కథం తత్రాహ – స్వప్నమధ్యే జాగ్రత్స్వాప వ్యవస్థా యథేతి. (61)

టీ :- ఐన అవయవి యొక్క అభావము కలుగగా ఆగమాపాయగు బాల్యాదులందు అతడే ఈ దేవదత్తుడు అను గుర్తింపు కలుగకపోవును. అదియే భట్టారకులచే ఇట్లు చెప్పబడినది. ‘ఆవిర్భావతిరోభావ’ ఇత్యాదిగ. అందులకు ఇట్లు చెప్పెను ‘స్యాత్ ’ అని. వాస్తవముగ పరమాత్మకు వికల్పే = భేదము లేకుండగ. లేదా వస్తువునకు అజ్ఞానముచే భేదము కలుగగా పూర్వ పూర్వారోప సాదృశ్యము వలన అదియేయను భ్రమ కలుగును, అదియు ఎంతవరకైతే అజ్ఞాననివృత్తి కలుగునో అంతవరకే. అట్లైన సర్వమునకు మిథ్యాబుద్ధి కలిగిన శాస్త్రమునకు విధినిషేధభావమెట్లు? అనిన ఇట్లు చెప్పెను – స్వప్నము మధ్యలో మేల్కొనుట పరుండుటయని వ్యవస్థ ఎట్లు కలుగునో అట్లే యని. (61)

శ్లో ॥ భావాద్వైతం క్రియాద్వైతం ద్రవ్యాద్వైతం తథాత్మనం ।
వర్తయన్ స్వానుభూత్యేహ త్రీన్ స్వప్నాన్ ధునుతే మునిః ॥62॥

ఆత్మకు భావాద్వైతమును, క్రియాద్వైతమును, ద్రవ్యాద్వైతమును ఆలోచించుచు ముని ఆత్మతత్త్వానుభవముచే త్రీన్ అనగ జాగ్రత్, స్వప్న సుషుప్తి స్వప్నములను తొలగించుకొనుచున్నాడు. లేదా వస్తుభేదబుద్ధి యనునది

టీ :- ఇదానీముక్తమేవాద్వైతం భావనాత్రయోపదేశేన దృఢీకరోతి – భావాద్వైతమితి చతుర్భిః. వరత్యన్నాలోచయన్. స్వానుభూత్యా ఆత్మతత్త్వానుభవేన త్రీన్ జాగ్రదాదీన్ 'త్రయ ఆవసథాస్త్రయః స్వప్నాః ఇతి శ్రుతేః. యద్వా వస్తుబేధ బుద్ధిరేకః స్వప్నః, తతస్తత్తదధికార భేదేన కర్మభేదేన బుదిర్ద్వితీయః, తతో మత్కర్మ సాధితమేతత్ఫలం మమైవ భోగ్యమితి తృతీయః. తాన్ధునుతే నివర్తయతి. (62)

ఒక స్వప్నము. అటు తరువాత తదధికారభేదముచే కర్మభేదబుద్ధి యనునది రెండవ స్వప్నము. అనంతరము నాకర్మచే సాధించబడినదీ ఫలము నాకే భోగ్యమను బుద్ధి మూడవ స్వప్నము. ఈ మూడు స్వప్నములను తొలగించుకొనుచున్నాడు. (62)

టీ :- గతమున చెప్పబడిన అద్వైతమునే ఇప్పుడు భావనాత్రయముచే దృఢముగావించుచున్నాడు. –' భావాద్వైతం' అని నాలుగు శ్లోకములచే – వర్తయన్ = ఆలోచించుచు. స్వానుభూత్యా = ఆత్మతత్త్వానుభవముచే. త్రీన్ = జాగ్రదాదులను. 'మూడగ్నులు మూడుస్వప్నములు' అని శ్రుతి చెప్పుచున్నది. లేదా వస్తు భేద బుద్ధి ఒక స్వప్నము. అటుపై వాని అధికార భేదముచే కర్మభేదబుద్ధి రెండవ స్వప్నము. అనంతరము నా పనిచే ఈ ఫలము సాధించబడినది నాకే భుజించతగినది అను బుద్ధి మూడవది. వానిని ధనుతే = వదిలివేయును. (62)

శ్లో ॥ కార్యకారణవస్త్వైక్య మర్శనం పటతన్తు వత్ ।
అవస్తుత్వాద్వికల్పస్య భావాద్వైతం తదుచ్యతే ॥ ॥63॥

కార్యకారణములందు వస్తువుయొక్క ఐక్యమును ఆలోచించుట ఇది దారమే, వస్త్రము కాదు అని భేదమునకు అవస్తుత్వము చెప్పుట భావాద్వైతమని చెప్పబడుచున్నది. (63)

టీ :- కార్యకారణయో ర్వస్త్వైక్యస్య మర్శన మాలోచనం తన్తురేవ న పట ఇతి. (63)

టీ :- కార్యకారణములందు వస్త్వైకము యొక్క – మర్శనం = ఆలోచన. దారమే కానీ వస్త్రముకాదు అని. (63)

శ్లో ॥ అవస్తుత్వాద్వికల్పస్య భావాద్వైతం తదుచ్యతే ।
యద్బ్రహ్మణి పరేసాక్షాత్సర్వ కర్మ సమర్పణమ్ ।
మనోవాక్తనుభిః పార్థ క్రియాద్వైతం తదుచ్యతే ॥ ॥64॥

మనోవాక్కాయములచే కావించబడిన సర్వకర్మలను సాక్షాత్ పరబ్రహ్మయందు అర్పణ చేయుటయనినదేది కలదో అది క్రియాద్వైతము అని చెప్పబడినది. (64)

టీ :- మనోవాక్తనుభిః కృతానాం కర్మణాం సమర్పణమ్. త్రైః సమర్పణమితివా. ఉద్దేశ్యఫలభేదో హి క్రియా భేదేహేతుః - ఈశ్వరార్పణే చ తదభావాత్క్రియాణామద్వైతమ్. (64)

టీ :- మనోవాక్తనువులచే చేయబడిన కర్మలయొక్క సమర్పణము లేదా మనోవాక్కాయములచే సమర్పణము అనియైనను. ఉద్దేశ్య ఫలభేదమే క్రియాభేదమున హేతువుగదా - ఈశ్వరార్పణయందును అదిలేనందున క్రియలకు అద్వైతము. (64)

శ్లో ॥ ఆత్మజాయా సుతాదీనామన్యేషాం సర్వదేహినామ్ ।
యత్స్వార్థకామయోరైక్యం ద్రవ్యాద్వైతం తదుచ్యతే ॥ -65

తన భార్యా సుతాదులకును ఇతర సమస్త ప్రాణులకును స్వార్థకామము లందు అనగా పంచభూతాత్మకుడైన భోక్త పరమాత్మ రూపుడైనందున అభేదాలోచనచే అర్థకామములందైక్య దర్శనము ద్రవ్యాద్వైతమని చెప్పబడుచున్నది. (65)

టీ :- ఆత్మనః స్వస్య జాయాదీనాం చ స్వార్థశ్చ కామశ్చ తయోః దేహాదీనాం పఞ్చభూతాత్మకత్వేన భోక్తుశ్చ పరమాత్మత్వేన అభేదాలోచనేన అర్థకామయోర్యదైక్య దర్శనమిత్యర్థః. (65)

టీ :- ఆత్మనః = తన భార్యా సుతాదులకు స్వార్థము కామమును వానిదేహాదులకు పంచభూతాత్మరూపముగ భోక్తకు పరమాత్మ స్వరూపముచే అభేదాలోచనచే అర్థకామములందే ఐక్య దర్శనము కలదో అది ద్రవ్యాద్వైతమని చెప్పబడుచున్నది. (65)

శ్లో ॥ యద్యస్య వాఽనిషిద్ధం స్యాద్యేన యత్ర యతోన్నృప ।
స తేనే హేత కర్మాణి నరోనాన్యైరనాపది ॥ ॥66॥

ఓ రాజా ! ఏక్రియ ఎవనికి ఎక్కడ ఏకాలమున ఏమార్గమున అనిషిద్ధవెూ ఆ నరుడు ఆ మార్గమున ఆ కర్మలను కోరతగును. అనాపత్కాలమున ఇతరములను కాంక్షించరాదు. (66)

టీ :- ఉక్తానాశ్రమధర్మాన్ సంక్షిప్యాహ – యదితి. యద్ద్రవ్యమ్, యేనోపాయేన. యతః సకాశాత్. (66)

టీ :- చెప్పబడిన ఆశ్రమధర్మములను సంక్షేపించి చెప్పెను. – 'యత్' అని. ఏ ద్రవ్యము ఉ ఉపాయముచేత దేని సమీపమునుండి. (66)

శ్లో ॥ ఏతైరన్యైశ్చ వేదోక్తైర్వర్తమానః స్వకర్మభిః ।
గృహేఽప్యస్య గతిం యాయా ద్రాజంస్తద్భక్తి భఙ్నరః ॥
॥67॥

ఓ రాజా ! ఇట్టి కర్మలచే మరియు వేదోక్తములైన ఇతరములగు స్వకర్మములచే కూడుకొన్నవాడై ఇంటియందును ఉన్నవాడై ఆ భగవద్భక్తి పూర్ణాన్తరఙ్గుడైన మానవుడు ఆ భగవంతుని మార్గమునే పొందును. అనగా వైకుంఠమును చేరి ముక్తుడగుచున్నాడని అర్థము. (67)

టీ :- ప్రస్తుతముపసంహరతి – ఏతైరితి. అస్య శ్రీకృష్ణస్య గతిమ్. తద్భక్తి భాక్ తస్య భక్తః. (67)

టీ :- ప్రస్తుతాంశమును ముగించుచున్నాడు. – 'ఏతైః' యని. ఈ శ్రీకృష్ణుని గతిని. తద్భక్తిభాక్ = ఆ శ్రీకృష్ణుని యొక్క భక్తుడు. (67)

శ్లో ॥ యథా హి యూయం నృపదేవ దుస్త్యజా
దాపద్గణాదుత్తరతాత్మనః ప్రభోః ।
యత్పాదపఙ్కేరుహ సేవయా భవా
న హాకక్షీన్నిర్జిత దిగ్గజః క్రతూన్ ॥ – 68

ఓ రాజా ! ఎటులైతే మీరు రాజులచేతను, దేవతలచేతను తరింపరాని మీ యొక్క ఆపద్గణమునుండి ప్రభువైన శ్రీకృష్ణుని కారణమున తరించితిరో, ఏ శ్రీహరి యొక్క పాదకమలముల యొక్క సేవచే నీవు దిగ్గజములవంటి శత్రువుల జయించినవాడవై క్రతువులను నిర్వహించితివో. (68)

టీ :- ఏతత్సర్వసాధారణముక్తమ్, భక్తస్య తు భక్తిరేవ సర్వపురుషార్థ హేతురితి పాణ్డవానేవ లక్ష్యీకృత్యఆహ - యథా హీతి. హే నృపదేవ, నృపైర్దేవైశ్చ సహాయైర్దుస్త్యజాదితి వా. ఆత్మనః శ్రీకృష్ణాదేవ ప్రభోర్హేతోః - అడభావ ఆర్షః. ఉత్కర్షేణా తారయతేత్యర్థః. యథా యథావత్ తమేవ భజతేతిశేషః. యద్వా యథా ఆపద్గణాదుత్తీర్ణస్త్వమ్. యథా చ క్రతూ నహార్షీత్తథా శ్రీకృష్ణాదేవ తారకాత్సంసారాదప్యుత్తరతేత్యర్థః. (68)

టీ :- ఇదియంతయు సాధారణధర్మము చెప్పబడినది. భక్తునకైతే భక్తియే సర్వపురుషార్థ హేతువని పాణ్డవులనే లక్ష్యముగా చేసుకొని చెప్పెను. - 'యథాహీ' యని. ఓ నృపదేవా ! లేదా సహాయకులైన నృపులచేతను, దేవతల చేతను వీడరాని యని. ఆత్మనః = శ్రీకృష్ణుని వలననే ప్రభువైన కారణమున. ఇచ్చట 'అడ్' అభావము ఆర్షము. విశేషించి తరించుడు అని అర్థము. (68)

శ్లో॥ అహం పురాఽభవం కశ్చిద్గంధర్వ ఉపబర్హణః ।
నామ్నాఽతీతే మహా కల్పే గంధర్వాణాం సుసంమతః॥ ॥69॥

(నారదుడు) నేను పూర్వము ఉపబర్హుడను పేరుగల గంధర్వుడనుగా ఉంటిని. అట్టి నేను గడచిన మహాకల్పమున గంధర్వులకు మిక్కిలి సమ్మతమైనవాడనై. (69)

టీ :- శ్రీకృష్ణసేవా మహతామవజ్ఞయా భ్రశ్యతి తత్కృపయాచ సిద్ధ్యతీతి దర్శయన్ పూర్వ వృత్తాన్తమాహ - అహమితిసార్ధైః పఞ్చభిః. నామ్నా ఉపబర్హణః. (69)

టీ :- శ్రీకృష్ణునిసేవ మహాత్ములయొక్క తిరస్కారముచే భ్రంశమగు చున్నది. వారి కృపచేతను సిద్ధించుచున్నది. అని తెలుపుచు పూర్వ వృత్తాంతమును 'అహం' ఇత్యాది ఐదున్నర శ్లోకములచే చెప్పెను. ఉపబర్హణుడను పేరుగల. (69)

శ్లో ॥ రూపపేషలమాధుర్య సౌగంధ్యప్రియదర్శనః ।
స్త్రీణాం ప్రియతమో నిత్యం మత్తస్తుపురులమ్పటః॥ ॥70॥

రూపము, పేషలమైన మాధుర్య సౌగంధ్య యుక్తుడనై చూడముచ్చటైన అందముగలవాడనై స్త్రీలకు మిక్కిలి ప్రియమగువాడనై మదించి మిగుల లమ్పటుడనైతిని. (70)

శ్లో ॥ ఏకదా దేవసత్రే తు గన్ధర్వాప్సరసాం గణాం ।
ఉపహూతా విశ్వసృగ్భిర్హరిగాథోపగాయనే ॥ - 71

ఒకానొకప్పుడు దేవసభయందు హరిగాథలను గానము చేయుటకు బ్రహ్మలచే గన్ధర్వులు, అప్సరో గణములు పిలువబడిరి.(71)

టీ :- పేషలం సౌకుమార్యంరూపాదిభిః ప్రియం దర్శనం యస్య. (70,71)

టీ :- పేషలం = సౌకుమార్యము, రూపాదులచే ప్రియమైన దర్శనము గలవాడై. (70,71)

శ్లో ॥ జ్ఞాత్వా విశ్వసృజస్తన్మే హేలనం శేపు రోజసా ।
యాహి త్వం శూద్రతా మాశు నష్టశ్రీః కృతహేలనః ॥
॥72॥

అదిఎరిగిన నేను స్త్రీలతో పరివృతుడనై గానము చేయుచు అచ్చటకు వెడలితిని. అట్టినా పరిహాసమునెరింగిన బ్రహ్మలు తమ తపః శక్తిచే – "నీవు వెంటనే నష్టమైన రూపశోభాది సంపదగలవాడవై శూద్రత్వమును నొందెదవుగాక" యని శపించిరి. (72)

శ్లో ॥ తావద్దాస్యామహం జజ్ఞే తత్రాపి బ్రహ్మవాదినామ్ ।
శుశ్రూషయానుషఙ్గేణ ప్రాప్తోఽహం బ్రహ్మపుత్రతామ్॥
॥73॥

అప్పుడా శాపఫలితముగా నేను ఒక దాసియందు జన్మించితిని. అట్టి జన్మమున బ్రహ్మవాదుల శుశ్రూషాభాగ్యమబ్బుటచే మరల బ్రహ్మపుత్రుడనై జన్మించితిని. (73)

టీ :- తదాహ్వానం విద్వాన్. ఉన్మత్తస్సన్ గాయన్నేవ గతః. (72,73)

టీ :- వారి ఆహ్వానము నెరింగినవాడనై, ఉన్మత్తుడనై గానము చేయచునే వెడలితిని. (72,73)

శ్లో॥ ధర్మస్తే గృహమేధీయో వర్ణితః పాపనాశనః ।
గృహస్థో యేన పదవీ మఞ్జసాన్యాసినామియాత్ ॥
॥74॥

ఏ ధర్మముచేతనైతే గృహస్థుడైయుండియు జ్ఞానమును పొంది, దానిచే ధర్మకర్తల యొక్క ఫలమును పొందునో అట్టి పాపనాశకమైన గృహమేధి యొక్క ధర్మము నీకు వర్ణించి చెప్పబడినది. (74)

శ్లో॥ యూయం నృలోకే బత భూరిభాగా ।
లోకం పునానా మునయోఽభియాన్తి ।
యేషాం గృహానావసతీతి సాక్షా ।
ద్గూఢం పరంబ్రహ్మ మనుష్యలిఙ్గమ్ ॥ - 75

ఎవరి గృహములందైతే పరమాత్మ మనుష్యరూపమున సాక్షాత్తుగ నివసించుచున్నాడో అట్టి గృహస్థులైన మీరు గొప్ప అదృష్టవంతులు గదా ! లోకమును పునీతము గావించెడు మునులు మీ గృహములను చురవచ్చు చున్నారు గదా. (75)

శ్లో॥ సవా అయం బ్రహ్మ మహద్విమృగ్యం ।
కైవల్య నిర్వాణ సుఖానుభూతిః ।
ప్రియః సుహృద్వః ఖలు మాతులేయ ।
ఆత్మార్హణీయో విధికృద్గురుశ్చ ॥ - 76

కైవల్య నిర్వాణ ( మోక్షప్రాప్తిరూప) సుఖానుభూతియైనవాడును మహనీయులైన ముముక్షువులచే వెతకదగిన వాడునగు అట్టి ఈ పరంబ్రహ్మ ( శ్రీకృష్ణుడు ) మీకు ప్రియమిత్రుడు, మేనమామ కొడుకు, మీకు పూజ్యుడు, దైవకృతమైన గురువు కూడా అగుచున్నాడు, (76)

శ్లో॥ మౌనేన భక్త్యూపశమేన పూజితః ।
ప్రసీదతామేష స సాత్త్వతాం పతిః ॥ - 77

ఎవని రూపమునైతే సాక్షాత్తుగ శివ - బ్రహ్మాది దేవతల చేతను బుద్ధిపూర్వకముగ వస్తుతః వర్ణించబడలేదో అట్టి ఈ సత్త్వగుణ సంపన్నుల బ్రోచెడు దేవుడు మౌనముగా భక్తితో శాన్త చిత్తముచే పూజింపబడినవాడై ప్రసన్నుడగునుగాక. (77)

టీ :- త్వం తు కృతాతర్థ ఏవేతి హర్షేణ పునః పూర్వ శ్లోకానేవ పఠతి - యూయమితి. శేషం స్పష్టమ్. (74 - 77)

టీ :- నీవైతే కృతార్థుడవే యని ఆనందముచే మరల పూర్వ శ్లోకములనే చదువుచున్నాడు. - 'యూయం' అని మిగిలినది స్పష్టము. (74 -77)





**శ్రీశుక ఉవాచ.**

శ్లో ॥ ఇతి దేవర్షిణా ప్రోక్తం నిశమ్య భరతర్షభః ।
పూజయామాస సుప్రీతః కృష్ణం చ ప్రేమవిహ్వలః ॥ ॥78॥

**శుకయోగీంద్రుల వారిట్లు చెప్పుచున్నారు.**

'భరతకుల శ్రేష్ఠుడగు ధర్మరాజు నారదునిచే చెప్పబడిన విషయమును విని మిక్కిలి సంతోషించినవాడై ప్రేమవిహ్వలుడగుచు శ్రీకృష్ణుని పూజించెను. (78)

శ్లో ॥ కృష్ణపార్థావుపామన్త్ర్య పూజితః ప్రయయౌ మునిః ।
శ్రుత్వా కృష్ణః పరంబ్రహ్మ పార్థః పరమ విస్మితః॥ ॥79॥

శ్రీకృష్ణుని – పార్థుని (చేరబిలిచి, సెలవుగైకొని) పూజింపబడిన వాడై నారదముని వెడలిపోయెను. శ్రీకృష్ణుని పరంబ్రహ్మ గావినిన పార్థుడు మిక్కిలి ఆశ్చర్యమునొందెను. (79)

శ్లో ॥ ఇతి దాక్షాయణీనాం తే పృథగ్వంశాః ప్రకీర్తితాః ।
దేవాసుర మనుష్యాద్యాః లోకాయత్ర చరాచరాః ॥ ॥80॥

ఇట్లు దక్షుని సంతానము యొక్క వంశములు వేరువేరుగా చెప్పబడినవి. ఏ వంశమునందైతే దేవాసుర మనుష్యాది చరాచర లోకములు కలవో వానిని వివరించితిని, అని. (80)

టీ :- సప్తమస్కంధ గూఢార్థ పదభావార్థ దీపికా, సంసేవ్యతాం సదా సద్భిర్యతి శ్రీధర నిర్మితా । (78 – 80)

టీ :- సప్తమ స్కంధము యొక్క గూఢార్థ పదముల భావార్థ దీపిక శ్రీధర నిర్మితమైనది సజ్జనులచే సదా సేవించబడుగాక.(78 – 80)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమసంధే శ్రీధరస్వామి విరచితాయాం భాగవత భావార్థ దీపికాయాం టీకాయాం పఞ్చదశోఽధ్యాయః.**

**ఇది వ్యాసమహాముని రచితమైన సంహితయగు శ్రీమద్భాగవత మహాపురాణమందలి సప్తమస్కంధమున ప్రహ్లాదాను చరితమను యుధిష్ఠిర – నారద సంవాదమున సదాచార నిర్ణయమను పదనైదవ అధ్యాయము.**

**సప్తమ స్కంధము సమాప్తము.**






సదానందో విజయతే

జయ కృష్ణానంద

మదనానందో విజయతే తరామ్

జయ మాధవానంద

# శ్రీగురుమదనానందసరస్వతీపీఠము

రాంపురం, తొగుట మం., మెదక్ జిల్లా




సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్